శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## ఎనిమిదవ సంపుటము

రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు

ద్వితీయ ముద్రణ : డిసెంబర్, 1999

ప్రకాశకులు :

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము,

ప్లాట్ నెం. 103ఎ, మర్కజ్‌మర్యాద అపార్టుమెంట్స్, అడిక్‌మెట్, హైదరాబాదు.

వెల : 250/-

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## ఎనిమిదవ సంపుటము

రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు

ద్వితీయ ముద్రణ : డిసెంబర్, 1999

ప్రకాశకులు :

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము,

ప్లాట్ నెం. 103ఎ, మర్యాదమర్యాద అపార్టుమెంట్స్, అడిక్‌మెట్, హైదరాబాదు.

వెల : 250/-

# విషయసూచిక




| | | | పుట |
|---|---|---|---|
| 102 | తెనాలి రామకృష్ణకవి | ... | 1 |
| 103 | తెనాలి శ్రీగిరికవి | ... | 49 |
| 104 | పూసపాటి రాచిరాజు | ... | 50 |
| 105 | గౌరరాజు | ... | 65 |
| 106 | వెల్లంకి తాతంభట్టు | ... | 66 |
| 107 | కాచిరాజు బసవన | ... | 71 |
| 108 | యాదవామాత్యకవి | ... | 74 |
| 109 | చంద్రమౌళి | ... | 88 |
| 110 | దేవరాజభట్టు | ... | 89 |
| 111 | ప్రౌఢకవి మల్లన | ... | 90 |
| 112 | సారంగు తమ్మయ్య | ... | 95 |
| 113 | చరిగొండ ధర్మనామాత్యుఁడు | ... | 106 |
| 114 | చరిగొండ నరసింహకవి | ... | 132 |
| 115 | కాకుమాని గంగాధరుఁడు | ... | 134 |
| 116 | తాళ్లపాక తిమ్మక్క | ... | 138 |
| 117 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు | ... | 151 |
| 118 | తాళ్లపాక చిన్నన్న (తిరువెంగళనాథుఁడు) | ... | 163 |
| | తాళ్లపాక చినతిరుమలాచార్యులు | ... | 168 |

| | | |
|---|---|---|
| 120 | రేవణూరి వెంకటాచార్యుఁడు ... | 17[illegible] |
| 121 | వెలగపూఁడి వెంగయామాత్యుఁడు ... | 180 |
| 122 | హరిభట్టు ... | 188 |
| 123 | రాచమల్లు కవులు ... | 219 |
| 124 | మలయమారుతము సర్వన్న ... | 224 |
| 125 | ఎఱ్ఱన ... | 226 |
| 126 | వెన్నెలకంటి సూరనార్యుఁడు ... | 236 |
| 127 | పెదపాటి సోమయ్య ... | 25[illegible] |
| 128 | ఆంధ్రకవి రామయ్య ... | 2[illegible] |
| 129 | వాసిరాజు రామయ్య ... | 25[illegible] |
| 130 | సంకుసాల నృసింహకవి ... | 261 |
| 131 | భానుకవి ... | 274 |




శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## ఎనిమిదవ సంపుటము



### 102 తెనాలి రామకృష్ణకవి

ఈతనిని మహాకవిగాఁ గొందఱు మాత్రమే యెఱిఁగియున్నను హాస్యగానిగా నాంధ్రదేశమున సామాన్యులలోఁగూడఁ బెక్కురెఱుంగుదురు. ఈతనిని 'తెనాలిరామలింగ'మని కూడనందురు. అనుటయే కాదు కొన్ని గ్రంథములయందు రామలింగఁడనియు రామలింగమనియుఁ గలదు. ఈతఁడు మొట్టమొదట శైవాచార సంపన్నుఁడై పిదప వైష్ణవమతాభిమానియై వైష్ణవులను గురువులనుగాఁ జేసికొనినందున నామములో నీమార్పు కలిగినది. ఇతఁడు శైవమతాభిమానిగా నున్నప్పుడు రామలింగమనియు వైష్ణవమతాభిమానియైన

పిదప రామకృష్ణుఁడనియుఁ దన గ్రంథములలో వ్రాసికొనియున్నాఁడు. ఈతఁడు రచించిన గ్రంథములలో నుద్భటారాధ్యచరిత్రము, ఘటికాచలమాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము ననుమూఁడు గ్రంథములు ముద్రితములైనవి. ఈ క్రింద నుదాహరించిన గద్యలను జూచితిమేని యాతని నామములోఁ గలిగినమార్పు తెలియగలదు.

"ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణ సకలకళాభరణ రామనార్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారతీ బిరుదాభిరామ రామలింగ నామధేయ ప్రణీతంబైన శ్రీమదుద్భటారాధ్యచరిత్రంబను మహాప్రబంధంబు"

"ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాక పరిచిత సరసకవితాసనాథ తెనాలిరామకృష్ణకవినాథ ప్రణీతంబైన ఘటికాచలమాహాత్మ్యము"

ఘటికాచలమాహాత్మ్య పాండురంగ విజయగద్య లొక్క తీరుననేయున్నవి.

ఈగద్యలు రెండింటిలో నొకదానికొకటి సంబంధములేదు' ఈయిరువురు కవులు నొక్కరేయని భావించుటెట్లు? అనుప్రశ్న వచ్చుచున్నది. ఈప్రశ్నమున కుత్తరమిచ్చుటకుఁ బూర్వ మింక నొకసంగతిని గూర్చి యిటఁ బ్రస్తావింప వలసియున్నది. తెనాలి రామలింగమను పేరుగల విశ్వకర్మ కులజుఁడున్నాడు. అతఁడును గవియే. ధీరజన మనోవిరాజితి మనునొక గ్రంథమును రచియించియున్నవాఁడు. నామసామ్యము చేత వీరిరువురు నొక్కరేయని భ్రమ

గొలుపుచుండును. ఆ భ్రమ పోవుటకై ధీరజనమనోవిరాజితములోని గద్యనిచ్చుట నిచ్చుచున్నాడను.

"ఇది శ్రీమదుమామహేశ్వర చరణారవింద సేవాప్రవీణ తెనాలి వంశపవిత్ర కశ్యపగోత్రాగ్యజనస్తోత్రపాత్ర మృత్యుంజయ నామధేయ పౌత్ర మల్లికార్జున తనూభవ రామలింగ నామధేయ కవివిరచితంబగు రాజధీరజనమనో విరాజితంబను గ్రంథంబునందు సర్వంబు నేకాశ్వాసము"

ఈ గ్రంథపీఠికలో "కృష్ణరాయల యాస్థానకవులలో నొకఁడగు తెనాలిరామలింగ మహాకవియు నీవంశములోనివాఁడే యనుటకుఁ గొన్ని నిదర్శనము" లున్నవని వ్రాసియున్నారు. కాని యిది కేవల మసత్యము. ఆమహాకవి కౌండిన్యగోత్రుఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ధీరజనమనో విరాజితకర్త విశ్వకర్మకులజుఁడు. కశ్యప గోత్రుడు; ఈ రెండువంశములకు నెట్టిసంబంధమును లేదు.

ఇఁక రామలింగ, రామకృష్ణనామధారు లొకవ్యక్తి యగునో కాదో చూడవలసియున్నది. ఉద్భటారాధ్యచరిత్రమునఁ గవితనను గూర్చి చెప్పుకొనిన పద్యములివి:—

సీ. కౌండిన్యముని రాజ మండ లేశ్వరవంశ
పాథోధి నవసుధాభానుమూర్తి
పొలుగు మ్మొలేశ పదపయోజద్వయీ
ధ్యానధారణ సముదాత్తచిత్తు
మానితాయాతయామా నామభావిత
విపులమహో యజుర్వేదవేది

రామేశ్వరస్వామి రమణీయకరుణా వి
శేషపోషిత విలసితసమగ్ర

గీ. సహజ సాహిత్య మాధురీసంయుతాత్మ
లక్కమాంబకు ఘనయశోలక్ష్మి వెలయు
రామధీమణికిని బుత్త్రి రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు

చ. విలస దయాతయామబహువేద వివేకపవిత్రభావసం
కలితములైన వాక్యములఁ గావ్యముఁ జెప్పఁగ నేర్తు వాదికా
వ్యుల కవితానిగుంభనసమున్నతిఁ గాంచినవాఁడ వౌదు నీ
వలఘువచోవిలాస సుగుణాకర రామయలింగసత్కవీ !

ఘటికాచలమాహాత్మ్యమునఁ గృత్యాదిరచింపక పూర్వమే కవి చనిపోయియుండుటచే నందలికవినామాదికమును దెలుపు పద్యములు లభింపలేదు. పాండురంగమాహాత్మ్యమునందు రామకృష్ణకవి తననుగూర్చి చెప్పుకొనిన పద్యములివి:

క. నను రామకృష్ణకవిఁ గవి
జనసహకారావళీ వసంతోత్సవసూ
క్తినిధిఁ బిలిపించి యుర్వా
సనమునఁ గూర్చుండఁ బనిచి చతురత ననియెన్.

సీ. తగ సంస్కృతము దెనుంగుగఁ జేయఁ దెనుఁగు సం
స్కృతముగఁ జేయంగఁ జతురమతివి
పలు దెఱంగుల నెన్న గలకావ్యధారల
ఘనుఁడ వాసువునందుఁ గరము మేటి

వఖిలభూమీపాలకాస్థాన కమలాక
రోదయ తరుణ సూర్యోదయుఁడవు
శైవవైష్ణవ పురాణావళీ నానార్థ
ములు నీకుఁ గరతలామలకనిభము

తే. లంధ్రభూమి కుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నిశ్రేణి వగ్ర
శాఖకాకోకిలమ వీవు సరసకవిత
రమ్యగుణకృష్ణ రామయ రామకృష్ణ!

క. కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురువిభుఁడ వఖిలకావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండలవినుతుఁడవు లక్ష్మమావరతనయా!

ఈపద్యములనుబట్టిచూడ నిరువురును కౌండిన్యగోత్రులు. ఇరువురును రామయపండితుని పుత్రులు; ఇరువురకును లక్క మాంబ (లక్ష్మమ్మ) తల్లి అని తెలినది. ఇరువురునొకే వ్యక్తి యనుట కింకేమి కావలయును? రామలింగ రామకృష్ణనామములతో నున్నవ్యక్తి యొకఁడేయని చిరకాలానుగతమైన ప్రతీతి కలదు ఈయభేదమును గొందఱు గ్రంథస్థము చేసియుండిరి.

ఉ. రంగుగఁ బాండురంగని తెఱంగలరంగ రచించి వేడ్కమీ
అంగ ఛలోక్తులన్ నృపుగరంగనొనర్చు హరారంగు నింగిము

ట్టంగ మెలంగు నేరుపు గడంగి చెలంగు సభంగసద్యశో
లింగుని. రామలింగ శశలింగకళానిధినిన్ గణించెదన్.

వల్లూరి నరసింహాకవి నాగ్నజితీ పరిణయము.

ఆంధ్రకవి చరిత్రకారులగు శ్రీ వీరేశలింగముపంతులుగారును, కవి జీవితకారులగు శ్రీగురజాడ శ్రీరామమూర్తి పంతులుగారును, సుప్రసిద్ధ పండిత కవిశేఖరులగు మానవిల్లి రామకృష్ణకవిగారును నీ యభేదము నంగీకరించియున్నారు. రామకృష్ణకవి రచించిన యుద్భటారాధ్య చరిత్రమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు రామలింగ, రామకృష్ణకవు లొక్క వ్యక్తియేయని యనేక కారణములను జూపుచు నిర్ధారణచేసి యుద్భటారాధ్య చరిత్రమందలి పద్యములవంటి పద్యములు ఘటికాచలమాహాత్మ్యము నందు నున్నవని చెప్పుచు వారియభేదమును ధృవపరచుట కిదియొక బలవత్తరకారణ మనిభావించి యట్టి పద్యములను గొన్నిఁటి నుదాహరించియున్నారు. మచ్చునకు రెండుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. అచలసుతాభర్త కల్పించి మఱికాని
మృగములు లేఁబూరి మేయు వచట
అసమలోచనునకు నర్పించి మఱికాని
యళులు క్రొవ్విరితేనె లాన వచట
అంధకధ్వంసికి నర్పించి మఱికాని
కోయిల లిగురాకుఁ గొఱుక వచట
అంగజారాతికి నర్పించి మఱికాని
చిలుకలు పండ్లు భుజింప వచట

గీ. తక్కఁగలజంతువులు శంభు, దలఁచి కాని
యుచితవర్తనములఁ గోరియుండ వచట
వదనములు వేయిఁగలయంతవాని కైన
నాయరణ్యంబుఁ గొనియాడ నలవియగునె

ఉద్భటారాధ్యచరిత్రము.

సీ. మొకరి తేఁటులు మూఁతి ముట్టవు తేనియల్
శ్రీమధుశాసి కర్పించి కాని
కోకిలమ్ములు చిగురాకులు గొఱుకవు
శ్రీవనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ గబళింపవు హరిణముల్
శ్రీనీలమూర్తి కర్పించి కాని
ఫలభుజశ్రేణులకుఁ జిలుకలు దలఁపవు
శ్రీమాధవునకు నర్పించి కాని

గీ. యితరజంతువులును హరి మతిఁ దలంచి
కాని యేవర్తనమునకుఁ బూన వనిన
నాతపోవనమాహాత్మ్య మభినుతింప
నలవియే నేమొగంబుల చిలువకైన

ఘటికాచలమాహాత్మ్యము

సీ. అభ్రగంగాప్రవాహంబు లెన్నియొ కాని
తల ధరియింతు రంతయును నదులు
పదినూఱుపడగల పాము లెన్నియొ కాని
యందఱు నురగేంద్రహారయుతులు

డా లొందు చంద్రఖండంబు లెన్నియొ కాని
యందఱు ధరియింతు రమృతకరుని
విషరాశిఁ బుట్టిన విషము లెన్నియొ కాని
యందఱు హాలాహలాంకగళులు

గీ. గంధగజదైత్యు లెందఱో కాని యంద
ఱతులగజచర్మపటధారు లైనవారు
కర్మబంధంబు............
కాలికొనకుండ నిద్రింపఁ జాలుఘనులు.

ఉద్భటారాధ్యచరిత్రము.

సీ. నునుగాలి దూదిపానుపు లెన్నియో కాని
యందఱు శయనీకృతాహివరులు
సురలోకవాహినీనిర్ఝరము లెన్నియొ కాని
యందఱు దివ్యతీర్థాంబుపదులు
నీట జనించుమానికము లెన్నియొ కాని
యందఱు కౌస్తుభహారయుతులు.
చలివేఁడివెలుఁగుల సాము లెందఱో కాని
యందఱు నిందుకంజాప్తదృశులు

గీ. ఖగకులాధీశు లెందఱు కలరొ కాని
యందఱును బుల్గురాఁటెక్కి-యములవారు
నారుపోసినరీతి నున్నారు ధీరు
లన్నగరియందుఁ గాపురం బున్నవారు.

ఘటికాచలమాహాత్మ్యము.

పాండురంగమాహాత్మ్యమునఁ గవితననుగూర్చి చెప్పుకొనిన పద్యములో "శైవవైష్ణవపురాణావళీనానార్థములు నీకుఁ గరతలామలకనిభము" లనియున్నది. ఈపాదమునకు "శైవవైష్ణవ పురాణావళీనానార్థరచనాపటిష్ఠైకమతివి" అని పాఠాంతర మున్నది. ఈ శైవవైష్ణవకథా విజ్ఞానసందర్భముకూడ రామలింగరామకృష్ణాభేద వాదమునకు బలమొసంగుచున్నది. ఇంతేకాదు. తెనాలియన్నయ, శ్రీగిరి, రామభద్రుఁడు మొదలుగాఁగల తెనాలికవుల చరిత్రముల యందు వ్రాయఁబోవునంశములవలన నీరామలింగరామకృష్ణ నామములను ధరించిన యాతఁ డొక్కఁడేగాని భిన్నవ్యక్తులుగారని స్పష్టపడును. కావున నీవాదవిమర్శన మింతతో వదలి రామలింగరామకృష్ణు లొక్కవ్యక్తియే యని నిశ్చయించి యాతనికులగోత్రములు, కాలము, ఈతఁడు రచించినగ్రంథములు మొదలగువానింగూర్చి వ్రాయుచున్నాఁడను.

ఇతఁడు ప్రథమశాఖానియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్య గోత్రుఁడు; కాత్యాయనసూత్రుఁడు; ఇతనితండ్రిపేరు రామయ పండితుఁడు; తల్లి పేరు లక్ష్మమ్మ, ఇతనిప్రపితామహ ప్రపితామహుల నామము లితని గ్రంథములనుబట్టి తెలియవు. ఇతనికిసోదరు లున్నట్లును నీతనిగ్రంథముల వలనఁ దెలియదు. కాని అన్నయ్య, శ్రీగిరియనుసోదరు లున్నారు. వారును, నాంధ్రకవులే. వారిచరిత్రములను వేఱుగా వ్రాయుదును.

ఇతఁడు పాలగుమ్మియేలేశ్వరునిశిష్యుఁడై శైవమతానుయాయియై కొంతకాలము లింగధారణ మొనర్చియుండునని తోఁచుచున్నది. ఉద్భటాచార్యచరిత్రమందలి "మానితాయాతయామా

నామ భావిత విపులమహాయజుర్వేదవేది'' అను వాక్యములనుబట్టి యితఁడు శుక్లయజుర్వేదమును బూర్ణముగ నభ్యసించి, విడిచిపెట్టక యనుదినమును వల్లె వేయుచుండువాఁడని తెలియుచున్నది. విపుల మహాయజుర్వేద మనుటచేఁ గృష్ణయజుర్వేదమునుగూడ నభ్యసించె నేమో యనితోఁచుచున్నది. కాని రెండుభాగముల నభ్యసించుట కష్టము కావున నీవిషయమును నిశ్చయముగాఁ జెప్పఁజాలము.

ఇతనికిఁ గుమారభారతి యను బిరుద మున్నది. వయసునఁ బెద్దవాఁడైన పిదప సమంజసముగా నుండదని కాఁబోలు పాఁడురంగ విజయమున నీబిరుదమును వేసికొనలేదు.

కొంతకాల మైనపిదప నితఁడు వైష్ణవమతాభిమానియై చిక్కూరు భట్టాచార్యుల శిష్యుఁడై వైష్ణవగ్రంథములను రచించెను. ఆకాలమున నితఁడు వైష్ణవులవలె పట్టెనామమును ధరించెనో లేక నిలువుబొట్టుమాత్రమే ధరించెడి నియోగిబ్రాహ్మణుఁడుగ నుండెనో తెలియదు. కాని యీతనిమనుమఁడు, ఘటికాచలమాహాత్మ్యమును దీసికొని ఖండోజీరాయలయొద్ద కేఁగినప్పుడు నిలువు బొట్టును మాత్రమే పెట్టుకొనియున్నట్లీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. వెదురాకువంటితిరుమణి
నుదుటం గలవిప్రుఁ డొక్కఁడమాతనకావ్యం
బది గైకొని చెంతకుఁజని
ముదమున నాశీర్వదించి మొగి నిట్లనియెన్

ఘ. కృత్యాది ౧౨.

రామకృష్ణుఁడుకూడ నిట్టినామము నే ధరించియుండును.

ఇతని కాలమునుగూర్చి భిన్నాభిప్రాయమున్నది. ఇతఁడు క్రీ. శ. ౧౬౯౭–౧౭౦౦ ప్రాంతమున జన్మించి ౬౦–౬౭ సంవత్సరములు జీవించి ౧౭౬౦–౧౭౮౦ నడుమఁ గాలధర్మమునొందెనని నాయభిప్రాయము. ఇందులకు హేతువుల నీక్రింద నిచ్చెదను.

ఇతఁడు రచించిన గ్రంథములలో మూఁడుమాత్రమే యిప్పుడు లభించుచున్నవి. మొదటిది ఉద్భటారాధ్యచరిత్రము. రెండవది పాండురంగవిజయము. మూఁడవది ఘటికాచలమాహాత్మ్యము. ఒక గ్రంథప్రశంస మఱియొక గ్రంథములో లేదు. ఉద్భటారాధ్యచరిత్రము శైవగ్రంథమగుటచే దాని ప్రశంస వైష్ణవగ్రంథమగు పాండురంగమాహాత్మ్యమునఁ జేసియుండక పోవచ్చును. ఘటికాచలమాహాత్మ్యకృత్యాది రామకృష్ణరచితము కాదు. ఈతని గ్రంథరచనాకాలము క్రీ శ. ౧౭౨౭–౧౭౭౭ అని చెప్పవచ్చును.

(౧) ఉద్భటారాధ్యచరిత్రము:- ఇది మూఁడాశ్వాసముల కావ్యము. ఇందు శివాంశచే జన్మించినయుద్భటుఁడు ముంజభోజుఁ డను రాజునకు గురువై యాతని నుద్ధరించుటయు, నాయుద్భటుఁడు ప్రాణత్యాగ మొనర్ప నాతని దేహము నగ్నికాహుతి సేయఁగా గలిగినధూమముచే శివునిచే శపింపఁబడిన గంధర్వులు పిశాచరూపంబులం బాయుటయు మొదలుగాఁ గలయుద్భటారాధ్యచరిత్రము వర్ణిత మయినది. శివప్రభావమును దెలుపుమఱికొన్ని యుపకథ లిందు కలవు.

ఈగ్రంథమును రామలింగకవి "ఊర–దేచమంత్రికి" కృతి యొసంగెను. ఈదేచమంత్రి కొండవీడురాజ్యపరిపాలకుఁడైన నాదెళ్ల గోపమంత్రికడ కార్యనిర్వాహకోద్యోగమున నున్నవాఁడని యీ క్రింది రెండుపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆహవకౌశలప్రహసితార్జునతన్ సముదీర్ణధైర్యరే
ఖాహృతమేరుసారత మహాద్భుతుఁడై గుణనిర్జితేభర
శ్రీహరుఁడై చెలంగు నలగోపనమంత్రికి రాజకార్యని
ర్వాహకుఁ డూర దేచసచివప్రవరుండు దలిర్చు నుర్వరన్.

సీ. తనదానవిభవంబు ధనధానవద్యావి
శ్రాణనప్రక్రియఁ జౌకపఱుప
తనవచశ్శుద్ధి శాంతనవపౌత్త్రాదులం
తటివారలకు నద్భుతం బొనర్ప
తనమూర్తి చూచినంతన మూర్ఛములు వంచి
దర్పితారాతిబృందములు దలఁక
తనమనస్స్థితి పురాతనమహామునిముఖ్య
మగుశంభుతత్త్వంబుఁ దగిలి ప్రబల

గీ. ప్రబలుఁడై యొప్పు నాదెండ్ల భవ్యవంశ
దీప తిమ్మప్రధానేంద్ర గోపసచివ
రాజ్యసంరక్షణక్రియారబ్ధబుద్ధి
గోచరుం డూర యన్నయ దేచమంత్రి

ఈ దేచమంత్రి రాజనీతివిశారదుఁడేగాక పండితుఁడుగూడ నైయున్నట్లీతఁడు రచించిన దేవీపంచస్తవ వ్యాఖ్యానమువలనఁ దెలియనగును. ఈ దేచమంత్రి కౌండిన్యగోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు "ఊర" యను నగ్రహారనివాసుఁడు. ఈతనివంశమును బదునైదుపద్యములలోఁ గవివర్ణించియున్నాఁడు. ఈ దేచమంత్రికి 'చంద్రశేఖరమౌని' గురువైనట్లీ క్రిందిపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

క. శ్రీచంద్రశేఖరాహ్వాయ
వాంఛదయమచంద్రపాదవనరుహా సేవా
శ్రీచతురాత్మన కన్నయ
దేచామాత్యునకు సత్య ధీనిత్యునకున్.

నాదిండ్ల గోపమంత్రి క్రీ శ ౧౫౧౫ మొదలు ౧౫౩౩ వఱకును గొండవీడును పాలించినట్లాతని చారిత్రమున వ్రాసియున్నాఁడను ఈ దేచమంత్రియు నాతనికిఁ గృతినిచ్చిన రామలింగకవియు, నా కాలపువారని తలంచుటకు సంశయింపఁబని లేదు కదా! నాదిండ్లగోపమంత్రి దేచమంత్రికి క్రీ శ ౧౫౧౭వ సంవత్సరమున నొకయగ్రహార మొసంగినట్లు శాసనము కలదు. కావున రామలింగకవి క్రీ శ ౧౫౨౫ సంవత్సరప్రాంతమున నుద్భటారాధ్యచరిత్రమును దేచమంత్రికిఁ గృతియిచ్చెనని నిశ్చయింపవచ్చును.

ఉద్భటారాధ్యచరిత్ర లభింపకపూర్వము రచించిన దాటచే నాంధ్రకవుల చరిత్రమున రామలింగకవి కృష్ణదేవరాయల యాస్థానమున నుండియుండఁడని వ్రాసియున్నారు. ఉద్భటారాధ్య చరిత్రమునుబట్టి రామలింగకవి కృష్ణదేవరాయలకాలమున నున్నాఁడనుట స్పష్టము. దేచమంత్రికిని గోపమంత్రికినిగల సంబంధమునుబట్టి యామంత్రుల మూలమున రాయలయాస్థానమున రామలింగకవికిఁ బ్రవేశముగలిగి యుండవచ్చుననియు, రాయలు జీవించియున్నంతవఱకు రామలింగకవి యాతనియాశ్రయమున నున్నాఁడనియుఁ దలంచుటకు విరుద్ధమేమియుఁ గాన్పింపదు. ఇతఁడు ౧౫౨౦-౧౫౩౦ నడుమఁ బది సంవత్సరములు రాయలయాస్థానమున నుండియుండును.

(౨) ఘటికాచలమాహాత్మ్యము:— ఇది మూఁడాశ్వాసముల పద్యకావ్యము. ఇది రామకృష్ణకవి చనిపోయినపిమ్మట నాతని

మనుమఁడు ఖండోజీకిచ్చిన ట్లీక్రింది కృత్యాదిపద్యములలోఁ జెప్పి
యున్నాఁడు.

శా. ఓఖండోజివిచిత్రరాయ ! విను నీవొక్కండు దక్కంగ నా
శ్రీఖండాచల శీతలాచల ధరాసీమాబ్ధిరాణ్మౌఖులా
లేఖాధీశులలోన కావ్యసుమనోలీలా సుగంధప్రమో
దాఖండీకృతమానసుల్ దొరకరావా! మందుకైనన్ మహిన్

చ. భువిని విచిత్రవాక్సరణిఁ బొల్చిన తెన్నలిరామకృష్ణ స
త్కవికులవజ్రపాణి ఘటికాగిరినాథ మహాచరిత్రమున్
సవరణగా రచించి కృతిసంతతి కన్యక కెన్న యోగ్యుఁడౌ
ధవు డొకరుండు లేమిఁగని తా మదిలోన విచారుఁ జెందుచున్

సీ. పాలుపేది పుట్టులోభులపాలు చేసిన
పశుమూల్యమాత్రఁ బ్రాప్యమనుచు
మూఢాత్ములైన కాముకుల కర్పించిన
నెనరుతోఁ బాలింపనేర రనుచు
నదిరి తన్నాఱుఁగని హీనులకిచ్చిన
వసుమతి నపకీర్తి వచ్చుననుచు
మత్సరగ్రస్త పామరుల కీఁదలఁచిన
విడువక నొకమూల వేతురనుచు
నెంచి కృతికన్య నింటనే యుంచె నాతఁ
డాతని యభీష్టసిద్ధి నేఁడయ్యెననుచు
నిన్ను విని తెచ్చినాఁడ నానిరుపమాన
కావ్యమిది కొమ్ము భాగాంబికాతనూజ.

ఈపద్యములనుబట్టి రామకృష్ణకవి యీగ్రంథమును రచించి
యెవ్వరికిని గృతియియ్యక కృత్యాదిఁ వ్రాయక యుంచెననియు, దాని

నాతని పౌత్రుఁడు తెచ్చి ఖండోజీకిచ్చెననియుఁ దెలియుచున్నది. ఇం దెంతవఱకు సత్యమున్నదో నిర్ణయింపఁజాలము. ఈకథ నిజమయ్యె నేని, యీగ్రంథము రామకృష్ణునిరచనములలోఁ గడపటిదై యుండ వలయును. లేదా కవి-భగవంతుని కర్పితము చేసినగ్రంథమును, కృత్యాదియు నాశ్వాసాద్యంత పద్యములను దీసివేసి యాతని మను మఁడు తెచ్చి ఖండోజీకిచ్చి యుండవలయును. ఎట్లు నిశ్చయించుటకు నాధారములు లేవు ఘుటికాచలమునకు Sholingar అని యిప్పటి పేరు. ద్వితీయాశ్వాసాది నొక్కకందపద్యమును గ్రంథాంతమున నొక్క మాలినీవృత్తమును దక్క ముద్రితగ్రంథమున నాశ్వాసా ద్యంతపద్యములు లేవు.

ఖండోజీప్రభువు వెంకటగిరి యనుతనయాస్థానకవితో నీఘుటి కాచలమాహాత్మ్యమునకుఁ దనవంశావళిని వర్ణింపుచు కృత్యాదిని వ్రాయుమని చెప్పినట్లీక్రిందిపద్యములలోనున్నది.

మ. పదసందర్భవిశుద్ధి ప్రౌతతరశబ్దప్రక్రియాబుద్ధి సా
రద గంభీరచతుర్విధప్రథిత ధారాసిద్ధి ప్రాపంచిసం
సదభిద్యద్గిరి రాజసోదరత మెచ్చన్ మించుపుంభావశా
రద వీవేగద వన్న వేంకటగిరీంద్రా ! సాంద్రమేధానిధీ !

క. విదితప్రబంధములు వే
డ్కఁ దనరఁగ మదంకితముగఁ గావించినను
మొదలఁ బవిత్రము చేసితి
సదయాత్మా ! విచిత్రరాయచంద్రవతంసా !

తే. ధరణిఁ దొమ్మిదిలిబ్బులు దాఁచుకొన్న
వానికైనను ధనకాంత వోనియట్లు

కృతులు పదివేలు గైకొన్న కీర్తికాముఁ
డైనవానికిఁ జనదు కావ్యాభిలాష.

ఉ. కావున రామకృష్ణకవికల్పితకావ్య మొకండు దెచ్చి స
ద్భావముతోడ నాకతని పౌత్త్రుఁడొసంగె మదంకితంబుగా
నీ వికఁ హారనాయకమణి ప్రతిమానముగా మదీయవం
శావళి చెప్పి కూర్పుము యశంబు భృశంబుగ సంఘటిల్లఁగన్

ఈకృత్యాదిని రచించిన వెంకటగిరికవిచారిత్రమును వేఱుగా వ్రాయఁదలఁచి యిందు విడిచితిని. ఈఖఁడోజీవిషయముగూడ నందే చెప్పెదను. ఈఖండోజీప్రభువుతో రామకృష్ణకవికి సంబంధము లేదు. రామకృష్ణకవి కాలనిర్ణయమునకు ఖండోజీకాల మక్కఱలేదు.

(3) పాండురంగమాహాత్మ్యము:- ఇది యైదాశ్వాసముల పద్యకావ్యము. దీనినే పాండురంగవిజయ మందురు. కొందఱీరెండుగ్రంథములును వేఱని చెప్పుదురు కాని యీవాదము విశ్వాసార్హముకాదు పాండురంగ విజయరచనాకాలమును నిరూపించి పైనివ్రాసిన కవికాలముతో సమన్వయము కుదుర్పవలసియున్నది.

ఈగ్రంథమును గవి విరూరివేదాద్రి మంత్రికిఁ గృతియిచ్చెను. ఈ వేదాద్రి విరూరునకుఁ గరణమైనట్లును బెదసంగభూపాలునికడ వ్రాయసకాఁడుగానున్నట్లును నీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

తే. గురుతుగలరాజు మంగయగురవరాజు
పుత్త్రుఁ బెదసంగభూపాలు శత్రుజైత్రు
భానుసమతేజు విద్యావధాన భోజుఁ
గొల్చి వేదాద్రి నిత్యలక్ష్ములఁ దనర్చు.

మ. విభవేంద్రుండు విరూరిశాసనమహావిఖ్యాతి రామానుజ
ప్రభువేదాద్రి లిఖించువ్రాయసము లౌరా ! పెద్దసంగావని

విభుచిత్తంబు నెఱింగి గంటము రవల్ విద్యావధూనూపుర
ప్రభవప్రౌఢ ఝళంఝుళారభటిసౌభాగ్యంబు గల్పింపఁగన్.

ఈవిరూరి వేదాద్రి యార్వేలనియోగిబ్రాహ్మణుఁ డయిన ట్లీ క్రిందియాశ్వాసాంత పద్యమువలనఁ దెలియుచున్నది.

మాలిని:—సరసగుణరతీశా! వత్సహాస్రాన్వయేశా!
నిరవధికగుణాఢ్యా! నిత్యసత్యోపలబ్ధీ!
హరిహయసమభోగా! యాచమానానురాగా!
శరగతినిగమాళీ! కావ్యకృత్పద్మహేళీ!

కృతిపతి యైనయీవేదాద్రికిఁ గందాళయప్ప గురు వైనట్లీ క్రిందిపద్యములలోఁ గవి వర్ణించియున్నాఁడు.

సీ. వేదమార్గప్రతిష్ఠాదైవతజ్యేష్ఠుఁ
డభ్యస్తతద్దర్శనార్థ రాశి
యతిరాజ రచితభాష్యగ్రంథనిర్ణేత
యఖిలపురాణేతిహాసకర్త
బంధురదివ్యప్రబంధానుసంధాత
పంచసంస్కారప్రపంచచణుఁడు
వాధూలమునిచంద్ర వంశవర్ధనమూర్తి
సకలదేశాచార్యనికర గురువు

తే. పట్టమేనుంగు శ్రీరంగపతికి నన్న
గారిగర్భంబురాశి సీహారరశ్మి
సారసాహిత్యసర్వస్వశయ్య నేటి
యాళవందారు కందాళయప్పగారు.

శా. తత్త్వాదృగ్విభవప్రభావనిధిఁ గందాళప్పగారిన్ దయా
యత్తస్వాంతు నితాంతశాంతియుతు లోకాచార్యవర్యున్ సుధీ

చిత్తాంభోరుహ భానుఁ గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్నతిన్.
హాత్తైన్ దాను విరూరిమంత్రిమణి వేదాద్రీశుఁ డుద్యద్రుచిన్.

ఈకందాళియప్పగారు వైష్ణవపండితుఁడు వైజయంతీ విలాసమును రచించినసారంగు తమ్మయకును జైమినిభారతకృతిపతియైన ఎనుములపల్లి పెద్దయామాత్యుని పెదతండ్రియగు నారయకును తండ్రియైన మాదయకును గురువైన యప్పపండితున కీతఁడు పౌత్రుఁడు ఈయప్పపండితుని తండ్రిపేరు "అణ్ణ"యని పైపద్యములోనున్నది. అప్పపండితుని నివాసము తిరుపతి. తిరుపతిలోనున్న కృష్ణరాయతటాకముయొక్క యొద్దననే యతనియిల్లున్నదఁట! ఈతనిశాసనములు క్రీ.శ. ౧౫౪౦-౪౫ ప్రాంతమునఁ గన్పట్టుచున్నవి ౧ విరూరి వేదాద్రికీ యప్పపండితుఁడు విద్యాగురువు కాఁడనియు, వైష్ణవమంత్రోపదేశము చేసినముద్రాగురువనియుఁ దలంపవలసియున్నది. కందాళంవారు మొదలగు శ్రీవైష్ణవులు మతగురువులై దేశాటనము చేయుచు శిష్యులను జేర్చికొని వైష్ణవమంత్రముల నుపదేశించుచు నాకాలమునఁ దమశిష్యులను ముద్రాంకితులను గావించి వైష్ణవమతవ్యాప్తిని జేయుచువచ్చిరి. కందాళయప్పలాచార్యులకాలమును దెలిసికొనుటతో మన కార్యము పూర్తి కానేరదు.

వేదాద్రి కాశ్రయుఁడగు పెదసంగభూపాలుని గూర్చికూడ తెలిసికొని వేదాద్రికాలమును నిర్ణయింపవలసియున్నది. పెదసంగభూపాలునకుఁ గామందకమును గృతినందిన వేంకటాద్రి మేనల్లుఁడు. కామందక రచనాకాలమును దత్కర్తలగు వేంకటరామకృష్ణకవులు గ్రంథమునందే యిచ్చియున్నారు. దానిననుసరించి వెంకటాద్రికాలమును, వెంకటాద్రి కాలమునుబట్టి పెదసంగభూపాలుని కాలమును నందుమూలమున విరూరివేదాద్రికాలమును నిశ్చితముగాఁ దెలియఁగలదు. ఇదిగాక రామకృష్ణకవియు కామందక కృతిపతియగు వేంకటాద్రియు నేకగురుశిష్యులు.

---

౧. తి.దే.శా. సం-౪ పుట ౬౫ సంపుటము ౫ పుట ౧౧౫; 303; ౧౧౩

రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యమున భట్టరుచిక్కాచార్యులు దనకుఁ గురువైనట్లీ క్రిందిపద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు. ఇతఁడు రామకృష్ణకవికి విద్యాగురువని చెప్పవీలు లేదు. రామకృష్ణుఁడదివఱకే పండితుఁడై కవియై యుద్భటారాధ్య చరిత్రమును రచించి యుండెను. చిక్కాచార్యులు వైష్ణవమతోపదేశ మొనర్చిన మత గురువై యుండును.

క. వాక్కాంతాశ్రియభట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్య కళాకలాప మీడేఱుటకున్.

ఈ రామకృష్ణకవి కల్లుఁడైనలింగమగుంట రామకవియు నీతని తమ్ముఁడైనలింగమకుంట తిమ్మకవియు వెంకటరామకృష్ణకవులచేఁ గామందక మనునీతిశాస్త్రమును అయ్యలభాస్కరకవులచే రెట్టమత శాస్త్రమును గృతినందిన కొండ్రాజు తిమ్మరాజుకొడుకగు వెంకటాద్రియు నీభట్టరుచిక్కాచార్యునకు శిష్యులయి నట్లీక్రిందిపద్యముల వలనఁ దెలియుచున్నది.

క. గురురాయపట్టభద్రుని
నరహరి శ్రీరంగనాయకాంశభవున్ భ
ట్టరుచిక్కాచార్యుల ను
ద్గురులఁ దలఁచి యడుగులకు నతుల్ గావింతున్.

లింగమకుంట రామకవి.

సీ. శ్రీవైష్ణవహితుఁడ జిక్కయభట్టరు
శిష్యుఁడ

లింగమకుంటతిమ్మకవి.

క. శ్రీచంచద్భట్టరుచి
క్కాచార్యవర్యశిష్య! యతులితశౌర్య

ప్రాచుర్యవర్య ! గుణ ర
త్నాచల ! జయలలితధైర్యనయతత్వనిధీ ! కామందకము.

శ్రీమానవిల్లి రామకృష్ణకవిగారు భట్టరుచిక్కాచార్యులను వాక్యము లోని భట్టరు అనఁగా భట్టపరాశరులనియు, 'అతని కుమారుఁడు చిక్కాచార్యులనియు, లింగమకుంట తిమ్మకవియు, నాతనికే శిష్యుఁడనియు, తంజాపురీనాథుఁ డగువిజయరాఘవునిసభలో నుండిన శేషము తిమ్మకవి తనయంబరీషచరిత్రమున భట్టపరాశరునిపుత్త్రిడు, చిక్కభట్టనియు నతనిపుత్త్రుఁడు రంగనాథదేశికుఁడనియు, నతని కుమారుఁడు చిక్కభట్టనియు మరల నతనిపుత్త్రుఁడు రంగనాథుఁడు తనగురువనియు వ్రాసికొనియె'' ననియు, "చరిగొండధర్మన భట్ట పరాశర దేశికునిపౌత్రుఁడగు రంగనాథదేశికుని. శిష్యుఁడనియు వ్రాసియున్నారు. ౧ కాని యీవిషయములు సత్యములు కావు, భట్టరు శబ్ద మిచ్చటపూజ్యార్థమున నుపయోగించినదే కాని తండ్రిని జెప్పుట కుద్దేశించినది కాదు. లింగమకుంటతిమ్మకవి "చిక్కయ భట్టరుశిష్యుఁడ" నని వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చిక్కయాచార్యు నకు (శ్రీకవిగారి యర్థమునను సరించి) పరాశరభట్టుకుమారుఁడనియుఁ దిమ్మకవి యాతని శిష్యుఁడనియు జెప్పవలసివచ్చును. కావునఁ జిక్కయాచార్యులు భట్టపరాశరునిపుత్త్రుఁడనువాద మంగీకార్యము కాదు.

చరిగొండధర్మనకాను
"భట్టపరాశరప్రభురంగ గురుపాద
నీరేజబంభరు నిర్మలాత్ముఁ

డనని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి ధర్మనకు భట్టపరాశరుని కుమారుఁ డగు రంగగురుఁడు గురువు కాని శ్రీరామకృష్ణ కవిగారని నట్లాతని పౌత్రుఁడు గురువు కాఁడు. రంగదేశికుని తండ్రి చిక్కయాచార్యుఁ డును కాఁడు.

---

౧ ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక ౧౯౧౪ పుట ౧౦౦.

శ్రీకవిగారుదాహరించిన శేషముతిమ్మకవి గ్రంథము నాయొద్ద లేదు దానికృత్యాది తంజావూరు భాండాగారపుస్తక పట్టికయం దున్నది అందు శేషము తిమ్మకవి తాను "పరాశరభట్టరాఖ్యఘనకు లచ్ఛాత్రుని" అనివ్రాసికొని యున్నాఁడు. గ్రంథాంతగద్యలో "శ్రీమత్పరాశర భట్టకులజలధి రాకాశశాంక, చిక్కయార్యనందన రఘునాథ దేశికపాదారవిందేదిరాయమానమానస వేంగమాంబా గర్భశుక్తి మౌక్తిక"

అనివ్రాసియున్నాఁడు. చిక్కయార్యుఁడు భట్టపరాశరుని తనయుఁడని శేషము తిమ్మకవి చెప్పలేదు. పరాశరభట్టకుల నీరధికిఁ జంద్రుఁడగు చిక్కయార్యుఁడని మాత్రమే చెప్పియుండెను. శ్రీకవిగారు చెప్పినవంశావళియు నిందులేదు. ఇద్దరు చిక్కయలు నిరువురు రంగనాథులును లేరు. కాలవ్యత్యాసమును సరిపుచ్చుటకై కవిగారూహించి ఇంకొక చిక్కయార్యుని, మరియొక రంగనాథుని కల్పించిరో వారి కేదియైన యాధారము కనబడినదో తెలియదు. సరియైన యాధారము లభించువఱకు నీవంశావళి యంగీకార్యము కాదు. శేషము తిమ్మకవి గురువు రఘునాథుఁడు కాని రంగ నాథుఁడు కాఁడు. నాకుఁజూడఁగా నీ సంబంధము లిటులుండునని తోఁచుచున్నది.

| | |
|---|---|
| భట్టపరాశరుఁడు | |
| రంగగురువు. | చరిగొండ ధర్మన్నకు గురువు. |
| చిక్కయాచార్యుఁడు. | రామకృష్ణకవికి, లింగమకుంట రామకవి తిమ్మకవులకు కామందక కృతిపతి వెంకట్యాదికిఁగురువు. |
| రఘునాథదేశికుఁడు | శేషముతిమ్మకవికి గురువు. |

చిక్కయాచార్యుఁడు. ౧౫౩౦–౧౫౭౦ నడుమనున్నవాఁడని పైని వ్రాసియుంటిని. ఆపత్రములో నాతఁడు రామకృష్ణాదులకు గురువు గానుండెననుట కభ్యంతరము లేదు. ఆతనికి క్రీ. శ. ౧౫౬౦ ప్రాంత

మున రఘునాథదేశికుఁడు జన్మించి శేషము సిమ్మకవికి ౧౬౦౦ ప్రాంతమున గురూపదేశము చేసియుండిన నుండవచ్చును పై వంశ వృక్షములో రంగగురువునకును జియ్యరాచార్యునకును గలసంబంధము నాయూహాతప్ప ఆధారము లభింపలేదు.

పరాశరభట్టు నామముగలవారు ముగ్గురు కనఁబడుచున్నారు. ఒకరు కూరేశభట్టను కుమారుఁడు క్రీ శ. ౧౦౯౩ ప్రాంతము వాఁడు. కూరేశభట్టునకు మనుమనిమనుమఁడు రెండవపరాశర భట్టరు. ఇతఁడు క్రీ శ ౧౨౦౦ ప్రాంతమువాఁడు వీరిగోత్రమేదియో తెలిసికొనవలసియున్నది. వీరిరువురు మనకథాకాలమునందున్న వారుకారు. వీరుగాక యింకనొక పరాశరభట్టరు హారీతసగోత్రుఁడు. క్రీ శ ౧౫౦౦ ప్రాంతమునందున్నాఁడుగ ఇతఁడే పైవంశవృక్షములోని రంగగురుతండ్రియై యుండును ఈముప్వురునుగాక పరాశర భట్టరు నామధారులు మరికొందఱున్నారు. రంగవర్ధనుఁడని నామాంతరముగల మంచికొండ గోత్రజుఁడగు ముమ్మడినాయఁకుడు పరాశర భట్టరుఁడను తనగురువున కిచ్చిన యొకగ్రామము నాయనతల్లి శ్రీరంగేశ్వరున కర్పించుచు శా శ ౧౨౮౦ లో వ్రాయించిన తామ్రశాసనములోఁ దనకుమారుఁ డీడవ పరాశరభట్టరుఁడని చెప్పినది. కాని యీయేడుగురును క్రీ. శ ౧౩౫౦ సంవత్సరమునకుఁ బూర్వులు కావున వారితో మనకిప్పుడవసరములేదు పరాశర భట్టరుల విషయమింకను బరిశోధనీయము

రామదాసు అని ప్రఖ్యాతిఁగాంచిన కంచర్ల గోపన్న దాశరథీ శతకమునఁ దనగురువు రఘునాథభట్టరు అని యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు

ఉ. అర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్ట రా
చార్యులకంజలెత్తి కవిసత్తముల న్వినుతించి కావ్యస

---

౧. తి. దే. శా. సం. ౪ సంఖ్య 23

కర్యమెలర్ప నొక్క శతకం బొనగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపు మిది దాశరథీ ... ... ౬

శేషము తిమ్మకవియు, గోపనయు నేకగురుశిష్యులేమో చూడవలసి యున్నది. కాలవ్యత్యాస మంతగాఁగన్పట్టదు కానీషా క్రీ. శ. ౧౬౭౨–౧౬౮౭ కాలముఁవాఁడు అప్పటికి గోపన్నకు ౬౦ సంవత్సరములు వయసుండెనని యనుకొనినచో ౧౫౬౦ ప్రాంతమున జన్మించిన రఘునాథభట్టరు తన డెబ్బదేండ్ల వయసున రామదాసునకిరువదేండ్ల ప్రాయమున ౧౬౩౦ ప్రాంతమున గురువుగా నుండియుండును. అయిన నీవిషయమున నింకనుఁ బరిశోధనము గావింపవలసియున్నది.

శాఖాచంక్రమణముగఁ జాలదూరమేఁగితిమి. ఏదియెట్లున్నను రామకృష్ణకవియు వేంకటాద్రియు నేకగురుశిష్యులగుట నిశ్చయము. శ్రీ రామకృష్ణకవిగారిచ్చిన వంశావళి ననుసరించి రామకృష్ణకవి గురువును వెంకటాద్రిగురువును భిన్నవ్యక్తులగు చిక్కాచార్యులు కారని తెలుపుటకై యీచర్చయావశ్యకమైనది.

వెంకటరామకృష్ణకవులు కామందకరచనా కాలము నాగ్రంథమునందే ఈక్రిందిపద్యములో నిచ్చియున్నారు.

మ. రమణీయంబుగ శాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూఱునునాఱునై వెలయఁగాఁ బ్రౌఢిం దెనింగించిరా
రమహిందిమ్మయ వేంకటాద్రివిభు పేర్మి వేడ్కఁగామంద కీ
యము శ్రీ వేంకటరామకృష్ణులు స్వభావాబ్దంబునన్ రూఢిగన్

దీనినిబట్టి కామందకీయ రచనాకాలము క్రీ. శ. ౧౫౮౪ అయినది, ఇది నిస్సంశయమైన కాలము. ఇఁక గామందకీయ కృతిభర్తయైన వెంకటాద్రికి పెదసంగభూపాలుఁడు మేనమామయని ఋజువుచేయవలసి యున్నది. ఆసంబంధము కామందకమువలన ధ్రువపడదు. వెంకటాద్రి కేట్టమత శాస్త్రమును నీక నొకకావ్యమును గూడఁ

గృతినందియున్నాఁడు. ఈవిషయము రెట్టమత శాస్త్రమందలి యీ క్రిందిపద్యమువలన స్పష్టమగును.

సీ. శ్రీమదహోబలస్వామి మహారాజ్య
రక్షకుండగుచు నేరాజు వెలయు
నభిరామ కామందకాఖ్య సత్కావ్యర
త్నమునకు నేరాజు నాథుఁడయ్యె
నిరయూరిపుర వరాధీశాది బహుబిరు
దాంకుఁడై యేరాజు యశముగాంచె
జానకీనాయక చరణసంసేవన
ప్రౌఢిచే నేరాజు ప్రబలుతిరుల
నతడు కొండ్రాజు తిమ్మభూపతివరేణ్య
తనయు పెదతిమ్మరాజ వతంసగర్భ
వార్ధిచంద్రుండు సత్కులవర్ధనుండు
సతతవిభవుండు వేంకటస్వామివిభుండు.

అయ్యలభాస్కరకవులు రామురచించిన రెట్టమత శాస్త్రము లో నీపెదసంగభూపాలు నిట్లు వర్ణించియున్నారు.

గీ. అట్టిపెదతిమ్మరాజు ధైర్యాద్రిరాజు
సంగవిభుగుర్వశౌరి యనుఁగుఁగూఁతు
నంగనాశిరోమణిఁ బాపసంగమాఖ్య
ప్రేమ వరియించె విభవాభిరాముఁడగుచు.

ఈ పెదతిమ్మరాజు రెట్టమత శాస్త్ర కృతిపతియైన వెంకటాద్రికిఁ దండ్రియును బెదసంగరాజు తండ్రియైన గుర్వరాజున కల్లుఁడునై యున్నాఁడు

క. గుణనిధి యగు తత్కన్యా
మణిజనకుని బోధజనకు మంజులభాషా

ఫణివరు రణవిజయార్జునుఁ
బ్రణుతింపఁ దరంబె గురువపార్థివ వర్యున్

సీ. పృథులవిక్రమశాలి పెదసంగనృపతియు
సత్యసంధుఁడు చినసంగరాజు
ధర్మగుణాఢ్యుండు తిమ్మభూపాలుండు
రుచిరకీర్తి ఘనుండు రుద్రఘనుఁడు
ప్రధనాంగణ కిరీటి బసవనరేంద్రుండు
స్థిరభాగ్యనిధి పెదచిట్టఘనుఁడు
సింధుగాంభీర్యుండు చినచిట్టవర్యుండు
సతతధన్యుఁడు పొట్టిసంగశౌరి

కలితతేజుండు పాపసంగప్రభుండు
ననఁగఁ బరఁగినతొమ్మండ్రు తనయవరులఁ
గాంచి విజయసంశీలుఁడై మించె నౌర
మంగరాజన్య గురువసమ్రాడ్వరుండు.

క. ఆగురువరాజ వరునకుఁ
ద్యాగసముద్రునకు నల్లుఁడయి వెలసె ధరా
భాగధురంధరతను నా
భాగుఁడు పెదతిమ్మరాజు ప్రజలు నుతింపన్.

ఈపద్యములనుబట్టి పాండురంగమాహాత్మ్యకృతిపతియైన వేదాద్రికిఁ ప్రభువగు పెదసంగభూపాలునకును రెట్టమత, కామందక కృతిపతి యగు వేంకటాద్రికిని పైనిజెప్పిన సంబంధము ధ్రువపడుచున్నది. దీనినిబట్టి విటూరి వేదాద్రికాలమును నిర్ణయించుటకు ముందొకనొక విషయమును జర్చింపవలసియున్నది. రెట్టమతశాస్త్రమునఁ గూడ నొకకాలమీయఁబడినది. దానినిటఁజెప్పి సమన్వయము చేయుట యావశ్యకము.

రెట్టమత శాస్త్ర గ్రంథాంతమున నీక్రింది సీసపద్యము ముద్రితమైయున్నది.

సీ. కలియుగము ప్రథమభాగము నాల్గువేలయె
న్మిదినూర్ల పైని డెబ్బదియునొకటి
శాలివాహన శకసమ మిలవేయునా
ర్నూటతొంబది రెండు రూఢిగాఁగఁ
బ్రభవాదిగతములు పరఁగ నిర్వదిమూఁడు
నేండ్లయ్యె నెంతయు నన్న బుధులు
అట్టి కాలంబున నయ్యాఁ భాస్కర
కవివర్యు లలరాజకమలహితుని
యాజ్ఞఁబూర్వోక్త రెట్టమతాఖ్య కావ్య
మును నొనర్చిరి యాచంద్రముగను గీర్తి
వక్త్రశ్రోతలకును గల్గ వసుధమీఁద
నలయ హేబలనృహరికి సమర్పణముగ.

ఈపద్యమునుబట్టి యేర్పడుకాలము శా. శ. ౧౬౯౨ అనఁగా హూణశకము ౧౭౭౦ అయినది. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులు గారికాలము నాధారముగాఁగొని రామకృష్ణకవి కాలమును నిర్ణయింపఁజూచిరి. అందుచే రామకృష్ణకవి చారిత్రమున "అతని యాశ్రితుఁడగుటచేత రామకృష్ణకవియు ౧౫౬౦–౭౦ సంవత్సర ప్రాంతమునుండి కవియైయుండవచ్చును." అనియొకచోటను "అట్లను కొన్నను పాండురంగమాహాత్మ్యము రచియింపఁబడిన కాలము ౧౬౫౦ సంవత్సరమునకంటెఁ బూర్వమయియుండదు." అని యింకొక తావునను పూర్వోత్తర విరుద్ధములయిన వాక్యములను వ్రాసియుండిరి. పైనినుదహరించిన సీసపద్యములోని కలియుగసంఖ్యయు, శకసంఖ్యయుఁ బ్రభవాదిగతాబ్దసంఖ్యయు నొకదానికొకటి సరిపోవుచున్నవి. కావున నందు ముద్రాపకస్ఖాలిత్యముగాని విలేఖకుని

ప్రమాదముగాని లేదు. ఉద్భటారాధ్య చరిత్రమునుబట్టి నిర్ణయించిన రామకృష్ణకవి కాలమునకును, రెట్టమత కావ్యమునందిచ్చిన కాలమునుబట్టి లెక్కవేయఁగా దేలిన రామకృష్ణకవి కాలమునకును దాదాపు రెండువందల సంవత్సరములు భేదము గన్పడుచున్నది. ఇంతకాలమును వ్యక్తులవయసులలో సర్దుబాటు చేసి సమన్వయించుట యసంభవము. ఇందేదియో యొకటి తప్పుకాక తప్పదు. రెట్టమత కాలము సరియైనదందుమేని రామకృష్ణకవి కాలము క్రీ. శ. ౧౭౭౦ అని చెప్పవలసి వచ్చును. ఇది కేవలము విరుద్ధము కావున రెట్టమత కాలమే తప్పు ఇది ప్రతివిలేఖకుని కాలమైయుండును పై పద్యమును జదివినప్పుడది విలేఖకుని కాలముగాక కవుల కాలమనియే తోఁచును. కాని యితర సందర్భములనుబట్టి చూచినప్పుడది యసత్యమనక తప్పదు ఈపద్యము చరిత్రకారులను భ్రమపెట్టి తప్పుత్రోవను ద్రొక్కించినది. రెట్టమత కావ్యము కామందకమునకుఁదరువాత పుట్టినది. ఆకాలమును అయ్యలభాస్కరకవుల చారిత్రమున వ్రాసెదను.

కామందకరచనాకాలమగు క్రీ శ ౧౫౮౪ నాఁటికి వేంకటాద్రికి ౪౦ సంవత్సరములవయసు కలదని యనుకొనినచో నాతనిజననము ౧౫౪౪ అగును. మేనమామకును మేనల్లునకును ముప్పదివత్సరముల యంతరముండునని తలంపవచ్చును. అప్పుడు పెదసంగభూపాలునిజననము ౧౫౧౦ ప్రాంతమగును. రెట్టమతకాలమునాఁటి కీతనికి గుమారు లున్నట్లు వ్రాసియున్నది. కావున నీతనిజననము పదేండ్లు వెనుకకుఁ బోయినఁ బోవచ్చును.

ఈ పెదసంగరాజుతండ్రియైన గురువదేవచోడరాజు కడపమండలమునందున్న అఘునాశనీ–పావనీనదులసంగమస్థలమునందలి 'అనిమెల' యనుగ్రామమునందున్న సంగమేశ్వరస్వామికి శివరాత్రి పుణ్యకాలమున ననిమెల మొదలుగా నాల్గుగ్రామములను దానమిచ్చి శా. శ. ౧౪౬౫ శోభకృతు సం. భాద్రపద శు. ౩ సోమవారమునాఁడు (క్రీ.శ.

౧౨౮౩) శాసనము వ్రాయించెను. ఆసంగమేశ్వరునిపేరే తనకుమారుల కుంచెను. పెదసంగభూపాలుని జననము ౧౨౧౦ అయినచో దానకాలము నాఁటికి గురువరాజున కఱువది యేండ్లుండును. అందు విరుద్ధమేమియు లేదు. ఈగ్రామమును మరికొన్ని గ్రామములను సదాశివరాయలవలన నళియరామరాజుదారమముగాఁ బడసియుండెనఁట ! గురవరాజుతండ్రి మంగరాజు. తాత బొమ్మరాజు. ఈశాసనములో గురవరాజు తొమ్మండ్రు కుమారులపేరులు నుదాహృతము లైనవి.

వెంకటాద్రికి "ఒరయూరు" పురవరాధీశుఁ డనుబిరుదముండెనని పైపద్యములో నున్నది. ఈశాసనమున గురువయదేవచోడుఁడనియున్నది. అందుచే వీరందఱు నొరయూరు చోడవంశములోనివారని తలంపవలసియున్నది. లేదా రేనాటిచోడులైనఁగావచ్చును రేనాటిచోడవంశ మొరయూరు చోడశాఖనుండి వచ్చినయొక శాఖ కావచ్చును.

పైని జెప్పిన గురువదేవచోడరాజున కైదవకుమారుఁడైన బసవనరేంద్రునకు గంగాధరరాజ దేవచోడమహారాజనుకుమారుఁడు కలఁడు. అతఁడని మొలసంగమేశ్వరులకుఁ జంద్రగ్రహణ సమయమున గొన్నిభూములనిచ్చి శా. శ. ౧౨౧౮ (౧౨౯౬ క్రీ. శ.) వందనసం॥ అధికాషాఢ శు ౧౨ నాఁడొకశాసనము వ్రాయించెను. ౨

ఈసందర్భమున శ్రీఆచార్య నేలటూరు వెంకటరమణయ్యగారొకవ్యాసమును వ్రాయుచు, నందు గురువరాజు రెండవకుమారుఁడైనచినసంగరాజు వ్రాయించిన రెండుశాసనముల నుదాహరించినారు. ౧ అందొకటి శా. శ. ౧౨౮౮ పరాభవసంవత్సర ఆషాఢ బ౧ నాఁడు పొత్తపిగ్రామమును సర్వమాన్యం చేసియిచ్చినట్లు వ్రాయించినది. ఇఁక రెండవశాసనమునుగూర్చి శ్రీవెంకటరమణయ్యగారిట్లు వ్రాసియున్నారు.

---

౧ A. R. 197 of 1938
౨ A. R. 198 of 1938
౧. భారతి సం. ౧౮ పుట. ౧౫౦

౨౧ నాఁడు పౌత్త్రపిగ్రామమును సర్వమాన్యం చేసియిచ్చినట్లు వ్రాయించినది. ఇఁక రెండవశాసనమునుగూర్చి శ్రీ వెంకట రమణయ్యగారిట్లు వ్రాసియున్నారు.

"ఈచినసంగరాజు కృష్ణరాయల కాలమునఁగూడ నుండెనని మఱియొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఇందు శకవర్షము లేదు. "ప్రమాదిసంవత్సర ఆషాడశుద్ధ ౧౧లు శ్రీమన్మహామండలేశ్వరగు ముడూరు అవుబళదేవ మహారాజులుంగారు కడప శ్రీపతికొండసానికి యిచ్చినధర్మశాసనక్రమ మెట్లన్నను, మాకు గురువరాజు చినసంగ రాజుగారు పాలించిన సిద్ధవటముసీమ లోనిమాచుపల్లిగ్రామాన కడప తిరువెంగళనాథునిసేవకు దాసివైననిమిత్తము నీకు నేము మాన్యము వెట్టినచేను..." ప్రమాదినామ సంవత్సరమునకు సరియైనశకవత్సరము ౧౪౪౧ అనఁగా క్రీ. శ. ౧౫౧౯ సం॥ మంగయగురువరాయొక్క రెండవకుమారు డగుచినసంగరాజు సిద్ధవటసీమయందు మాచుపల్లె మొదలైనగ్రామములను పాలించుచుండెనని విశదమగుచున్నది. పెదసంగరాజుశాసన మేదియు నింతవఱకు లభించకున్నను నతడు తనతమ్ముఁడగు చినసంగరాజువలెనే కడపమండలమున నెచ్చటనో క్రీ. శ. ౧౫౧౯వ సంవత్సరమునుండియు రాజ్యపాలనము సేయుచుండె ననుటనిశ్చయము. కావుననాతనివ్రాయసకాఁడైన పిరూరివేదాద్రి మంత్రి కంకిత మీయఁబడిన పాండురంగమాహాత్మ్యము కృష్ణరాయలవారి రాజ్యకాలము తుదనో తరువాత నచిరకాలమునకో విరచిత మయ్యెనని యూహించుచున్నాను పైఁజెప్పిన శాసనముల నన్నిటిని సమకూర్చి చింతించిన నీయూహ సత్యమునకు దూరము కాఁజాలదని తలంచెదను."

పైనిజెప్పిన చినసంగరాజు ప్రమాదిసంవత్సరశాసనము శా. శ. ౧౪౪౧ కాదనియు, ౧౫౦౧ వ సంవత్సరమునాఁటిదనియు నాయభిప్రాయము. శా. శ. ౧౪౬౫ వఱకు అనఁగా చినసంగమరాజు శాస

నమునకుఁ బిమ్మట ౨౪ సంవత్సరములవఱకు నాతనితండ్రి గురువ రాజు జీవించియుండి శాసనము వ్రాయించినాఁడు. ప్రమాదిసంవత్సర శాసనము ౧౪౪౧ అయినచో అప్పటికి చినసంగరాజున కథమము ముప్పదియేండ్లయిన నుండియుండవలయును. అయినచో నాతని జననము క్రీ. శ. ౧౪౮౯ వ సంవత్సరమును నాతనియన్నయైన పెద సంగరాజు జననము ౧౪౬౫ వ సంవత్సరమును, తండ్రియైన గురువ రాజు జననము ౧౪౫౫ సంవత్సర ప్రాంతమునగును. అపత్యములో ననిమెలశాసనమునాఁటికి గురువరాజు దాదాపు తొంబదియేండ్లు వయసుకలవాఁడగును. ఇది యస్వాభావికము. మఱియు మేనల్లునకును మేనమామకును వయోవ్యత్యాసము ౬౦ సంవత్సరములగును. అదియు నస్వాభావికమే. గురువరాజునకును నతనిదౌహిత్రుఁడైన వేంకటాద్రికి నడుమనంతరము తొంబదేండ్లగును. అదియును సామాన్యధర్మము కాదు. కావునఁ బ్రమాదిసంవత్సరము శా. శ. ౧౫౦౧ యని తలంచుటయే న్యాయమని నాయుద్దేశము.

దీనిననుసరించి, రామకృష్ణకవి పాండురంగవిజయకృతిప్రదానము ౧౫౫౦ ప్రాంతమనినిశ్చయించుటయే యుచితము. శ్రీవెంకటరమణయ్యగారనినట్లు పాండురంగవిజయ రచనాకాలము క్రీ. శ. ౧౫౩౦ యైనచో నప్పటికి వసుచరిత్రము ప్రారంభించుటగాని వసుచరిత్రమును రచించుటకుఁ దగినవయసు రామరాజభూషణున కుండుటగాని యసంభవమై పాండురంగమాహాత్మ్య చతుర్థాశ్వాసమున రామకృష్ణకవి—

౪. గిరికానువ క్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక్కపన్నగ మొకనాఁ
డురవడి నిచ్చటనుండిరా
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.

ఆనుపద్యమును వ్రాయుటయుఁగూడ నసంభవమగును. కావున క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతముననే విహారి వేదాద్రి పాండురంగమాహాత్మ్యమును రామకృష్ణకవిచేఁ గృతినందియుండుననినిశ్చయింతము. అప్పటికి రామకృష్ణకవి కించుమించుగ నేఁబదేండ్లుండును. కృతికర్త, కృతిపతులిరువురు సమవయస్కులయియుందురు. ఇతఁడు క్రీ. శ. ౧౪౯౫-౧౫౦౦ ప్రాంతమున జన్మించి తన యిరువదియైదు-ముప్పదేండ్లప్రాయమున ౧౫౨౫ ప్రాంతమున నుద్భటారాధ్యచారిత్రమును రచించి ౧౫౪౦ ప్రాంతమున శైవమతమునువిడనాడి వైష్ణవమతమునుస్వీకరించి ౧౫౫౦ ప్రాంతమునఁ బాండురంగవిజయమును ౧౫౬౦ ప్రాంతమున ఘటికాచలమాహాత్మ్యమును రచియించి పిమ్మటఁ గొలఁదికాలములో స్వర్గమును జేరియుండునని తలంపవచ్చును. ఈతనికి ముద్రాగురువైన చిక్కయాచార్యులు ౧౫౨౦-౧౫౭౦ నడుమ నుండెనని యూహింపనగును.

ఈయూహలననుసరించి, రామకృష్ణకవి, అళియరామరాయలతో సమకాలికుఁడగుచున్నాఁడు. ఈకాలనిర్ణయమునకొక యాక్షేపణము రావచ్చును. రామకృష్ణకవికి సోదరుఁడైనయన్నయకవి, సుదక్షిణాపరిణయ మనుకావ్యమును రచించి యళియరామరాజు పెదతండ్రికి మునిమనుమఁడైనకోనేటిరామరాజునొద్ద మంత్రిగా నున్న పులిజాలసోమయామాత్యున కంకితము చేసెను. ఇది యసంభవము కాదా? సోదరులనడుమ నింతకాలవ్యత్యాసముండునా? యని యెవరైనఁ బ్రశ్నింపవచ్చును ఈప్రశ్న కుత్తరము నన్నయకవి చారిత్రమున వ్రాయుదును. విమర్శించి చూడఁగా నిందు వ్యత్యాసముగాని విరోధముగాని కన్పించ లేదు.

రామకృష్ణకవి లింగపురాణమును రచించెనని చెప్పుదురు. ఆగ్రంథ మిప్పు డెచ్చటను గన్పట్టుట లేదు. రచించియున్నచో వైష్ణవమతస్వీకరణమునకు ముందు వ్రాసియుండును. తెనాలిరామ

కృష్ణుని యాదిపురాణములోనిదని యీక్రిందిపద్యము నప్పకవి లక్ష్యముగా నుదాహరించియున్నాఁడు.

మ ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దైతేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబుపైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్లయగు సౌభాగ్యంబుశోభిల్లఁగన్.

ఈపద్యము నే తెనాలి రామకృష్ణుని యిందుధరోపాఖ్యానములోనిదని కస్తూరిరంగకవియు నాసందర్భమువనే లక్ష్యముగా నిచ్చియున్నాఁడు. ఈపద్యము నాచనసోముని యుత్తరహరివంశమునందున్నది. ఈపద్యమునకుముందుత్తరహరివంశములో "ఇందుధరోపాఖ్యానము" అనికథాశీర్షికనిచ్చి యున్నాఁడు. ఆదిగువనే యీ పద్యములిఖితమై యున్నది. రంగకవి యాశీర్షిక నొకగ్రంథముగాఁ బేర్కొనియున్నాఁడు. అందుచేఁ బైనిజెప్పిన రెండుగ్రంథములును రామకృష్ణరచితము లున్నవో లేవో చెప్పఁజాలము. అవి యిప్పుడెచ్చటను గానిపించుట లేదు ఈకవి ప్రతిపద్యశిరఃకంప మనుగ్రంథమును రచియించె నందురు. అదియును గన్పడుట లేదు

రామప్రెగడ జగ్గన సమకూర్చిన యుదాహరణగ్రంథములో నీరామకృష్ణకవి, కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము, అను గ్రంథములలోనివని కొన్నిపద్యము లుదాహృతములైనవి. కందర్పకేతుఁడను నొకానొకపురుషునివిలాసము లిందు వర్ణితములై యుండును. ఆగ్రంథములందలి పద్యములివి :—

కందర్ప కేతువిలాసము :—

ఉ. అక్కమలాక్షిఁ గన్గొనినయప్పటినుండియు నేమిచెప్ప! నా
కెక్కడఁ జూచినన్ మదనుఁ డెక్కడఁజూచినరోహిణీవిభుం
డెక్కడఁజూచినం జిలుక లెక్కడఁజూచినఁ గమ్మగాడ్పు లిం
కెక్కడ వెట్టయోర్వఁగల నీవిరహానలతాపవేదనన్.

ఉ. కామిని చంద్రుఁజూచి మదిఁ గందు సరోరుహగంధి మందిరా
రామముఁ జూచి మ్రానుపడు రాజనిభానన సారెకున్ శుక
స్తోమముఁ జూచి యేఁకరును దొయ్యలి కోకిలఁజూచి కంటఁగ్రం
పౌ మదలీలఁ దాల్చు మదనానలతాపవిషాదవేదనన్.

ఉ వారిజ! మీన! కోక! యళివర్గ! సితచ్ఛద! సల్లతావనీ!
మీరుచిరాస్య మీనయన మీకుచ మీయలకాలి మీగతిన్
మీరమణాంగి మత్ప్రియ నమేయగతిన్ విరహాతురాననన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరుఁ
గావరే?

సీ. తారామనోరంజనారంభ మేదొడ్డు
శిలలు ద్రవింపంగఁ జేయుననినఁ
జాకోరక్షార్థ యోజనకేళి యేదొడ్డు
పేర్చి యంభోధు లుబ్బించు ననినఁ
గుముదౌఘతాపోపశమకృత్య మేదొడ్డు
సృష్టియంతయుఁ జల్లసేయుననిన
వరనిశాకామినీవాల్లభ్య మేదొడ్డు
వర్ణింప నక్కళాపూర్ణుఁ డనినఁ

గీ దనకు సర్వజ్ఞశేఖరత్వంబు గలుగ
హితసుధాహారవితరణం బేమిదొడ్డు
ననఁగ విలసిల్లె హరిదంతహస్తిదంత
కాంతి నిభకాంతిఁ జెలువారి కంజవైరి!

"కందర్పకేతువిలాసమును జిట్టమంత్రికంకితముచేసెననియు నీ చిట్టమంత్రి, నాదెండ్లయప్పనగోపనలకు సన్నిహితజ్ఞాతియు సమకాలికుఁడునగు "చిట్టరసు" అనువతఁడే యైనయెడలనాకృతియు గొరగి ప్రాంతములో రచింపఁబడియుండవలయుననియు, అప్పాజియను నామము సాళ్వతిమ్మరుసునకుఁగాక యతని మేనల్లుఁ డగునాదెండ్ల

యప్పమంత్రికే చెల్లునని నాయభిప్రాయము" అనియు శ్రీమానవిల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. (ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక ౧౯౧౨ పుట ౧౦౩) ఇట్లువ్రాయుటకు శ్రీకవిగారి కాధార మేదియో చెప్పలేదు. నాదెండ్లయప్పనగోపనలకు సమకాలికుఁడైన డాయాది చిట్టరసు అనునాతఁడున్నట్లు రాజశేఖరచరిత్ర, కృష్ణార్జున సంవాద, ప్రబోధచంద్రోదయవ్యాఖ్యలలో నెచ్చటను నుదాహృతము కాలేదు. శ్రీరామకృష్ణకవిగారి కీచిట్టరు నెందులభ్యమయ్యెనో తెలియలేదు. ఆకాలమున రెంటాలచిట్టరసొకఁడున్నాఁడు. అతఁడేమో!

నాదెండ్లయప్పయను "అప్పాజి" యని మనమనుకొనిన నను కొనవచ్చును. కానిరాయలు "అప్పాజీ"యని తిమ్మరుసునే పిలుచుచుండెడివాఁడు. కాని నాదెండ్లయప్పనమంత్రిని పిలువలేదు. ఈవిషయము స్పష్టముగాఁ గృష్ణరాయవిజయమునఁ జెప్పఁబడినది. ఆపద్యమును గృష్ణరాయలచరిత్రమున నుదాహరించియున్నాఁడను.

హరివిలాసములోని కొన్నిపద్యములనుగూడ నుదాహరించెదను. ఇందుఁ గథాప్రారంభమున నయోధ్యానగరవర్ణనము కలదు.

హరిలీలావిలాసములోని కొన్ని పద్యములు :—

ఉ. ఏటిమహానుభావుఁ డిహిహీ జమదగ్నితనూజుఁ డేఁడుమ
మ్మాటులఁగాని శత్రుమదమర్దనదక్షుఁడు గాఁడు గోత్రిమే
తూఁటుగఁ జేతఁదల్లి మెడఁ ద్రుంచెఁ గదా యని యానడింతు రా
గాటపుపంతగాండ్రు కులగణ్యు లగణ్యులు పుణ్యు లప్పురిన్.

ఉ. వేదపురాణశాస్త్రములు వేడుకవిద్యలు సర్వయజ్ఞసం
పాదనశక్తి నిత్యనితపాయవిధిప్రతిపాలనంబు, దా
కాదిమతత్త్వముం గనుట హస్తగతామలకంబు గంట, ధా
త్రీడవిజావతంసుల కరిందమ మప్పురిఁ గల్గువారికిన్.

చ. యుగములు వేయువోవ నొకయుద్ధసువుల్ గణుతించునంతకే
యుగములు లక్ష చెల్లుఁ బోరినున్నధనంబు మితింప నమ్మహా
యుగశతకోటులేఁగు నితరోన్నతవ త్తువు లెన్నఁ గీసవె
త్తిగ నలకాధినాథులుగ దే పురిలో మను వైశ్యపుంగవుల్.

శా. ఆకరివేల్పుసామిచరణాబ్జములన్ జనియించినారు మం
దాకినితోడుసీడలయినారు నిజంబుగఁ గమ్మకట్టి దా
నైం కమనీయకీర్తిమహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతు లద్రిధీరులు ప్రభాద్రులు మాద్రులు శూద్రు
లప్పురిన్.

ఉ. చంగునఁ దాఁటు ధే యనిన సప్తసముద్రములైన వేగ వా
గెం గుదియింప నిల్చు నడుగెంటన శస్త్రనిపాతధీరతన్
సంగరరంగవీథిఁ దమస్వామికి గెల్పుఘటించునట్టియు
త్తుంగతురంగరత్నములు తొంటిహయాకృతి శార్ఙిఘట్టువుల్.

ఉ. కాలధనంజయుండు తనుఁ గాచి దివాకరమత్స్యయంత్రమున్
గే లెడలించి సంధ్య యనుకృష్ణ నుదంచితరూపవిభ్రమ
శ్రీలలితాంగినిం దగ వరించి తమోమయధార్తరాష్ట్రభూ
పాలకసేన నేయు సితభల్లములో యనఁ బర్వెఁ దారకల్.

గీ. ఉడుపథం బనుములుదోసతోడిమ యూడఁ
దామరసబంధుఁడనుపండు తనకుఁ దానె
వికృతి గనుపింపఁ గనుపట్టు విత్తు లనఁగఁ
దనరె నెఱసంజఁ గెంపగు తారకములు.

ఉ. ఆలఘుస్ఫురితంబు వేఁడియగునన్నము నుల్చినముద్దపప్పు క్రొం
దాలిపుకూర లప్పడము ద్రబ్బెడవారలు పానకంబులున్
మిలిమిపిండివంటయును మీఁగడతోడిదధిప్రకాండమున్
నాలుగుమూఁడుతోయములనంజులు గంచపళాత్తి పెట్టుచున్.

చ. సరసులపొందు గల్గఁగఁజాలి బహూన్నతచారుశాఖలం
చెరిగి మహాద్విజావనమె పేర్మి నిజాయతిగాఁ దనర్చి ని
ర్భరజనతాపసంహరణపాత్రము లయ్యు మహీజవాటికల్
పురి వెలినిల్చె మేటియు నపూజ్యుఁడగున్ మధుపానుకూలతన్

ఉ. రాసి సహస్రభానుఫణరత్నము లెల్లను జోవఁ దన్ను చుక్
వాసరభోగిఁ గాలఫణివైరి కదుక్ వడి నొక్కి నక్కఁగాఁ
జేసినఁ గ్రమ్ము అదు గ్రధిరశీకరపూరవిజృంభణం బనం
గా సముదగ్రతం బొలిచెఁ గ్రమ్మి జపోపమసాంధ్య రాగముల్

ఇందలి శార్దూలవృత్తమును గూచిమంచి తిమ్మకవి తనలక్షణ గ్రంథమున లక్ష్యముగా గ్రహించి తెనాలి రామకృష్ణుని హరిలీలా విలాసములోనిదని చెప్పియున్నాఁడు.

పేరులనుబట్టి మొదటి దొక శృంగారప్రబంధ మనియు రెండవది శ్రీమహావిష్ణులీలలనువర్ణించు గ్రంథ మనియుఁ దెలియుచున్నది. పై పద్యములనుబట్టి యంతకంటె నధికముగఁ నేమియుఁ దెలియుట లేదు. ఇవి యాకవికృతములే యైనచో, నుద్భటారాధ్యచరిత్రము నకును పాండురంగవిజయమునకును నడుమ వీనిని రచియించియుండును

కాకునూరి అప్పకవి తనలక్షణగ్రంథమున రామకృష్ణకవి చాటుధార లనియాక్రింది రెండుపద్యముల నిచ్చియున్నాఁడు.

క. బసవనకుఁ బుట్టినప్పుడె
పసరము గోవిందరాజు పసరం బైనన్
గస వేటికిఁ దినఁ డనఁగాఁ
గసవుం దిను శత్రు లాజి గదిసిన వేళన్.

బసవనకుమారుఁడైన యీగోవిందరా జెవ్వఁడో తెలియదు. శత్రువులువచ్చి యుద్ధము చేయవలసిన యావసరమున్న వాఁడు. కావున నీతఁడు చిన్న సామంతనృపాలుఁడో దండనాయకుఁడో యైయుండును.

క. చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెరఁగున్
మిన్నంది మొరసె వరసిం
గన్నకవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.

ఇందలి చిన్నన యే అష్టమహిషీకల్యాణాదిద్విపదకావ్యములను రచియించిన తాళ్ళపాక తిరువెంగళార్యుఁడు పెదతిరుమలయ్య యాచిన్ననకుఁ దండ్రియై యనేక గేయములను రచియించినవాఁడు. వీరిరువురును రామకృష్ణకవితో సమకాలికులు. వరసింగన్న యెవ్వరో తెలియదు తాళ్ళపాకము వారిలో నీ పెదతిరుమలాచార్యుల కన్నయగు నరసింగయ్యాయున్నాఁడు. కాని యాతఁడు కవియైనట్లు కన్పట్టదు. అతనిగ్రంథములు లేవు. అతఁడు కవియనియెవ్వరు ననలేదు. రామకృష్ణ కవితో సమకాలికుఁడో, ఇంచుక పూర్వుఁడో యై యుండును.

తెనాలిని నివాసముగా నేర్పరచుకొనినప్పటినుండియు వీరు తెనాలివారైనను, నంతకుఁబూర్వము వీరిగృహనామ మీశ్వరప్రెగడ వారైనట్లు బ్ర॥ శ్రీ వీరేశలింగముగారు కవులచరిత్రలో వ్రాసియున్నారు. ఉద్భటారాధ్యపీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగా రీతని గృహనామము గార్లపాటివారనియు తెనాలిలో రామలింగేశ్వర స్వామి యాలయమున నొకయుత్సవవిగ్రహపీఠముమీద నీశ్లోక మున్నదనియు వ్రాసియున్నారు.

శ్లో॥ శ్రీ తెనాలినగరే వ్యరాజయ
ద్గార్లపాటిపుర రామపండితః
శుక్లమాఘసితపంచమీగురౌ
రామలింగ ముమయోత్సవాకృతిమ్.

తెనాలికి రాకపూర్వము వీరు గార్లపాడునివాసులై యుందురు. అందుచే గార్లపాటివారని పేరు వచ్చియుండును. అంతకుఁ బూర్వమీశ్వర

ప్రెగడవా రేమో! శుక్ల సంవత్సరము శా. శ. ౧౪౩౧. ఈదాన మొసంగినది రామపండితుఁడు. అతఁడు తెనాలియందలి రామలింగేశ్వరుని పేరు తనతనయునకుఁ బెట్టియుండెను. రామయపండితులు శా. శ. ౧౪౩౧ మాఘమాసమువఱకు (౧౫౧౦ మార్చి) జీవించి యుండెనని యిందు వలన స్పష్టమగు చున్నది. ఈరామయ్య పండితుఁడు గార్లపాడునుండి తెనాలివచ్చియుండును. తెనాలియగ్రహార నిర్ణేతగా రామకృష్ణకవి యెప్పుడయ్యెనో తెలియదు. ఉద్భటారాధ్య చరిత్రమునఁ దెనాలియగ్రహారనిర్ణేతవని చెప్పఁబోవలేదు. కావున నప్పటికీయగ్రహారముతో సంబంధము లేదు. నిర్ణేతశబ్దమునకు నిర్ణయించువాఁడు, కలిగించువాఁడు, లేక అధ్యక్షుఁడు; అనునర్థము లున్నవి. వీనినిబట్టి యాయగ్రహారమునం దీతనికి స్వామ్యము లేదనియు, నగ్రహారమును జేయించినవాఁడో లేక నగ్రహారీసుల కధ్యక్షుఁడో యైయుండుననియుఁ దోఁచుచున్నది. ఈయగ్రహారస్వామ్య మెవరిదో పరిశోధింపవలసి యున్నది.

రామకృష్ణకవిగ్రంథములను జదివినవారి కీతఁడు పరమభక్తాగ్రేసరుఁ డనియుఁ, జక్కని వైదుష్యము కలవాఁ డనియు. సహృదయులకు మనోహరముగ నుండునట్లు కవిత్వము చెప్పఁగలసమర్థుఁ డనియు తోఁచును. కాని సామాన్యప్రపంచమున నీతనిప్రతీతి వేఱువిధమున నున్నది. ఇతఁడు వికటకవి యనియు. సర్వదా పరుల నాక్షేపించుస్వభావముఁ గలవాఁడనియు, కొంటెప్రవర్తనము గలవాఁడనియుఁ బ్రజలనుకొనుచుందురు. తెనాలి రామలింగఁ డనినప్పు డీగుణములు గల వ్యక్తియే సామాన్యప్రజల హృదయములకుఁ గోచరించుచుండును. ఇతనిని గుఱించినకథ లనేకము లాంధ్రప్రపంచమునఁ బ్రచారములో నున్నవి. అందుఁ గొన్ని యసభ్యములై వాకొనుటకు నూకొనుటకుఁ గూడ నసహ్యములుగ నుండును. అట్టి కథలతోఁ గొన్ని పుస్తకములు కూడ నచ్చుపడినవి. ఎవ రేబూతుకథ చెప్పఁదలఁచినను, ఏయుక్తిని

నుడువవలయు ననినను, దానికర్తృత్వ మీతనిపైఁ బెట్టుచుందురు. ఈ కథాప్రపంచ మంతయు నమ్మఁదగినది కాదు. అంతటి యసహ్యాప్రవర్తనము కలవాఁడని రామకృష్ణకవిని దలంచుట పాపహేతువు. తోడివారలతో హాస్యప్రసంగము సేయుట యందును, హాస్యరసమును బోషించుటకై పద్యముల నల్లుటయందును నిష్టము కలవాఁడను నంతవఱకు మనమంగీకరింపవచ్చును. ఈవిషయము సే వల్లూరి నరసింహాకవి "వేడ్క మీఱంగ చలోక్తులన్ నృపుగరంగ నొనర్చు హారంగు నింగి ముట్టంగ మెలంగు నేరుపు గడంగి చెలంగు" అని చెప్పియున్నాఁడు. అంతమాత్రమున నీతఁ డుచితానుచితజ్ఞానము లేనివాఁడని తలంపరాదు. ఇతనికవిత్వమునం దొకవిశేషమున్నది. అచ్చటచ్చట మారుమూలలనున్న పదముల నేర్చి కూర్చుచుండుట యం దితనికిఁగోర్కె మెండు. అందుఁ గొన్నిసామాన్యముగ స్థూలదృష్టికిఁ దప్పులవలెఁ గాన్పించును. కాని విమర్శించిచూచినచో నవి తప్పులైయుండవు. వ్యాకరణశాస్త్రమునందలి యేమారుమూల సూత్రమునుబట్టియో యవిసాధువులగుచుండును. దీనినిబట్టి యాతఁ డెట్టిస్వభావముగలవాఁడో యూహింపనగును. ఏకవినైన నాక్షేపించు నప్పుడుకూడఁ గవిది తప్పుకాకపోయినను, నీతనిది సదాక్షేపమని ప్రజలను భ్రమ గొలుపుచుండును. వినోదముకొఱ కట్టిచేష్టలను జేయుచుండుటనుబట్టి లోక మాతనికనేకకథల నంటగట్టి మోసపోవుచున్నది. ఈతని కారోపింపఁబడినకథల నిచ్చట వ్రాయఁబూనినచో గ్రంథమున విశేషభాగము వానితో నిండిపోవును. వానినిట వ్రాయుటవలనఁ గలిగెడి పరమప్రయోజనమును లేదు. పాఠకుల వినోదార్థము నాలుగైదుకథల నిటవ్రాసెదను. ఈకథల నుదాహరించి బ్ర.శ్రీ. వీరేశలింగముపంతులుగారు రీతఁడాకాలమున లేఁడనుకారణముచే విశ్వాసార్హము కావని వ్రాసిరి. పైనిజేసిన కాలనిర్ణయమునుబట్టి రామకృష్ణుఁ డాకాలమువాఁడు కాఁడని వ్రాసివేయఁ

జాలకపోయినను సందర్భమునుబట్టి యుక్తియుక్తము కాదను కారణముచేఁ ద్రోసివేయవచ్చును.

(౧) వ్యాకరణశాస్త్రమునందపారప్రజ్ఞగల కందాళ అప్పలాచార్యులనుగుఱించి యాయన శిష్యుఁడొకచోట

"అపశబ్దభయంనాస్తి అప్పలాచార్యసన్నిధౌ"

యని వ్రాసెనఁట. ఎంతటియపశబ్దమునైనను దనపాండిత్యముచే నప్పలాచార్యులుగారు సుశబ్దముగా సాధింపఁగలఁడని యాశిష్యుని యభిప్రాయము. రామకృష్ణుఁ డచ్చటనుండి :—

"అనాచారంభయం నాస్తి శిష్టమూత్రస్య సన్నిధౌ"

యని యుత్తరార్థమును బూరించి దానిచేఁబూర్వార్థమునకు విపరీతార్థము వచ్చునట్లు చేసెనఁట! నిలువఁబడియుండి మూత్రోత్సర్జనముఁ జేయువానియొద్ద ననాచారభయమెట్లు కలుగలేదో అట్లే శుద్ధుఁడైన యప్పలాచార్యునియొద్ద నపశబ్దభయ మిక్కలిలేదని తాత్పర్యము తేలినది. ఈశ్లోకమును వీరేశలింగము పంతులుగారిట్లాంధ్రీకరించినారు.

గీ. అప్పలాచార్యుని సన్నిధియందు వీస
మంతయును నపశబ్దభయము లేదు
నిలిచి మూత్రవిసర్జన సలుపువాని
వద్దఁగూడ ననాచారభయము లేదు.

కందాళ అప్పలాచార్యునియందు బీతని కెంతగౌరవమున్నదియుఁ బాండురంగమాహాత్మ్యమునం దాయననుగూర్చి రచించిన పద్యమువలనఁ దెలియఁగలదు. ఈశ్లోకపూరణ మాయనను కుంతయని యగౌరవపఱచుటకుఁగాదు ప్రజలను నవ్వించుటకొఱకే!

(౨) మనుచరిత్రమునం దాంధ్రకవితాపితామహుఁడు రచించిన

"కలనాఁటి ధనము లక్కఁట
కలనాఁటికిఁ దాఁచఁ గములగర్భనివశమా
నెలనడిమినాఁటి వెన్నెల
యలవడునే గాఁదెఁ బోయ నమవసనిసికిన్"

యనుపద్యమును విని, నపభ్రంశపదములతో రామకృష్ణకవి

క. ఏమితిని సెపితివి కపితము
బ్రమపడి వెఱిపుచ్చకాయ వడిఁ దిని సెపితో
యుమెతక్కాయ దిని సెపితో
యమవసనిసి యన్నమాట యలసని పెదనా!

అనుపద్యమును జెప్పి వెక్కిరించెనఁట! అమవసశబ్దము తప్పుగా భావించి యీయాక్షేపమును రామకృష్ణకవిచేసియుండఁడు. ఒకవేళ చేసినను నంతచక్కనిపద్యమును చక్కనిభావముతో చక్కనిధారతో రచించి, పద్యాంతమున 'నమవస' నిసియనుశబ్దముకంటె మనోహరమైనశబ్దము నేలవేయు లేదని త్రోఁచియో, తనస్వభావము ననుసరించి, తనది దురాక్షేపమయినను సదాక్షేపముగా భ్రమింపఁజేయవలయునని యో యీయాక్షేపమును జేసియుండును. రామకృష్ణకవి శబ్దజ్ఞానము లేనివాఁడని తలంపరాదు.

(3) శ్రీకృష్ణదేవరాయల సేవకుఁడొకనాఁడు రామకృష్ణునకు "కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్" అనుసమస్య నిచ్చెనఁట! అందుపై రామకృష్ణకవికిఁ గోపమువచ్చి

క. "గంజాయి త్రాగి తురకల
సంజాతులఁగూడి కల్లు చవిగొన్నావా
లంజలకొడకా యెచ్చట
కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్."

అని పూరించెనఁట! అందుపై వాఁడు రాయలతో నీవృత్తాంతము చెప్పుకొనఁగా నవ్వి మఱునాఁడు సభలో నాసమస్యనే రాయలు రామకృష్ణున కీయఁగా నాతఁడు నవ్వుచు

"రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటుఁ గొల్వఁ బాల్పడి రకటా!
సంజయ విధి నే మందును
కుంజరయూధంబు దోమకుత్తుక సొచ్చెన్"

అని పూరించెను. రాయలును నవ్వుకొనియెనఁట.

(౮) ఒకానొక లేఖరి తాను గొప్ప వ్రాతఁగాఁడననియు, గ్రంథములను వ్రాయను ద్యోగ మిప్పింపుఁడనియు రాయలయాస్థానమునకు వచ్చెనఁట!

రామకృష్ణకవి:—

క. తువ్వఁట! బాబా తలపైఁ
బువ్వఁట! జాబిల్లి వల్వ బూదఁట, చేఁదే
బువ్వఁట చూడఁగను హుళి
క్కవ్వఁట యరయంగ నట్టిహరునకు జేజే.

అనుపద్యమును జెప్పుచు నిందలి "తువ్వఁట హుళిక్క" అనుశబ్దములను వికారముగా జదివి యాతనిని వ్రాయుమని చెప్పఁగా సభవారు నవ్వుటయు నా వ్రాయసకాఁడు తెల్లవోవుటయు జరిగె నందురు.

(౯) రామకృష్ణకవి రామరాజభూషణునిగురించి

క. చీపర పాపర తీఁగలఁ
జేపలబు ట్లల్లినట్లు చెప్పెడు నీయీ
కాఁపుకవిత్వపుమాటలు
బాపనకవివరునిఁ జెవికిఁ బ్రమదం బిడునే.

యనుపద్యమును జెప్పెనందురు. రామరాజభూషణునంతవాని నీతఁ డిట్లనియుండఁడు. ఈపద్యము మరియెవరినిగూర్చి యెవరుచెప్పినదో తెలియదు.

(౬) రామరాజభూషణునితో సంబంధించినవి మఱికొన్ని పద్యము లున్నవి. రామకృష్ణకవి రామరాజభూషణకవి కాలము వాఁడు కాడని కొంద ఱాపద్యములను విశ్వసించుట లేదు. రామకృష్ణకవి చరమకాలములో రామరాజభూషణుఁ డున్నాఁడని నాయభిప్రాయము. ఆపద్యముల నీకవిచారిత్రమునందుకంటె రామరాజ భూషణుని చారిత్రమునం దుదాహరించుట యుక్తమనితలంచి యిందు వదలితిని.

(౭) ముక్కుతిమ్మనవిషయమున నీతఁ డేదో యొకయపరాధముఁ గావించెననియు నందుపై నాతఁ డలిగి పండ్లూడునట్లు తన్నెననియు, నందుచే నొకపన్నూడిపోవఁగా రామకృష్ణుఁడు దుప్పికొమ్ముచే నూడినపల్లమర్చుకొనెననియు, రాయలొకప్పుడు "రవిగాననిచోఁ గవిగాంచునే కదా!" యనిసమస్య నీయఁగా బట్టుమూర్తి :—

"ఉ. ఆరవి వీరభద్రునిపదాహతి నుల్లినబోసినోటికిన్
నేరఁడు రామకృష్ణకవి నేరిచెఁబో మనముక్కుతిమరాట్
క్రూరపదాహతిం బడినకొక్కిరిపంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియింప నౌర రవి గాననిచోఁ గవి గాంచునే కదా!

యని పూరించెననియుఁ జెప్పుదురు. బట్టుమూర్తి రాయలకాలములో నుండెనని చెప్పఁజాలము. ఈసమస్యను బూరించినకవి యెవ్వరో!

రామకృష్ణుఁ డొకనాఁడు తిమ్మకవి యింటికి బోవునప్పటికాతఁ డుయ్యేలలో నూఁగుచుండెనఁట! రామకృష్ణుఁడు "కవీంద్రా! ఊతునా" అని యడిగెనఁట! తిమ్మన "మంచిది" అనెనట! అందుపై

రామకృష్ణుఁడు తిమ్మనపై నుమిసెనఁట! అందులకుఁ గోపించి యూఁగుచున్న తిమ్మకవి తన కాలుతోఁ బన్నూడునట్లు రామకృష్ణుని దన్నెనట.

రామకృష్ణకవి యట్టినీచపుపనిని జేయుననినమ్మరాదు. ఏదయిన విద్యావిషయమున వాదము పెఱిగి యాగ్రహావేశమున నట్టిది జరిగిన జరిగియుండవచ్చును.

(౫) ధూర్జటి కవితామాధుర్యమును గ్రహించి రాయలు

చ. స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటి పల్కులకేలఁ గల్గెనో
యతులితమాధురీమహిమ!

యని ప్రశ్నింపఁగా రామకృష్ణకవి "హా! తెలిసెన్ భువనైకమోహనోద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహార సంతతమధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటం జుమీ! యని సభ్యులు నవ్వునట్లు పూరించెనఁట! దీనిని కుమారధూర్జటియే గ్రంథస్థము చేసియున్నాఁడు.

చెప్పఁబూనినచో నిట్టి కథలు రామకృష్ణునివిషయమునఁ జాలఁ గలవు. గ్రంథవిస్తరశంకవలనను వానివలన నయ్యెడిప్రయోజనము లేకుండుటవలనను నాకథలకును రామకృష్ణునకును గలసంబంధము సందేహాస్పదమగుటచేతను వదలివేసితిని.

రామకృష్ణునికవిత్వము ప్రౌఢమై కదళీపాకమున మనోహరముగా నుండును. లోకోక్తులను సందర్భానుసారముగా నుపయోగించి, కావ్యములకు వన్నె దెచ్చెను. పాత్రోచితముగఁ జేసినవర్ణనములు హృదయానందదాయకములై యొప్పారుచుండును. ఇతని గ్రంథములం దెచ్చటను నౌచిత్యము చ్యుతము గాలేదు. పదగుంభనమున నెన్నికగన్నవాఁడు, ఉత్తమకవులలో నొకనిగ నెన్నఁదగిన యీతఁడు పెక్కుకావ్యములను రచించినను నందు మూఁడు మాత్రమే లభించినవి. అయిన నదియును సంతోషింపఁదగినదే.

పెద్దన, తిమ్మన, మల్లనాదుల కావ్యము లొక్కటికంటె నెక్కువ లభింపలేదు. ఒక్క కావ్యముకూడ లభింపని సుకవు లెందఱో కలరు.

ఈతని కవిత్వశైలి తెలియుటకై దొరకిన గ్రంథములనుండి యాశ్వాసమున కొకటివంతున నీక్రింద నుదాహరించి యీతని చారిత్రమును ముగించెదను.

ఉద్భటారాధ్య చరిత్రము :—

ఉ. కానుక రాజధర్మ మని గైకొను లోభము పూనికాదు శీ
ఘ్రానియమంబునన్ రిపులఁ గాంచు విరోధముఁ దాల్చికాదు రా
జ్యానుపమానముద్రకు బలావలి నేలు భయంబుఁ బొందికా
దా నరనాథచంద్రుఁడు మహాద్భుత మాతనివర్తనం బిలన్ ౧ఆ

మ. ఒకఁ డున్నాఁడు మదీయబాంధవుఁడు గన్యం డెల్లచో బల్లవుల్
సకలానంగకళారహస్యవిదుఁ డీజాణండ యంచున్ ధనున్
బ్రకటింపన్ భవదాత్మజాతకుఁ దగున్ భామా యతం డీను బు
చ్చుకొ సామర్థ్యము గల్గుఁ బేరు సమకూర్చున్ నీకు
నైశ్వర్యముల్ ౨ఆ

చ. సముసుఖమోదియై వినయసంగతుఁడై శుభితాభిరాముఁడై
యమరిననీ తెలుంగు సుగుణాఢ్యువశం బగు మాద్రశేరితా
ర్థ్వమనువుమీఁదనుం బ్రబలినట్టి తెలుంగును గూర్చు నారికే
ళమునకుఁ బోసినట్టిసలిలంబు విధంబున భూపురందరా! ౩ఆ

ఘటికాచలమాహాత్మ్యము :—

మ. సరయూతీరమునందు నొక్కపురరాజం బుగ్రభాస్వత్ప్రభా
పరయూథప్రతిరోధకస్మణిమయప్రాసాదహర్మ్యాంకమై
పరరాజోత్కరదుర్నిరీక్ష్యపరిఘాప్రాకారనిశ్శంకమై
పెరయున్ ఖ్యాత నయోధ్యనాఁ బ్రకటమై మిత్రాన్వ
యాధారమై ౧ఆ

శా. ఆ చెంత న్వసియించుభూసురుఁ డొకం డౌదార్యకర్ణుండు శ్రే
ఖా చేతోభవమూర్తి కాంతిజితరాకాశోకవిద్వేషి వి
ద్యాచాతుర్యఫణీశ దేశికుఁడు ప్రేమాయత్తచిత్తుండు త్ర
య్యాచారాచరణప్రచారి హరిశర్మాఖ్యుండు దారోన్నతిన్ ౨ ఆ

శా. వారంతన్ ఘటికాచలేశ్వరు జగత్స్వామిన్ దయాపారగం
భీరాకారు సుధారుని న్నిజమనఃపీఠంబున న్నిల్పి దు
ర్వారంబౌ విషయైకభోగనిరతస్వాంతంబు బంధించి తా
రారాధించిరి వేదమోదిత మనుధ్యానప్రకారంబునన్ ౩ ఆ



పాండురంగమాహాత్మ్యము :—

చ. విమలమయూఖరేఖయు నవీనతరోత్పలపత్రముల్ ప్రవా
ళమణియు నొక్కటీవియ బలాదృతిఁ దాల్చె నటన్నవించు వి
భ్రమశిథిలాంగియయ్యుఁ గుచభారనితంబకపోలగోపన
క్రమకలనాకులాత్మయయి కన్నుల నీసు నరల్చె గాఠియున్ ౧ ఆ

మ. అహరారంభమునందు రక్తుఁడయి మధ్యాహ్నంబునన్ సుభ్రుఁడై
గ్రహరాడస్తమయంబునం దసితుఁడై గాయత్రియుం బోలియు
య్యహిపర్యంకుఁడు మూఁడుమూర్తులకు నిక్కంబొప్పఁ బూజింతుర
న్వహముం గోమలి మూఁడుమంత్రముల నిత్యానందకాంతున్
మునుల్ ౨ ఆ

ఉ. అకుమఱుంగుపిందెయయి యంతిపురంబును బోలెనున్న రా
కాకుముదప్రియాస్య భయగాఢత్వర నేఁగుఁ గాని లో
నాకలి దప్పియున్ రవికరార్తియు నెన్నదు మన్మథాస్త్రకీ
లాకులతప్తచిత్తలకు లక్ష్యమె తక్కిన నొప్పు లెవ్వియున్ ౩ ఆ

మ. కుతుకం బింకక కుంకుమద్రవమిళిద్గోరోచనాపంకని
ర్మితపత్రాంకకలంకితాంబుధి కుమారీహారివక్షోరుహా

ద్వితయాస్ఫాలన లాలనోచిత పయోవిస్ఫారకాసారసం
తతి నానీదభవంబు క్రీడ సలుపున్ దద్దివ్యధామంబునన్ ౧౮

ఉ. అత్తఱి నిప్పుద్రొక్కినటు లాదల దేల్కొనినట్టు లావయు
వెత్తుగ ద్రావినట్లు విబుధేశుడు మాణవకోగ్రనిష్ఠతన్
చిత్తమునం దపించి యతిశీఘ్రగతిన్ క్షితికేగుదెంచె ద
ద్వృత్తము మానిపింతు నని వృద్ధమహీసురవేషధారియై ౧౯

ఈరామకృష్ణకవి వనిచెప్పెడుచాటుధారలు పెక్కులు గలవు. వానికర్తృత్వమును నిశ్చయింపలేము. మూడుచాటువుల నీక్రింద నిచ్చెదను ఇవి చాటుపద్యమణిమంజరినుండి యుద్ధృతములు.

చ అలఘునచంద్రబింబసమమై తనరారెడువక్త్రమందులో
గలిగిననామభేదములకై వడినొప్పెడి గప్పుకొప్పు చె
క్కులు రదనాంశుకంబు లవి గుబ్బలకున్ సరిరాకపోయె జే
తులు నరులయ్యె దానివలె నున్నది పొంకపుటాకు బోటికిన్.

చ. దరభుజగైణసింహములు దద్గణవేణ్యపలోకనద్వయో
దరములకోడి వాతిథిపదంబులు బుట్టలు బూతులన్ గుహాం
తంములు బూననిక్కెదిన డాగ స్రవింపగ నూర్పులూర్పు స
త్వరముగ నేగి నీకగని తత్తఱమందగ జేసి తౌ చెలీ.

మ. నరబింబాధరమున్ బయోధరములున్ వక్త్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూపకవ్వలి మొగం బైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు గ్రొమ్ముడియు మాకుం జాలవే గంగక
ద్దరి మేలిద్దరికీడునుం గలవె యుద్యద్రాజబింబాననా !

ఈమూడవపద్యమును గూర్చి నమ్మదగ్గము కాని యొకకథ కలదు అది యిట వ్రాయజాలను. ఈపద్యములు మనకు లభ్యము కాని యేకందర్పకేతువిలాసములోనివో యై యుండునని నాయభిప్రాయము.

ఈతనిని నుతించినయాంధ్రకవులు పెక్కురున్నారు వారినామముల నుదాహరించినను గ్రంథవిస్తరమే యగును. ఈక్రిందిపద్యము నెవరు రచించిరో తెలియదు. చాటుపద్యమణిమంజరిలో నుదాహృతమైనది.

ఉ. లింగనిషిద్ధుఁ గల్వలచెలింగని మేచకకంధరుం ద్రిశూ
లిం గని సంగతాళి లవలింగని కర్దమదూషిత న్మృణా
లిం గని కృష్ణచేలుని హలింగని నీలకచక్ విధాతృనా
లిం గని రామకృష్ణకవిలింగని కీర్తి హసించు దిక్కులన్.

కృష్ణరాయలు పెద్దన, తిమ్మనవలెనే, యీతఁడును "బ్రహ్మాంస్తుమస్త్వామనున్" అనుమకుటముతో దశావతారములను నుతించియున్నాఁడని యందురు. అందొక్కపద్యము నుదాహరించెదను.

శా. చాపచ్ఛాత్రినిషంగ భంగకుపిత ప్యోమ్మభృద్ధనుఃపంచవ
క్త్రిపంచాళిక దృష్ణియుక్తహుతభుగ్గ్రావాద్వయీపంచక
వ్యాపారభ్రమకారిపంక్తి గళగళ్యాఖండనాఖండదో
ర్గ్నపుణ్యాద్రిదరాఘురాఘువపరం బ్రహ్మాం స్తుమస్త్వామనున్.

ఈపద్యము తెలకూచి బాలసరస్వతిదని శ్రీప్రభాకరశాస్త్రిలువారు చాటుపద్యమణిమంజరిలో వ్రాసియున్నారు.

రామకృష్ణకవికృతములని వాకొనఁబడుచున్న కందర్పకేతువిలాసహారవిలాసము లెవరికంకితములో తెలియుట లేదు. ఈతని జీవితకాలములోఁ గృష్ణరాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయలు, అళియరామరాయలు, ననుప్రభువులు కర్ణాటరాజ్యసింహాసనమునలంకరించి యుండిరి. కాని రామకృష్ణకవిచేఁ గీర్తి కాయులుఁగా జేయఁబడినవారందొక్కరును లేకపోయిరి. కారణము దురూహ్యము.

—*—

## 103 తెనాలి శ్రీగిరికవి

ఇతఁడు యాజ్ఞ్యవల్క్య నియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్య గోత్రుఁడు; రామపండితుని పుత్రుఁడు; ఈరామపండితునకు రామలింగము, శ్రీగిరి, అన్నయ్య యని మువ్వురుపుత్రులు. వీరి నివాసస్థలము గుంటూరుమండములోని తెనాలి ఇందులో రామలింగముకవియై ఉద్భటారాధ్య చరిత్రము, ఘటికాచల మాహాత్మ్యము, పాండురంగ విజయము మొదలైన శైవవైష్ణవ గ్రంథములను రచియించినవాఁడు. అన్నయ్య సుదక్షిణా పరిణయమును రచించెను. వీరిరువురి చారిత్రములను వేఱువేఱుగా నిందువ్రాసి యున్నాఁడను. ఈ శ్రీగిరికవి శ్రీశైల మాహాత్మ్యమను పద్యకావ్యమును రచియించెను. ఈగ్రంథమిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. ఈతఁడీగ్రంథమును రచియించి నట్లితని పౌత్రుఁడైన రామభద్రకవి తన యిందుమతీ కళ్యాణమను గ్రంథము నందీక్రింది పద్యములోఁ జెప్పియుండుటచే మనకుఁ దెలిసినది.

సీ. ప్రౌఢి మాపెదతాత పాండురంగాది స
        త్కృతులు చేసెను రామకృష్ణసుకవి
యనుజుఁ డన్నప్ప మాపినతాత రచియించెఁ
        బరఁగ సుదక్షిణా పరిణయంబు
మాతాత శ్రీగిరి చాతుర్విఖ్యాతి
        శ్రీశైలమాహాత్మ్య కృతి యొనర్చెఁ
గడిమి మాతండ్రి యమ్మడిరామకృష్ణార్యుఁ
        డనఁ గీర్తిఁ గనె సంస్కృతాంధ్రములను.

తే. వారలను మించె మాయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితా మహాత్వమునను
నిన్న మాచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి !

శ్రీగిరి రచించిన శ్రీశైలమాహాత్మ్యము లభింపకపోవుటచే నీతని కవిత్వగుణమును దెలుపుటకుఁగాని పద్యముల నుదాహరించుటకుఁగాని యనువుపడ లేదు

శ్రీగిరితనయన్న పేరును తనకుమారున కుంచెను. ఆతఁడు రెండవ రామకృష్ణుఁడని వేరువడసెను. కాని యాతఁడు రచించిన కావ్యము లేవియో తెలియ లేదు శ్రీగిరిమనుమఁడైనవీరరాఘవాఖ్యకవి కవిత్వమునందు పూర్వులను మించెనని చెప్పినేకాని, యాతఁడు రచించిన పుస్తకము లేవియో తెలుప లేదు ఈ శ్రీగిరి కవి కాలము హూణశకము ౧౫౦౫–౧౫౬౦ ప్రాంతమై యుండునని యీతనిసోదరుల చారిత్రములలో వ్రాసినయంశములనుబట్టి తెలియుచున్నది

ఈకవి రామకృష్ణునివలె మొదట శివారాధనతత్పరుఁడై శ్రీశైలమాహాత్మ్యమును రచించియుండును పిదప వైష్ణవమతాభిమానియైనట్లీతనికుమారునకు రామకృష్ణనామముంచుటనుబట్టి యూహింపవచ్చును. ఇతఁడు పుత్రపౌత్రాదిసంపదకలవాఁడై నట్లిందుమతీకళ్యాణమువలనఁ దెలియుచున్నది.



## 104 పూసపాటి రాచిరాజు

ఇతఁడు సూర్యవంశక్షత్రియుఁడు; వసిష్ఠగోత్రుఁడు; తమ్మిరాజు అన్నమాంబికలపుత్త్రుఁడు. ఈకవి నవభారతమనుగ్రంథమునకుఁ గృతికర్తయని యొకరును గృతిభర్తయని యొకరును వ్రాసియున్నారు. ఇతఁడు వసిష్ఠగోత్రక్షత్రియుల వృత్తాంతములఁ దెలుపు ౫౬ చరణములుగల సీసమాలికను రచియించియున్నవాఁడు.

ఇతనిచారిత్రమును వ్రాయుటకు శ్రీఆడిదము రామరాయకృత "విస్మృతాంధ్రకవులు" "అడిదము సూరకవిచరిత్ర" అనుగ్రంథము

లును, కొటికలపూడి సోమశేఖరకవి కృతములగు "నరసభూపరాజీయము" అనుకావ్యమును శ్రీనిడదవోలు వెంకటరావుపంతులు M.A గారు భారతియందు (సం ౨౬ సంచిక 3, పుట ౧౩౭-౧౩౯) వ్రాసిన వ్యాసమును నాధారములు.

ఈవంశములో రాచిరాజు తమ్మిరాజు నామధారులు పెక్కురుండుటచేతను నిందుఁ గవిరాచిరాజెవ్వరో గుర్తించి యాతనికాలమును నిర్ణయించుట యావశ్యకమగుటవలనను వారివంశవృక్షము నవసరమైనంతవఱ క్రింద నిచ్చెదను. ఈరాచిరాజుగాక వీరివంశములో నింకను గొందఱు కవులు పదునాఱు పదునేడు శతాబ్దులలో నున్నారు.

అమలరాజు=అక్కమ్మ
|
అయ్యపరాజు
|
(౧) తమ్మిరాజు=అన్నమ్మ
|
(1) రాచిరాజు=సూరమ్మ
|
(౨) తమ్మిరాజు=అన్నమ్మ
|
(2) రాచిరాజు
|
(3) తమ్మిరాజు
|
గోపాలరాజు
|
గోపాలకృష్ణరాజు
|
(౪) తమ్మభూపాలుఁడు
కృష్ణవిజయ గ్రంథకర్త.

వారిపేరులివి :—

ఈ పై వంశవృక్షమునకీగ్రంథములు ముఖ్యాధారములు.

౧ పూసపాటి కొండరాజు—వేంకటాచలమాహాత్మ్యము.
౨ ,, తమ్మభూపాలుఁడు—కృష్ణవిజయము.
3 ,, విజయరామరాజు—విష్ణుభక్తిసుధాకరము.
౪ ,, వేంకటపతిమహీపాలుడు—ఉషాభ్యుదయము.

ఈవంశములో మూఁడవతిమ్మిరాజునకు గోపాలరాజుపుత్త్రుఁడో లేక సోదరపుత్త్రుఁడో తెలియలేదు. పుత్త్రుఁడని యూహించి యట్లు వ్రాసితిని సోదరపుత్త్రుఁడైనను రాచిరాజుకవినిగూర్చిన చర్చకడ్డము కాదు. ఈవంశీయులను వర్ణించినపద్యముల నాయాకవుల గ్రంథముల నుండి యీక్రింద నుదాహరించుచున్నాడను.

మొదటి తమ్మిరాజు

గీ. అట్టి యయ్యపభూపాలుఁ డమితగుణుల
బుత్రులను గాంచె నార్వురభూతియశుల
వారిలోఁ దమ్మిభూపాలవరుఁడు
కీర్తిశోభితదిగంతరాళుఁడై సొంపుమిగిలె
= నరసభూపాలరాడీయకృత్యాది.

మొదటి రాచిరాజు

గీ. అట్టి తమ్మినృపతి యన్నమదేవీల
లామయందు సుతుల భీమబలుల
ముగురిఁగాంచె వారిముగ్గురిలో రాచ
రాజు కీర్తి విజితరాజు వెలసె.

ఉ. దామెర తిమ్మభూవరుని దాఁకి జయింపుచు నాత్మకింకర
గ్రామణిఁజేసి మ్లేచ్ఛనృపకాండములన్ వధియించిమాళవో
ద్దామబలంబుఁగెల్చి వడి దద్దయుఁ దర్పనభీము మన్య సు
ల్తానును వాని బల్బిరుదు దాలిచె రాచనృపాలుఁడుద్ధతిన్.

సీ. శ్రీబ్రహ్మదత్తసుశ్రుతి కలాపాధ్యుఁడై
తతవిభుధాన్న ప్రదాతయగుచు
సర్వంసహాభారసౌకర్య ధారియై
నరసింహుఁడనగ ను బరఁగుచుండె
బలిశిరోమణి పాదపద్మసంశోభియై
విక్రమజితరాజ వీర్యుఁడగుచు
శ్రీరామమూర్తియై శ్రితగోపవర్యుఁడై
సర్వజ్ఞుఁడన కవిజాలహారి
చక్రి బహురూపములు దాల్చుశ్రమను వీడ
యొకట నన్నిగుణంబులు ప్రకటపఱచె
ననఁగ విలసిల్లె సజ్జనావన ప్రతిష్ఠ
రమ్యసత్కీర్తిజితరాజు రాచరాజు

గీ. భువిని దంతులూ రెఱ్ఱభూజాని
యాత్మభవ సూరమాంబిక యామెయందు
తనయులను తిప్పరాజును దమ్మరాజు
ఘనుని శ్రీకృష్ణరాయునిఁ గనియె నతఁడు
నరసభూపాలరాజీయ కృత్యాది.

విష్ణుభక్తి సుధాకరము—

మ. దిననాథద్యుతి రాచిరాజురణధాత్రిం దామెరాధీశు తి
మ్మననోడించెఁ జళుక్యవీర ఘనరాజ్యస్థాపనాచార్యతన్
గనియెన్ మ్లేచ్ఛులఁ గెల్చి తద్వివిధదుర్గగ్రాహియై ప్రౌఢ దే
వనృపాదిప్రభు భీమణప్రధితదివ్యద్విక్రమ ప్రౌఢిచేన్

ఉషాభ్యుదయము:-

ఉ. వారలలోన రాచనృపవర్యుఁడు దామెర తిమ్మభూవరున్
బౌరుషవృత్తిఁ గెల్చి తనబంటుగఁ జేకొని మ్లేచ్ఛ రాజులన్

బోరులఁ గెల్చి దుర్గములనుంగొని మాళవరాజుఁ గెల్చి త
త్పౌరుషలబ్ధ మన్యసులతాన్ బిరుదంబువహించె నెంతయున్.

ఆ. ప్రౌఢదేవరాయ బహుమతుఁడై మించె
ధర చళుక్యవంశవర నృపాలు
రాజ్యలాభమునఁ జెలంగించుటఁ దద్దంక
బిరుదనామ మొంది పేరుగాంచె.

క. నిరతంబు శివషడక్షరి
పరిపఠన మొనర్చి తత్ప్రభావంబున ను
ద్ధురవైరిపురము నేర్చెను
హరునికరణి సుమనసుల్ మహాశ్చర్యపడన్.

శివమంత్రోపాసకుఁడగు నీరాచిరాజు ప్రౌఢదేవరాయలకడ రణోద్యోగిగా నున్నవాఁడు. ఆరాయలు క్రీ. శ. ౧౪౨౨—౧౪౪౭ నడుమ విజయనగరరాజ్యమును బరిపాలించినమహాపురుషుఁడు. కావున నీరాచిరాజును నాకాలమువాఁడు. ప్రౌఢదేవరాయలకును బహుమనీ రాజులకు ననేకయుద్ధములు జరిగెను. వానిలో నీరాచిరాజు పాల్గొని యుండును. ఇతఁడుజయించిన దామెర తిమ్మభూపాలుఁడెవఁడో తెలిసి కొనవలసియున్నది. ఈరాచిరాజునకుఁ జళుక్యరాజ్యస్థాపనాచార్యత్వ బిరుదము కలదు. ఇతనికాలమున నీతనిచే సాహాయ్యమును బడసిన చళుక్యరాజెవ్వఁడో నాకుఁదెలియలేదు. ఈవిషయమున నింకను బరిశోధనము చేయవలసియున్నది. ఈరాచిరాజునకు గజపతులతో సంబంధ మున్నట్లు గాన్పింపదు.

ఈ మొదటిరాచిరాజుజననము ౧౩౮౦ ప్రాంతమనియు, ౧౪౪౦ వఱకు జీవించియుండవచ్చుననియుఁ దలంపవచ్చును.

రెండవ తమ్మిరాజు

నరసభూపాలరాజీయ కృత్యాది :—

సీ. విధిహారుహారులట్ల వెలసినవారిలోఁ
దమ్మిభూపతి నెన్నదరమె ధాత్రి
దండిచే బెల్లముకొండ సాధించెను
రహిఁగెల్చె నలరంగరాజు కొండ
రావుసింగను మూరురాయాంకు వే బరా
జితుఁ జేసె రాజులవితతి గెలిచెఁ
గాచెను బాహాదిఖానుని శరణన్న
నోడపల్లి జయించె నుగ్రశక్తిఁ

జండకోదండకాండ ప్రకాండగరిమ
సర్వసర్వంసహాచక్ర ధూర్వహుండు
రాజిలె వసిష్ఠగోత్రవారాసిపూర్ణ
చంద్రుఁడనగను రాజదేవేంద్రుఁడతఁడు.

గీ. అట్టి రాణ్మౌళిదానన్నమాంబయందు
రాచరాజును మఱితిప్పరాజు కృష్ణ
రాజవరుడను సుతుని విరాజగతిని
గాంచెఁగకుబంతవిశ్రాంతకాంతయశుల,

విష్ణుభక్తిసుధాకరము—

సీ. వారిలోఁ దమ్మభూపతిహాళి దోర్దండ
తతిఫలసామగ్రి దరమెయెన్న
దండిమై బెల్లముకొండ సాధించెను
ప్రౌఢిఁ గెల్చెను రంగరాజుకొండఁ
ద్రిభువనరాయాంక దీపితు రావు సిం
గనను పరాజితుఁగా నొనర్చె
నని శరణన్న బాహాతిఖానును గాచెఁ
బటుశక్తిచే నోడపల్లిఁ గొనియె

కఠిన రిపుజాలభయద విక్రమము గలిగి
ప్రాజ్యసామ్రాజ్యవిభవధుర్యవాతఁ గనియె
నౌర! యస్మద్వసిష్టగోత్రావనీశ
కోటి కాతండె నేటికిరీటవిభుఁడు.

ఉషాభ్యుదయము—

మ. అని నందాపురశైలసన్నిధిగజేంద్రానీకమున్ గూల్చి యుం
డెనసెన్ శ్రీగజపత్యభిఖ్య గుడశైలేంద్రుండు శ్రీరంగ రా
జనరేంద్రుండల యోడపల్లివిభుఁడున్ జన్యంబులందోడఁగా
కొనియెన్ వారలపట్టణంబుల శిరుల్ ఘోరప్రతాపంబునన్.

గీ. త్రిభువనీరాయబిరుద ప్రదీప్తుఁడైన
రావుసింగని సంగరరంగమందు
దునిమెఁ బెదవీటిచెంత సద్వినుతుఁడగుచు
కలన శరణన్న బాహాదిఖానుఁగాదె.

ఈ రెండవ తమ్మిరాజుకాలము క్రీ. శ. ౧౪౧౦—౧౪౭౦ అని యనుకొనవచ్చును. ఇతని కాలముననున్న రావుసింగ మహీపాలుఁడు రెండవసర్వజ్ఞుఁడై యుండును. ఇతఁడు ౧౪౦౦-౧౪౦౫ ప్రాంతమున జన్మించెనని శ్రీనాథునిచారిత్రమునను పోతనామాత్యునిచరిత్రమునను వ్రాసియుంటిని. తమ్మిరాజుచే జయింపఁబడిన రావుసింగభూపాలునకు త్రిభువనీరాయబిరుదమున్నట్లుపై పద్యమువలనఁ దెలియుచున్నది. వెలుగోటివారి వంశావళినిజూచినచో నీబిరుదము మొదటిసర్వజ్ఞునకున్నట్లును రెండవ సర్వజ్ఞునకులేనట్లును గన్పించుచున్నది. (౧౩౯—౧౪౦ : ౧౫౭—౧౫౮ పద్యములు) కాని మొదటిసర్వజ్ఞుఁడు రెండవతమ్మిరాజు జన్మించినప్పటికేచనిపోయెను. కావున తమ్మిరాజు జయించినవాఁడు రెండవసర్వజ్ఞుఁడే కాని మొదటివాఁడుకాఁడు. రావువారివంశమున నాకాలమున మఱియొక సింగనృపతి లేఁడు. ఈసింగనృపతిని బరాజితుఁగానొనర్చెనని విష్ణుభక్తిసుధాకరమును దునిమెనని యుషాభ్యుదయమును జెప్పుచు

న్నవి. ఇందేదినిజమో తెలియదు. ఏదియైనను నీసంఘటనము ౧౪౫౦-౧౪౬౦ నడుమజరిగియుండును. దీనినిబట్టి బమ్మెరపోతనామాత్యుండీత నికి భోగినీ దండకమును వ్రాసియిచ్చెననుట సత్యముకాఁజాలదని తేలు చున్నది.

బాహాదిఖానెవ్వరో తెలియుటలేదు. ఇతనిని రక్షించుటయు సింగనృపతిని జయించుటయు నొకేకాలమున జరిగెనో భిన్నకాలముల యందు సంభవములైనవియో తెలియదు. ఇందుఁబెదవీటికడ జరిగిన దేదియో స్పష్టముగాఁ దెలియుటలేదు. పెదవీఁడు, ఓడపల్లిగ్రామము లెచ్చటివో ? బహుశః గుంటూరుమండలమున నుండియుండును.

ఈతమ్మనృపతి పరాక్రమవంతుఁడును సాహసుఁడునునై యనేక రణములలోఁబాల్గొని కీర్తిఁగాంచి యున్నవాఁడు. ఇతనిపైఁగల చాటు పద్యముల నడిదము సూరకవిచరిత్రమునుండి గైకొని అడిదము నీలాద్రి కవిచారిత్రమున నిచ్చియున్నాఁడను. (ఆంధ్రకవితరంగిణి ౬వ సంపు టము ౨౩౩-౨౩౪ పుటలు)

చాటుపద్యమణిమంజరిలో నింకను గొన్నిపద్యములున్నవి. కాని గ్రంథవిస్తరభీతి నిందీయలేదు. ఈపద్యములనుబట్టి యీతమ్మ భూపాలునికాలము శా. శ. ౧౩౭౦ (క్రీ.శ. ౧౪౪౮) అయినట్లును. కపిలేంద్రగజపతియొద్ద రాజ్యకార్యధురంధరుఁడుగా నున్నట్లును దెలియు చున్నది. ఆకాలమునాఁటికి కపిలేంద్రగజపతి కళింగాధిపతియై యాంధ్ర దేశమునఁగూడ జాలభాగ మాక్రమించుకొని పరిపాలించుచున్నట్లుచరి త్రలుచెప్పుచున్నవి. ఈతమ్మభూపాలుని శాసన మొకటి కలదు. ఆ శాసనమిది—

శ్రీమన్మహామండలేశ్వర మహీమండలరాయ మన్నెసుల్తాన్ శ్రీపూసపాటి రాచిరాజయ్యదేవు మహారాజులుంగారి కుమారుడగు శ్రీతమ్మిరాజులుంగారు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు వేయిన్నిమున్నూట యెనబైయగు నా......యన్ తమ

పూజ్యస్థానమైన బెజవాడకు తమబంధువులైన సూర్యసోమవంశపు రాజులున్ను తామున్నువచ్చి అక్కడ యింద్రకీలాద్రియందున పాండవుల గుళ్ళదక్షిణభాగమందు కృష్ణవేణీ మల్లిఖార్జున నరశింహులు సాక్షిగాను విజయశాసనశిలా స్తంభంబు వేయించిరి.

ఈశాసనము తమ్మభూపాలుని పైకాలమును ధ్రువపరుచుచున్నది కపిలేశ్వరగజపతి శాసనమొకటి బెజవాడయందు శా. శ. ౧౩౭౭ కాలమునాఁటిది కలదు. (ద. హిం. శా. సం ర సంఖ్య ౭౭౧) కావున నీతమ్మభూపాలుఁడు కపిలేశ్వరగజపతియొద్ద సేనాధిపతిగా నుండెనని నిశ్చయింపవచ్చును.

## రెండవ రాచిరాజు

ఇతఁడే మనప్రస్తుతచరిత్రకుఁ గథానాయకుఁడు

నరసభూపాల రాజీయము—

గీ. వారిలోపల రాచభూవాసవుండు
గండపెండేరమును బూనె దండి నూత్న
భారతంబనఁ గృతిఁజేసె భాసురముగ
గేతవరపట్టనేశుఁడై కీర్తిమించె.

సీ. జంబారికుంభీశ దంభోళి కుంభిర
వరశరదంభోదవార మేలి
మందారకుందార విందార బృందార
కార్యస ర్వేశరుగ్గర్వ మడఁచి
గంగాతరంగాజతుంగా శితాంగార్వ
గళవళక్షపరిభావళుల నేలి
తారాతుషారాగ హారాలిహీరాద్రి
పాత్మభూధారావిభాలి మించి

యలను నెన్నొనిసత్కీర్తి యు గనంగ
లాట కర్ణాటచోళ మరాటయవన
సాల్వమాగధమాత్స్య దేశములయందు
నతఁడు బొగడొందఁడే రాచకులభర్త.

శ్రీకృష్ణవిజయము—

సీ. నవభారతాఖ్యాన నవ్యకావ్యమునకు
నాయకుండయ్యె నే నరవరుండు
కటకేశ్వరునిచేతఁగని కేతనరమాత్మ
పురముగా నేలె నేభూవిభుండు
నిలిపె బాహుహామన్నె నృపగండపెండేర
నెపుడు డాకాల నేనృపతిపాళి
అఖిలసద్గుణవతి యక్కమాంబాదేవి
పాణిశుఁడయ్యె నే పార్థివుండు
ప్రథితగజపతి రాజవీరప్రతాప
రుద్రితన యూథినాయకా రూఢతమ్మ
రాజజనకతఁగాంచె నేరాజతిలక
మతఁడలరు తమ్మవిభురాచయప్రభుండు.

క. మన్నెసులతాను బిరుదం
బెన్నఁగ గజరాజుపీట నెన్నఁగ దాముస్
మన్నీల మనుచువచ్చిన
దన్నును నీగొడుగువాఁడు తమ్మయరాచా ! చాటువు.

ఈరాచిరాజు తాను రచించిన సీసమాలికాంతమున నీక్రింది గీతములలోఁ దనకాలము నిచ్చియున్నాఁడు.

"శరణాగతత్రాణబిరుదువార
లనుచు శ్రీరామచంద్రార్పణముగ బుతు

గగనాబ్ధిచంద్రశకంబునందు
సరససంగీతసాహిత్య చక్రవర్తి
రాజమార్తాండ శ్రీతమ్మిరాజరాజ
రాచిరాజోదితంబు విభ్రాజితంబు
ధరణి వెలయుత నాచంద్రతారకంబు.

దీనినిబట్టి రాచిరాజుకాలము శా.శ. ౧౪౦౭ (క్రీ.శ. ౧౪౮౫) అయినట్లుస్పష్టమగుచున్నది. ఇతనిని కొండవీడుదుర్గములో నుండఁగా వీరభద్రగజపతితోఁ బాటుగ శ్రీకృష్ణదేవరాయలు ౧౫౧౫ వ వత్సరములో జీవగ్రాహముగాఁ బట్టుకొనినట్లు రాయలచరిత్రమున వ్రాసియుంటిని. ౧ ఆసంవత్సరములోనే కేతవరముదుర్గముకూడ రాయల స్వాధీనమైనది. కేతవరము గుంటూరుమండలములోని సత్తెనపల్లి తాలూకాలోనిది.

ఈపూసపాటివారిలో మూఁడుతరములవారికి ఒరిస్సారాజు లగు గజపతులతో ప్రభుసామంతసంబంధ మేర్పడినది. కావున దానిని గూర్చి యిటనించుక వ్రాయవలసియున్నది. మూఁడవతమ్మిరాజు గజపతి కల్లుఁడై నందున నాసంబంధము మఱింత బలమైనది.

(౧) కపిలేంద్రగజపతి క్రీ. శ. ౧౪౩౫—౧౪౬౧ వఱకు రాజ్యము చేసినను, ౧౪౫౦ ప్రాంతమునుండిగాని యాంధ్రదేశముతో నీతనికి సంబంధము కలుగలేదు. ఇతనిశాసనములు కళింగమున ౧౪౩౫ నుండి కన్పడుచున్నను నాంధ్రదేశమున ౧౪౫౦ కి పూర్వ మగుపడుట లేదు.౨ ఇతని రాజ్యధుర్యుఁడైనవాఁడు రెండవతమ్మిరాజు. ఇతని కాలము ౧౪౧౦—౧౪౭౦ కావచ్చును. ఇతఁడు పురుషోత్తమగజపతి కాలములోఁగూడ స్వల్పకాలముండి యుండును.

---

౧. ఆంధ్రకవితరంగిణి సప్తమసంపుటము పుట ౧౫౯.

౨. A. R. 141 of 1896; 313 of 1896; 308 of 1892; 148 of 1913; 17 of 1934-35; 277 of 1935-36; 637 of 1936.

(౨) పురుషోత్తమగజపతి:—ఇతఁడు కపిలేంద్రగజపతి తనయుఁడు. క్రీ.శ. ౧౪౬౭ మొదలు ౧౪౯౭ వఱకు రాజ్యముచేసినవాఁడు. ఇతనికాలములోనున్నవాఁడు రెండవరాచిరాజు. ఇతఁడే సీసమాలిక రచించినవాఁడు. ఇతఁడే నవభారతకృతికర్త, లేక కృతిభర్త. పురుషోత్తమగజపతియే యీతనికిఁ గేతవరము నిచ్చియుండెను. ఇతని సీసమాలికాకాలము క్రీ. శ. ౧౪౮౪.

అప్పటి కీతనివయసు ౩౪ వత్సరము లనుకొంటిమేని, యీతని జననము ౧౪౫౦ ప్రాంతమై ప్రతాపరుద్రగజపతిరాజ్య ప్రారంభకాలమునాఁటికి ౪౫ యేండ్లవయసుకలవాఁడై రాయలచే జీవగ్రాహముగా బట్టువడునాఁటి కఱువదియైదేండ్లు వయసున నుండును. ఈరెండవరాచిరాజు ప్రతాపరుద్రగజపతికివియ్యంకుఁడు. ఈరెండవరాచిరాజుతనయుఁడైనమూఁడవతిమ్మరాజునకుఁ బ్రతాపరుద్రగజపతి తనయనిచ్చి పరిణయము చేసియుండెను. ఈమూఁడవతిమ్మరాజును శ్రీకృష్ణరాయలును తోడియల్లుండ్రు. క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతమున జన్మించిన రెండవరాచిరాజు, ౧౪౮౫ ప్రాంతమున నుదయించిన శ్రీకృష్ణరాయలును దోడియల్లుండ్రగుట యస్వాభావికము. కావునఁ బ్రతాపరుద్రగజపతియల్లుఁడు మూఁడవతిమ్మరాజే కాని రెండవరాచిరాజు కాఁడు. ఈవిషయము రెండవరాచిరాజును నుతించిన శ్రీకృష్ణవిజయ మందలి సీసగీతములవలన స్పష్టముగాఁ దెలియుచున్నది.

ప్రతాపరుద్రగజపతికిని రాయలకును సంధిజరిగినపిమ్మట నీమూఁడవతిమ్మరాజు కేతవరదుర్గపాలకుఁడుగ నుండెనో లేదో తెలియదు. దీనినిగూర్చి పరిశోధనము గావింపవలసియున్నది.

కొండవీటిదుర్గమునఁ గృష్ణరాయలు రెండవరాచిరాజుతోఁ గూడ శ్రీనాథరామరాజులక్ష్మీపతిరాజును జీవగ్రాహముగాఁ బట్టుకొనినట్లు రాయలతిరుపతిశాసనములవలనఁ దెలియుచున్నది ౧. ఈలక్ష్మీపతి

౧. ఆంధ్రవిజ్ఞాన తరంగిణి సం ౩. పుట ౯౭.

రాజకుమారుఁడైన రామయదేవమహారాజు శాసనములు క్రీ.శ. ౧౫౩౮ ౧౫౫౯, ౧౫౫౭ సంవత్సరములలోఁ గేతవరమునఁ గన్పట్టుచున్నవి. సదాశివరాయలు కేతవరదుర్గపరిపాలనము నీరామరాజున కిచ్చినట్లుందున్నవి. ౧

రెండవరాచిరాజు నవభారతమును రచించెనో, కృతిపొందెనో పరిశోధనము కావలసియున్నది.

శ్రీనిడదవోలు వేంకటరావుపంతులుగారు పైవ్యాసములో రాచిరాజు వ్రాసిన సీసమాలికయం దీక్రిందిపాదములు గలవనియు వీనినిబట్టి వేములవాడ భీమకవికాలము నిస్సందేహముగా నిర్ధారణమగుచున్నదనియు వ్రాసియున్నారు.

"మామకవంశభీమనృపాలసచివుండు
        దండనాథాగ్రణి దానరాజు
వేములవాడ శ్రీభీమునిచే రామ
        గోపాలచరితంబు గొనినమేటి
వత్సవాయిని చంద్రివర్మచే గిరినిధి
        గగనేందుశకముల గాన్క నొంది
సజ్జాపురముఁ గొట్టి సకలారిమండల
        భయదప్రతాపంబు బాదుకొలిపి
వెలసె నావంశజు లిల వత్సవాయి వారైరి."

పూసపాటి భీమరాజునకు మంత్రియు దండనాయకుఁడు నైన దానరాజు చంద్రవర్మనృపాలునిచే వత్సవాయి యనుగ్రామమును శా.శ. ౧౦౯౨ సంవత్సరమున బడసెననియు నాతఁడే వత్సవాయివారికి మూలపురుషుఁడనియు, నతఁడు వేములవాడభీమకవిచే రామగోపాలచరిత మనుగ్రంథమును గృతిపొందెననియుఁ బై పద్యపాదములవలనఁ దెలియుచున్నది. వేములవాడ భీమకవి రాఘవపాండవీయమను ద్వ్యర్థి

౧ A. R. 288, 291, 295, 296 of 1934-35.

ప్రబంధమును రచియించెనను జనశ్రుతికలదని యాతనిచరిత్రమునవ్రాసి యుంటిని. అదియే రామగోపాలచరితమైయుండును. ఇదియే రాఘవ వాసుదేవీయమనియు దీనియందుండి ప్రాచీనలక్షణ గ్రంథములయందు దాహృతమై యున్నదనియు, గ్రంథముకూడ నేడు మరియొకకవికృతిగా లభ్యమగుచున్నదనియు శ్రీ వెంకట్రావుగారు వ్రాసియున్నారు.

వేములవాడ భీమకవిచరిత్రమున "ఈవిమర్శనమునుబట్టి భీమకవి కాలము క్రీ.శ. ౧౧౮౦—౧౧౯౦ నడుమ నున్నవాఁడని యంగీకరింప వచ్చునని నానిశ్చితాభిప్రాయము. ఇతరాధారము లేవియైన లభించి మార్పుచెందిననేతప్ప భీమకవి కాలమిదియే యని యంగీకరింతము"౧ అనివ్రాసియుంటిని. శ్రీవెంకట్రావుపంతులుగారి శ్రమపరిశోధనముల వలన నీరాచిరాజు రచించిన సీసమాలిక లభించుటచే భీమకవి కాలము నిస్సంశయముగా నిర్ధారణమైనది. దానరాజు చరమవయస్సున వత్సవాయిని సంపాదించినాఁడనియు, భీమకవి కేంబదేండ్లవయసునను దాన రాజునకు ముప్పదేండ్లవయసునను రామగోపాలచరితము రచితమై యుండుననియు నూహించితిమేని యిదివరకు నిర్ణయమైనకాలము సరియైనదే యగును. అట్లుకాదేని భీమకవికాలము ఇరువది ముప్పది సంవత్సరములు ముందునకు పోవచ్చును.

"శ్రీకరంబైన వసిష్ఠగోత్రోద్భవుల్
సప్తర్షిపేయులు సార్వభౌము
లాధరాధీశ వంశానతారాది ప్రశ
స్తవృత్తాంతంబు విస్తరింతు
అలఘు విక్రముఁడు కోసలజయాదిత్యుండు
దక్షిణవిజిగీష దాడి వెడలి
నిగమాగమాంతపారగుఁ డాజి భీష్ముండు
శ్రీదేవవర్మ సైన్యాధిపతిగ

౧. ఆంధ్రకవితరంగిణి సం. ౧ పుట. ౨౩౫

నఖిలసీమల విజయ స్తంభములు నాటి
దివి కేగెను త్రిలింగ దేశభూమి
వాహినీపతి దేవవర్మ ప్రభుండయ్యె
అద్దూరి సీమలో నాజగొండ్రు
వల్లభునోడించి వైభవంబుల మించి
సార్వభౌమపదంబు జగతిగాంచె
అతనిసుతుండు బుద్ధావనీశుఁడు రాచ
తపసియై కాంచెను ధర్మనృపుని
తనయులాతనికి బుద్ధయ దేవవర్మలు
బుద్ధరాజందుఁ బ్రసిద్ధుఁడయ్యె
అతని తనూజుఁ డాతతబలోన్నతుఁడు మా
ధనవర్మనృపతి మత్తాతఁబోలి
జనకు నాజ్ఞను సప్తశతి సాంగముగ రామ
దేశికుచే నుపదేశ మొంది
కనకదుర్గాకటాక్షపాత్రవిభవుఁడై
మళయసింగని జోర మణిందఁజేసి
చౌబలహస్తి మల్లబలాధిపునిరక్త
ధారచేఁ బరదేవతను భజించె
వసుదిగింద్రియశకవత్సరంబుల జయ
వాటికాదుర్గవైభవముఁ గాంచె
గగనవాణీవాక్యగౌరవంబునఁ బూస
పాటిభూమిని పురీవరముగట్టి
వాసిగాంచుటఁ బూసపాటివారనునింటి
పేరుగాంచిరి రాచపెద్దలయిన
నమలరాజాదిగా ప్రముఖులు మావారు
తత్ గృహనామముల్ దాల్చుచుండ్రి"

రాచిరాజు రచించిన వసిష్టగోత్రక్షత్రియుల సీసమాలికను శ్రీ వెంకటావ్రుపంతులుగా రొకమారు దయతో నాకొసంగినందునఁ జూచితిని. పైని వ్రాసినచరణములుగాక తక్కినచరణములలో నింటిపేరులుమాత్రమే కలవు. విశేషచారిత్రాంశములం దేమియుఁ గన్పడ లేదు. రాచిరాజు నవభారతగ్రంథకర్తకాక కృతిభర్తయైనను నీసీస మాలికనుబట్టి యాతఁడు కవియే యనిచెప్పవచ్చును.



## 105 గౌరరాజు

"గౌరరాజు చాటుధార" యని యీక్రిందిపద్యమును గాకునూరియప్పకవి, అప్పకవీయమునం దుదాహరించియున్నాఁడు.

ఉ. ప్రాకటదర్పతన్ సకలరాయనిలక్కనృపాలు నాజిలో
దాఁకువిరోధిసైన్యము ముదం బొదవ న్వరియింపవచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్ముకొను నంచితదివ్యవిమానసంచర
న్నాకవిలాసినీచరణహంసకభూరిఝుణంఝుణధ్వనుల్. కి౩ర గౌన
తిమ్మకవికూడ నీపద్యమును లక్ష్యముగా నుదాహరించినాఁడు.

ఈపద్య మొకగ్రంథములోనిదైనచోఁ గృతిపతివంశములోని యొకపురుషునివర్ణనమని భావింపవలసియుండును. ఆపక్షములోఁ గవి లక్కనృపాలునికాలములోనివాఁడని నిశ్చయముగాఁ జెప్పలేము. కాని యీపద్యము చాటుధారయని యప్పకవిచెప్పుచుండుటచే నీగౌరరాజు లక్కనృపాలుని కాలములోనివాఁడని నిశ్చయింపవచ్చును.

కడపమండలములోని రాజంపేట తాలూకాయందలి గుండ్లూరుగ్రామమున లక్కనృపాలునినామ ముదాహృతమైనయొకశాసనము కలదు ౧ ఇది లక్కరాయని కుమారుఁడైన రాయనృపాలకునిది. ఇందు శాసనకాలము లేదు. కాని యప్పుడు రెండవదేవరాయలు ప్రభువుగా

౧ A. R. 617 of 1907.

నున్నట్లు వ్రాయఁబడియున్నదఁట! అతనికాలము క్రీ శ ౧౪౩౨-౪౭ కావున లక్కనృపాలుఁడును గౌరరాజును ౧౪౨౦ ప్రాంతమునం దున్నవారని చెప్పవచ్చును తాతపేరు మనుమనికిఁ బెట్టెదరను నాచారమునుబట్టి లక్కరాజుతండ్రియైన సకలరాయని పేరే శాసనకర్త నామమని తలంచి, యీలక్కనృపాలుఁడే పైచాటుధారలోని లక్కభూపతి యని తలంచితిని. ఈలక్కనృపతి మనుమఁడుకూడ లక్కజనపతియై పరాక్రమవంతుఁడయ్యె నేని కవికాలము క్రీ శ. ౧౪౮౦ ప్రాంతమగును. కవియు లక్కక్షితిపతియుఁ గడపమండల వాసులైయుందురు. పై శాసనములోని లక్కయదేవమహారాజునకు "అత్యంబరగండ" బిరుదమున్నది. పొత్తపినాఁటిలోని గుండ్లూరు పరిపాలకుఁడని చెప్పఁబడియుండెను. ఆగ్రామమున వేర్వేరుకాలములలోనివి యేడుశాసనములున్నవి. గౌరరాజును గూర్చి యింకనేమియుఁ దెలియదు.



## 106. వెల్లంకి తాతంభట్టు

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు ఆపస్తంబసూత్రుఁడు. శాలావత గోత్రుఁడు. అబ్బయకును ఎఱ్ఱమ్మకును బుత్రుఁడు రామార్యునకుఁ దమ్ముఁడు ఈకవిశేఖరుఁడు కవిచింతామణియను లక్షణగ్రంథమును రచియించెను అందుఁ గని తనను గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు

సీ. శుచి యెఱ్ఱమాంగర్భ శుక్తిముక్తామణి
యబ్బధీమణి సూనుఁ డనఘబుద్ధి
పావనవశత శాలావతిగోత్రుఁడ
హార్యధైర్యుండు రామార్యుతమ్ముఁ
డషభాషాప్రక్రియా బద్ధణ్ణుండు
సన్నుతసాహిత్య చక్రవర్తి
యనవద్య సర్వవిద్యాశారదృశ్యుఁడు
విద్వజ్జనవ్రాత విశ్రుతుండు

సకలహరిదంతరాళ విశ్రాంతవిశద
కార్తికచంద్రికాయతకీర్తి కాంతి
హరినిభుఁడాస్య వాణీవిహారవసతి
తామసోల్లంఘి వెల్లంకి తాతసుకవి.

కవిచింతామణియందు వ్యాకరణవిషయములును ఛందస్సును గావ్యలక్షణములును గొంతవఱకుఁ జెప్పియున్నట్లు గన్పట్టుచున్నది. ఈగ్రంథముయొక్క యసమగ్రమైన యముద్రితప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందున్నది. ఈగ్రంథము పూర్వ మొకప్పుడు ముద్రితమైనట్లు వినియున్నాఁడను. కాని నాకా ప్రతి లభింపలేదు. వెల్లంకి తాతంభట్టుకృతమని సులక్షణసారమను పేరుగల యొక చిన్నగ్రంథము ముద్రితమై ప్రచారములోనున్నది. కాని యది యాతని రచనము కాదు. పైనిజెప్పిన యముద్రితప్రతి యందు భాషాలక్షణాధికారము, శబ్దనిర్ణయాధికారము, వళిప్రాసాధికారము, దోషాధికారము నను నాల్గధికారములున్నవి. గ్రంథము మొత్తమెన్ని యధికారములు కలదియో తెలియలేదు. ఈగ్రంథమునకుఁ గావ్యానుశాసనమని నామాంతరము కలదు. ఈకవి కృష్ణరాయలకుఁ బూర్వుఁడందురు. పిల్లలమఱ్ఱి పినవీరన రచించిన జైమినిభారతమునుండి లక్ష్యములను గైకొనియుండుటచేఁ బదునైదవ శతాబ్ది చివరభాగముననో పదునాఱవశతాబ్ది ప్రథమభాగమున నీతఁడుండియుండునని తలంపవలసియున్నది. అధికారముల తుదల నున్న గద్యలలోని బిరుదములు భిన్నరీతులుగానున్నవి. "అష్టభాషా[illegible]వతార వెల్లంకితాతంభట్ట" ౧ "శబ్దవర్ణనిర్ణయ వెల్లంకితాతంభట్ట" ౨ "సారసాహిత్య వెల్లంకితాతంభట్ట" 3 "వినుతవిద్యావిశారద" ౪ ఈ విధముగా నధికారమందలి విషయమును సూచించునట్లు బిరుదములు వేసికొనియున్నాఁడు. ఈకవి మాహాత్మ్యమును వర్ణించుచు నొకకవి చెప్పిన రెండుపద్యములను చాటుపద్యమణిమంజరి నుండి గైకొని యీక్రింద వ్రాయుచున్నాఁడను.

సీ. ఏకవినిర్మించె నీశబ్దశాస్త్ర ప
ద్ధతియెల్ల సుకవిచింతామణియన
ఏకవిచెప్పె ననేక పుణ్యానల్ప
బంధురసంక్షేపభాగవతము
ఏకవి పఠియించె నెల్లభాషలు నత
ప్రకటనిర్భరమతిప్రౌఢి మెరసి
ఏకవి తెచ్చె మహీశసంఘము చేత
వారణాశ్వాది మహ వస్తుచయము
గీ. అతఁడు వెల్లంకితాత మహాయశోగ్ర
గణ్యుఁడుత్తమ సుకవి ముఖ్యాధినాథుఁ
డంబరాశావకాశ విఖ్యాతచక్ర
వాళశైలాంతరావాప్త ఖేలయశుఁడు.

సీ. కర్ణాటకటక భూకాంత సభాంత ప్ర
గల్భ కవీశ్వర కమలహేళి
గజపతి సంపదఖర్వవిద్యాగర్వ
తార్కికకుముద సుధామయూఖ
అశ్వసాధన మహేంద్రాస్థాన శాబ్దిక
వర్యచూతద్రుమవన వసంత
మాళవేశ్వర సభామధ్యమస్థాయిశా
లంకారిక మయూరలలిత మేఘ
యనుచు నిన్నవనీపతుల హరవాంబు
సరసగంభీర వాక్ప్రౌఢి సన్నుతింతు
రబ్ధిమణితనయ శబ్దార్థనిలయ
శాస్త్రిరాత్మజ వెల్లంకితాతసుకవి !

ఈపద్యములనుబట్టి యీకవి తర్క-వ్యాకరణాది శాస్త్రముల యందుగొప్పపాండిత్యము కలవాఁడనియు నశ్వపతి, గజపతి, నరపతుల

చేత బహూకరింపఁబడినవాఁడనియుఁ దెలియుచున్నది. ఇతఁడు సంక్షేప భాగవతమును రచించినట్లు పైపద్యములో నున్నది. ఏభాషయం దది రచితమయ్యెనో తెలియదు. ఆంధ్రమున నాగ్రంథమున్నట్లు వినలేదు. ఈతని కవిత్వశైలి తెలియుటకై యాంధ్రకవుల చరిత్రమునం దుదాహరింపబడిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

క. ఆదిపురాణాగమములు
వేదంబులు నోరఁ గాయవేయక నుడువన్
వా దేలా కవివరులకు
మేదిని నెవ్వారుసాటి మించినగరిమన్.

శా. నిన్నాడింపఁగవచ్చు గోసతనయుల్ నెయ్యంబున న్వేదిపై
నున్నా రీకడఁ గొమ్ముజోగులు కరాళోన్మత్తులై వచ్చెదర్
వెన్నామీఁగడయున్ ఫలం బొసఁగెదన్ వేగంబె రా రమ్ము మా
యన్నా యంచును వ్రేతపెట్టి హరి యోయమ్మా నగు న్నాటికిన్

ఈకవినివాస నేదిమో తెలియదు. కృష్ణామండలమునందలి నందిగామతాలూకాయందు వెల్లంకియను గ్రామ మున్నది. ఈయూరునుబట్టి కవిగృహనామ మేర్పడియుండును. ఈగ్రంథము యథామాతృకముగా ముద్రితము కావలసియున్నది. ఆంధ్రసాహిత్యపరిషత్తునం దొకప్రతియున్నది.

ఈతఁడు తనలక్షణగ్రంథమున దీర్ఘాక్షరములకుఁ దరువాతవచ్చు రకారము. రేఫయేగాని శకటరేఫ కాదని వ్రాసియుండెనఁట. దీర్ఘాక్షరములమీఁదఁగూడ శకటరేఫములున్నవని నిరూపించుచు నప్పకవియుఁ దిమ్మకవియు నీక్రిందిపద్యములను వ్రాసియున్నారు.

"వెల్లంకి తాతన బొల్లెను బండిఱా
నిడుదపైఁ గలుగదు నిక్కమనుచు"

అప్పకవీయము.

"వెల్లంకి తాతయార్యుఁడు
తెల్లముగా శకటరేఫ దీర్ఘంబులపైఁ
జెల్లదని పలికె నదియుం
గల్ల వితర్కింపఁ బ్రాచీకవిసమ్మతులన్.

'సర్వలక్షణసారసంగ్రహము'

ఆంధ్రసాహిత్యపరిషత్తునం దున్నవ్రాఁతప్రతిని జూచితిని. అం దీభావ మున్నపద్యము గానరాలేదు. ఆప్రతియందును నాల్గధికారములే యున్నవి. వృత్తాధికారము మొదలుగా మఱికొన్ని యధికారము లుండవలయునని తోఁచుచున్నది. రేఫశకటరేఫనిర్ణయాధికారము వేఱుగ నుండెనేమో! ఆప్రతియందున్న నాల్గధికారములలోను, కవిత్రయము, నాచనసోమన, శ్రీనాథుఁడు, అథర్వణాచార్యుఁడు, భాస్కరుఁడు, పినవీరన మొదలగు పదునాల్గవశతాబ్దివఱకుఁ గలకవులగ్రంథములనుండి గ్రహించినలక్ష్యములే కనఁబడుచున్నయవి. అప్పకవి మొదలగు వారాదిపురాణములోనిదని యుదాహరించిన "ఒకనాఁడిందుధరుండు" అనుపద్యమునాచనసోమునిదనియే యిందుదాహరించినాఁడు. నారాయణశతకము, భోగినీదండకములనుండి లక్ష్యము లిందుదాహృతము లైనవి. కాని యాగ్రంథములకర్త లెవ్వరో చెప్పలేదు.

పరమయోగివిలాసములోని సూరపరాజు సీసచరణము అని యీక్రిందిచరణ ముదాహృతమైనది.

సీ. నిగమచోరకుని ఖండించినయలతయో

యబ్ధిలో గిరి మోచినట్టియలతో.

ఇది సిద్ధిరాజుతిమ్మరాజు పరమయోగి విలాసములోనిది. ఈతిమ్మరాజు తాతంభట్టుకంటె నర్వాచీనుఁడు. విలేఖకులెవ్వరో దీని నిందుఁ జేర్చి యుందురు. సూరపరాజెవ్వరో తెలియదు. పింగళిసూరనార్యుఁడైనచో నాతఁడును తాతంభట్టునకుఁ దర్వాతివాఁడే.

నేను చూచినవ్రాఁతప్రతియందు మొదటిపద్య మిది:—

"శ్రీభూతేశసుతాగ్రజున్ గణపతిన్ శీతాంశుమౌళిన్ సమ
స్తాభీష్టప్రదునిర్వికల్పుజగతాధారున్
.......................ంఘ్రి పద్మద్వయున్
సాభిప్రాయము చేసుజఅన్ గొలిచెదన్ సున్యక్తపూజాప్రియున్."

ఈగ్రంథ మెవరి కంకితమైనదియుఁ దెలియదు. లోపలిపద్యము లలో "పంకజనాభా! కైటభమథనా! కృష్ణా!" ఇత్యాదిసంబోధనము లున్నవి.

ఈకవిచింతామణికిఁ గావ్యానుశాసనమని నామాంతరము కలదు. ఈగ్రంథమునఁ బూర్వకవినుతి లేదు. కవులమాహాత్మ్యమును గూర్చి నాల్గయిదుపద్యములు కృత్యాదిని జెప్పియున్నాఁడు. ఈకావ్య సంపూర్ణప్రతిని సంపాదించి ప్రకటించు టత్యంతావశ్యకము.

కృష్ణామండలమున "తాతంభట్టు"అను నింటిపేరు కలవైదిక బ్రాహ్మణులున్నారు. ఈతాతంభట్టునుబట్టి యాయింటిపే రేర్పడిన దేమో యనియూహ వొడమినది. కాని యందు సత్యములేదు. తాతంభట్టువారు కౌశిక–గోత్రీయులు వెల్లంకి తాతంభట్టు శాలావత గోత్రుఁడు.



## 107 కాచిరాజు బసవన్న

ఇతఁడు కవిసర్పగారుడ మనులక్షణగ్రంథమును రచియించెను. శిథిలావస్థలో నున్న యసమగ్రప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముననున్నది.

లక్షణసారసంగ్రహమును రచించిన చిత్రకవి పెద్దనార్యుఁడీక్రింది పద్యములో నీతనిని స్మరించియున్నాఁడు.

ఉ. త్ర్యక్షనరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
య్యక్షతభక్తివిస్ఫురదనంతు ననంతుఁ, గవిత్వలక్షణా

ధ్యక్షులఁ గాచిరాజుబసవార్యుని, భైరవు, సూత్నదండి, వా
గ్వీక్షణకర్ణనేత యగువెల్లఁకితాత బుధేంద్రు నెన్నుచున్.

కాకునూరి యప్పకవి తనయప్పకవీయమున నీబసవనార్యు
నీక్రింది పద్యములోఁ దలపెట్టియున్నాఁడు.

మ. హరభక్తుం డగుభీమసత్కవి ననంతామాత్యునిం బెద్దన
ద్వయునిం దాతనఁగాచిరాజు బసవప్ప నైభరవు శ్రీధరుం
బరమోత్సాహమునం దగం దలఁచి చెప్పంబూనితి న్వారిచే
త రచింపంబడినట్టి ఛందముల చందంబెల్ల నందంబుగాన్. ౧౯౬

'కాచిరాజు' యింటిపేరో తండ్రిపేరో తెలియదు. ఇతని కవి
సర్పగారుడము ముద్రితము కాలేదు. ఈతని కులగోత్రనివాసాదు
లేమియుఁ దెలియవు. చిత్రకవి పెద్దనయీతనిని నుతించుటచే నీబసవన
క్రీ.శ. ౧౪౫౦–౧౬౫౦ నడుమనుండెనని నిశ్చయింపవచ్చును. ఇంకను
గొంచెము వెనుకకుఁబోయినఁ బోవచ్చును. కాని ౧౬౫౦ దాఁటి
యివ్వలకురాఁడు.

ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారములోఁ గవిసర్పగా
రుడమున కొకవ్రాఁతప్రతియున్నది. కవిఆత్రేయసగోత్రుఁ డైన నంద
వరీకబ్రాహ్మణుఁడనియు గ్రంథము శ్రీగిరి మల్లిఖార్జున కంకితమనియుఁ
దెలియుచున్నది. అందలి మొదటిపద్యములు రెండు నీక్రింద నుదాహ
రించు చున్నాఁడను.

శా. శ్రీశైలేంద్రుని, శాంతు, దంతురవిభారింభోళి పాణింధమా
ప్రాశాలిప్త మణీనిలింపమకుట ప్రాసాదకోలత్పదుం
బేశాకల్పుని మల్లిఖార్జునుని సంప్రీతిం గృతింజేసి వి
ద్యాశక్తిం గవి సర్పగారుడము సందర్భింతుఁ బూర్వస్థితిన్

శా. శ్రీవాణీ గిరిజేశ దండిముఖరాజీవాక్షులం గొల్చి వా
గ్దేవిన్ జిత్తమునందు నిల్పికొని శక్తిన్ భక్తిఁ గీర్తించి సా

నా విద్వత్కవులన్ మదిందలచి నూత్నప్రౌఢిం గావ్యక్రియా
ప్రావీణ్యంబున నుల్లసిల్లు కవితాప్రాజ్ఞుండనై యెప్పుడున్.

ఈకవి తన గ్రంథమును శ్రీగిరి మల్లికార్జునున కంకితము చేసినట్లు పై పద్యమువలనం దెలియుచున్నది. కానిలోపల "కప్పరసింహా" "కృష్ణా" "ఇనకులేశ" "నృసింహా" "బాలకృష్ణా" ఇత్యాదిసంబోధనములతో గూడిన పద్యములుండుటచే నిది కేవలము కవిసర్పగారుడము కాదనియు, విలేఖకు లితరఛందోగ్రంథములనుండి కొన్ని పద్యముల నిందుం జేర్చిరనియు స్పష్టమగుచున్నది.

"కవులు నిడరెందు కవిసర్పగారుడాన
మెందుచందాన నుత్తమగండవర్య"

అనుమకుటముతోం గొన్ని పద్యములున్నవి. ఇవియుత్తమగండఛందము లోనివై యుండును. ఈకవికిం దరువాతివారగు పింగళిసూరన అయ్యలరాజు రామభద్రుండు మొదలగువారి గ్రంథములలోని పద్యములిందు లక్ష్యములుగాం జేరినవి. కవిసర్పగారుడములోనివని యితరలక్షణ గ్రంథములలో నుదాహృతములైన పద్యములిందుం గానవచ్చుటలేదు. ఈగ్రంథప్రతులు సంపాదించి, బసవనగ్రంథమును వేరుపరచి సంస్కరించిముద్రింపవలసియున్నది.

ఇందుబీజఫలప్రకరణము, గణలక్షణప్రకరణము నక్షత్రరూప ప్రకరణము, వర్ణఫలప్రకరణము, భాషాఫలప్రకరణము, విషమాక్షర ప్రకరణము, శబ్దశుద్ధిప్రకరణము, యతిప్రకరణము, ప్రాసప్రకరణము, వృత్తప్రకరణము అను ప్రకరణములున్నవి. గ్రంథమసమగ్రము వళులు ముప్పదినాలుగని చెప్పియున్నాండు. గద్యయైనను లభింపమి కవి వృత్తాంతమించుకేనియుం దెలిసినదికాదు.

వెల్లంకితాతంభట్టులోని పద్యములీతని గ్రంథమున లక్ష్యములుగాం గన్పట్టుచున్నవి. కావునం దాతంభట్టుకంటె నీతండర్వాచీనుండు. ఇతండు దత్తమండలవాసుడనుట స్పష్టము.

## 108 యాదవామాత్య కవి

ఈతనిగృహ నామమేదియో తెలియదు. తనకును తనపూర్వుల కును నమాత్య, మంత్రి శబ్దములనుజేర్చుటచే నీతడు నియోగిబ్రాహ్మ ణుఁడని తోఁచుచున్నది. వీరేశలింగం పంతులు గారితని నాఱువేల నియోగిబ్రాహ్మణుఁడని వ్రాసియున్నారు. ఇతఁడు భారద్వాజగోత్రుఁ డు. వేంకటరాజపౌత్రుఁడు. బావనార్యపుత్రుఁడు.

ఇతఁడు చంద్రహాసవిలాసము, విక్రమార్క చరిత్రము, యాదవా మాత్యఛందస్సు అని నామాంతరముగల లక్షణశిరోమణియను మూఁడు పుస్తకములను రచియించెను. ఈతనిని భద్రాచలమందుండు శ్రీరామ చంద్రమూర్తి యిష్టదైవము. తనపుస్తకముల నాదేవునకే కృతియొసం గెను. ఇష్టదైవము తననుగూర్చి పలికినట్లు చంద్రహాస విలాసమున రచించిన యీక్రింది సీసపద్యమువలన నీతని వంశావళి కొంత తెలియు చున్నది.

సీ. ఇట్లనిపల్కె మహీసురాన్వయమున
　　　　వాసికెక్కిన భరద్వాజ మౌని
గోత్రసంభవులందుఁ గొమరొప్పు భానప్ప
　　　　వంశంబునకుఁ జాలవన్నె దెచ్చి
నట్టి తిమ్మకవీంద్రు నన్వయంబునఁబుట్టి
　　　　మహిమించు నారపమంత్రి పుత్రుఁ
డగు వేంకటాద్రి కిల్లాలైన కొండాంబ
　　　　తనయుఁ డాబాపన్న తమ్ములైన

ఘనులు కృష్ణయ వీరనల్ కవియెంజన్న
మాంబయను సాధ్వియందు నిన్నాదరమునఁ
దలఁపఁర్రామన్న నీవిపినతండ్రికొడుకు
మదనసౌంధర్య ! యాదవామాత్యవర్య !

చంద్రహాసచరిత్ర గ్రంథాదిని కేవలాంధ్రపద్యమును జెప్పక నన్నయాదులవలె సంస్కృతభాషలో నీక్రిందిపద్యమును రచించియున్నాఁడు.

చ. శ్రితజనరక్షణాయ సరసీరుహపత్రవిలోచనాయ వి
శ్రుత శుభకీర్తనాయ రవిసూనుసఖాయ మఖావనాయ సం
తతసుగుణాకరాయ వసుధాతనయాపరితోషణాయ సే
వితపవనాత్మజాయ రఘువీరవరాయ నమోనమోనమః

ఈక్రిందిపద్యములలోఁ బూర్వకవులను స్తుతించుచుఁ దన వినయమును జక్కఁగా సూచించియున్నాఁడు.

సీ. వాల్మీకిముఖ్య గీర్వాణకవీంద్రుల
కును నన్నపార్యాది తెనుఁగుకవుల
కును శుభంబులొసంగు మని భద్రగిరి
రామభద్రునిఁ గడుఁబ్రస్తుతించి
కవినరుల్నామీఁద గలదయచేతను
గబ్బంబుఁజెప్పఁగాఁ గలనటంచు
భావించి నేనీప్రబంధంబు గల్పింపఁ
దలఁచినాఁడను సతతంబు నియతి
శారదాదేవిఁ బ్రార్థించి గారవమున
వరముఁ గైకొని మీఁరంప వచ్చివాణి
నాదుజిహ్వాంచలంబునఁ బాదుకొనిన
ధైర్యమునఁ బల్కెదను గవివర్యులార!

గీ. పెంపుమీఱ వేల్పుఁ పెద్దలుపూజింప
బాలుఁడట్లుచేయు భంగిగాను
మీరు కవితచెప్పినా రని నేనిట్టి
చర్యకొనరితిఁ గవివర్యులార!

క. కదలీపాకముగాఁ బెం
పొదవఁగ నే నీప్రబంధమొగి రచియింతున్

గోదవలు మిక్కిలి గల్గిన
సతయతఁ దగ దిద్దవలయు సత్కవివర్యుల్.

గీ. లేకయుండినఁ జదువేమి లేనివాని
కిట్టిసద్బుద్ధి జనియించు టెందుఁగలదు
నిచ్చనిచ్చలు మీరంపవచ్చి వాణి
పొసఁగ నన్నిట్లు పలికింపఁబూనెఁగాక.

గీ. నన్నుఁబోలిన కవి గల్గకున్న ధాత్రి
పరకవీంద్రులన్ పేరెట్లువచ్చు మీకుఁ
బిన్నలుండుటచేఁ గాదె పెద్దలనుచుఁ
దెలియఁగలుగుట యార్యులు తెలిసికొనుట.

ఉ. నేరిచి యాదుపుత్రులును నేరకపల్కిన నందనుండునున్
గూరిమితల్లికొక్కటియగుం దలపోయఁగ లివాగ్వధూటికిన్
మీరలు నేను నొక్కటియె మీరువచించిన కావ్యమండలిం
జేరి మదీయవాక్యములఁ జేరకపోవునె యంచు నెంచుచున్.

భద్రాద్రిరామచంద్రుఁడీగ్రంథమును దనకుఁగృతియిమ్మని యడిగినట్లు కవి తనగ్రామమందలి త్రివిక్రమదేవునకు విన్నవించినట్లును ఆదేవుఁడా కథను దనకువిన్పింపుమని స్వప్నమునఁ గోరినట్లును ఈక్రింద పద్యములలోఁ గవిచెప్పియున్నాఁడు.

సీ. అని విన్నవించిన నాయుపేంద్రుఁడు నన్ను
గరుణతోఁ గనుఁగొని కదియఁబిలిచి
హస్తాంబుజంబు నాయౌదలపై నుంచి
భద్రాద్రిరాఘవార్పణముగాను
మును నీవుచెప్పిన జనపాలుచరితంబు
వినుపింపు నేను త్రివిక్రమాఖ్య
గలవాఁడ నాకథ తెలియఁగా విని నీకు
నాలోకమిచ్చెద నమ్ముమనుచు

నానతిచ్చి తిరోహితుండైన నేను
వేగమేల్కని యాకల విబుధవరుల
కెఱుంగఁజెప్పిన వారు నీకిష్టభాగ్య
మబ్బె నెంతటిధన్యుండ వనిన నఱరి.

తే. అనుచుఁ గ్రిమ్మఱ భద్రాద్రి కరుగుదెంచి
యచటగోదావరీ స్నానమాచరించి
జానకీయుక్తుఁడౌ రామభద్రుఁగాంచి
వేడ్కనేఁ గన్నకలయెల్ల విన్నవించి.

తే. ఆవిదేహాత్మజాధీశు ననుమతమున
నెలమి గవులార! యిక్షుపురీంద్రుఁడైన
యాత్రివిక్రమదేవు నాయాత్మ నిలిపి
కొనుచు వందన మొనరించి కోర్కులలర.

ఈ త్రివిక్రమదేవుఁ డున్నయూరు చెఱకూరో చెఱకుమిల్లియో చెఱకువాడయో చెఱకు శబ్దాన్వితమగు మరియేదేని గ్రామమో అయియుండు ననుకొనుచున్నాఁడను. భద్రాద్రి శ్రీరామచంద్రునకుఁ గృతియిచ్చుటచే నీతఁడు గోదావరిమండలవాసుఁ డై యుండునని యూహకలుగుచున్నది. కాని యామండలమున జెఱకూరు లేదు.

చంద్రహాసచరిత్రము జైమినిభారతముననున్న చంద్రహాస చరిత్రమే కాని యన్యముకాదు.

విక్రమార్కచరిత్రము వచనకావ్యము. ఈశ్వరుఁడు పార్వతితో ననినట్లు చెప్పిన యీక్రిందిసీసపద్యమువలన నిందలికథ తెలియఁగలదు.

సీ. వెలంది నీవడిగిన విక్రమాదిత్యుని
జనకుఁడౌ చంద్రగుప్తునిచరిత్ర
మానుపూర్వికముగ నాభోజభూపాలు
కథ శాలివాహనువిధము నాతఁ

డావికర్మార్కు నజీవితుఁగావింప
నతఁడెక్కినట్టి సింహాసనంబు
నొక్క భోజుఁడు పూస నొక్కొక్కప్రతిమ దా
మొక్కొక్క దినమున నొక్కకథయుఁ

గాఁగ నారాజు సాహసత్యాగములను
జతురమతులయి వినిపించి కుతుక మొనరఁ
దొల్లి నీశాపమునఁ దల్లడిల్లుచున్న
బొమ్మలరుదెంచె నీసమ్ముఖమ్ము చేర.

ఈముప్పదిరెండుకథలకు కథారంభమున నాకథాసంగ్రహమును దెలుపుచు నొక్కొక్కసీసపద్యమును రచించినాఁడు.

ఈతనిగ్రంథము లేవియును ముద్రింపఁబడినట్లు గానరాదు. లింగమకుంటతిమ్మకవి తనసులక్షణసారమున యాదవామాత్య ఛందస్సునుండి :—

సీ. రగణము శంఖమనఁగ నొప్పు మూఁడవ
జామునఁ బనడపుఁజాయ కుజుఁడు
గ్రహముగా వేల్పు హిరణ్యా రేతుఁడు గాఁగఁ
దారకృత్తికగాఁగఁ దగరు రాశి
గా మేషయోనిగా గణ మాసురంబుగా
శృంగారరసముగా స్థిరఫలంబు.
భయముగాఁ గౌశికభద్రగోత్రమున నెట్టి
నిమేన నృపకులమున జనించె

బంధుజనగేయ సత్కవిభాగధేయ
రమ్యచారిత్ర వేంకటరాజపౌత్ర
వర్ణితోదార బాపన్నవరకుమార
మదనసౌందర్య ! యాదవామాత్యవర్య !

అను మొదలగుపద్యముల నుదాహరించియుండుటచే నీతఁడుతిమ్మకవి కంటెఁ బూర్వుఁడనుట నిశ్చయము. తిమ్మకవి క్రీ. శ. ౧౭౭౦ సంవ

త్సరప్రాంతమువాఁ డనియాతనిచారిత్రమునఁ దెలియనగును. కావున నీయాదవామాత్యకవి పదునైదవశతాబ్దియం దుత్తరార్థముననో పదు నాఱవశతాబ్దియందుఁ బ్రథమపాదముననో నున్నాఁడనిచెప్పవచ్చును.

ఈతనికవిత్వము ముద్దులమూటఁగట్టుచు దేనెలొలుకుచున్నదని వీరేశలింగముపంతులుగా రభిప్రాయ మిచ్చియున్నారు. ఇతనిశైలి తెలియుటకై చంద్రహాసచరిత్రమునుండి కొన్నిపద్యముల నుదాహ రించుచున్నాఁడను.

ఉ. రాజసవృత్తిఁగొందఱు ధరాస్థలిలో ధనమాన్యతాత్ములై
రాజసవృత్తి చేతఁ గవిరాజులు తమ్ము నుతించి వేఁడుచోఁ
దేజము దూలిపోవఁ గడుదీనత మోమొకకొంతవాడఁగా
రోజుచుఁబొమ్మటందు రొకరూకయు నియ్యఁగలేక యిందిరా!

ఉ. వీని మొగంబు తెల్విఁజిగి వీనియురంబు వెడందపొంకమున్
వీనిగభీరనాభియును వీనికపోలయుగంబు తేటయున్
వీనియొయారిమీసములు వీనిభుజంబులతీరుఁ గన్గొనన్
వీనికె యొప్పుఁగాక కలవే యిలలో మగవారికెన్నఁగన్.

ఉ. చండిక యానెలంతుకను సాదర మొప్పఁగఁ జూచి యట్టులా
నండజయాన సందియమునందకు మంత్రికుమారియున్ మహీ
మండలనాథుకన్యకయు మద్వరసంభవుఁడైనవాని నా
ఖండలతుల్యుఁగోరిరి యఖండతరామితమోహమగ్నలై

ఉ. రాజమరాళయాన ! మము రవ్వ యొనర్పక చిత్తగింపుమీ
రాజమరాళముంగొని విరాలి యడంచితి నంచు బొంకెదే
రాజమరాళ మైన మరురాయిడిమానుపునంట దబ్బరా
రాజమరాళ మల్లనృపరాజము తానుగ నేర్చు నేమొకో !

సీ. శిరమున దేదీప్యవరకిరీటంబు వీ
నుల నవరత్న కుండలము లొప్ప

వక్షస్స్థలంబున వనజాలయ వెలుంగ
హృదయకంజంబున మదనుఁ డలర
నక్షియుగ్మమున మిత్రాబ్జులు కొమరార
కరమున శంఖచక్రములు దనర
నాభిపంకజమున నలువ చెన్ను వహింప
కటితటిఁగాంచనపటము మెఱయ

గీ. పదసరోరుహమున గంగ పరిఢవిల్ల
పుడమితాలుపు తెల్లనిగొడుగునీడ
ఘనతమీఱంగ గరుడవాహనము నెక్కి
వచ్చిప్రత్యక్ష మయ్యె భూవరునియెదుట

ఉ. అత్తరి నొక్కబిత్తరి సుమాశుగదేవునికై రయంబునన్
మొత్తము మావిమ్రానిఫలముల్ దగఁ గోయఁగఁ జిల్క దానిత
ళ్ళొత్తెడు మోవి బింబ మనుకొంచును ముక్కునఁ జీరి కూయుచున్
దత్తరమందుచున్ జెలులదండకు వే చన వారు నవ్వఁగన్.

ఉ. అప్పుడు చంద్రహాసవసుధాధిపుఁ గ్రేకొని విస్మితాత్మయై
కప్పురగంధియా విషయ కంజశిలీముఖువారి కగ్గమై
ముప్పిరిగొన్న మోహమున ముగ్గి చలింపుచు నేస్తగత్తియన్
దప్పక చూచెఁ దత్తరము దైన్యముకన్గవయందె కన్పడన్.

చ. అని విషయావధూటి హృదయంబున ముప్పిరిగొన్న మోహమా
కనుఁగవయందుఁ గన్పడఁగఁ గాయజుఁ డేయుశిలీముఖంబులన్
తను వలయంగ డెందమునఁ దాలిమి నేలిమి మాలిపోవఁగా
వనజపతంనుజాలముల వాడినతీవియతోడ సాటియై.

ఉ. అందొకజోటి పొన్నవిరు లందము నందగఁ గోయఁబోవ నిం
డిందిర నప్పు డా తెఱవ తిన్ననినుమ్మొగ మబ్జ మంచు నిం
పొందఁగ వ్రాలి నుల్కిపడి పోవఁగఁదోలియుఁ బోవకున్న పై
నందెలు మ్రోయఁగాఁ బరచె నత్తరి సంపఁగిమ్రానిదండకున్.

సీ. వజ్రింపుగమ్మల వన్నియ నెఱనిగ్గు
గండభాగంబులఁ గ్రందుకొలుపఁగ
ముత్తెపుటుంగర మురువుకెమ్మోవిడా
ల్గమిలోనఁ గురువిందకాంతి నెసఁగ
కుంకుమపూరంగు గుల్కుపయ్యెద కుచో
పరిహారదీప్తి నాపగిది సిగుప
కంకణఝణఝణత్కారంబు మణినూపు
రముల నాదముకుగర్వంబుఁ జెనుప

గీ. నిడుదపైన్నె ఱెజడ పాపబుపత యనుచు
బాడుప నొడిసెడినట్టువవులుగు నడుగు
జాడ రా వచ్చె గంధర్వసార్వభౌమ
కన్నె యో పుష్పధన్వునిగన్నతల్లి.

ఈకవి తనగ్రంథమును గోదావరిమండల మందలి భద్రాద్రి రామున కంకితమిచ్చి యుండుటచే గోదావరిమండల వాసుఁడైనట్లు చెప్పఁదగియున్నను, నీ మండలమున జెఱుకూరు లేకపోవుటవలనఁ గేవల మీమండల వాసుఁడని చెప్పననువు గాకున్నది. పై గీతపద్యములో "అనుచుఁ గ్రమ్మఱ భద్రాద్రికరుగుదెంచి" యని చెప్పియుండుటచే నదినఱకు భద్రాద్రియాత్ర కావించినట్లర్థమగుచున్నది. గోదావరి మండలమున నున్నప్పుడీయాత్ర చేసెనో త్రివిక్రమస్థానమునుండి వచ్చెనో యెఱుంగరాదు.

ఈసందర్భమున నల్లాడ దొడ్డారెడ్డి కొంకుదురుశాసనము స్ఫురణకు వచ్చుచున్నది. అందొక నారనమంత్రి యున్నాఁడు. ఆతనిగోత్ర ముందుదాహృతము కాలేదు. ఆతనితండ్రిపే రొబయామాత్యుఁడు ఓబయ, నారనశబ్దములు కర్నూలు నెల్లూరు కడప మొదలగు నాంధ్ర దక్షిణమండలములలో బహుళముగాఁ గాన్పించును. ఈనారనమంత్రి దొడ్డయరెడ్డితోఁగూడ నాప్రాంతమునుండి రాజమహేంద్రవరమునకు

వచ్చియుండును. ఆతనికి నాలుగున్న రఖారీలభూమి గోదావరిమండల మండలి పలివెల సమీపముననున్న గుంపిని గ్రామములో దొడ్డారెడ్డి యిచ్చినట్లా శాసనములోఁగలదు ౧. ఆనారనమంత్రియే యాదవామాత్యునిపూర్వుఁడనుట కూహతప్ప వేఱాధారములులేవు. నారనమంత్రియు నీతనిపుత్రపౌత్రులును గొంతకాల మిచ్చటనుండి భద్రాద్రిరామభక్తులై యాదవామాత్యుని కాలముననో యాతనితండ్రి కాలముననో చెఱకూరునకు వెళ్ళియుండురనియుఁ బూర్వపరిచయముచే నీకవిభద్రాద్రిరామున కంకితముచేసియుండెననియు నూహ కలుగుచున్నది. బాపన్న, వీరన్న మొదలగు పేరులు గోదావరిమండలమునఁ దఱచుగాఁగన్పట్టుచుండుట యీయూహకు బలమొసంగుచున్నది. ఆశాసనకాలము క్రీ. శ. ౧౪౪౦ నారనమంత్రికి యాదవామాత్యుఁడు ప్రపౌత్రుఁడు. ఆనారనమంత్రియే యీతఁడనినచో యాదవామాత్యుఁడు క్రీ. శ. ౧౫౨౦ ప్రాంతమున నుండును. ఇది పైనిజెప్పినకాలముతో సరిపోవుచున్నది. ఈవిషయమింకను బరిశోధనీయము.

యాదవామాత్యఛందము నీతఁడురచించెనా ? కృతినొందెనా ? యని సంశయము కలుగుచున్నది. పైనివ్రాసిన సీసగీతియందలి తుది రెండుపాదములును యాదవామాత్య సంబోధకములుగ నున్నవి. అందుచేతనే కాఁబోలు శ్రీవీరేశలింగము పంతులుగారాంధ్ర కవులచారిత్రమున "ఇతఁడు కృతులందుట మొదలైనవానినిబట్టి చూడఁగా నితఁడున్నతపదమునం దుండినట్లు తోఁచుచున్నది" అనివ్రాసియున్నారు. ఇతఁడు కృతిపతి దననుసంబోధించి చెప్పినట్లు చంద్రహాస విలాసమున "మదనసౌందర్య! యాదవామాత్యవర్య" అని వ్రాసికొని యున్నాఁడు ఛందమునఁగూడఁ దుదిచరణ మిట్లేయున్నది. చూడుఁడు.

"బంధుజనగేయ సత్కవిభాగధేయ
రమ్యచారిత్ర వేంకటరాజపుత్ర !

౧ ఇండియను ఎపిగ్రాఫికా సం. ౩ పుట ౬౯ ఆంధ్రకవితరంగిణి సం ౪ పుట ౨౦౪.

వర్ణితోదార బాపన్న వరకుమార
మదనసౌందర్య! యాదవామాత్యవర్య!"

దీనినిబట్టి యీకవి తనఛందోగ్రంథమును నాత్మసంబోధకముగా రచియించియుండెనని తోఁచుచున్నది.

గుంటూరుమండలమున బాపట్లకు వాయవ్యదిశను బదిమైళ్ళ దూరములోఁ బెద్దచెఱుకూరను గ్రామమున్నది. అందుఁ దిరివిక్రమదేవుఁడున్నాఁడు. అనవేమభూపాలుఁడు క్రీ. శ. ౧౩౭౮ లో వ్రాయించిన శాసన మొకటి యాయూరఁగలదు. ఆగ్రామమే యాదవామాత్యకవి నివాసమని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

---

## 109 చంద్రమౌళి

రామప్రెగ్గడ జగ్గన తనప్రబంధ రత్నాకరమునందుఁ జంద్రమౌళీ హరిశ్చంద్ర కథలోనిదని యీ క్రిందపద్యము నుదాహరించియున్నాఁడు.

చ. అలసత టొంకు నాస్తికత యాయతచింత యయుక్తికారితా
కలనము దీర్ఘసూత్రము విశాసముఁబొందమి దుర్వ్యయంబు పె
ల్లలుక నిరర్థకార్యరుచి యర్థమతచ్యుతి మంత్రహాని ప్రా
జ్ఞులవెలి శాంతసౌమ్యకృతి శూన్యత నానివి రాజదోషముల్.

ఈకవికాలము సరిగాఁ దెలియరాలేదు. శంకరకవికంటెఁ బూర్వుఁడు. క్రీ. శ. ౧౨౮౦-౧౩౩౦ నడుమ నున్నవాఁడని తలంపవచ్చును. ఇతనికులగోత్ర సూత్రనివాసాదు లేమియుఁ దెలియవు.

ఈకవినిగూర్చి శ్రీ నిడదవోలు వేంకటరావుపంతులు **M.A.** గారిట్లు వ్రాసియున్నారు. ౧

---

౧. భారతి సం ౧౩ భా ౧ పుటలు ౧౬౬-౧౬౭.

"ఈతఁడు హరిశ్చంద్రకథను బద్యకావ్యముగ రచియించినట్లు ప్రబంధరత్నావళి వలనఁ దెలియుచున్నది. ప్రాచీనకవులలో తురగా రామన, అయ్యంకి బాలసరస్వతి యనుజంటకవులు తమనాగరఖండ మున కవిస్తుతియం దీతని స్తుతించియున్నారు.

"నన్నపనుఁ దిక్కమఖిఁ బ్రబంధపరమేశు
సాధునాథర్వణాచార్యుఁ జంద్రపకాళి
భాస్కరు ననంతు శ్రీనాథభట్టు భీము
సోము నమరేందుఁ దలఁతు నుత్సుకత నాత్మ"

పైజంటకవులు క్రీ.శ. ౧౫౮౦ సంవత్సరప్రాంతము వారగుటచే చంద్రపకాళికవి యంతకుఁబూర్వము వాఁడనిమాత్రనే యూహించుట కవకాశము కలుగుచున్నది. ఇందుల కుపబలముగా నొక్కవిషయము మాత్రమిటఁ దెలుపుట యావశ్యకము. శంకరకవిరచిత హరిశ్చంద్రో పాఖ్యానము ముద్రితమై ప్రసిద్ధమై ప్రచారములో నున్నది. ఇందుఁ బంచమాశ్వాసమున చంద్రమతీ విచారఘట్టమునఁగల యీక్రింది పద్యమంద జెరింగినదియే.

"అకటా చేరెఁడు నేలకుండగఁడె సప్తాంబోధివేష్టిభన
త్సకల ద్వీపకలాపభూప మకుటాంచత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్ఘళనిర్గళత్కిరణశుంభత్పాదుఁడైనట్టి ఠా
జకుమారుండని యేడ్చెకన్నుగన నశ్రుల్ కాల్వలై పారగన్.

ఈపద్యము చంద్రమాళికవి రచియించినట్లు సుప్రసిద్ధలాక్షణిక కవి గణపవరపు వేంకటకవి తనయాంధ్రకౌముది యందిట్లు చెప్పి యున్నాఁడు.

"సరసపుమాటలఁ జంద్రపకాళికవి రచనఘటించిన హరిశ్చంద్రకథను- దోరణిగ "నకటా! చేరెఁడునేలకు" నసెడిమత్తేభనాలవపదమున-రాజ కుమారుఁడ న్రాజిల్లెఁ జేతనమను పదమునకు షష్ఠ్యర్థమునను రహిఁగ- నాదేశంబు రాక యీరీతులఁ గృతులందుఁ జెల్లు నొక్కెడలఁ గనుక.

శంకరకవికిఁ జంద్రమహాళికవియని నామాంతరమున్నట్లు తెలియ రాలేదు. లాక్షణికులు శంకరకవిగ్రంథము నాతనిపేరుతో నుదాహరించిరి. ఒకవేళ పైపద్యము చంద్రమహాళి హరిశ్చంద్రకథనుండి శంకర కవి సంగ్రహిం[illegible]నాఁడేమో! ప్రస్తుతము ముద్రితమైయున్న శంకర కవికృతహరి[illegible]శ్చంద్రోపాఖ్యానము సప్రమాణము గాదు. ఇతరకవుల గ్రంథము[illegible]లోని పద్యములు కొన్ని యిందుఁగలవు. నైఘంటికులీగ్రంథములోని[illegible]ని యుదాహరించినపద్యములిందుఁ గానరావు. హరిశ్చంద్రోపాఖ్యానము పంచమాశ్వాసమున హరిశ్చంద్రచంద్రమతులు తమ మృతసుతుని [illegible]ర్చి సంభాషించుఘట్టమునఁ గలయీక్రిందిపద్యము రామర[illegible]షణకవికృత హరిశ్చంద్రనలోపాఖ్యానములోఁ బంచమా శ్వాసమ[illegible]సందర్భముననే గానవచ్చుచున్నది :—

[illegible]మెఱుంగునిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
[illegible]ఁగ నేలయేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
[illegible]తమానసంబునను వేమఱు, నాయువు శాశ్వతంబె సం
[illegible]స్థిరంబులే విధివిపాకము దాటఁదరంబె యేరికిన్"

మ[illegible]

[illegible]రిరాచవాఁడా
[illegible]నా వెంటఁ దిరుగురా దాసుఁడవై
[illegible]మాడ లిచ్చెదఁ
[illegible]యప్పుఁ దీర్చుకోరా! యనుడున్"

[illegible]ను నీ హరిశ్చంద్రోపాఖ్యానము నాల్గవయాశ్వాసమున [illegible] "బారాది" యనుపదమున కుదాహరణముగ బ్రౌనుదొర [illegible]తమనిఘంటువున వ్రాసియున్నారు. (బ్రౌణ్యనిఘంటువు (౧౮[illegible]౨). పుట ౯౯౧ గ్రంథమున నీపద్యసంఖ్య ౨౩౩) శబ్దరత్నాకరమున పైపద్యము కొంచెముమార్పుతో "గోసఁగి" యనుపదమున కుదాహరణముగా నీయఁబడినది. శ్రీసీతారామాచార్యులవా రీపద్య

ములో దానుఁడనుపదమునకు బదులు "గోసఁగి" యని పద్యము నుదాహరించిరి.

పైపద్యము వ్రాఁతప్రతులయందున్నదిగాని ముద్రితప్రతుల యందీక్రిందిపద్య మగుపడుచున్నది.

"ఓరి యోరంతపొద్దు నాయొద్దఁగదల
కుండి యుడిగంపుఁబనులు సేయుచుఁ బ్రియంబు
చెలఁగ మెలఁగెద వేని యోచిఱుతబాపఁ
డడిగినంత ధనంబు నేఁ దడయకిత్తు."

ఈగ్రంథము ముద్రించుటకుఁ బూర్వమే బ్రౌ[illegible]రవారు నిఘంటువునఁ జేర్చినపద్యము తరువాతివారేల తీసివైచిరో [illegible]త్తపద్య మెట్లుచేర్చిరో తెలియకున్నది.

పైదానిఁబట్టి చంద్రమౌళికవి తొలుత హరిశ్చంద్ర[illegible] రచియించియుండవచ్చుననియు నావెనుక శంకరకవి రచిం[illegible]యొక వచ్చు ననియు లేఖకులు నొకగ్రంథములోనిపద్యములు [illegible]న్నది. గ్రంథములో వ్రాసినారేమో యనియు సందియము క[illegible]ను." చంద్రమౌళియనుకవి యొకఁడు ప్రాచీనుఁ డున్నట్లు నిశ్చ[illegible].

శబ్దార్థ మొక్కటియే యైనను, శంకర చంద్రమౌ[illegible]లొక్కరుగారనుట నిశ్చయము. శంకరకవికంటెఁ జంద్రమౌ[illegible] డగుటయు నిశ్చయమే. కాని చంద్రమౌళికవి కాలవ[illegible]ర్ణయించుట కాధారములు లభ్యము కాలేదు. పదునై[illegible]ద పాదమునను, బదునాఱవశతాబ్ది ప్రథమపాదమునను నీతఁడ[illegible]ండు నని యూహించుచున్నాఁడను. ఇతని నివాసమునుగూర్చి [illegible] దెలియదు.

లక్షణగ్రంథకర్తలు ఒకరిపద్యముల నొకరివిగాఁ దమగ్రంథములలో నుదాహరించుటయు విలేఖకు లొకరిపద్యములను సందర్భానుసారముగా మఱియొకరిగ్రంథములలోఁ జేర్చుటయుఁ గలదు. "అక్టా!

చేరెఁడునేలకుఁ దగఁడె" అను పద్యవిషయమున నీరెండింటిలో నేది జరిగెనో నిర్ణయింపవలసియున్నది.

శంకర పీఠశరభకవులిరువురును గౌరనద్విపదకావ్యముల నను సరించి తమపద్యకావ్యములను రచియించియుండిరి. చంద్రమౌళికవి గౌరన ననుసరించెనో లేక స్వతంత్రముగఁ దనరచనను సాగించెనో చెప్పుట కాతనిగ్రంథము లభించినఁగాని నిశ్చయింపలేము.

ఈసందర్భమున గౌరన తనద్విపదకావ్యమున:—

"సకలదీవుల నేలు జనపతిపుత్త్రిఁ
డకట చేరెఁడునేల కర్హుండుగాఁడె?"

అని చెప్పియుండెను. ఈభావమునే శంకరకవి యీక్రింది పద్యమున వెల్లడించియున్నాఁడు.

క. శ్రీలున్ దైవాట జలధి
వేలావలయితధరిత్రి విమలయశుండై
యేలున్నృపసూతి యదుగెదు
నేలకుఁ బాత్రుండు గాఁడె నీకిటుతగునే. 2-ఆ ౨౮.

ఈపద్యమునకుఁ బిమ్మట "అనిమతియు" అని చిన్నవాక్య మున్నది. ఆక్రింద "అకటా! చేరెఁడు నేలకుం దగఁడె" అనుపద్యము ముద్రితమైనది.

పైకందపద్యములోనిభావమును "అకటాచేరెఁడు" అనుపద్యము లోనిభావమును ఒకటియే. ఈమత్తేభములో రాజునకు విశేషణముగా రెండుపాదములుగల యొకదీర్ఘసమాసము చేర్పఁబడినది. కందపద్య మున్నప్పు డీమత్తేభము పునరుక్తియగును. పునరుక్తిగా శంకరకవి యీపద్యమును వ్రాసియుండఁడనియు నిది చంద్రమౌళికవిత్వమేయని యు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. సంశయము లేదు. ఈపద్యమును విలేఖకు లెవరో శంకరకవిగ్రంథమునఁ జేర్చియుందురు. పూర్వోత్తర

సందర్భముకుదుకుటకై యీరెండుపద్యములకు నడుమ నున్న చిన్న వచనమును "అనిమఱియు" అనిమార్చియున్నాఁడు. ఆతరువాతనున్న "కుదురుమెఱుంగు" అనుపద్యమునకు ముందొక చిన్న వాక్యమో పద్యమో యుండియుండవలయును. అదిలేదు. అదియుండినఁగాని యన్వయము కుదురదు. ఆవిలేఖరి యీయసందర్భమును గమనింపక యీ వచనమును దనయిచ్చవచ్చినరీతిని మార్చినాఁడు. "అనిమఱియు"నను వచనమున్నచోట అనిపలికి మిక్కిలిదుఃఖించుచున్న చంద్రమతిం జూచి హరిశ్చంద్రుఁ డిట్లనియె" అనుమాటలుండియుండును.

ఈమాటల నచ్చటఁజేర్చి "అకటా! చేరెఁడు నేలకుం దగఁడె" యనుపద్యమును దీసివేసినచో ననన్వయదోషమును బునరుక్తిదోషము నుగూడ లేకుండఁబోవును. గావున నట్లుచేయుటయే సమంజసము.

"అకటా! చేరెఁడు నేలకుందగఁడె" యనుపద్యమువంటిపద్యమును వీరశరభకవికూడ వ్రాసియున్నాఁడు. అదియిది.

శా. సప్తద్వీపసముద్రముద్రిత మహాసర్వంసహాచక్ర సం
ప్రాప్తశ్రీకమనీయలక్షణజగత్ప్రావీణ్యసత్యవ్రతో
ద్దీప్తప్రాభవుఁ డైనరాజసుతుఁ డర్థిన్ దైన్యభావోదయ
వ్యాప్తిన్ జెత్తెఁడు నేలకైనఁ దగఁడే యంచున్విలాపించుచున్.

ఇది పైపద్యమున కనుకరణీయమనుట నిశ్చయము. వీరశరభకవి గౌరన ననుసరించి తనకావ్యమును వ్రాసినను, ఈపద్యమును జంద్రమౌళీ హరిశ్చంద్రోపాఖ్యానము ననుసరించి వ్రాసియుండును.

శంకరకవిగ్రంథములోని "కుదురుమెఱుంగు" అను పద్యము రామరాజభూషణవిరచిత హరిశ్చంద్రనలోపాఖ్యానములోనిదని యనుచున్నారు. ఆవిషయమును జర్చించుట కిది యదను గాదు. శంకరకవి చారిత్రమున వ్రాసెదను.



## 110 దేవరాజభట్టు

ఈకవిరచించిన హరిశ్చంద్రచరిత్రలోనివని రెండుపద్యము లాంధ్రసాహిత్యపరిషత్తునందున్న యుదాహరణగ్రంథసంధాత యుదాహరించినాఁడు. ఈగ్రంథము కాలగర్భమునఁబడిపోయినది. కవిని గూర్చినవిశేషము లేమియుఁ దెలియుట లేదు. ఆరెండుపద్యముల నీక్రింద నుదహరించుచున్నాఁడను.

ఉ. అంబుధులాలవాలము దిగంతము లాకులు కూర్మశేషవ
క్ష్మాంబులు కందమూలములు చక్రపుఁగొండలు కోట నాఁగవృ
క్షంబున విష్ణువిగ్రహతుజంబునఁ జుట్టి పెనంగి మిన్నుపు
ష్పంబుగా నబ్జజాండ మనుపండును బండు ధరిత్రివల్లియై

చ. సురనిచయంబుఁ ద్రోచి నహుషుఁడటు నేలకయున్న రాక్షసు
ల్వరుసల వచ్చి చూఱఁగొని వాసవు వెట్టికిఁ బట్టుకున్న శ
ర్వరిఁ గనుమూయుఁగన్నఁ దిదివం బనునాఁడె నల్పజీవమై
యరుగక భూమినున్న నమరావతియాడగునయ్యయోధ్యకున్.

ఈకవి స్వతంత్రముగ నీగ్రంథమును రచించెనో లేక గౌరన కవి ద్విపదకావ్యము ననుసరించెనో తెలియదు. అయోధ్యాపురమును వర్ణించిన పైపద్యములోని భావములు గౌరనకావ్యమున లేవు.

కవికాలము తెలియదు. క్రీ. శ. ౧౫౬౦ వ సంవత్సరమునకుఁ బూర్వమనిమాత్రము నిశ్చయముగాఁ జెప్పవచ్చును. భావిపరిశోధకుల కనుకూలముగా నుండునని హరిశ్చంద్రకథను రచించిన చంద్రమౌళి కవికిఁ దరువాత నీతనిని జేర్చితిని. పై రెండుపద్యములనుబట్టి యీతని కవిత్వము ప్రౌఢమయి, మనోహరముగానుండునని చెప్పవచ్చును.

—***—

# 111 ప్రౌఢకవి మల్లన

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; పోతయ మంత్రికిని అమ్మళాంబకును బుత్త్రుఁడు; శివదేవయోగి పుత్త్రుఁడైన శక్తినాథుని శిష్యుఁడు; ఈకవి రుక్మాంగదచరిత్ర మను నామాంతరము గల యేకాదశీ మాహాత్మ్య మను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి గోదావరిమండలమందలి దాక్షారామ భీమేశ్వరున కంకితము చేసెను.

ఇతఁడు తనతండ్రిని, గురువును, బూర్వకవులను స్తుతించిన పద్యముల నీక్రింద వరుసగా వ్రాయుచున్నాఁడను.

క. మనమున సేవింపుదు మ
జ్జనకుని శ్రీవత్సగోత్ర సాగరచంద్రున్
ఘనుఁ బోతయమంత్రీశ్వరు
ననయంబును భక్తి నమ్మళాంబా ప్రియునిన్.

సీ. ఫాలపట్టికఁ బాశుపత మహామంత్ర భ
స్మత్రిపుండ్రము కాంతిమహిమ మీఱఁ
గటిమండలమున నీర్కావిధోవతి మీఁద
వెలికిపట్టుపచ్చడం బలవు మిగులఁ
గంఠ, పీఠిక మూ క్తికములలో రుద్రాక్ష
మాలికావిస్ఫూర్తి శ్రీలఁ దనర
దర్భాంకురాలంకృతం బైన పాణిప
ద్మమునందు నక్షసూత్రము దలిర్పఁ

గీ. బ్రణవ పంచాక్షరీ మంత్రపరిణుతి నిగుడ
నాదిశంభు స్వరూపమై యధికమహిమ
నన్నుతికి నెక్కు శివదేవయోగి పుత్రు
శక్తినాథుని మద్గురుస్వామిఁ దలఁతు.

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ బే
రెన్నికఁ జిమ్మపూడియమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్
సన్నుతిఁ జేసి వాక్యసరసత్వము పీనులకింపు మీఱ న
త్యున్నతిగా నొనర్తుఁ గవియోధులు మేలనఁ గావ్యమిమ్మలన్.

కావ్యమెట్లుండవలయునో తెలుపుచుఁ గవివ్రాసిన యైదాఱు పద్యములలో రెండుపద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

శా. సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కార శృం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ పాంచాలరీతిం దగన్
వారస్త్రీయును బోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యాల బిలన్. ౨౪

క. జాజులపొట్లము విప్పిన
యోజఁ గవిత్వంబు వెలయు చుండిన సభలన్
బూజింతురె యాకృతి బుధ
రాజులు రాజులును సుకవిరాజులు గరిమన్. ౨౬

దాక్షారామభీమేశ్వరుఁ డీకవికి స్వప్నమునఁ గన్పడి యీగ్రంథమును దన కంకితము చేయుమని యాజ్ఞాపించినట్లు చెప్పుచు దక్షవాటిని, భీమేశ్వరుని, నైదుసీసపద్యములలో వర్ణించియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే వాని నిందుదాహరింపలేదు. ద్రాక్షారామమును వర్ణించి భీమేశ్వరున కంకిత మొనర్చుటచే నీకవి గోదావరిమండలములోనివాఁడని యూహింపనవకాశమున్నది. కాని యదియే సత్యమని నిర్ణయింపలేము. నైజాము రాష్ట్రవాసుఁడేమో యనునను మానముకూడఁ గలదు.

ఈకవి భాగవతమును రచించిన బమ్మెర పోతనామాత్యుని పుత్త్రుఁ డని కొంద ఱనుచున్నారుకాని యందు సత్యము లేదు. పోతనకు మల్లన యనుపుత్త్రుఁ డుండుట నిజమేకాని యాతఁ డీతఁడు కాఁడు. పోతనామాత్యుఁడు కౌండిన్యసగోత్రుఁడు. ఈమల్లనకవి శ్రీవత్స

గోత్రుఁడు. ఈకవి తండ్రిని నుతించినపద్యములో భాగవతముపేరెత్త లేదు. నిజముగా నీతఁడు బమ్మెరపోతనామాత్యునితనయుఁడే యైన పక్షమున భాగవతము మాట తలపెట్టకుండ నుండఁజాలఁడు.

ఈకవి సోమునివఱకుఁ గలకవులనుమాత్రమే నుతించియున్నాఁడు. కవిగృహ నామ మెచ్చటను దెలుపలేదు. గద్యలో "ఇదిశ్రీమత్సార్వ తీశ్వర వరప్రసాదలబ్ధకవితాపవిత్ర పోతయామాత్యపుత్ర సకలజనా నందచర్య ప్రౌఢకవిమల్లనార్య ప్రణీతంబైన" అనియున్నది. 'ప్రౌఢ కవి' అనునది గృహనామ మేమో!

ఈమల్లనకవి శ్రీవత్సగోత్రజుఁ డని తెలిసినపిదపఁ గూడ బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు కవులచరిత్ర ద్వితీయముద్రణమునందు బమ్మెరపోతనామాత్యునిచారిత్రములో "పోతరాజునకు మల్లనయను కుమారుఁడు కలఁడు. ఆమల్లనయే ప్రౌఢకవిమల్లన. యనుటనుగూర్చి యింకను విచారింపవలసియున్నది" అని వ్రాయుట కేమి కారణమో తెలియకున్నది.

ఈకవికాలమును దెలుపువిషయము లేమియు గ్రంథమున గన్పట్టలేదు. కవులచరిత్రమునం దీతనిని బదునైదవశతాబ్ది వాఁడని యూహించియున్నారు.

రుక్మాంగదుఁడనురాజు, మహర్షులవలన నేకాదశీవ్రతమాహాత్మ్యమును విని యావ్రతమును దానాచరించుటయేకాక తనప్రజ లందఱు నాచరించునట్లొనర్చుటయు, నావ్రతభంగ మొనర్ప దేవతలు ప్రయత్నించుటయుఁ దనకుమారుని వధించుటకైన నంగీకరించి వ్రతమును విడువకుండుటయుఁ దుదకు భగవంతుఁడు ప్రత్యక్షమై మోక్ష మొసంగుటయు, నొకటి రెండుకథలును నిందువర్ణితములైనవి. ఏకాదశీవ్రతమాహాత్మ్యమున నరకమున కొక్కఁడును బోవకపోవుటచే నరకలోకమంతయుఁ బాడువడిపోయెనని దుఃఖించుచు యమధర్మరాజు బ్రహ్మతోఁబోయి విన్నవించుకొనుసందర్భమున నేపాప మొనర్చిన

వాని కెట్టినరకము వచ్చునో తెలుపుటతోఁ బ్రథమాశ్వాసమును నెట్టి పుణ్యము చేసినవారు నరకమువంకకుఁ బోవకుందురో తెలుపుటతో ద్వితీయాశ్వాసమును బూర్తియైనవి. రుక్మాంగదుని వ్రతభంగ మొనర్చుటకై బ్రహ్మకష్టపడి ప్రయత్నించి యొక కామినిని సృష్టించెను. రుక్మాంగదుఁ డామెవలలోఁ జిక్కుకొనియెను కాని యామెయెన్ని విధములఁ బ్రయత్నించినను నేకాదశీవ్రతము మానలేదు. ధర్మాధర్మములను బుణ్యపాపములను దెలుపుటయే యీగ్రంథోద్దేశము.

ఈకవి కవిత్వము సలక్షణమై ప్రౌఢమై మనోహరముగానున్నది. శైలి తెలియుటకై కొన్నిపద్యముల నిటనుదాహరించెదను.

ఉ. పట్టణవీథులందు నసిపత్రవనంబులయందు డాకినీ
హట్టములందు రాజభవనాగ్రములన్ జెఱసాలలందు నే
పట్టున నిండియుండుదురు పాయఁగఁ ద్రోయఁగరాకమూఁకలై
యెట్టిదినట్లు నేఁడొదనఁ డొక్కరుఁడున్ పురిపాడు దేరెడిన్ ౧౧

క. నిరతాన్నదాన మొసఁగెడు
నరునింట జనించు పరిజనమ్ములు కూడన్
నరకముల తెఱవు చూడక
హరిలోకమునందు నుందు రధికవిభూతిన్ ౨౧

ఉ. ఎక్కడ జన్మభూమి తరళేక్షణ నీతలిదండ్రు లెవ్వరే
దిక్కుననుండుదీవు నినుఁ దేరి కనుంగొనినంతమాత్ర నే
నెక్కటికింత లేక యలరమ్ముల పాలుగఁ జేసె మన్మథుం
డొక్కక్షణంబు నిల్వ నీక నోపను నీదయ గల్గకుండినన్. ౩౧

చ. పెనిమిటిలేనిభామినులఁ బ్రీతిఁ గనుంగొన దోష మర్థితో
ననయము దీర్ఘసేవలు మహావ్రతముల్ నుపవాసముల్ బ్రియం
బున నొనరించియున్ విధవ వోలదు నాథుఁడు గల్గియున్న యం
గనయురకాలిధూళి నధికంబగు పావనపుణ్యసంపదల్. ౪౧

సీ. చిరభక్తిఁ దీర్థముల్ సేవించు పుణ్యముల్
సత్యవాక్యమునకు సవతు రావు
ఘనతులాపురుషంబు గావించుపుణ్యంబు
సత్యవాక్యమునకు సవతు రాదు
కలకాలమును దపంబులు సేయుపుణ్యంబు
సత్యవాక్యమునకు సవతు రాదు
ధృతిశతక్రతువు లర్థి నొనర్చు పుణ్యముల్
సత్యవాక్యమునకు సవతు రావు
గీ. దేవతాపూజలును భూమిదేవపాద
పూజలును సేయునతిశయపుణ్యఫలము
సత్యవాక్యమునకు నెన్న సవతు రాదు
మనుజుఁడనువాఁడు సత్యము మఱువరాదు. ౫౭ ఆ

ఈమల్లనకవి విషమాక్షరప్రయోగముచే బ్రిహ్మదండిచెట్టున ముండు రాలునట్లు చెప్పినపద్య మని అప్పకవీయమునం దీక్రిందిపద్య ముదాహృతమైనది.

క. గుడియన్ననృపతిఁబాడఁగన
నడునంగాఁ గొండపల్లినగరి బడమటఁ
గుడియెడమ నుడమ గాడిన
చెడుముండులు బ్రిహ్మదండిచెట్టున దుల్లున్.

కొండపల్లిని బాలించిన యీగుడియన్ననృపతి యెవ్వరో తెలిసినచో నీకవికాలము నిశ్చయింపనగును. కాని యీరాజెవ్వరో తెలిసినదికాదు.

భాగవతములోనిపద్యములఁ బోలినపద్యము లీగ్రంథమునఁ బెక్కులున్నవి. ఎవరి నెవ రనుకరించిరో నిర్ణయింపఁజాలము.

గురువును పర్ణించినపద్యములో నుదాహృతుఁ డైనశివదేవ యోగికాకతీయగణపతి దేవునొద్దమంత్రిగా నుండినశివదేవయ్యకాఁడు. కాలవ్యత్యాస మున్నది.

# 112 సారంగు తమ్మయ్య

ఇతఁడు వైజయంతీ విలాసమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమునురచించి శ్రీరామచంద్రమూర్తి కంకితముచేసెను.

ఇఁతడాపస్తంబసూత్రుఁడు; భరద్వాజ గోత్రుఁడు; నృసింహామంత్రికి నక్కమాంబకుఁ దనయుఁడు; తమ్మమంత్రికిని దిమ్మాయికిని పౌత్రుఁడు; అనంతన, వెంకటాద్రియను వారలీతని సహోదరులు. ఇతఁడు తనతల్లిదండ్రులను సహోదరులను మూఁడుపద్యములలో వేఱువేఱుగా వర్ణించియున్నాఁడు. తనవంశమునకు మూలపురుషుఁడైన సారంగధరునిబట్టి "సారంగువారను" గృహనామమేర్పడినట్లు కవియీ క్రింది రెండుపద్యములలో వర్ణించియున్నాఁడు.

క. శ్రీరంగ హిమవదంతర
భూరంగత్కీర్తి యగుచుఁ బొగడతకెక్కెన్
సారంగధరుఁడు నిర్జిత
సారంగధరుండు కీర్తిసర్వజ్ఞుఁడిలన్.

క. సారంగధరుఁడు వెలయఁగ
సారంగునివారటంచు సచివాగ్రణులై
పేరుం బెంపును గాంచి రు
దారత నయ్యాభవులనఁగఁ దద్వంశభవుల్.

ఈసారంగునకు మనకవి మనుమని మనుమఁడు తమ్మయ సోదరుఁడైన వెంకటాద్రిని "గణకప్రభు సన్నుతుఁ"డనియు నీతని తాతతండ్రిని "భూసమార్జిత కానతంసనిరతాభ్యుద్గీత నానాకళాధీ సంధానసురేంద్రమంత్రి" యనియు నుతించియుండుటచే నీవంశమువారు గణితవిద్యావిశారదులని తెలియుచున్నది. కవితమ్మయ, గోలకొండకు గరణికము చేయుచున్నట్లీ క్రిందిపద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

చ. ఇనసమతేజులౌ నృపులనెల్ల మహమ్మదుశాహి యేలునీ
యెనుబదినాల్గు దుర్గముల నేలినయేలిక గోలకొండఁ ద
ద్ఘననగరీస్థలిన్ గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్మ పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థులౌనన్.

ఈకవి తనకు గండాళప్ప యాచార్యులు గురువని యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. వందారు దాసజనతా
మందారు స్వేదశాస్త్రమహిత ప్రజ్ఞా
బృందారకగురు మద్గురుఁ
గండాళప్పల గురు స్జగద్ధితుఁ గొల్తున్.

శ్రీవీరేశలింగము పంతులుగారు పైపద్యములోని మహమ్మదుశాహియు నఁగా మహమ్మదుకులీకుతుబ్షాగా భావించి, యాతఁడు క్రీ.శ. ౧౫౮౫-౧౬౧౨ నడుమ రాజ్యముచేసిన వాఁడు కావున గవియు నాకాలము వాఁడే యని నిర్ణయించియుండిరి. కాని యానిర్ణయమునఁ గొంతపొర పాటుకలదని తోఁచుచున్నది. కావున విమర్శించిచూతము.

చిత్రభారతకృతిపతియగు యెనుములపల్లి పెద్దయామాత్యుని తండ్రియుఁ బెదతండ్రియునగు మాదయనారయులకుఁ గండాళఅప్పలా చార్యులు గురువైయుండినట్లా గ్రంథకృత్యాదియందుఁ గలదు. (చరి గొండధర్మనకవి చరిత్రమును జూడుఁడు) ధర్మనకవి చిత్రభారతమును క్రీ. శ. ౧౫౧౦ ప్రాంతమున రచియించియుండెనని సహేతుకముగ నాతనిచరిత్రమున వ్రాసియుంటిని. అప్పలాచార్యులు క్రీ. శ. ౧౪౮౦-౧౫౧౦ ప్రాంతమువాఁడని యందుఁ దెలిపితిని. సారంగు తమ్మయ్య యతనికడ శిష్యుఁడుగా నుండినచో మహమ్మదుశాహి కాలమునాఁ టికి తొంబదేండ్లు వయసుగలవాఁడగును. ఆకాలమున నీకావ్యమును రచించినాఁడనుటకంటె నామహమ్మదుశాహి శ్రీపంతులుగారూహిం చిన మహమ్మదు కులీకుతుబ్షాకాఁడనియు బహుమనీమహమ్మదుషాహ

అను మరియొకప్రభువని తలంపవలయుననియు నా యభిప్రాయము. ఈమహమ్మదుషాహాను రెండవ మహమ్మదుషాహాయందురు. ఇతఁడు క్రీ. శ. ౧౪౮౧ లో సింహాసనమెక్కి ౧౫౧౮ లోఁ జనిపోయెను. ఇతనినే కృష్ణరాయలు ౧౫౧౭ లో జెఱనుండి విడిపించెను. ఈతని కాలముననే, ఇతనియొద్ద సేవకుఁడుగానున్న కులీకుతుబ్షాయను నతఁడు తనప్రభువును ధిక్కరించి స్వతంత్రుఁడయ్యెను. ఇతఁడు స్వతంత్రుఁడు కాకపూర్వమో స్వతంత్రుఁడైనను నీబహుమనీ మహమ్మదుషాహా యధికారము పూర్తిగానశింపకపూర్వమో తిమ్మయకవి గోలకొండకు కరణముగా నుండి యీగ్రంథమును రచియించియుండును. పైపద్యములోఁజెప్పిన యెనుబదినాలుగుదుర్గముల పరిపాలనాధికారము బహుమనీ మహమ్మదుషాహాకన్వయించునుగాని కులీకుతుబ్షామనుమఁడైన మహమ్మదు కులీకుతుబ్షాకన్వయింపదు. బహుమనీమహమ్మదుషాహా బహుమనీరాజులలోఁ గడపటివాఁడు బహుమనీరాజుల పరిపాలనము క్రింద విశేషదేశముండెడిది అందులోఁ గడపటివాఁడైన యీరెండవ మహమ్మదుషాహా కాలములో నారాజ్య మైదుభాగములుగాఁ జీలిపోయినది. అందొకభాగమునకు మాత్రమే కులీకుతుబ్షా స్వతంత్రుఁడయ్యెను అందుచే నాపద్యమందలి వర్ణనము కులీకుతుబ్షామనుమఁడైన మహమ్మదు కులీకుతుబ్షా కన్వయింపదు

పైనిఁజెప్పినకందాళయప్పలాచార్యునకుఁ బౌత్రుఁడైనయప్ప పండితుఁడు మఱియొకఁడున్నాఁడు. అతఁడు విరూరి వేదాద్రికిగురువు. మనతిమ్మయకవి యాతనిశిష్యుఁడనుట కవకాశమున్నది. ఇంచుమించుగ మహమ్మదు కులీకుతుబ్షా కాలముకూడ నందులకుసరిపోవును. అందుచే శ్రీ వీరేశలింగముపంతులు గారూహించినకాలమేల సత్యము కాకూడదని యెవరైనఁ బ్రశ్నింపవచ్చును మహమ్మదు కులీకుతుబ్షాహా కెనుబదినాలుగు దుర్గములపైఁ బరిపాలనము లేదని పైనివ్రాసి

యున్నాఁడను. "మహమ్మదుశాహి" యనఁగా బహుమనీ మహమ్మదుషాహా యనియే నాయుద్దేశము.

అప్పలాచార్యుని వర్ణించినపద్యమును పైని వ్రాసియుంటిని. చరిగొండ ధర్మనామాత్యుఁడు చిత్రభారతమున నప్పండితుని వర్ణించిన పద్యము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

శా. వందారు ద్విజదోషమేఘపవనున్ వారాశిగంభీరు నా
నందాత్మున్ హరిపాదభక్తు నిఖిలామ్నాయజ్ఞు విశ్వంభరా
మందారక్షితిజాతమున్ నిగమసన్మార్గ ప్రతిష్ఠాపరున్
గందాళప్పగురున్ వివేకనిధి లోకఖ్యాతు వర్ణించుచున్

ఈపద్యములు రెండు నొక్క పోలికగా నున్నవి. 'వందారు' శబ్దఘటితనికి బిరుదమువలెఁ గాన్పించుచున్నది ఈ రెండు కారణములను బట్టి తమ్మయకవి మొదటి యప్పపండితుని శిష్యుఁడై క్రీ శ. ౧౫౦౦ ప్రాంతమున నున్న వాఁడనియే నాయభిప్రాయము.

షాహా యనఁగా కృష్ణరాయలకాలములోని బహుమనీ రెండవ మహమ్మదుషాహాయని నిర్ణయించుటయే సమంజసము. దీనినిబట్టి వైజయంతీ విలాసజననము క్రీ శ. ౧౫౧౦ ప్రాంతమని స్పష్టమగుచున్నది. అట్లుకాదనుటకు బలవత్తరములైన యుపపత్తులు లేవు.

ఈకవి సన్నిద్దరాళ్వారులని ప్రసిద్ధిగాంచిన వైష్ణవభక్తులలో నొకఁడగు తొండరడిప్పడియాళ్వారు చారిత్రమును వైజయంతీవిలాసమనుపేర (విప్రనారాయణచరిత్రమని నామాంతరము) మూఁడాశ్వాసముల గ్రంథముగా రచియించియున్నాఁడు. తొండరడిప్పొడి యనభక్తపాదరేణువనియర్థము. ఇతఁడు సర్వదా శ్రీరంగేశ్వరుని సేవించుచుఁ బుష్పోద్యానమునుండి పువ్వులను దెచ్చి మాలలుగా గూర్చి స్వామికర్పించుచుఁ దన్మయుఁడై దేవునిఁ గొల్చుచుండెను.

ఒకనాఁ డాయుద్యానమునకు మధురవాణి దేవదేవి యనునిరువురు వేశ్య లప్పచెల్లెండ్రరుదెంచి యాతనికి నమస్కరింప నా బ్రహ్మచారి వారివందనముల నందుకొనక మూఱు మొగము వెట్టుకొని వెడలి పోయెను. అందుపైఁ గోపమువచ్చి దేవదేవి యప్పతో

ఉ. "మ్రొక్కిన నవ్వ రేమనఁడు మోమటు వెట్టుక చక్కఁబోయెనే
దిక్కును జూడఁ డాయె నొకదీవనమాటయు నాడఁ డాయె వీఁ
డెక్కడి వైష్ణవుండు మన మేటికి మ్రొక్కితిమమ్మ యక్కరో
నెక్కొని వెఱ్ఱిబుద్ధిమయి నిద్దురవోయిన వానికాళ్ళకున్."

అని యనఁగా సాధుశీల యగు నామధురవాణి ——

ఉ. చూచిన నేమి నీవలను చూడక యుండిన నేమి పూజ్యులన్
జూచిన భక్తి మ్రొక్కుటయె శోభన మీతఁడు బ్రాహ్మణుండు ధా
త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు దేవుఁడు నీవు మ్రొక్కినన్
జూచునొ పల్కునో యటుల సుమ్మితఁడున్ సరసీరుహాననా!"

యని ప్రత్యుత్తరమిచ్చెను. అందుపై దేవదేవి

చ. ప్రకటజితేంద్రియుల్ ధరఁ బరాశరకౌశికులంతవారు స్త్రీ
లకు వశులంతకంటె మిగులం దృఢమై మగకచ్చ బిగ్గఁ గ
ట్టుకొనఁగనీతఁ డెంత శుకుఁడో హనుమంతుఁడొ భీష్ముఁడో వినా
యకుఁడో తలంచుకో సరసిజాయతలోచన! నెమ్మనమ్మునన్.

క. ఈనిష్ఠ లింతి తారస
మైనం దాఁకాన సూ సదాచారి యటం
టే నచ్చినదాఁకా నను
మానిజనవిడంబనములు మన మెఱుఁగనివే.

క. ఇటువంటయ్యలు కారా
చిటుకుమనక యుండ సంజచీఁకటివేళన్

ఘుటచేటీవిటులై
కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ !

యనిపల్కుచు నాతనిని బరిహాసించెను. దానిపై నాయప్పచెల్లెండ్రకు వాగ్వాదము పెరిగి తుద శ్రీబ్రహ్మచారిని దేవదేవి విటునిగాఁజేసి తెచ్చినచో మధురవాణి వేశ్యావృత్తిని వదలివేయునట్లును నటులఁజేయ లేకున్నచో దేవదేవి యావృత్తిని మానుకొనునట్లును వారిరువురును బన్నిదము వైచికొనిరి. దేవదేవి యోగినీవేషముం దాల్చి యా వైష్ణవ బ్రహ్మచారింజేరి తాను వేశ్యనని చెప్పి,

ఉ. ఒక్కనిఁ బిల్వనంపి మఱియొక్కనిచేతఁ బసిండిపట్టి వే
ఱొక్కనియింటి కేగుచు మఱొక్కని నానడుచక్కినొక్కచోఁ
బొక్కిలి దాల్చికూడ భ్రమఁ బొందివిటుల్ దెలియంగ లేరుగా
కెక్కడిసత్య మేడ వల పెక్కడి నేమము వారకాంతకున్."

అని వేశ్యావృత్తినిగర్హించి,

గీ. అనఘ! వేశ్యావిడంబవర్తనము లెన్న
నిసుకపాతఱ యాజోలియేలత్రవ్వ
నప్పడుపుఁగూటిపై నసహ్యతజనించె నని తెలిసి,

గీ వారసతులైనయాసీమ వారివలెనె
మోడిమానిసినైన నేగోడు లేదు
జిహ్వ నాల్గచ్చరాలు నేర్చినకతాన
పడుపుగూటికి మనసు గొల్పక యుంటిని.

అనియాతనికి నచ్చచెప్పి యాతనిదాస్యము నర్థించెను.

పాప మా బ్రహ్మచారి:—

ఉ. కాకులు రాని పండ్లుదినఁ జేర శిలామయ దేవమందిరా
నీకములందు రావులు జనించును; సజ్జనచిత్తవృత్తియ

వ్యాకులలీల జాతిగుడివంటిది లోకములోన వేశ్యలుం
గాకులవంటివార లటుగాన ప్రమాదము చేరనిచ్చినన్.

అని మొదట నామెను నిరాకరించెను. కాని యామె యనేకవిధముల ప్రత్యుత్తరములిచ్చి నమ్మింపఁ దుదకుఁ గాదనలేక యామె దాస్యము నంగీకరించెను.

దేవదేవీ సహవాసమున నాబ్రహ్మచారిహృదయ మెట్లు మార్పుచెందినదియుఁ గవి యీక్రిందిపద్యమున మనోహరముగా వర్ణించి యున్నాఁడు.

శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబై వన
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగె బో నీళ్ళకుం బల్చనై.

దేవదేవిపంతము నెగ్గినది. నైష్ఠికబ్రహ్మచారి విటాగ్రేసరియై వేశ్యయింటిదాసుఁడైనాఁడు. మధురవాణి వేశ్యావృత్తిని విసర్జించినది. కొన్నిదినములు గడచినపిదప వేశ్యమాత దేవదేవి యంగీకారముతో ద్రవ్యవిహీనుఁడగుబ్రహ్మచారిని:—

సీ. నీపట్టితిరుమణి నీతిరుచూర్ణంబు
గణికకు వెండిబంగారు లౌన
నీపుట్టగోచియు నీశాటివేష్టము ల్వార
కాంతకుఁ బట్టుచీర లౌనె
నీముష్టిగూడయు నీతులసిసరులు
వేశ్యకుఁ బండుగు వేఁట లౌన
నీవేదశాస్త్రము ల్నీసంధ్యజపములు
లంజెసానికి బంజులగము లౌన

పెట్టనోపితివా యెప్ప టట్లెయుండు
పెట్ట లేకున్న విచ్చేయు మిందలకడ
మొదల రోయింతులకు నొక్కమదుపె గాక
నీసదాచారమేలయ్య దాసరయ్య!

అని నిందించి యాతని నిలువెళల నడచినది. బ్రహ్మచారి చేయునది లేక దేవదేవిని సదాస్మరించుచు దేవాలయమున కేఁగి శ్రీరంగేశ్వరుని సేవించుచుండెను. శ్రీరంగేశ్వరుఁడు భక్తునిపైఁ గనికరమూని తనయాలయమునందలి బంగారుగిన్నెను దీసికొని వైష్ణవబాలకునిరూపమున నేఁగి దేవదేవికిచ్చి తొండరడిప్పొడి పంపెనని చెప్పెను. దేవదేవియు వేశ్యమాతయు నాతొండరడిప్పొడిని బుజ్జగించి మరల దమయింటికిఁదోడి తెచ్చిరి. దేవాలయాధికారి బంగారుపాత్రముపోయినదని తలారుల కెఱింగింప వారలు వేశ్యాగృహములను బరీక్షించిరి. దేవదేవియింట నాపాత్రి మగుపడ వారామెను న్యాయస్థానమునకుఁ దోడిదెచ్చినంత నామె తనకాపాత్ర తొండరడిప్పొడి యిచ్చెనని చెప్పెను. న్యాయాధికారి యాతనిని శిక్షింపనున్నంతలో శ్రీరంగేశుఁడు ప్రత్యక్షమై వైష్ణవబాలకరూపమునఁ దానే యాగిన్నెను దొంగిలించి దేవదేవి కిచ్చితినని చెప్పి వారల కందఱకును మోక్ష మొసంగెను.

ఈకవి కవిత్వము మృదువై నిరర్గళమైన ధారకలిగి ద్రాక్షాపాకమున నతిమనోహరముగానున్నది. ఈకావ్యమున ముఖ్యములైన పాత్రలు రెండు. తొండరడిప్పొడి నాయకుఁడు. దేవదేవి నాయిక, నాయకుఁడు ఋష్యశృంగుని వంటివాఁడు. కామినీపరాఙ్ముఖుఁడు. వేశ్యాసంపర్కమునఁ గ్రమముగా నాతనిహృదయమెట్లు చంచలమై యింద్రియములవెంటఁ బరువెత్తెనోఁ దెలిపి కవి యీతనిపాత్రను జక్కఁగాఁ బోషించినాఁడు. ఆత్మహత్య చేసికొనఁ బ్రయత్నించుటకు ముందు తొండరడిప్పొడి పశ్చాత్తప్త హృదయమును మరికొన్ని పద్యములలోఁ జెప్పిన నెంతయో బాగుగ నుండెడిది. దేవదేవి అరితేరిన ప్రౌఢవేశ్య

కపటాభినయము వెన్నతోఁబెట్టినది. పైగా పన్నిదమువైచినది. ఈ పాత్రను స్వభావోచితముగఁబోషించి కవి కావ్యమునకువన్నె తెచ్చెను.

గ్రంథమువలనఁ కలిగెడి ప్రయోజనముమాట నటుండనిండు. తొందరపడిప్పాడికథను గవి కల్పింపలేదు. అదివరకున్న కథను రసవత్తరములగు మాటలతోఁ బాఠకులహృదయాకర్షణమ్మొనర్చునట్లు ప్రదర్శించుటయే కవికార్యము. ఆవిధినాతడు నేర్పుతో నిర్వర్తించినాఁడు. అది కొనియాడఁదగినది.

బ్రి. శ్రీ. వీరేశలింగముపంతులు గారికవిచారిత్రమున దేవుని బంగారుగిన్నెను మరల వేశ్యకిప్పించుటయు విప్రనారాయణుని బ్రహ్మరథముఁబట్టించుటయుఁజెప్పి యీక్రింది రెండుపద్యముల నుదాహరించి యాపైని నీగ్రంథమందలి నీతినిగూర్చి తమయభిప్రాయమును దెలిపియున్నారు.

గీ. బ్రహ్మసభ యెల్లభక్తినప్పరమవైష్ణ
వోత్తముని బ్రహ్మరథమున నునిచి పట్ట
ణమున నేగించి రధికసంభ్రమము మీఱ
జియ్య ముందరికొమ్మనఁ జేరి మోవ.

ఉ. చోరుఁడనంగ రాదొరులసొమ్ములు ప్రముచ్చిలినం బ్రపన్నునిన్
జారుఁడనంగరాదు పెలుచం బరకాంతలఁగూడినన్ దురా
చారుఁడనంగరాద యనిశంబును వేశ్యలతో రమించినన్
బోరున మీఱ లాతనికిఁ బూనుఁడు బ్రహ్మరథంబు వైష్ణవుల్

ఇటువంటి సిద్ధాంతములే మనదేశములో నీతికిని మతమునకును గూఢనమిత్తమైన చెఱుపును గలుగఁజేయుచున్నవి. నీతిని విడిచిన మతమెప్పుడును దేవునికి ప్రీతికరము కానేరదు"

పంతులుగారిసూక్తులు న్యాయసమ్మతములుకావని యనఁజాలము. కాని యవి యీసందర్భమున నప్రస్తుతములనియుఁ బ్రమాద

జనితములనియు ననుపయోగములనియు ననక తప్పదు. పంతులుగా రుద్ధాహరించినపద్యము నీతిబోధ కుద్దిష్టముకాలేదు. అందొకసిద్ధాంత ము ప్రతిపాదితము కాలేదు. వైష్ణవబ్రహ్మచారి నిజముగాఁ జోరుఁ డనిసమ్మి వైష్ణవులను హేళనచేయుటకై యితరమతములవారు పలికిన పరిహాసవాక్యములు కవి యీవిషయమును "శ్రీ వైష్ణవజనంబులు మనంబుల ఘనం బగుఖేదంబు లొందుచుండ నవ్వల నితరమతంబుల వారతని నుద్దేశించి......సోల్లుంఠనము లాడుచుండిరి" అనువాక్యము లలో స్పష్టముగా వెల్లడించియున్నాఁడు.

తొండరడిప్పొడిని వైష్ణవులు శిక్షించిరని కవి వ్రాసియున్నాఁడు. కాని తమంతదాము బ్రహ్మరథముపట్టిరని వ్రాయలేదు శ్రీరంగే శుఁడు ప్రత్యక్షమై తన భక్తాగ్రేసరుని చింతఁబాపుటకు తానే దొంగ యై తనసొమ్మును దానే యపహరించి దేవదేవికిచ్చితినని చెప్పిన పిమ్మట నా శ్రీవైష్ణవులు దేవదేవి కాగిన్నెను మరల నిచ్చి తొండరడి ప్పొడిని బ్రహ్మరథము పట్టిరని కవి రచించినాఁడు. శ్రీరంగేశుఁడు ప్ర త్యక్షమయ్యెనని నమ్మితిమేని, విప్రనారాయణుని బ్రహ్మరథము పట్టుట అనుచితమని యనువా రెవ్వరు? ఆమాటలను నమ్మనివారికి యీగ్రం థముతోడను నావిమర్శనముతోడనుగూడఁ బనిలేదు. మూలచ్ఛేద ముచేయు వ్యాఖ్యానమెందులకు? హేతువాదమునకందని నన్నియు నసత్యములందుమేని, మనపురాణేతిహాసాదివాఙ్మయప్రపంచమంతయు నిరర్థకమే యగును. కవి రసోత్పాదనమునకును, పాత్రౌచిత్యమునకును గావలసిన భావములను భావనయుక్తియుక్తముగా నుపయోగించెనని యు దుర్నీతిని బోధించునట్టివిషయము లిందు లేవనియు నీగ్రంథముపై శ్రీపంతులుగా రొసంగినయభిప్రాయ మసమంజసమనియు నాయభిప్రా యము. భక్తుఁడేదికోరిన నది లభింపఁజేసి యాతనిని కాపాడి తరింపఁ జేయుటకుఁ బరమేశ్వరుఁ డెల్లప్పుడు సిద్ధముగానుండునని గీతావాక్య ము. అదిసత్యమని రుజువుచేయుటకే యిట్టికథలు కల్పితములు. ఇవి

యన్ని మతములయందు నుండును. ఈగ్రంథమున నీతి లేకపోలేదు. విశేషచర్చతో నిటఁబనిలేదు. మనబుద్ధికందనివన్నియు నసత్యములని వాదించువారికి భగవంతునిమహిమ యపారమని నది సామాన్యబుద్ధి కందదనియుఁ బరమహంసరామకృష్ణుఁడు బాలయోగి మొదలగు వారప్పుడప్పుడు మనకు నిదర్శనములను జూపుచునేయున్నారు.

ఈతమ్మయకవి యేశాఖా బ్రాహ్మణుఁడను విషయమున శ్రీవీరేశలింగముపంతులు గారాంధ్రకవుల చారిత్రమున నిట్లు వ్రాసియున్నారు.

“ఈప్రాంతములయందు సారంగువారు సాధారణముగా మాధ్వులుగా నున్నారు. ఈకవి తనవంశమును వర్ణించుచు—

ఉ. తమ్మనయుంబుఁ బ్రోచుటకు ధారుణిబంధులు బంధుపారిజా
తమ్మన రామభక్తిఁగల తార్కికులెల్లను వీనిదార చి
త్తమ్మనఁ జూపులందనిసి ధార్మికులీతని దెంతమంచివృ
త్తమ్మనఁ నాగిరిప్రభుని తమ్మనమించె నుదంచితస్థితిన్

గీ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయియందు నం
దనుల శౌర్యసింహు నారసింహుఁ
జతురబుద్ధిచంద్రు సత్కళాగుణచంద్రు
గిరిచమూనరేంద్రుఁ గీర్తిసాంద్రు

తనతాతను రామభక్తునిగాఁ జెప్పుటచేతను, అతనిభార్యను తిమ్మాయి యని చెప్పుటచేతనుగూడ నితఁడు మాధ్వశాఖీయుఁ డేమోయని యూహింపఁ దగియున్నను,

క. సారమతి యానృసింహుఁడు
వారాశిగభీరుఁడతుల వైభవమున గౌ
రీరమణి నీశుడుం బలె
నారూఢాన్వయుఁ వరించె నక్కమసాధ్విన్

అని తనతల్లిదండ్రులను పార్వతీపరమేశ్వరులతోఁ బోల్చుటచేతను దన పూర్వుల కమాత్యాదిపదములను జేర్చుచు వచ్చుటచేతను దానుగోల కొండకు కరణమునని చెప్పుకొనియుండుటచేతను గవి నియోగిబ్రాహ్మణుఁడని తోఁచుచున్నది.''

మాధ్వులు కరణికము చేయుటయు నమాత్యమంత్రి శబ్దములను దమనామములకుఁ జేర్చుకొనుటయు, శివపరములగు నామములను ధరించుటయు మాధ్వులలోఁగూడ నచ్చటచ్చటకలదు. ఈప్రాంతము లయందలి సారంగువారు భారద్వాజగోత్రజులు కవియు నాగోత్రజుఁడే భారద్వాజగోత్రజులలో సారంగువారను నింటిపేరుగల నియోగిబ్రాహ్మణులున్నట్లు రుజువయిననేతప్ప తమ్మయకవి మాధ్వశాఖాబ్రాహ్మణు డనియే నిశ్చయింపవలసి యున్నది.

## 113 చరిగొండ ధర్మనామాత్యుఁడు

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్య గోత్రుఁడు; తిమ్మనామాత్యునకును మాదమకును దనయుఁడు. భట్టపరాశర రంగగురు శిష్యుఁడు. శతలేఖినీ సురత్రాణ బిరుదాంచితుఁడు;

ఈతఁడు చిత్రభారతమను నెనిమిదాశ్వాసముల ప్రబంధమును రచియించి యెనుములపల్లి పెద్దయామాత్యున కంకితముచేసి యుండెను. అందుఁగవి తననుగూర్చి యిట్లుచెప్పుకొనియున్నాఁడు.

సీ. కౌండిన్యగోత్రదుగ్ధసముద్రచంద్రు నా
పస్తంబ సూత్రశోభనగరిష్ఠు
సర్వవిద్యాభిజ్ఞుఁ జరికొండ తిమ్మనా
మాత్యాగ్రణికి మాదమకును గూర్మి
నందను నతిశాంతు నారాయణధ్యాన
తత్పరు శ్రీరంగధామసదృశ

భట్టపరాశర ప్రభురంగ గురుపాద
నీరేజబంభరు నిర్మలాత్ము.

తే. ధర్మనామ్నాయు సత్కవితాధురీణు
దాంతు శతలేఖినీసురత్రాణ బిరుద
కలితు నన్నువేడ్కఁబిలిపించి గారవించి
తేనియలు చిల్కనిట్లని యానతిచ్చె

మ. శతలేఖన్యవధాన పద్యరచనా సంధానసురత్రాణ చి
హ్నితనామా! చరికొండధర్మసుకవీ! నీవాగ్విలాసంబు లా
శితికంఠోజ్జ్వల జూటకోటర కుటీశీతాంశురేఖాసుధా
న్వితగంగాకనకాబ్జ నిర్భరరసావిర్భూతమాధుర్యముల్.

తే. కావున విచిత్రగతి నలంకారసరణి
మీఱ రసములు సిప్పిలమెచ్చు లొలుక
దెనుఁగు గావింపు నాపేర ననఘ! సుకవి
ధీరులరుదందఁగాఁ జిత్రభారతంబు.

ఈ చిత్రభారత మందలికథ గయోపాఖ్యాన కథ వంటిది. పూర్వమొకప్పుడు తుల్యుఁడను మహర్షి విష్ణునింగూర్చి తప మొనర్చుచుండ నాతనితపోభంగమును జేయుమని దేవేంద్రుఁడు రంభ నాతనికడ కంపెను. ఆయప్సరస తలంపెరింగి కోపించి యామునిని గుఱ్ఱంబవుగమ్మని యామెను శపించెను. ఆమె భయాక్రాంతయై శాపాంతమును వేఁడఁ గుండిన నగరాధిపతి యగు చతుర్దన మహారాజునకు వాహనంబవై యాతనికి మూఁడులోకంబులుఁ ద్రిప్పి చూపించిన మరుక్షణంబున నెప్పటిరూపంబును దాల్తువని శాపాంతమును బ్రసాదింప నామె యట్లేచేసి పిదప నిజరూపముం బడసి స్వర్గధామముఁ జేరెను. ఆమె తురగాకృతిలో నున్నపుడాకాశమార్గమున సంచరించుచుండ దానినోటినుండి వచ్చిన ఫేనము కాళిందీనదీపులిన తలంబున సూర్యున కర్ఘ్యప్రదాన మాచరించు శ్రీకృష్ణుని దోసిలిలో పడియెను.

శ్రీకృష్ణుఁ డది చూచి కోపించి, యాయశ్వాగ్రోహాకుని నెలదినములలో వధింతు నని ప్రతిన పట్టెను. ఆవృత్తాంతమును, జతుర్ధనుండు విని మూఁడు లోకములు దిరిగినను దనను రక్షించువారు లేకపోఁగాఁ దుదకర్జునుని శరణుజొచ్చెను. దీనఁ డనునాచతుర్దనుని రక్షింతు నని యర్జునుఁడు శపథము చేసెను. అందుకొఱకై శ్రీకృష్ణుఁడాదిగా యాదవ బలములకును భీష్మద్రోణార్జును లాదిగాఁ బాండవ కౌరవబలములకును ఘోరయుద్ధము జరిగెను. ధర్మజుఁ డొక్కరుఁడు దక్కపాండవకౌరవ బలము లన్నియు సమసిపోయినవి. ఆగతిఁ జూచి విచారించు ధర్మజుని కడకు శ్రీకృష్ణుఁడు వచ్చి చనిపోయినయోధులలో నొక్కని ప్రాణంబు నిచ్చెదఁ గోరుకొమ్మని యడుగ నాతఁడు చతుర్దనుని బ్రదికింపుమని కోరెను. అతనిసత్యవ్రతమునకు మెచ్చి, వీర మరణము నొందినవారి నందఱిని శ్రీకృష్ణుఁడు బ్రదికించెను. ఇదియే చిత్రభారతము నందలి కథ. చతుర్ధనుఁడు తనను రక్షింపుమనిశంకరుని కడకేఁగ బాణాసురుని దానురక్షింపలేకపోయితిననియు శ్రీకృష్ణున కెదురుగాఁ దాను నిలువ లేననియుఁ జెప్పుటలో నీశ్వరునిముఖమునఁ బ్రసక్తానుప్రసక్తముగా నుషాపరిణయకథను జెప్పించి కవి ప్రబంధవర్ణనా నియమముకొఱకు శృంగారరసమును వర్ణించియున్నాఁడు. ఈ చిత్రభారతముత్తమప్ర బంధములలో నొక్కటి. ఈతనికవిత్వము ప్రౌఢమై మృదుపదసంయు తమై మనోహరముగా నున్నది.

ఈకావ్యము ఎనుములపల్లి పెద్దయామాత్యున కంకిత మీయఁ బడినది. ఈతనిగృహనామము ఇనుమలపల్లి వారని కొన్నిప్రతులయం దున్నది. చాలప్రతులలో 'ఎనుములపల్లి' వారనియే యుండుటచే నదియే గ్రహింపఁదగినది. ఈపెద్దయామాత్యుఁడు నియోగిబ్రా హ్మణుఁడు. కాశ్యపగోత్రుఁడు. మాదయమంత్రికిని గృష్ణాంబకును కుమారుఁడు సింగరాజుమంత్రికిని సింగమాంబికకును బౌత్త్రుఁడు. ఈ పెద్దయామాత్యుని గీర్తించిన మూఁడుపద్యముల నీక్రింద నుదాహరిం చుచున్నాఁడను.

క. బాహుబలభీముఁడశ్వా
రోహణ రేవంతుఁ డఖిలరూఢయశస్కుం
డాహవనిర్జితరిపు వీ
రాహంకారుఁడు పెద్దనార్యుఁడు వెలయున్.

ఉ. నిద్దపుఁగీర్తి సంపదల నీరజబాంధవసూతికం బెనుం
బెద్దన సత్కళామహిమ మీనపతాకుని మామకం బెనుం
బెద్దన రూపురేఖలు నుపేంద్రునిముద్దులపట్టికం బెనుం
బెద్దన మాదయప్రభుని పెద్దన మించు ధరాతలంబునన్.

సీ. ఏలించెఁ బటిచేత హిమధరాధరసేతు
పర్యంతమేదినీపతుల నెల్లఁ
బాలించె నిజబుద్ధిబలముచే నాజ్ఞాన
శంబులై చెలఁగ దేశంబు లెల్లఁ
గూలించె సంగరక్షోణి బాహాసిచే
దర్పితారాతిజాతంబు నెల్లఁ
దూలించె నీగిచే దుర్వారబుధబంధు
యాచకవ్రాతదైన్యంబు నెల్ల

గీ. మించి చిత్తాంబుఖానభూమీమహేంద్ర
సకలసామ్రాజ్యలక్ష్మీవిశారదుండు
భాగ్యసంపన్నుఁ జెన్మలపల్లి మాద
మంత్రిశేఖరు పెద్దనామాత్యవరుఁడు.

ఈపద్యమునుబట్టి యీపెద్దయామాత్యుఁడు, చిత్తాంబుఖాను నొద్ద మంత్రిగా నున్నట్లు తెలియుచున్నది. ఇతఁడే కాకుండ నీతనితమ్ముఁడై నసింగరాజుకూడ నీచిత్తాంబుఖానుదయకుఁ బాత్రుఁడై యాతనిచేత బహుమతులను గైకొనినట్లీపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. తనప్రతాపాగ్ని శాత్రవసమిత్తతి నేర్చి
భూరిభూమిర్థంబుఁ బుటము వెట్టి

దనకాంతిచంద్రిక జననేత్రకువలయం
బులనేలి మరుముఖాంబుజము మోడుచేఁ
దనదానమేఘ మర్థినికాయచాతకా
వళిఁ బ్రోచి చంద్రమండలముఁ బొదువఁ
దనకీర్తిలత దశాదంతిదంతంబుల
కడఁ బ్రాఁకి కల్పవృక్షంబుఁ బొదువ

తే. నలరుఁ జిత్తాంబుఖానదయూత్త హేమ
చామరాందోళికార్జునచ్ఛత్రవీటి
కాకరండకలాదిభృంగారకాది
రాజచిహ్నాంచితుఁడు సింగరాజుభువిని.



కృతిపతికిఁ బ్రభు వైనయీచిత్తాంబుఖానుఁ డెవ్వరో తెలిసికొనవలసియున్నది. ఈతనిపేరును గాంచినతోడనే యితఁడొకమహమ్మదీయుఁ డని స్ఫురించును. కాని యితఁడు మహమ్మదీయుఁడు కాఁడు. భారతీయుఁడు. గోదావరీమండలవాసుఁడు, ఈతని చారిత్ర మద్భుత సంఘటనలతోఁ గూడినది. ఈతనిది బోయకుల మనిచెప్పుదురు. కుల వివరములు సరిగాఁ దెలియవు కాని మొత్తముమీఁద హీనకులుఁడనుట నిశ్చయము. ఈతఁడు చిన్నతనమునందు "అవసరాలపెద్దిరాజు" అను నియోగిబ్రాహ్మణునియొద్దఁ బశువులగాపరిగా నుండెడివాఁడఁట ప్రతి దినమునను ఆబ్రాహ్మణుఁ డీపిల్లవానికి అన్నము పెట్టుచుండువాఁడఁట. ఒకనాఁడాతఁ డన్నముమూటతీసికొని పొలములోనికి, వెళ్ళునప్పటి కాబాలుఁడు తాటిచెట్టు నీడను బరుండియుండఁగా నాచెట్టునీడ తొలఁగిపోయినందున ఒకసర్పము పడగవిప్పి, గొడుగుగాఁ బట్టి యాతని ముఖమునకు సూర్యరశ్మి తగులకుండఁ గాపాడుచుండెనఁట. ఇట్టికథలు చిన్నతనమున దారిద్ర్యావస్థనుండి యుచ్చదశలోనికి వచ్చినవారి కనేకులకుఁ జెప్పుచుందురు. ఇందెంత వఱకు సత్యమున్నదో నిర్ణయింపఁజాలము. కాని యీచిత్తాప్రఖానుని





గూర్చి మదరాసుదొరతనమువారి పుస్తకభాండాగారమునందు సేక రింపఁబడియున్న కైఫీయతులలో వ్రాయఁబడియున్నది. ఈకైఫీయతులు మూఁడు కలవు. మొదటిది కీమ్మూరుకైఫీయతు. రెండవది పేరుతెలి యని కైఫీయతు, మూఁడవది యేకశిలానగర కైఫీయతు. ఇవి మూఁడును, ఇతనికాలమునుగూర్చియు మతమునుగూర్చియు వేఱు వేఱురీతులఁ జెప్పుచున్నవి. ఈకైఫీయతులు సకాలములో వ్రాయఁ బడినచారిత్రములు కావు కొంతకాలము గడచినపిమ్మట నాచారిత్రక పురుషులనుగూర్చి కరణములో, పండితులో పెత్తనదారులో వ్రాసి యిచ్చినవాఙ్మూలములు. కావున నిందలివిషయము లన్నియు సత్యము లని తలంపనలదు. ఈకైఫీయతులలోని విషయములను, శాసనముల తోను ఆపురుషులనాఁడు వ్రాసినవాఙ్మయముతోడను సమన్వయము చేసి పరిశీలించి సత్యాన్వేషణము చేయవలసియుండును. అందుకొఱ కీచిత్రాంబుఖానుతో సంబంధించినభాగములను, కీమ్మూరుకైఫీయతు నుండి తీసి యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"కీమ్మూరుగ్రామానకు పశ్చిమమున నాలుగుక్రోశముల దూర మున రాజపూడిఅనే గ్రామములోను ఆగ్రామము జాగ్రత్తస్థలముగ యుండేది గనుక అవసరాల పెద్దిరాజుఅనే ఆయన వక గోలకొండ వ్యాపారిఅనేవాడుకగల నియోగి ఒకరు కలరు ఆయనయింటివద్దసీతడు అనేవాడు వకచదువు బోయవాడు వుండేవాడు. ఆచిన్నవాడు పెద్దిరాజు గారి దూడలును మేపిస్తూయుండేవాడు. వాడు పొలములోకి ప్రొద్దు ననే దూడలను తోలుకొనివెళ్ళిన తరువాతను జాముప్రొద్దుఅయినతరు వాతను చద్దివణ్ణము ఆతుతోటి పెద్దిరాజు పట్టుకువెళ్ళి పెటుతూయుం డేవాడు. ఒకనాటికాలమందు సీతడు ఎప్పటివలెనే దూడలను తోలు కొని పొలములోకివెళ్ళి ఆదూడలను బీడులోవదలి తానొక తాటిచెట్టు నీడను నిద్రపోవుచుండగా రెండుజాములు అయ్యేవేళకు పెద్దిరాజు యెప్పటివలెనే చద్దివణ్ణము తీసుకుపోయేవేళకు సీతడు ముఖముమీాద

తీక్ష్ణమైన యెండవచ్చి యుండగాను ఆయెండ వాడిముఖముమీద తగలకుండా వకసర్పము తనపడగ శీతదుముఖముపైన అడ్డుపెట్టివుండ గాను పెద్దిరాజుచూచి వీడుబహు అదృష్టవంతుడు కాన్ యున్నాడని తలచి వాడినిలేపి చద్దిఅన్నముపెట్టి వాడిభోజనము అయినతరువాతను సీతా! నీకు భాగ్యంవస్తే నాకుయేమియిస్తావురా అని పెద్దిరాజు అడి గితే నాకుభాగ్యంవస్తే అంతామీది కాని మరివకటికాదని చెప్పెను. అదిమొదలుకొని వాడిచేత దూడలుకాపించక వాడ్డికివిద్యచెప్పిస్తూ గరి డీలు, సాము నేర్పిస్తూ యీప్రకారంవుంచినతరువాత వాడికి అనువైన వస్త్రములు కట్టనిచ్చి రాజమహేంద్రవరములోకి కోరుకొండ నుంచి వచ్చిన సర్దారులవద్దకు కొల్వుకంపించగా వాడువెళ్లి కొలువునిలిచి పదియిరవై మందితో కూడావెళ్లి యెక్కడెక్కడికార్యములు నిర్వాహ కము బాగాచేస్తూవచ్చినందున వాడికి యేనూటికి సర్దారీ మొకర్రరు చేసి యిచ్చినారు. మన్నెంతట్టున జగ్గంపేటపాడినికొండకోయవాళ్ళు పితూరీలు విస్తారంఅయినందున సీతడు అనేవానికి చితాపిఖానులు అని కిల్లాపుయిచ్చి మన్నెపుఅంచునఠాణావుంచి యేనూరుమందికి ముజరా యిచ్చివుంచగానే శీతాపిఖానుడు అవసరాల పెద్దిరాజునువద్దకు పిలువ నంపించి యేనూరుమంది సిబ్బంది మనవద్దవుంది మన్నెపసాగి మనకు ఠాణాదొరికింది. యీసమయములోనే యీవైపున యెక్కడయినా జాగ్రత్తగా వుండేస్థలం విచారించి అక్కడ వకకోట బందోబస్తు చేసుకొనిమందిని కూర్చుకొని మావాసగిరిచేస్తే ప్రబలించగలము. తరు వాత మనలను వకరు వంచలేరు ఆలాగున అని ఆలోచనచేసి రాజ వూడి మన్నెము గనుక అక్కడ రాతికట్టుతో కోటకట్టించి అక్కడ వుండి మన్నెము అంతా పల్కించుకొని తానుసర్కారుకు మొరాసు అయి తనవద్ద పెద్దిరాజును దివాన్గిరీ వుంచుకొని వుండెను. శితాపిఖా నుడికి వివాహమయినతరువాతను అప్పలమ్మ అనేకుమార్తెకలిగినది. ఆచిన్నదానికి సంపూర్ణయావనము వచ్చి పెండ్లికాకవుండగా అవస రాలపెద్దిరాజును వకనాడు చూచి తనవద్దకు రమ్మనుమని వర్తమానం

అంపించినదట. అందుకు పెద్దిరాజు చెప్పినమాట. నీకు తండ్రి నాకు తండ్రి రక్షకుడు గనుక నీవు నాకు తోబుట్టుతో సమానంగాని మరి వకటి కాదు. మర్యాదకు దప్పిదముగా నీవునాయందు యీలా తలచడం మంచిదికాదు. అని మందలించిన ఆమాటలకు ఆచిన్నదానికి కోపము వచ్చి తండ్రియయున చితాపిఖానుడితో యేమనిచెప్పినదంటే అవసరాల పెద్దిరాజు నన్ను తనవద్దకు రమ్మనుమని వర్తమానము పంపించినాడు. అని అందుకు చితాపిఖానుడికి చాలకోపంవచ్చి పెద్దిరాజును కచేరీకి పిలువనంపించి మాతృద్రోహంవంటిరాణివాసద్రోహం చేసినవారికి యేమిచేయవలెనని అడగగా ఆకుమార్తె మాటలువిని యీతడీలా గడిగినాడు గనుక వీనిని మనము మరల్చలేము అని అనుకొని తనరెండుకళ్ళు సూరకత్తితో తీసి యెదుటవుంచి ఆలాగంటి సంగతి నిజమైనా అబద్ధమైనా గాని ప్రభువుకు నిజమనితోచినపుడు అనుమానం యెవడియందున్నదో అపురుషుడుని యేప్రకారం శిక్షించవలసినదని చెప్పగా నీవే ఆపనిచేసినవాడవని చెప్పినవాడాయెను. సరే నాయందు ఆదోషమున్నదో లేదో భగవంతునికి తెలుసును. నీకు నాయందు అపోహం వున్నది గనుకనే ఆశిక్షచేసుకున్నవాడిని అయినాను యిందులఫలము ముందు తెలియగలదనిచెప్పి వెంటనే పెద్దిరాజు యింటికి వెళ్ళిపోయి పిమ్మట రాజమహేంద్రవరము వెళ్ళిపోయి అక్కడ అల్లాకొల్లిఖానుడు అనేసల్లమ్కారుడు వుండగా ఆయనతో తనసంగతి చెప్పెను. ఆసల్లమ్కారుడు పెద్దిరాజును ఆదరించివుంచెను. కొంతకాలమయినతరువాత ఒకనాడు పెద్దిరాజును పిలిపించి సీతాఖానుడు అందరికీ ముగ్గొయ్యి అయివున్నాడు. నిన్ను గురించిన పనికై మేము చాలా కష్టపెట్టుచున్నాము. అతడిని వంచించే సాధనము నుచెప్పెదవా? అనిఅడుగగా మంచిది ఫౌజును నాతో అంపిస్తే నేను తర్లి వెళ్లి తలకొట్టి తిరిగి దర్శనానికి వస్తానని చెప్పినందున వెంటనే తాంబూలమిచ్చి రాణువను గోలుకొండనుండి తెప్పించి పెద్దిరాజుకు తయినాత్తీ చేసి ఖర్చులుకు సొమ్మిచ్చి మందుగుండుఫిరంగులీయగా

పెద్దిరాజు రాజపూడికోట ఫౌజుతో ముట్టడివేయగ కోటలోను సీతా పిఖానుడు 30 దినములు లడాయిచేసి అంతట నిఖాయించలేక కోట విడిచి తన స్వజనముతో కూడా పరారి అయిపోగా పెద్దిరాజు వెంట తగిల్చి తోటపల్లిలొద్దిఅనేస్థలంలో సీతాపిఖానుని పట్టుకొని తలతీసి నాలుగుఘడియలలోపల ఆవర్తమానం రాజమహేంద్రవరము పంపించినాడు నాటినుండి రాజపూడికోట నిర్జనమయిపోయినది.”

గోదావరిమండలములో పెద్దాపురంతాలూకాయందు రాజపూడిగ్రామ మున్నది. పొలములనడుమ శిథిలమయినకోటచిహ్నము లిప్పుడును గన్పట్టుచున్నవి. ఆప్రాంతములయందు సీతాపతికథ నిప్పుడును చెప్పుకొనుచున్నారు. అందువలనఁ బైనిజెప్పిన కయ్ఫీయతులోఁ జాలభాగము సత్యము లనియే నమ్మవలసియున్నది.

మఱియొకకైఫీయతులో అవసరాలపెద్దిరాజునివాసము గోదావరి మండలములోని బిక్కవోలుపరగణాయందలి వేటపాలెము గ్రామమనియుఁ దాను ఓరుగల్లునకుపోయి యచ్చటిప్రభువుల నాశ్రయించి, సేనాధిపత్యమును సంపాదించెద ననిసీతాపతి ప్రార్థింపఁగా, పెద్దిరాజు వేయిరూపాయల నాతని కొసంగెననియు, నాతఁ డాసొమ్ముతోఁనోరుగల్లున కేఁగి యచ్చటిమహమ్మదీయప్రభువుల నాశ్రయించి చితాప్ ఖానుబిరుదును కొన్నిజాగీరులను సంపాదించె ననియుఁ బిమ్మట నోఢ్రదేశపురాజగు ముకుందదేవునాశ్రయించి రాజమహేంద్రవరసర్కారునకుఁ బరిపాలకుఁడై పెద్దిరాజున్ను ధనమొద్దకుఁ బిలిపించుకొని యాసర్కారులోఁ జేరినపదునెనిమిదిమహాళ్ళకు మంత్రిత్వపదవి నొసంగి, వేమగిరికోటను వదలివేసి, రాజమహేంద్రవరమువఁ గోటను గట్టించె ననియు, రాజపూఁడికోటకూడ నాతనిస్వాధీనమందే యుండెడిదని యుఁ జెప్పఁబడినది. పెద్దిరాజునకును చితాప్ ఖాన్ తనయకును నడచిన ప్రణయగాథ నీకైఫీయతుకూడఁ జెప్పుచున్నది. కాని యామెపేరు అప్పలమ్మయనుటకు బదులుగా నాగమ్మ యనిపేర్కొన్నది. పెద్దిరాజుక్రోధమును మనసునందుంచుకొని పల్లకీమీఁద గొల్కొండ కేఁగి

జూపల్లిసామంతరావనుగొప్పసరదారు నాశ్రయించి యప్పుడు నవాబుగానున్న యిబ్రిహిమ్‌షాదుషాకు నచ్చజెప్పి, చితాప్‌ఖానునుజయించుటకై సలబత్ ఖాను, అమల్‌దార్ తోప్‌ఖానా, సయ్యదుమీరా, వజీరుషామహమ్మద్‌ఖాను, జూపల్లిసామంతరావు, కధాన్ వీరమరావు, ముత్యాలయల్లప్పాశ్వారావు, సెట్టిపల్లి ఖేతారావు, మేదరలమెట్టుగోపాలరాయడు, భల్లమచిన్నారావు, వెల్లవీరమరావు అనుపదకొండుగురు సరదార్లును పదకొండువేలగుఱ్ఱములును, ఎనుబదివేలసైన్యమును దీసికొని నారికెడమిల్లివద్ద గోదావరి నదినిదాఁటి, యీతకోటకోటను బట్టుకొని పిదప తాతపూడిరేవుదాఁటి, నల్లూరుమడుగువద్ద దండువిడియించఁగా, నల్లూరిచౌదరిఅయిన గంధంతమ్మయ్యమహాపాత్రుఁడు "ఆహారపదార్థములను" సప్లయిచేసి, యిబ్రహింపాదుషాసైన్యము వచ్చుచున్నదని శితాప్‌ఖానునకు సూర్నేనికొండమానిచేత నుత్తరములు పంపించఁగా నాయుత్తరములను ద్రాక్షారామవద్ద వజీరుమహమ్మదుఖాను పట్టుకొని, నల్లూరుగ్రామాధికారియగు గంధంతమ్మయ్యపాత్రుఁడును బట్టి తీసికొనివచ్చి ద్రాక్షారామ దక్షగుండముయొక్క తూర్పుగట్టున యాతనిశిరస్సును ఖండించివైచెను. వేమగిరికోటను శా. శ. ౧౪౯౫ ఆషాఢ శు ౫ జయవారమునాఁడు పట్టుకొనిరి. పిమ్మట రాజమండ్రికోటను బట్టుకొనిరి.

ఈవిషయములన్నియు రెండవకైఫీయతునందున్నవి. మూఁడవకైఫీయతునందు చితాప్‌ఖానుఁడు మహమ్మదీయమతమును గైకొని హిందువులదేవాలయములను ధ్వంసముచేసిన ట్లువ్రాయఁబడియున్నది.

రెండవకైఫీయతునందువ్రాసినకాలము సరియైనది కాదు. ఇబ్రిహింపాదుషా యనునామమును సరియైనదికాదు. ఇబ్రహింషాదుషా కాలమునాఁటి కీసీతాపతిఖాను లేడు. అతఁడు మహమ్మదీయమతమును గైకొనను లేదు. ఈతనివిషయమై యాంధ్రగ్రంథము లేమిచెప్పుచున్నవో చూతము.

చిత్రభారతమునందు సితాప్ఖానునుగూర్చి యీక్రిందిపద్యములు వ్రాయఁబడియున్నవి.

సీ. చలివేడి వెలుఁగులై కలువదమ్ములనేలు
కన్నుదోయి నేఁపొద్దుఁ గరుణచిలుక
నేత్రతె నతామర మేడ నాడెడుకన్య
కిర వైఁసరియుత్మము శ్రెంపఁదది సెలుపఁ
దొలుచూలుబాపనదొర నింపుతోఁ గన్న
పొక్కిలి పుటుటాలిపూవు చెలఁగఁ
బదియూతునన్నెలపసిమిఁ జూపెడువింత
సరిగదుప్పటి మేనఁ జొకళింపఁ

తే. బ్రాఁజదువుగుంపు మ్రోఁతలు పరిఢవిల్ల
మేటిజగములనాడుమిన్నేటిపాప
పుట్టినిల్లైనయడుగులఁ బోల్చి యెపుడు
సంతసంబున వెలయుఁ బాంచాలివిభుఁడు.

తే. ఆజగన్నాథపరమదయాత్తమధ్య
మక్షమామండలుండు భీమప్రతాప
ఖండపరశుండు వైభవాఖండలుండు
భోగివంశాబ్ధిచంద్రుండు భూరిబలుఁడు.

సీ. అనువత్సరంబు బ్రాహ్మణులకు గోసహ
స్రము లిచ్చు నృగనరేశ్వరునిరీతిఁ
గంధులకెనగఁ బాకాలచెర్వాదిగాఁ
జెఱువులు నిలుపు సగరునికరణి
దివ్యప్రతాపుఁడై దిగ్విజయంబుఁ గా
వించు మాంధాతృవిభునిలీల
దేవభూదేవతార్థిశ్రేణి కగ్రహా
రములిచ్చు భార్గవరాముపగిది.

తే. నిందుశేఖరపాదారవిందయుగళ
భావనాపరుఁ డంగనాపంచబాణుఁ
డతులధైర్యాభిభూతహిమాచలుండు
మానభూపాల చిత్తాంబుఖాన విభుఁడు.

సీ. సర్వసర్వంసహాసంరక్షణక్రియా
చాతుర్య సప్తమచక్రవర్తి
హరిదంతకరిదంత హరిరాజసురభూజ
తారకానిర్మలోదారకీర్తి
దుర్వారపరిపంథిగర్వగాఢాంధకా
రచ్ఛటాహరణమార్తాండమూర్తి
హేమభూధేనుగంధేభఘోటకదాన
ధారాకృతాంభోనిధానపూర్తి

తే. యాతఁడింపొందు లాటకర్ణాటభోట
ఝూటకరహాటపాండ్యపానాటగౌడ
చోళమళయాళరాజసంస్తూయమాన
మానధనుఁ డైనచిత్తాంబుఖానవిభుఁడు.

ఈపైపద్యములనుబట్టి చిత్తాంబుఖానుఁడు (ఇతఁడే చితాప్‌ఖానుఁడు) మహమ్మదీయుఁడు కాఁ డనియు, గోబ్రాహ్మణభక్తికలవాఁడనియు స్పష్టమగుచున్నది. పేరు చితాపుఖానుఁ డనియున్నను, నితఁడు హిందువుఁడే ఆంధ్రుడు ఆజన్మాంతము హిందువుఁడుగనే యున్నాఁడు. ఇతఁడు 'ఖాను' అనుబిరుదును వహించుటచేత, మహమ్మదీయమతమును గైకొనెనని భ్రమపడి ఏకశిలానగర కైఫీయతులో నట్లు వ్రాసియుండును. అతఁడు మహమ్మదీయమతమును బుచ్చుకొనెననుట కాధారములు లేవు, చిత్రభారతమునం దీతనిప్రశస్తి యిట్లు వర్ణింపఁ బడినది.

"భుజబలభీమ ప్రతిగండభైరవ యిరువత్తుగండగోవాళ గండర గండ భేరుండ మండలీకమృగజేంటెగార సమరరాహుత్త రాయ సంగ్రామధనంజయ కోదండవిద్యాపాండిత్య రఘురామ యపరిమితభూదాన పరశురామ నిరంతరభోగసుత్రామ యష్టదిగ్గజమనోభయంకర దుష్టలాంకుశలారూపసరిగజాంకుశ ఇప్పత్తేళు దండియరనాయంకరతల గుండగండ, హెన్నుకట్టుకుదిరికట్టు మండలీకరగండ యెంబిరుందగండ సర్వబిరుదరకొమర, వేశ్యాభుజంగ, యనవరత కనకకర్పూరదానధారాప్రవాహాధ్యనేక ప్రశస్తమధ్యానే మండలాధీశ్వర, భోగివంశపయఃపారావార రాకాసుధాకర, శ్రీచిత్తాంబుఖాన మహీమహేంద్ర"

కిమ్మూరుకైఫీయతులో నీతఁడు బోయకులమువాఁడై నట్లున్నది. "భోగివంశపయఃపారావారరాకాసుధాకర" యనిచెప్పుటచే నీతని యింటిపేరు "భోగి" అయియుండునని యూహింపఁదగియున్నది. పైని వ్రాసినవిషయములనుబట్టి యీతఁడు హిందువుఁ డనిస్పష్టమయినది. ఇఁక నీతఁ డెప్పటివాఁ డనువిషయము నిర్ధారణము కానలసియున్నది.

శ్రీకృష్ణదేవరాయలు, ఉదయగిరి, కొండవీడు మొదలుగా గజపతులయధీన మందున్న దుర్గములను జయించి, పిమ్మటఁ గళింగదేశమును జయింపవలయునను నుత్సాహముతోఁ గోదావరినదిని దాఁటి కళింగదేశప్రయాణోన్ముఖుఁడై యున్నతఱిని తిమ్మరుసుమంత్రి, గోదావరినదికిని గళింగదేశమునకును నడుమనున్న అరణ్యపంక్తులలోఁ బ్రయాణము గావించుట దుస్తరమనియు, దండయాత్రనింతటితో నిలుపు సేయుట మంచి దనియుఁ గృష్ణదేవరాయలతో విన్నవించుటయు, నందుపై నాతఁడు భయము లేదనిచెప్పి ముందునకుఁ బోవుటయుఁ గృష్ణరాయవిజయమున నీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడియున్నది.

......పదిలంబుగ దళంబు హత్తించి జయోత్సాహంబున మించి గజపతియున్న దేశంబునకుం గమకంబునం దమకంబుమీఱం జన నెంచు నమ్మూరురాయగండప్రచండబిరుదాంకుం గనుంగొని యు

నంగునిమామగురునిం గ్రేణిసేయంగలసుధీ చమత్కారంబున వెల
యుసాళ్వతిమ్మరుసు మంత్రిపుంగవుం డిట్లనియె.

చ. ఇతరులు శక్తులే తలఁప నేమలశాహు నిజాముశాహులన్
గుతపనమల్కునున్ గెలిచి గొబ్బున సర్వగిరీంద్రదుర్గముల్
జతురతఁ గైకొనన్ ధర నసాధ్యము నీకిఁక గల్గనైన నం
చితయశ ! యొక్కవిన్నపముఁ జేసెద వేడురఁ జిత్తగింపుమా!

ఉ. తిన్నదనంబునన్ గజపతిం గెలువం జను టొప్పుఁగాక యా
పన్నశరణ్య ! శైలవనపంక్తులుదాఁటి తదీయసీమలో
న న్నిలఁజూచి వారలు ఘనంబుగ మార్గము లడ్డగించినన్
సన్నుతశౌర్య రస్తు మన సైన్యము జేసుట దుస్తరంబగున్.

చ. అనుటయుఁ బిన్ననవ్వునగి యప్ప ! యిదెంతటికార్యమయ్య! యా
వనగిరులెంత! పస్తుతతి వచ్చుట యెంత ! సమస్తదేశముల్
మనకు వశంబులయ్యెఁ బదమా ముద మూనుచు సంశయంబు నె
మ్మనమున మానుచు న్దివిజమంత్రిసమాన యటంచు బల్కుచున్

క. ఆవీరనృసింహధరి
శ్రీనరనందనుఁడు రణదతిస్ఫుటభేరీ
రావములు చెలఁగ నడఁచెన్
దేవతలు నుతింప గజపతిన్ గెలుచుటకై.

ఈవిధముగా శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశముపై దండెత్తి పోవునప్పుడు చితాప్‌ఖానుఁ డఱువదివేల సైన్యముతో నరణ్యప్రాంతములందాతని నెదిర్చెననియు, రాయలాతనిని జయించి సింహాద్రికడకేఁగి యటనిలచె ననియు నీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడియున్నది.

క. చనుచోఁ జితాపుఖానుం
డనువాఁడు ధరాధరాంతరాంతరసీమన్
గనుమలలో నఱువదివేల్
ఘనశార్ఙ్గధరుల్ చెలంగఁ గలహ మొసర్పన్.

ఉ. నాలుగు దిక్కులం గినిసి దట్టడవిం జరియించు నచ్చమూ
పాళి గలంగ బల్లెముల బాణములన్ మెఱు గీటెగుంపులన్
రాలఁ దుపాకులం బలుఫిరంగుల భంగము నొందఁ జేసి గ
గ్గోలుపడం గడంగి యెలగోలుబలంబు చలం బెలర్పఁగన్.

క. ముంగల నెసంగ రంగ
త్తుంగతురంగేంద్రఖురవిధూతరజంబుల్
నింగిఁ జెలంగఁ గళింగ థ
రాంగణమున నిల్చె రాయ లద్భుతమతిమై.

చం. చితాపుఖానుఁడం గడింది చిచ్చునార్ప నేర్చిన
చ్చితింగదా ముదంబు మీఱ శీఘ్ర మీగజాధిపుల్
నితాంతకీర్తి ధాత్రిలోన నిండఁ గల్చెదన్ ఘన
ప్రతాపధీధితిం దిగంతభాగము ల్విరాజిలన్.

తే. అనుచు పొట్నూరిసింహాద్రి కరుగుదెంచి
సకలచతురంగబలములు సరగ నపుడు
పరభయంకరవై భవప్రకటలీల
పాళెమిడియించె వేడ్క నప్పార్థివుండు.

ఈపద్యములనుబట్టి యీసీతాపతిఖానుఁడు గోదావరి మొదలు సింహాద్రివఱకును గలమన్నెపుసీమ కధిపతియై గజపతులతో మైత్రి కలిగియున్నాఁడని స్పష్ట మగుచున్నది. ఈ మధ్యసీమలో సీతాపతి దక్క మఱియెవ్వరును శ్రీకృష్ణరాయల నెదిరించినవారులేరు. సింహాద్రిచేరినపిమ్మట ఓఢ్రసామంతులు బలవంతులు పదాఱుగురు కృష్ణరాయల నెదిరింపసంసిద్ధులగుటయు వారిని జయించుట కష్టమనితోఁచి తిమ్మరుసుమంత్రిమాటను వినక వచ్చినందులకు రాయలు విచారించుచుండఁ దిమ్మరుసు తనబుద్ధిప్రతిభచే భేదోపాయమున వారిని గెలిచి గజపతినిజయించి, యాతనికుమార్తెను కృష్ణరాయలకుఁ బరిణయము

చేయించుటయుఁ దరువాతకథాంశములు, వానివివరములతో మనకిటుఁ బ్రిసక్తిలేదు.

కృష్ణరాయలు, గజపతినిజయించి పొట్నూరునద్ద జయస్తంభము నాటించినది క్రీ.శ. ౧౫౧౬ సంవత్సరమని యాతని చరిత్రమున వ్రాసియుంటిని. కావునవాకాలమున సీసీతాపతిఖానుఁడు గోదావరి మండలమన్యప్రదేశముల కధికారియై గజపతులకుఁ బరాక్రమవంతుఁడైన సామంతుఁడుగానున్నాఁడనుట నిశ్చయము.

ఈసీతాపతిఖానుడు ఏకశిలానగరమునఁకును జయించి అచ్చట జయస్తంభమును వేయించి నట్లొకశాసనమున్నది. ఆశాసనమును హైదరాబాదు శాసనశాఖవారు డాక్టరు హీరానందశాస్త్రిగారియుపోద్ఘాతముతోఁ బ్రకటించినారు. అది సంస్కృతభాషలో దాదాపు ౧౫౦ పంక్తులు గలదైనందున గ్రంథవిస్తర భీతిచే దాని నిందియలేదు. శాసనకాలము తెలుఁగున నిట్లీయఁబడినది.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయశకవర్షంబులు ౧౪౨౫గు రుధిరోద్గారి మాఘశుద్ధ ౫ ఆదివారమునాఁడు" (క్రీశ. ౧౫౦౩) ఈశాసనమువలన మన క్రిందివిషయములు దెలియుచున్నవి. సీతాపతిఖాను తాతపేరు నాగయ ఇతఁడుగొప్పపరాక్రమవంతుఁడు. ఇతనికుమారుఁడు మానయ. ఈమానయభార్య గౌరాంబ ఈదంపతుల కుమారుఁడే చిత్తాపఖాను (సీతాపతి). ఈతని కిరువురుభార్యలు. మొదటియామె దేవాంబిక, ఈమెయం దిరువురు కుమారులు జన్మించిరి. మొదటియాతనిపేరు "అవధూతఖాను" రెండవయాతఁడు, పురాంతకుఁడు చిత్తాపఖానురెండవభార్య అనుమాంబ. ఈమెయందు ముఫ్వురు కుమారులు కలిగిరి. మొదటివానిపేరు అమరయ్య, రెండవవానిపేరు భోగయ్య మూఁడవవానిపేరు రామయ్య, చిత్తాపఖానుప్రథమపుత్త్రుఁడైనయవధూతఖానుశాసనకాలమునకుఁ బూర్వమే రణరంగమున నిహతుడయ్యెను. శత్రుభయంకరుఁడును రాజనీతినిపుణుడునగు సీచిత్తాపఖా

నుఁడు శత్రువులను జయించి రాజుకొండ మొదలగుననేక దుర్గములను జయించెను.

అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానములో నా గ్రంథకృతిపతియైనయిబ్రహింషాదుపాతండ్రియగు కులీకుతుబ్ షాహా, యీచితాపుఖానునిజయించి గౌతమీనదినిదాఁటించెనని యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. కటకేశ్వరునిఁ దోలి కైవశంబుగఁ జేసెఁ
గొండంతజయముతోఁ గొండపల్లిఁ
గంపమంది చితాపఖానుండు గౌతమీ
తటిని లఘించిపోఁ బుటము వెట్టె
బైడవిరాహాచప్రాంగణక్షోణిలోఁ
బీగఁ దోలి బరీదు వెన్ను చూచె
సాగరగౌతమీసంగమస్థలమున
నడిదంబు గడిగెఁ బ్రఖ్యాతిగాఁగ
నష్టదిగ్రాజులను దనకరియుఁగోరు
వెట్టికాపులఁ జేసి మువ్వెట్టిఁ గొనియె
నితరధరణీతలాధీశు లెన్వరీడు
పృథివిఁ గుదుపనమలుక చక్రేశ్వరునకు

ఈకులీకుతుబ్ షా హూణశకము ౧౫౧౨–౧౫౪౩ వరకును గోలకొండనవాబుగా రాజ్యమేలినవాఁడు. ఇతఁడు సీతాపతిఖానుని క్రింద నున్న కంభఘుమెట్టను తీసికొనినట్లు పైగ్రంథములోనే యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. పడమటను సవాయి బసవనిగాఁ జేసి
యచట గొయ్యలకొండ నావరించె
తమదిమల్లాఖాను దక్షిణంబునఁ గొట్టి
హరియించెఁ బానుగి ల్లాదిగిరుల

నుత్తరంబున బరీ దోడిపాఱఁగఁ దోలి
మెతుకుదుర్గం బాక్రమించి మించెఁ
బ్రథమదిక్కున నోడ్డిపాత్రసామంతుల
ఘట్టించి కంబముమెట్టఁ గొనియె.
గీ. నతనిఁ బొగడంగఁ దగదె యాచతురసీతి
రాఘిగిరిదుర్గలుఁఠనప్రౌఢతేజు
వాహశిఖరాధిరోహ రేవంతమూర్తి
కుతుబశాహినిక్ష్మాపాలు గుణవిశాలు.

మహమ్మదీయమహాయుగములోఁ గొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు కులీకుతుబ్ షాహానుగూర్చి వ్రాయుచు "సీతాపతిరాజు నోడించి కంబముమెట్టుగ్రామమును దీసికొనెను. ఇదిప్రస్తుతము నైజాము రాజ్యములో నున్నది. దీని కిపుడు కమ్మంమెట్టు అనిపేరు" అనివ్రాసియున్నారు.

ఈశాసన మెవరికిని దాన మొసంగివ్రాయించినదికాదు. జయ స్తంభముమీఁద వ్రాయించినది. ఓరుగల్లువఱకునుజయించి, యచ్చట స్థాపించినజయస్తంభముపై నున్నదగుటచే నావిజయకాలమే యీ శాసనకాలమనుట స్పష్టము. అంతకుఁ బూర్వమే సితాపఖాను మొదటి పుత్త్రుఁడు చనిపోయెను. రణములోఁ జనిపోవుటచే నప్పటి కాతని కిరువది - ఇరువదియైదేండ్లుండియుండవలయును. దానినిబట్టి సితాప ఖానుజననము ౧౪౫౦ ప్రాంతమైయుండునని తేలుచున్నది. ఇతని జననము ౧౪౪౦ ప్రాంతమని కొందఱిఅభిప్రాయము. అది సత్య మైనఁ గావచ్చును. అం దసంభవ మేమియు లేదు. దీనినిబట్టి ఇబ్ర హీమ్‌పాదుషాకాలము నాఁటి కీతనికి నూఱేండ్లుదాఁటిపోవును. కావున పైనివ్రాసిన రెండవకైఫీయతునందలికాలమును పేరులును సరియైనవి కావనుట స్పష్టము. ఇబ్రహీమ్‌పాదుషాకాలమునాఁడు వేఱొక సితాప్‌ఖానుఁ డుండెనేమోయని పైనివ్రాసినశాసనప్రచురణకర్తలు

భావించిరి. కాని యీవిషయమును అద్దంకి గంగాధరకవిగాని పొన్నిగంటి తెలగనార్యుఁడుగాని చెప్పలేదు. ఇద్దరు చితాపఖానులుండిరని యెవరును జెప్పలేదు. కావున రెండవకైఫీయతుకర్తలు పేరులలోఁ బొరబాటుపడిరని యెంచి యీవాదమును విసర్జింతము.

కులీకుతుబ్‌షా క్రీ. శ. ౧౫౧౨-౧౫౪౩ నడుమ గోలకొండ ప్రభువుగా నుండెనని పైని వ్రాసియుంటిని. కాని యాతఁడు ౧౫౧౨లో స్వతంత్రుఁ డయ్యెనేకాని యంతకుపూర్వము బహుమనీరాజుచే గోలకొండరాజ్యమునకుఁ బరిపాలకుఁడుగ నియమితుఁడై యుండుటచే నాతనికి గోలకొండసీమతో సంబంధ మంతకుఁ బూర్వమునను గలదు. తపతీసంవరణోపాఖ్యానములోని కుతుబ్‌షా విజయములకాలములను గూర్చి అద్దంకి గంగాధరకవిచరిత్రమున వ్రాసెదను.

చితాపఖాను ఓరుగల్లును జయించి, జయస్తంభమును నాటించినది క్రీ.శ. ౧౫౦౩ వ సంవత్సరము. అప్పటి కోరుగల్లు మహమ్మదీయులక్రిందనున్నది. కానిహిందువులక్రింద లేదు. తురుష్కులచే తీసివేయఁబడిన పాంచాలరాయ పార్వతీవిగ్రహములను చిత్తాపఖాను మరల స్థాపించినట్లు పైశాసనములోని యీక్రిందిరెండుశ్లోకములు చెప్పుచుండుటచే నాతఁడు తురుష్కులనుండియే యోరుగల్లును గైకొనెనని స్పష్టమగుచున్నది.

"పాంచాల్యై పరిభూతదైన్యబహలప్రోద్యత్కృపావేశతః
ప్రాదాద్దక్షయవస్త్రజాతమమలమ్ యోగోపికావల్లభః
తం స్థానాచ్చలితమ్ దురితవిభవ త్పాంచాలరాయమ్పున
ర్భోగేచిత్తాపఖానభూమిరమణ స్సింహాసనే స్థాపయత్॥" ౩౨.
"దేవీ శుంభనిశుంభదానవకులప్రోన్మూలనోజ్జృంభణా
రంభాకాకతిరాజ్యపీఠకమలా నాదిర్జగన్మాతృకా
యేనా స్థాపిపునస్తురుష్కకుజనై రుచ్చాటితాస్థానతో
ధర్మైకైకశిలాపురే స హి మహాంశ్చిత్తాపఖానోనృపః॥" ౩౩

బహుమనీరాజులలోఁ గడపటివాఁడైనమహమ్మదుషాబలహీనుఁడగుటచే నాతనిసరదారులే యాతనికి దిరుగుబాటొనర్చిస్వతంత్రులగుచున్నకాలమున నీచిత్తాపఖానుఁడు కుతుబ్‌షాపరిపాలనములోనున్నయోరుగల్లుపై దండెత్తి యాతనినోడించి యోరుగల్లునుస్వాధీనము చేసికొనియుండును.

చిత్తాపఖానుఁడు మహమ్మదీయులసేనానిగా రాజమహేంద్రవరమునఁ బ్రవేశించి క్రమక్రమముగా బలవంతుఁడై తెలంగాణా కేఁగియచ్చట కంభముమెట్టు దుర్గమునకుఁ బరిపాలకుఁడుగా నియమితుఁడయ్యెను. ఇతనిని నియమించినయాతఁడు క్రీ. శ. ౧౪౭౦–౮౧ లో నొక్కవత్సరము రాజుగానున్న "కూ)రుఁడగుహుమాయూనుషా" యని శాసనపీఠికాకారులు వ్రాసియున్నారు. ఈవిషయము నింకను బరిశోధింపవలసియున్నది.

క్రీ.శ. ౧౫౦౩ లో నీతఁ డోరుగల్లునుజయించినను నెంతయోకాలము దానిని బరిపాలింపలేదు. కులీకుతుబ్షా తనప్రభువును ధిక్కరించి స్వతంత్రుఁడైనకొలఁది కాలములోనే అనఁగా క్రీ. శ. ౧౫౧౨–౧౩ వ సంవత్సరములోనే చిత్తాపఖానునిజయించి యోరుగల్లునుండి వెడలఁగొట్టినట్లు గన్పట్టుచున్నది.

ఈచితాపఖానునకు బెల్లముకొండపై యాధిపత్యమున్నట్లును నితనికినికుతుబ్‌షాహాకును గొప్పయుద్ధముజరిగినట్లును నందొకమాఱు షాహాయోడిపోయియు, మరల నతిప్రయత్నముచేసి చితాపఖానును జయించినట్లును నప్పుడు చితాపఖాను కొండపల్లిలోనున్నగజపతిసరదారులసాహాయ్యమును బడసియు విఫలుఁడైనట్లు గన్పట్టుచున్నది.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరములోఁ గజపతులనుండికొండపల్లిదుర్గమును దానితోఁ బాటుగ కమ్మంమెట్టును స్వాధీనముచేసికొనియెనని తిరుపతిశాసనమునఁ జెప్పఁబడినది. అప్పటికి గమ్మంమెట్టును నోరుగల్లును జితాప్‌ఖానుస్వాధీనమునుండితప్పిపోయి

కులీకుతాష్షా స్వాధీనమునందుండియుండును, అతనినుండియే రాయలు కమ్మంమెట్టును గైకొనియుండును.

కమ్మంమెట్టు కులీకుతుబ్షావశము కాఁగానే చితాప్ఖాను గజపతులసామంతుఁడై రాజపూడికోటయందుండి రాయలనెదిరించి యుండెను.

కృష్ణదేవరాయలు గజపతినిజయించి యాతనితనయను వివాహమాడి పిదపఁ దానాతనినుండి కైకొనిన దేశమును మరల నాతనికిచ్చివేసెనని చెప్పుచున్నారు. ఆప్రాంతములు క్రీ. శ ౧౫౧౮ వ సంవత్సరమునకుఁ బిమ్మట గజపతులపరిపాలనములో నున్నట్లు శాసనములు కన్పట్టుచున్నవి. కాలక్రమమున మఱికొంతకాలమున కాప్రదేశములు మరలఁ దురుష్కులస్వాధీనములైనవి. కృష్ణరాయలచే మరలి నీయఁబడినప్పుడు చిత్తాపఖాను కమ్మంమెట్టుప్రాంతమున కేఁగెనా ? అతఁడచ్చట గజపతులసేనానిగాఁగాని పరిపాలకుఁడుగాఁగాని యుండెనా ? యనియాలోచింపవలసియున్నది. చిత్రభారతము పైశాసనకాలప్రాంతమున సంఘటితమయ్యెనో లేకతరువాత మఱియొకప్పుడు రచితమయ్యెనో తెలిసికొనుటకీవిచారణ మావశ్యకమగుచున్నది.

కృష్ణరాయల నెదుర్చునాఁటికీచితాపఖానునివయసు దాదాపుగ నఱువదియేండ్లుండును ఈవయసున నీతఁడుమరల నిజామురాష్ట్రమున కేఁగి యాధిపత్యమును స్వీకరించెననుట కవకాశము లేదు. ఓరుగల్లు మహమ్మదీయులనుండి యితనిపరిపాలనము లోనికిరాలేదు ఓరుగల్లునందు మహోన్నతపదవియందుండగనే చిత్రభారతము పుట్టినదని యనుకొనవలయునేగాని, యాప్రాంతమునండి పరాజితుఁడై వచ్చి మరల నంతకంటెతక్కువస్థితిలో నచ్చటి కేఁగినప్పుడు రచితమయ్యెనని తలంపరాదు. ఇంతకును ౧౫౧౫ వ సంవత్సరమునకుఁ దరువాత నాతఁడు మరల నాప్రాంతిమున కధికారిగాఁ బోయియుండెననుట కాధారములుః లేవు. చితాప్ఖాను క్రీ.శ. ౧౫౨౦ ప్రాంతమున రాజ

మహేంద్రవరమునకును రాజపూడికిని నడుమ నడవిమార్గమధ్యమున ౫౬-౭౦ యేండ్లవయసున నవసరాల పెద్దిరాజుచేఁ బ్రోత్సహింపఁబడిన కుల్లీకుతుబ్షా సైనికులచే వధింపఁబడియుండునని తలంపవలసియున్నది. ఈవిషయమునుగూర్చి మరల నద్దంకి గంగాధరకవిచారిత్రమునఁ బ్రస్తావించెదను.

ఈచర్చనుబట్టి కవికాలము క్రీ శ ౧౫౮౦-౧౬౩౦ నడుమ ననియుఁ జిత్రభారతము క్రీ శ. ౧౬౦౩-౧౬౧౨ నడుమ రచితమయ్యె ననియు స్పష్టమగుచున్నది. ఈసందర్భమునఁ గృతిపతియైన పెద్దనామాత్యునితండ్రి మాదయకు గురువగు కందాళ అప్ప యెవ్వరను ప్రశ్నకు సమాధానమీయవలసియున్నది. ఈయప్పపండితునిగూర్చియు నీతని పుత్రపౌత్రులనుగూర్చియు, తెనాలి రామకృష్ణునిచరిత్రమున వ్రాసియున్నాఁడను. ఈయప్పపండితుఁడు విహారి వేదాద్రికి గురువైనయప్ప పండితుఁడు కాఁడనియు నాతనితాతయైన యప్పపండితుఁ డనియు, నిశ్చయింపవలసియున్నది ఇతనికాలము క్రీ.శ ౧౫౭౦-౧౬౦౦ అయియున్నది ఎనుములపల్లి మాదయకాలము ౧౫౯౦-౧౬౧౦ అయియుండునని నిశ్చయింపవచ్చును అతఁ డీయప్పపండితునిశిష్యుఁ డనుట కభ్యంతర ముండదు.

ఈధర్మకవిగురువైన పరాశరరంగగురువును గూర్చికూడఁ తెనాలి రామకృష్ణకవిచారిత్రమున వ్రాసియున్నాఁడను.

శ్రీవీరేశలింగముపంతులుగారు కవులచారిత్రమున నప్పపండితు లిరువురున్నట్లు తలంపక యిరువురు నొకేవ్యక్తి యనిభావించుటచేఁ గవి కాలనిర్ణయమునఁ గొంత భేదము కలిగినది. మఱియు శ్రీపంతులుగారు చిత్రభారతమందలి యష్టమాశ్వాసాదియందుఁ గృతిపతిని సంబోధించిన:-

క. "శ్రీరంగరాజసేవా
పారంగతహృదయ! కమలభవవంశపయః

పారావారసుధాకర !
మానసమానావతార ! మాదయుపెద్దా !"

అనుపద్యములోని "శ్రీరంగరాజు"ను మానవునిగాభావించి కాలనిర్ణయ మొనర్చిరి. శ్రీరంగరాయనామధారు లారవీటివంశములోఁదప్ప మరి యొక వంశములోఁగన్పడరు. అళియరామరాయలతండ్రి శ్రీరంగరాజు చితాపఖానుకాలములో నున్నాఁడు. కానియాతఁడు పరిపాలకుఁడుగా నున్నట్లు కాన్పింపదు. ఎనుములపల్లి పెద్దనామాత్యునకును నా శ్రీరంగ రాజునకును ప్రభుసేవక సంబంధమున్నదనుట కాధారములు లేవు. పెద్దనామాత్యున కిష్టదైవము ధర్మపురమందలి నృసింహస్వామి యైనట్లాశ్వాసాద్యంత పద్యములవలనఁ దెలియుచున్నది. అయినను నాతఁడు శ్రీరంగేశ్వర పదభక్తుఁడుగూడ నైయుండుననియుఁ బైపద్య ములోని శ్రీరంగరాజు శ్రీరంగమందలి దేవుడనియు నెంచఁదగియున్నది. ఎనుములపల్లి వారిలో రంగనామధారులున్నారు. కృతిపతి పెదతండ్రి యైన నారయ కుమారునిపేరు రంగనాథుఁడు. ఇతనిని రంగరాజు అని కూడఁగవి వ్రాసియున్నాఁడు.

శ్రీపంతులుగారువ్రాసిన శ్రీరంగరాజులకును గృతిపతి యైన పెద్దయామాత్యునకును నేమియుసంబంధములేదు. వారికంటెఁ బెద్ద యామాత్యుఁడు నూఱేండ్లు పూర్వుఁడు.

శ్రీరంగమందలి దేవుని గవులుసామాన్యముగా శ్రీరంగేశుఁడ నియు రంగనాథుఁడనియు వ్రాయుచుందురుకాని శ్రీరంగరాజని వ్రాయుట లేదు. ధర్మనకవి యట్లేలఁ జెప్పెనో తెలియదు. కవి "శ్రీరంగనాథ" అని వ్రాసియుండగా విలేఖకులు "శ్రీరంగరాజ" యని మార్చి రేమో ! నిజముగా శ్రీరంగరాజు మానవుఁడై యాతనియొద్దఁ బెద్దయామాత్యుఁ డెప్పుడైన సేవకుఁడుగా నుండెనేని యావిషయము కృత్యాదిపద్యములలోఁ జెప్పకుండ నుండఁడు. "సేవాపారంగతహృ

దయ'' అను వాక్యముకూడ శ్రీరంగరాజు దేవుఁడనియే స్ఫురింపఁజే యుచున్నది. కావునఁ బై పద్యములోని శ్రీరంగరాజు దేవుఁడనియే నిర్ణయింతము.

చిత్రభారతమును గృతినందిన యెనుములపల్లి పెద్దనామాత్యుఁడును, చిన్నతనమున సీతాపతిశాశ్రియమిచ్చిన పెద్దిరాజును ఒక్క వ్యక్తియేయని యనుకొనుచున్నారు. నామ సామాన్యముచేఁ గలిగిన భ్రమతప్ప సత్యమందు లేదు. కృతిపతియింటిపేరు ఎనుములపల్లివారు. పెద్దిరాజుయొక్క యింటిపేరు అవసరాలవారు. పెద్దిరాజునివాసము గోదావరిమండలము. కృతిపతి నివాసము నిజామురాష్ట్రము.

చిత్రభారతమున నేకశిలానగరము నీక్రింది సీసపద్యములో వర్ణించి, యందుఁ గృతిపతికగ్రజుఁడైనతిమ్మామాత్యుఁడు దేవాలయమును గట్టించినట్లు కవి చెప్పియున్నాఁడు.

సీ. అక్షయాత్మాభారదక్షదక్షిణభుజాకాంక్షేయకక్షత్రరక్షితంబు
కూటకోటీశాతకుంభకుంభప్రభామండితాంభోజాప్తమండలంబు
గంధసింధురధానగండాంధమత్తపుష్పంధయ ఝుంకార
బంధురంబు
విశ్వవిశ్వంభరానశ్వరైశ్వర్య ప్రదాశ్వరత్నవ్రాత శాశ్వతంబు
తే. సంతతోత్సవ తోషితశంభులింగ
సమ్ముఖేందు శిలానందచారు మంట
పస్థలీనృత్యదంగనాపాదరణిత
నూపురంబగు నేకశిలాపురంబు.

మ. అలఘుప్రాభవుఁడైన మాదవిభు తిమ్మామాత్యముఖ్యుండు తా
నెలయూరన్ రజతాచలంబుగతి లక్ష్మీశాలయంబర్థని
శ్చలభక్తిన్విలసిల్లఁజేసి మతిపాంచాలీశ్వర ప్రాంగణ
స్థలిఁగట్టించె సువర్ణకుంభవిలసత్సౌధంబు నోర్గంటిలోన్.

ఏకశిలానగరమునే ఓరుగల్లందురు. ఇప్పుడువరంగల్లను చున్నారు. సీతాపతి ఏకశిలానగరమును జయించి రాజ్యస్థాపనము చేసినప్పుడే పెద్దయ, సింగయలు మంత్రులైయుందురు.

ద్వితీయాశ్వాస ప్రారంభమున:-

క. శ్రీధర్మపుర నృసింహా
రాధన తాత్పర్య! బంధురక్ష్మామణి! ధా
త్రీధవనుత! యెనుములపల్లి
మాధవతనుజాత! పెద్దమంత్రివరేణ్యా!

అని చెప్పియుండుటచేత నీతని నివాసము నిజామురాష్ట్రమం దలిధర్మపురమైన నైయుండును. కవియునిజాంరాష్ట్రవాసుఁడే. అచ్చట మహబూబుమండలములో చరిగొండయనుగ్రామమున్నది. ఆప్రాంత మును "చరిగొండసీమ" యని యందురు.

ఈకవినివాస మాప్రాంతమైయుండునని తోఁచుచున్నది, కృతి పతివంశీయులను వర్ణించినపద్యము లీగ్రంథమున చాలగలవు. సీతా పతిమూలమున నిదివఱకే పెద్దదయిన యీకవిచారిత్రము నికఁ బెంచి వ్రాయఁజాలక యీతనికవిత్వశైలి దెలియుటకై కొన్ని పద్యములుదా హరించి విరమించుచున్నాఁడను. ఈతనికవిత్వము ప్రౌఢమై రసవంతము గానున్నది.

చ. భువనములం బ్రసిద్ధిఁగని పొల్చిన సద్ద్విజకోటికన్న నె
క్కుడయగు హంసచక్రములు గోరిభజింపఁగ నంబుజాక్షుఁ బె
క్కువిధములన్ స్మరించుపలుకుల్ శ్రుతియోగ్యములై చెలంగ ము
క్తివనితచేతికీరమనఁ దేజిశుకుండదుదెంచె వేడుకన్. ౧౮

ఉ. ఇమ్మునినాథుఁడే పనికి నీగతి ఘోరతపంబుసేయ నె
య్యమ్మునఁ బూనెనో కడుభయంకరమై ప్రసరించునిట్టితే
జమ్మునఁ నెల్లలోకముల నగ్గ నెవాయువులేనిచోట దీ
పమ్మునుబోలె పీఁడచలభావమునొందె దృఢప్రతిష్ఠుఁడై ౨౮

ఉ. ఓసిదురాత్మురాల! వినయోక్తులచే నను వెత్తిజేయు పే
రాసులుమాను, నిప్పుచెదలంటగ నేర్చునె బల్మిఁ బైఁ బడం
గా సమకట్టిచేరితివి. గానఁ దురంగమవై చరింపు నీ
మైసొబగెల్లఁ బొల్లువడ మర్త్యునిమోచి ధరాతలంబునన్. ౩౮

మ. నరపాలత్వము దోషహేతువు మహేంద్రత్వంబు వీక్షింప న
స్థిరమంభోరుహ సంభవత్వము మదింజింతింప లోలంబునీ
నిరతిం జెందఁగ నేల యంచు నెఱపూన్కిన్ వైష్ణవుల్ దేవతాం
తరమంత్రాంతర సాధనాంతరములన్ వర్జించిశుద్ధాత్ములై ౪౮

చ. కురులు మొగంబునన్ జెదరఁ గ్రొమ్మిడియించుక వీడఁ జెక్కులన్
జిఱునగవుల్ దొలంక మృదుచేలము జాఱఁగఁ గన్నుదోయి క్రొ
మ్మెఱుగులఁ జిందఁ జెల్చెలియ మేను గరంబున నూఁదినిక్కి తత్
త్తఱమును వేడ్కయుంచెనఁ గఁ దన్గను కామినిఁ జూచె నత్తఱిన్ ౫౮

చ. వినుమనఘాత్మ! నన్ను నరవింద దళేక్షణుఁ డింతవానిఁ గాఁ
జెనిచెనసైన నీనృపతి భీతిలి చేరినఁ గాచినాఁడ నీ
తనికయి చచ్చుటొండె రణధారుణిలో గెలుపొండె మేలుగా
కనివినిపింపుమీ కొలువునందు బలాదులెఱుంగునట్లుగన్ ౬౮

ఉ. ఆజగదేకవీరుఁడగు నర్జునుఁ డందఱికన్ని రూపులై
రాజితపుంఖ సాయకపరంపర లభ్రమునిండ నాత్మసే
నాజనులెల్ల నుబ్బగ దనంబ దునార్వర నొక్కపెట్టునం
గాజుపడంగ నేసెఁ దెలిగన్నులఁ గెంపుదొలంక వెండియున్ ౭౮

ఉ. ఇంత దలంక నేల ధరణీశ్వర యీరణభూమిఁ బడ్డభూ
కాంతులలోన నొక్కరుని గ్రక్కున నిచ్చెద వేఁడుమన్న నా
యంతకనందనుండు వినయంబున హస్తయుగంబు మోడ్చి దై
త్యాంతక! యీచతుర్దశ నృపాగ్రణి నిమ్మన నాతఁడిట్లనున్ ౮౮

ఈకవి పూర్వకవులను నుతించుటలో బమ్మెరపోతనామా త్యునిగూడఁ జేర్చియున్నాఁడు. పోతనామాత్యుని నుతించినవారిలో నీతఁడే మొదటివాఁడు. పోతనచారిత్రమున రామాభ్యుదయకర్త మొట్టమొదటఁ బోతనను నుతించెనని వ్రాసియుంటిని. అప్పటి కీధర్మ నామాత్యుని కాలము సరిగాఁ దెలిసికొనక యట్లు వ్రాసితిని. పోతనామాత్యుఁడు భాగవతమును క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమున రచియించి యుండునని యాతనిచరిత్రమున నిర్ణయించియున్నాఁడను. పోతనయు నీధర్మనామాత్యుఁడును సమీపగ్రామనివాసులును సమ కాలీనులు సగోత్రీకులునై యుండియుందురు ధర్మనకంటెఁ బోతన యిరువది ముప్పదేండ్లు పెద్దవాఁడైన నై యుండును.



## 114 చరిగొండ నరసింహకవి

ఇతఁడు శశిబిందుచరిత్ర మనుపద్యకావ్యమును రచియించె ననియు, క్రీ.శ. ౧౬౦౦ ప్రాంతమువాఁ డనియు. నీతని నివాసము మహబూబు నగరమండలమందలి చరిగొండ యనియు గోలకొండ కవులసంచిక తెలుపుచున్నది.

అప్పకవి, శశిబిందుచరిత్రమునుండి యీక్రిందిపద్యములను లక్ష్యములుగాఁ గైకొని యున్నాఁడు.

క. నాకౌకసులైనను నీ
ఘాకకు నిల్చెదరె కటకటా మమ్ముఁ బోట్లం
జేకొని సంరక్షింపక
నీకిటు లుచితంబె యుపవణింప నరేంద్రా. ౨౪౧౪౫

ఉ. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహుల్ బట్టఁగనిచ్చి మోవిపై
దియ్యనిమోవియు న్మనను దీరగఁ గ్రోలఁగ నిచ్చి యిప్పుడో
యొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేనుఁగు నిచ్చియంకుశం
బియ్యక కయ్యమాడఁ దగునే నను నీగతి నేచఁ బాడియే.

౩౮. ౨౩౭

క. నూవుంబువ్వును సంపెఁగ
పూవుఁ గెలిచి బిరుదుము తైప్రుంజల్లి దగ
న్దావైచె ననఁగ ముంగర
తో వనరుహనేత్రనాస తుల లే కొప్పున్. ౩౮ ౩౪౭

అప్పకవి శశిబిందుచరిత్రకర్త చరిగొండ నృసింహుఁ డని చెప్పలేదు. కాని నృసింహకవి గ్రంథము నాతఁ డెఱిఁగియున్నట్లు క్రిందిపద్యములవలనఁ దెలియనగుచున్నది.

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జరికొండనృసింహుఁడు వెల్లయంచు నీ
వఁ నగసాలిరుద్రపనివాఁడును మొల్ల లటంచుఁ గూరిచెం
దెలియక కొంద ఱిట్లు వికృతిం బదమధ్యమునన్ లకార శే
షలఁ దలపై యకారమును బాపుదు రార్యులు నవ్వునట్లుగన్.

అప్పకవీయము. ౫౮ ౧౧౩

దీనినిబట్టి యీకవి కందుకూరి రుద్రకవికిఁ బూర్వుఁ డనుట స్పష్టము. ఈనరసింహకవి చిత్రభారతమును రచించిన చరిగొండ ధర్మన్నకు సోదరుఁ డని యనుచున్నారు. అది సత్యమే యగునని నా యభిప్రాయము. ఈ శశిబిందుచరిత్రయందలికథ యేదియో యిది యెవరి కంకిత మయ్యెనో యేమియుఁ దెలియరాలేదు. ఇతఁడు ధర్మన్నకు సోదరుఁ డగుట క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమువాఁ డని నిర్ణయింపనగును. చిత్రభారతమునం దీనరసింహకవి ప్రశంస లేదు.



# 115. కాకుమాని గంగాధరుఁడు

—*—

ఈతఁ డేకులమువాఁడో యెప్పటివాఁడో యెచ్చటివాఁడో యేమియుఁ దెలియదు. రామా ప్రెగ్గడ జగ్గకవి సంపాదించిన ప్రబంధరత్నాకరమునందు కాకమాని గంగాధరుని బాలభారతములోనివని వ్రాసి యుంచిన యీ క్రిందిపద్యములను ప్రబంధరత్నాకరమునుండి యుదాహరించుచున్నాఁడను. పాంచాలీ పరిణయాది ప్రబంధములను రచించిన కాకమాని మూర్తికవికిని ఈతనికిని ఏమయిన సంబంధముండెనేమో! తెలియదు. మూర్తికవి పూర్వులలో నీతఁ డగపడుట లేదు.

దోనేరు కోనేరుకవి భాగవతమునకు బాలభాగవతము రచియించినట్లే యితఁడు బాలభారతమును రచియించియుండును. ఉదాహృత పద్యములనుబట్టి యీతనికవిత్వము రసవంతముగా నుండునని తోఁచుచున్నది.

శా. క్రీడాలోలతదంతకోరకశిఖం గీలించి భూచక్రమున్
క్రోడగ్రామణి మించి యెత్తి ఫణిలక్ష్ముదానుమోదంబువన్
జూడభోగము లెత్తి చూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
వ్రీడం బొందఁగఁజేయుదంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్.

శా. శ్రీరామాయణకావ్యకల్పన విరించిన్ వేదఘంటాపథో
ద్ధారప్రౌఢమనీషి సర్గమునిమార్తాండున్ దపఃకీర్తిల
క్ష్మీరమ్యున్ భువనైకవంద్యుఁ డగువాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తిఁ యుక్తిదలతున్ దత్త్వజ్ఞచూడామణిన్.

శా. సంసారార్ణవపారగుం బరమహంసవ్రాతచూడాపదో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్ధళనపాథఃక్షీరభేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు, జలదశ్యాము న్మహాపాతక
ధ్వంసాభారతభారతామృతనిధిన్ వ్యాసున్ బ్రశంసించెదన్.

సీ. కైవారం మొనరింతు గంభీరసాహిత్య
ఘంటాపథోద్భాసుఁ గాళిదాసు
వర్ణింతు నుద్వేలవాణీసుధాపూర
పాథోధిపరిబాణు భట్టబాణుఁ
బ్రణుతింతు నుద్దండభాషాసమాక్షిప్త
హారబాహు కేయూరుఁ దగుమయూరు
సన్నుతిగావింతుఁ జాటుధారాప్రౌఢి
గోమలతాయత్తు సోమదత్తు

గీ. భక్తి నంజలి రచియింతుఁ బ్రవరసేన
భాసశివభద్రభవభూతి భట్టహర్ష
భారవిమురారి హేరంబచోరులకును
మణియుఁ దక్కినసుకవుల మదిఁదలంతు.

క. శబ్దార్థరసవిశారదు
శాబ్దికమూర్ధన్యు శబ్దశాసన బిరుదున్
శబ్దాయమానవిస్ఫుర
దబ్దఘటారభటి నన్నపార్యునిఁదలఁతున్.

ఉ. ఆంధ్రకవిత్వతత్త్వ నముదంచితకీర్తినిఁ దిక్కయజ్వనీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతిసేయుదు (?) నుల్లస
త్కంధ గభీరమంజుతరగర్జిత విభ్రమభవ్యభంగి సై
రంధ్రిక యైన చాటుమధురస్ఫుట బంధురవాగ్విజృంభిగన్.

క. ఇంద్రదపరిస్థంబనుపురి
సాంద్రమహేంద్రాశ్మకాంతి సంతతులను ని
స్తంద్రంబై విలసిల్లెను
చంద్రాతపధవళచంద్ర శాలాయుతమై.

గీ. ఇంద్రమణిజాలకములందుఁ జంద్రముఖుల
వాలుఁగన్నులు యమునయావర్తములను
మెలఁగి యాడెడువాలికమీఁ లనంగ
... ... ... కనుపట్టు నీపట్టణంబునందు.

సీ. పురుహూతవిస్ఫూర్తి భూమండలం బెల్ల
భుజవిటంకంబునఁ బూనినాఁడు
గీర్వాణదుర్వారుఁ గేశిదానవుఁ గొట్టి
విజయలక్ష్మియుఁ కీర్తి వెలసినాఁడు
లచ్చి నెచ్చెలికాని లలితోరుపీఠికఁ
బొడమినపూఁబోఁడిఁ బొందినాఁడు
నవయుగద్వీపభూనాథ చూడారత్న
మిత్రశాసనలీల మెఱసినాఁడు

గీ. విమలకీర్తిమందాకినీవీచినకర
పూరపాతాళమర్త్య విబుధనివాసుఁ
డై కరం బొప్పుసోమాన్వయ ప్రభుండు
చారుకీర్తి పురూరవశ్చక్రవర్తి.

శా. మత్తారాతి మహాంధకార పటలీమార్తాండుఁ డుద్ఘాటికా
దత్తోద్యత్తురగావళీ ఖురపుటోత్పన్న క్షమాధూళికా
దత్తాంభోధి యయాతిఁ జెప్పఁదగు నుద్యద్వజ్రధారాపరిభ్రా
జిత్రైజన్ సితకీర్తి కైతకదళశ్రీ నూతనాంభోదమున్.

గీ. అట యుధిష్ఠిరుఁ డప్పంకజాక్షి ధౌమ్య
దత్తవహ్ని ధూమకందళితశిఖలు (?)
మగువఁ గూడినరాయంచ మధుపశబల
నలినములఁ బోలెను ప్రదక్షిణంబు సేసె.

శా. అలజ్జావతి జామ్యువంపున శిఖివ్యాలోలకీలాలిపై
నోలి న్వేల్చినలాజరాజి పవనప్రోద్ధూతవారాశివీ
చీలోలోద్ధతవిద్రుమాటవి నధిక్షేపించుకట్టాణిము
త్యాలో నాఁ గనుపట్టె నట్టియెడ నంద్రాజహంసంబుగాన్.

గీ. వరుఁడు కెంగేల నక్కన్యచరణపుటము
సన్నికంటిపై నిడ నొప్పె శత్రుయునతి
చూడమాణిక్యములమీఁదఁ గూడఁ జేయు
లీలఁ బ్రకటింపఁబూనిన కేళి మెఱయు.

శా. చంచత్కేలిసరస్తటీ మరకతచ్ఛాయాకదంబంబు గ్రొ
మ్మించు ల్లోనికిఁ దమ్ములిమ్ములనుగిమ్మారంబులై యుంట సం
ధించున్ వాసనఁ జంచరీకములు మందీభూతసందేహతన్
సంచారించుచు నల్లకల్వవిరులన్ ఝుంకారఝంకారులై.

శా. ధారాపాతవిభాతి శీతకరకాంతస్ఫారగేహంబు లీ
యూరం జంద్రికమీఁద బర్వను రుచున్ (?)
వ్యూఢాంబుధారాళతన్
జేరున్ జాతకపంక్తి చిత్తములు రంజిల్లన్ మయూరంబులున్
సారస్యంబుల లాస్యము ల్మెఱయు నుత్సాహించి భూపాలకా.

అగస్త్య పండితకృత మైనబాలభారత మనుపండ్రెండుసర్గలు గలసంస్కృతకావ్య మొకటి తంజావూరు పుస్తకభాండాగారమునఁ గలదు. దాని కిది యాంధ్రీకరణమేమో తెలిసికొనవలసియున్నది. ద్వితీయ ప్రతాపరుద్రుని యాస్థానమునుండి విద్యానాథుఁ డనిబిరుద మొందిన యగస్త్యపండితుఁడే సంస్కృత బాలభారతకర్త. శ్రీకృష్ణదేవరాయనికడ ప్రధానమంత్రియై జగద్విఖ్యాతుఁ డైనసాళువతిమ్మర సీబాలభారతమునకు మనోహర యనువ్యాఖ్యను రచించెను. ఈబాల భారతమాసంస్కృతకావ్యమున కాంధ్రీకరణమైనచో, నీకవి పదు

నాఱవశతాబ్దివాఁడని చెప్పవచ్చును. ఎట్లయిన నితఁడు క్రీ.శ. ౧౫౫౦ దాఁటి యీవలకు రాఁడు.

మనకు లభించినపద్యములలోఁ సంస్కృతకవులను నన్నయ, తిక్కనలను వర్ణించినపద్యములు కన్పట్టుచున్నవి. ఇతనికవిత్వము సంస్కృత బహుళమై యించుక క్లిష్టమైనను, మనోహరముగానున్నది.

ప్రోలుగంటి చెన్నశౌరి బాలభారతము నాంధ్రమున వచన కావ్యముగా రచియించెను. సంస్కృత బాలభారతమున కాతఁడు వచన రూపమునను నీతఁడు పద్యరూపమునను నాంధ్రీకరణములను వెలయించిరేమో! 'కాకుమాను' అను గ్రామము గుంటూరు మండలమున బాపట్లతాలూకాలో నున్నది. ఈగ్రామనామమునుబట్టి యీకవి యింటిపేరు వచ్చియుండును. ఈతఁడాగ్రామవాసుఁడేమో!



## 116 తాళ్లపాక తిమ్మక్క

ఈకవయిత్రిభర్త తాళ్ళపాక అన్నయాచార్యులు. ఈతని చారిత్రము నిదివఱకు వ్రాసియున్నాఁడను * అన్నయాచార్యుల కీమె ప్రథమభార్య. తిరుమలాంబ, తిమ్మాంబయని పర్యాయ నామములు.

ఈమెసుభద్రాకళ్యాణ మనుగేయకావ్యమును రచియించెను. ఈమెకుమారుఁడు నరసింగన్న. గ్రంథాంతమున నీకవయిత్రి తనను గూర్చి యిట్లు చెప్పుకొనినది.

"అవనిలో తాళ్ళపాకాన్నయ్యగారి
తరుణి తిమ్మక్క చెప్పె దాను సుభద్ర

* ఆంధ్రకవితరంగిణి సం ౬ పుట ౧౫

కళ్యాణమను పాట .కడుమంచి తేట
పలుకుల; నీపాట పాడిన విన్న
శ్రీహరివారికి చేరు వై యుండు
నానాట పాపములు నాశనంబౌను
అప్పులు బంధువు లనువొందఁగలరు
సప్తసంతానములు సమకూరఁగలవు."

అన్నయాచార్యుల జీవితమును నేను ప్రకటించిన పిమ్మట శ్రీతిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన యన్నయాచార్య చారిత్రమును జూడఁగలిగితిని. ఆచారిత్రము అన్నయాచార్యుని మనుమఁడును అష్టమహిషీకళ్యాణాది ద్విపదకావ్యములను రచించిన మహాకవియునగు చిన్నన్న వ్రాసినది. దానికి కీ. శే. శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు విపులమగుపీఠికను వ్రాసియుండిరి. ఈగ్రంథము నా కదివరకు లభించియుండకపోవుటచే నన్నయాచార్యునిగూర్చిన విషయములఁ గొన్నిటినందు వ్రాయ ననువైనదికాదు. వాని నాతనియర్ధాంగి యగునీతిమ్మక్క చారిత్రమున వ్రాయుభాగ్య మలవడినది.

అన్నమయ్యముత్తాత నారాయణయ్య; తాతవిట్ఠలయ్య, తండ్రి నారాయణయ్య, తల్లిలక్కమాంబ "ఈమె మాడుపూరి మాధవస్వామిభక్తురాలఁట! అదియామె పుట్టినింటివారియూరు గాఁబోలును. మాడుపూరు కడపజిల్లా సిద్ధవటముతాలూకాలో నున్నది." అన్నమాచార్య జననాదికమును గూర్చి శ్రీప్రభాకరశాస్త్రిలుగారుపీఠికలో నిట్లువ్రాసియున్నారు. "అన్నమయ శక ౧౩౨౬ కీ). ౧౪౦౮ క్రోధి వైశాఖమాసమున విశాఖనక్షత్రమున జన్మించినాఁడు. పన్నిద్దరాళ్వారులలో ముఖ్యు డగునమ్మాళ్వారు (శఠకోపయతి) కూడ వైశాఖవిశాఖనే జన్మించిరి. జన్మోత్సవము పుట్టిననక్షత్రమును బట్టియును, నిర్యాణోత్సవమును చనిపోయినతిథినిబట్టియును జరపుట సాంప్రదాయము. వైశాఖమాసమున విశాఖనక్షత్రము ప్రాయికముగా పూర్ణిమాతిథికి

వచ్చును. కనుక వైశాఖపూర్ణిమ జన్మతిథిగాఁ కూడ నిర్ణయింప వచ్చును. శక ౧౪౨౪ క్రీ. శ. ౧౫౦౩ దుందుభి ఫాల్గుణద్వాదశినాఁ డాతఁడు దివ్యధామమందినాఁడు. అతనిజీవిత పరిమాణము ౯౫ ఏండ్లు. ఇటుచూడఁగా నేటికాతఁడు జన్మించి ౫౨౪ ఏండ్లయినది. దివ్యత్వ మంది ౪౪౭ ఏండ్లయినది.

వేదాంత దేశికులు శ్రీవేంకటేశ్వరస్వామివారి గుడిఘంటయంశ మున నవతరించిరని ప్రఖ్యాతి మనయన్నమాచార్యులు స్వామినందకము (ఖడ్గము) నంశయున నవతరించిరని ప్రఖ్యాతి." ౧

అన్నమాచార్యులు క్రీ.శ. ౧౪౦౮ లో జన్మించి ౯౫ సంవత్సరములు జీవించి, ౧౫౦౩ వ సంవత్సరములోఁ స్వర్గమును జేరెనని నేనిదివఱలో వ్రాసియుంటిని. అన్నమయ్య చనిపోయిన దినమును గూర్చి భేదములేదు. కాని జన్మదినవిషయమున భేదమువచ్చినది. (శ్రీ)శాస్త్రి)లుగారేయాధారము ననుసరించి క్రీ.శ. ౧౪౨౪వ సంవత్సరము జన్మదివమని నిర్ణయించిరో చెప్పలేదు.

స్వస్తి(శ్రీ) జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధిసంవత్సరమందు తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదాఱుయేండ్లకు తిరువెంగళనాథుఁడు ప్రత్యక్షమైతే ఆది మొదలుగాను శాలివాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేటిదుందుభి సంవత్సర ఫాల్గుణ బ ౧౨ నిరుథానకు తిరువెంగళనాథ దేవునిమీాద అంకితముగాను తాళపాక అన్నమాచార్యులు విన్నపంచేసిన అధ్యాత్మ సంకీర్తనలు" అనుకావ్యములు తాళ్ళపాకవారిగోరుములు చెక్కిన రాగిరేకుపై వ్రాసియున్నది. దీనినిబట్టి తిరుపతిదేవస్థానము ప్రకటించిన రిపోర్టులో నిట్లువ్రాసియున్నారు. ౨

---

౧ అన్నమాచార్య చరిత్రపీఠిక ౨—౩ పుటలు

౨ అన్నమాచార్య చరిత్రపీఠిక ౨—౩ పుటలు

ఈరిపోర్టును వ్రాసిన సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి, బి. ఏ. గారు రాగిరేకుపై లిఖితమై పైవాక్యములోనున్న "క్రోధిసంవత్సరమందు" అనువాక్యమును "తిరువెంగళనాథుండు ప్రత్యక్షమైతే" అనువాక్యముతో నన్వయించి అన్నయాచార్యుల జననమని నిర్ణయించినారు. శ్రీప్రభాకరశాస్త్రులుగా రావాక్యమును "అన్నవాచార్యులు అవతరించిన" యనువాక్యముతోఁ గలిపి చదివి క్రోధిసంవత్సర మాతని జననమని నిర్ణయించినారు. ఇందేది యనుసరింపఁదగిన దనువిషయము విచారణీయము. శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారియూహ దూరాన్వయదోషమునకుఁ గుఱియైనది. ప్రభాకరశాస్త్రిగారి నిర్వచమునం దదిలేదు. కాని దానినిబట్టి యీవిషయమును తీర్మానింపరాదు. ఈవాక్యము లౌకగ్రంథములోనివి కావు. వీనినివ్రాయునపుడు కావ్యదోషములను మనసునందుంచుకుని వ్రాసినవికావు.

ఈవ్రాఁత అన్నయాచార్యులజీవితకాలములో వ్రాసినదికాదు. అన్నయాచార్యుల జనన మరణకాలములను దెలుపుట యీలేఖకుని యుద్దేశము కాదు. అన్నమాచార్యులు సంఘటించిన గేయముల రచనాకాలమును దెల్పుటకై యుద్దేశించి యాలేఖకుఁ డీవాక్యములను రచించియుండెను. అన్నమాచార్యులజననకాల మాతనికిఁ దెలియదు. ఈవాక్యములను వ్రాయునప్పటి కామహాపురుషుఁడు దివ్యధామమును చేరి కొలఁదికాలమైనదైయుండును. అందుచే మరణకాలమును సరిగా నీయఁగలిగెను. అన్నమాచార్యులు తిరువెంగళనాథుఁడు ప్రత్యక్షమైనది మొదలు ఆమరణాంతమును. గేయములను రచియించుచుండె

ఫుట–ణం "Tallapaka Annamacharya commenced composing both the Sankirtana in Saka 1346 క్రోధి (=1424 A.C.) being there in his 16 years of age during which he had a manifestation of god Tiruvengadanatha and continued his work until the 12th day of the dark fortnight of Phalguna in Saka 1424 Dundubhi (=23rd February 1503 A.C.) That is to say for a period of 80 years from 1424 to 1503 A. C.

నని చెప్పుటయే యాలేఖకుని యుద్దేశము. క్రోధిసంవత్సరమునఁ దిరువెంగళనాథుఁడు ప్రత్యక్షమయ్యెననియు, నప్పటి కన్నమాచార్యునకుఁ బదునాఱేండ్లువయస్సు గలదనియు వినుటవలననో, ఎచ్చటనైన వ్రాసియుండుటవలననో, లేఖకుఁ డావిషయము నారేకుపై లిఖించెనని తలంపవలసియున్నది. అన్నమాచార్యుని జననకాలమును దెలుపవలయునని యాలేఖకుని యుద్దేశమైనచో మరణకాలమునువలెనే జననకాలమును గూడఁ దెలిసికొని యందులిఖించియుండును. ఈవాక్యములయందున్న "నేటి" యనుపద మీసంశయ నివారణమునకుఁ దోడుపడఁజాలదు. "తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదాఱుయేండ్లకు" అను వాక్యములను గుండలీకరించి యావాక్యములకర్థము చెప్పుటయే సమంజసమని తోఁచుచున్నది.

వైశాఖమాసమందలి విశాఖ యాతనిజన్మనక్షత్రమని యాతని వంశీయు లన్నమార్యుని జననోత్సవమునకై కొన్ని యేర్పాటులను చేసి శాసనములను వ్రాయించియుండుటచే నాతనిజన్మమాసమును జన్మనక్షత్రమును దెలిసినవి. వారాశాసనమునందు జననసంవత్సరమును జెప్పలేదు. 'క్రోధిసంవత్సరమునందు' అనిరాగిరేకుపై వ్రాసినవ్రాతఁకు శాసనమునందలి వైశాఖవిశాఖను జేర్చి, క్రోధిసంవత్సరమున విశాఖతోఁగూడిన వైశాఖశుక్లపూర్ణిమ జన్మదినమని శ్రీశాస్త్రిలువారభిప్రాయపడియుండిరి.

ప్రతిమాసమునందును నన్నినక్షత్రములును వచ్చుచునేయుండును. ఆక్రోధిసంవత్సరమున (క్రీ. శ. ౧౪౨౪) విశాఖానక్షత్రము పూర్ణిమనాఁడు లేదు. బహుళ పాడ్యమినాడు 8 ఘడియలు మొదలు విదియనాడు 10 గడియలవఱకు విశాఖయున్నది. (1424 ఏప్రియలు నెల 14, 15 తేదీలు) (శ్రీప్రభాకరశాస్త్రిలుగారి యభిప్రాయానుసారముగ నీరెండుదినములలో నేదియోయొకటి అన్నమాచార్యుల జన్మదినమై యుండవలయును.

శ్రీతిరుపతిదేవస్థానమువారు ప్రకటించిన గ్రంథములన్నిటియం దును, అన్నమాచార్యుని జననము ౧౪౨౪ అని వ్రాసియున్నారు. క్రోధిసంవత్సరమున నేనాఁడు స్వామిప్రత్యక్షమయ్యెనో చెప్పలేదు. అప్పటి కన్నమార్యునకుఁ బదారేండ్లు అనఁగా పదునాఱవయేఁడు జరుగుచున్నదని తలంపవలయును. లోకములో పదునారేండ్లవాఁడు అని చెప్పినప్పుడు పదునై దేండ్లునిండి పదునారేడవసంవత్సరము నడచు చుండెనని దలంచుట స్వాభావికము. ఈధర్మము నిప్పట్టున ననుసరిం చిచూచితి మేని, (క్రోధిసంవత్సర వైశాఖమాసముతో ౧౫ వత్సరము లు నిండినపిమ్మటఁ బదునాఱవసంవత్సరములో నెప్పుడో స్వామిప్రత్య క్షమైయుండును. దానినిబట్టి విరోధిసంవత్సర వైశాఖ శుక్లపూర్ణిమా (29 ఏ ప్రియలు ౧౪౨౪) సోమవార మాతనిజననకాలమైనది. ఆ నాఁడు పూర్ణిమయు విశాఖానక్షత్రమును నలువదిఘడియలవఱకు వ్యాపించియున్నవి. ఆనాఁడే యన్నమాచార్యుల జననకాలమై యున్నదని నిర్ణయింపవలసియున్నది.

ఈ రెండువాదములకును నారాగిరేకుపై వ్రాఁతయే యాధారము. క్రోధివాదమును బలపఱచు సాధనాంతరము లభించువఱకు విరోధివా దమే సమంజసమని నిర్ణయింతము.

చిన్నన్న వ్రాసిన అన్నయాచార్యచరిత్రమునందు అన్నయాచా ర్యుల జననకాలమునుగూర్చి—

"చక్రనిగ్రహము లుచ్చమున మూఁడలర
అనుపమలగ్నంబు నందు వైశాఖ
మున విశాఖను జగంబున నుల్లసిల్ల
జనియించె నన్నమాచార్యుండు"

అని వ్రాసియున్నాఁడు. అన్నయాచార్యులజాతకముఁ జూచి యీతఁ డీవాక్యములను వ్రాసియున్నట్లు గన్పట్టదు. ఈచరిత్ర వ్రాయు

నాఁటికి అన్నమాచార్యులు జన్మించి నూఱేండ్లు దాఁటియుండును. ఈ వాక్యములలో నన్నయ జన్మతిథిని సరిగా నిర్ణయించుట కాధారము లులేవు. తిథిగాని, వారముగాని, చెప్పియున్నచో గొంత యవకాశ ముండును. అట్టిది లేకపోవుటచేఁ బరంపరగవచ్చు జనశ్రుతినిబట్టి చిన్నన్న యీవాక్యములను వ్రాసియుండును. అన్నయాచార్యుల గేయము లాయనజీవితకాలములో రాగిరేకులపై కెక్కినట్లు కన్పట్టదు. పెదతిరుమలయ్యకాలములోను నటుపిమ్మటను నాకార్యము జరిగియుండును. అనఁగా రాగిరేకమీఁదివాక్యము లాయన జననకాలమునకుఁ నూఱేండ్లతరువాత లిఖితమైనవి, అయినను జిన్నన్న కాలమునాఁటికవి రేకులపై లిఖితమై యుండుటచే యీవాక్యములలోని విషయములను జినన్న యీరేకులమూలముననఁగాని మరియొక విధముగాఁగాని యెఱిం గియుండునని తలంపవలసియున్నది.

క్రోధిసంవత్సర మన్నమయ్యజననకాలమని చిన్నన్న యెఱిఁగి యుండెనేని, పైద్విపదలలో నాసంవత్సరముపేరు చెప్పకయుండఁడు. కావునఁగ్రోధివత్సర మాతనిజననకాలము కాదనియు గేయరచనా ప్రారంభకాలమనియు నిర్ణయింపఁదగియున్నది.

అన్నమాచార్యుని జననకాలనిర్ణయసందర్భమున నింకనొక విషయ మాలోచింపవలసియున్నది. అన్నయాచార్యులు తనపౌత్త్రుఁ డైన చినతిరుమలయ్యకు బ్రహ్మోపదేశము చేసెను. కావున నాచిన తిరుమలయ్య జననము ౧౪౮౦ ప్రాంతమని శ్రీప్రభాకరశాస్త్రులవారు వ్రాసియున్నారు. దీనినిబట్టి ఉపనయనమయిన నెలలోపుగనే యన్న యాచార్యులు స్వర్గమలంకరించెనని తేలుచున్నది. అట్లనుట కాధార ములులేవు.

తిరుమలదేవస్థానము రిపోర్టులోఁ బెదతిరుమలయ్య నాల్గవ సంతానమైనచిన్నన్న (అష్టమహిషీకళ్యాణాదిగ్రంథకర్త) క్రీ.శ.౧౫౪౬

౧౪౬౧ కాలమువాఁడని వ్రాసియున్నారు. దానినిబట్టి లెక్కించి చూచినచోఁ బెదతిరుమలయ్యకుఁ బ్రథమసంతానమైన చినతిరుమలయ్య క్రీ.శ. ౧౪౮౫ ప్రాంతమున జన్మించియున్నట్లు తేలుచున్నది. అప్పటికి బెదతిరుమలయ్యకు ముప్పదియేండ్లున్నవన్నచో నాతనిజననము ౧౪౫౫ ప్రాంతమగును. దీనినిబట్టికూడ నన్నయాచార్యుల జననము క్రీ.శ. ౧౪౦౮ అనుటయే యుచితము.

చినతిరుమలాచార్యులు తనపితామహుఁడైన యన్నయాచార్యులను సంబోధించుచు, వ్రాసినకీర్తన యొకటియున్నది. అది యన్నయాచార్యుల జీవితకాలములో రచించినట్లు కన్పట్టుచున్నది. చినతిరుమలయ్యజననము శ్రీశాస్త్రిలుగారనినట్లు ౧౪౮౫ ప్రాంతమైనచో నన్నమాచార్యుల జీవితకాలములో నాకీర్తనవ్రాయుట యసంభవము. సర్వదా భగవద్ధ్యానతత్పరుఁడై విరాగిగా నున్నయాతనికిఁ బిల్లనిచ్చుటకెవ్వరు నంగీకరింపఁ లేదనియు శ్రీవెంకటేశ్వరుని యనుగ్రహముచేఁ బెండ్లియయ్యెననియుఁ జిన్నన్న వ్రాసియున్నాఁడు. సామాన్యముగా నాకాలమునఁ పెండ్లివయసు ముప్పదివత్సరములు, ఈతని విషయమున ముప్పదియైదుసంవత్సరము లనుకొందము. ప్రభాకరశాస్త్రిగారియూహ ననుసరించి యీతనిజననము క్రీ.శ. ౧౪౦౮ అయినచోఁ బెండ్లికాలము ౧౪౪౩ అగును. ఆకాలమున రజస్వలానంతరవివాహములు లేవు. తిమ్మక్కవయసు వివాహకాలమునాఁటికి ౧౦ సంవత్సరము లనుకొనినచో తిమ్మక్క (తిరుమలాంబ) కు నరసింగన్న జననము దాదాపుగ ౧౪౬౫ అగును.

చిన్నన్నవ్రాసినదానినిబట్టి యన్నయాచార్యులకు రెండువివాహములు నొక్కసారియే జరిగినట్లు తోఁచుచున్నది. ఒకకన్యనిచ్చుటకే సంశయించుచున్నప్పుడు, "తిరిపెమున కిద్దరాండ్రా?" యనినట్లిరువురు కన్యల నొక్కమారిచ్చి పరిణయములను జేసిరని తలంపరాదు.

౧ అన్నమాచార్య చరిత్ర పీఠిక ౯౧వ పుట.

నరసింగన్నను గనినపిమ్మట తిరుమలమ్మ చనిపోయియుండును. తరువాత నక్కలమ్మను బెండ్లియాడి యామెవలనఁ బెదతిరుమలాచార్యాదులను గనియుండును. అక్కలమ్మ పరిణయముకూడ రజస్వలానంతర వివాహమై యుండదు. ఈసందర్భములన్నిటిని గమనించినచో ప్రభాకరశాస్త్రిలుగారి వాదమునుబట్టి పెదతిరుమలయ్య జననము ౧౫౭౫ ప్రాంతమై చినతిరుమలయ్య కన్న యాచార్యులు బ్రహ్మోపదేశము చేయుట కనకాశము లేనిస్థితి యేర్పడును. తిరుమలమ్మసంతానము నరసింగన్న దక్క మఱియెవ్వరును లేరనుటనుబట్టి యామెచనిపోయిన పిమ్మటనే రెండవవివాహము జరిగెనని స్పష్ట మగుచున్నది.

చినన్న రచించినచరిత్రను జదివిచూచినచో నన్నమాచార్యులు పెండ్లికిపూర్వమే శతకరచనము, ముద్రాంకితము విద్యాభ్యాసము పంచసంస్కరణములు మొదలైనవి జరిగియుండెనని స్పష్టమగుచున్నది. ఒకవేళ నాతనిపరిణయము నాఁటివయస్సు ముప్పదేండ్లనినను పైని జూపిన వ్యత్యాసముకూడిరాదు. ఈవ్యత్యాసము లేకుండఁ జేయవలయుననిచో నన్నమాచార్యులజననము క్రీ. శ. ౧౪౦౯ విరోధిసంవత్సర వైశాఖ శు ౧౫ యనినిర్ణయింపవలసి యుండును.

చిన్నన్న రచించినచరిత్రములో నన్నమాచార్యుని జననకాలమున మూఁడు గ్రహములుచ్చరాసులయందున్నట్లు చిన్నన్న వ్రాసియున్నాడు. గ్రహనామములనుగాని రాసుల పేరులనుగాని యిచ్చియుండినచో నన్నయార్యుని జననకాలమును సులభముగా నిర్ణయింపవచ్చును. కాని చిన్నన్న యావివరముల నీయలేదు. ఆవివరము లాతనికిని దెలిసియుండవు. పెద్దలు చెప్పినమాటలనుబట్టి యాతఁడాచరణములను వ్రాసియుండును. జననలగ్నమునైన వ్రాసియుండకపోవుటచే జిన్నన్నయొద్ద నన్నయాచార్యుల జాతకము లేదనినిర్ణయింపవలసియున్నది.

పైనవ్రాసినచర్చలో నన్నమయ్యజననకాలములు రెండేర్పడినవి. (౧) క్రోధిసంవత్సర వైశాఖబహుళవిదియ (క్రీ.శ. ౧౪౨౪ ఏప్రి

యలు ౧౪-౧౫ తేదీలు (౨) విరోధిసంవత్సర వైశాఖ శు ౧౫ సోమవారము (౨౯ ఏప్రియలు ౧౪౦౯ వ సంవత్సరము) ఈరెండు దినములలో మూఁడుగ్రహము లుచ్చరాసులయం దున్నదిన మేదియో కనుగొనినచో నాతనిజననకాలము నిర్ణయింప వచ్చునని చూచితిని. డాక్టరు స్వామికన్ను పిళ్ళెగారిపంచాంగమునుబట్టి యీవిషయము నిర్ధారణము చేయవచ్చును. కాని యాపంచాంగము ఆధునికగణితశాస్త్ర విజ్ఞానమునకుఁ బూర్వసిద్ధాంతగణితముతో సమన్వయము చేయుటకై మధ్యమార్గమును గనిపెట్టి తదనుగుణముగ గుణించినదిగా నున్నది. ఇప్పటి సిద్ధాంతుల పంచాంగములను జూచితిమేని గ్రహముల స్థితిగతులలోఁ జాలభేదములు గన్పట్టుచున్నవి. అయిదు వందల సంవత్సరములకుఁ బూర్వ మేపంచాంగము ననుసరించి గ్రహస్థితిని నిర్ణయించిరో చెప్పఁజాలము. సూర్యసిద్ధాంతమునకు యెల్లయార్యుఁడు వ్యాఖ్యానము చేసిన కాలమది. అప్పటికి బీజసంస్కారము చేయవలయునా? అక్కఱ లేదా? యనువిషయము వివాదగ్రస్తమై యున్న ట్లెల్లయార్యునివాక్యములవలన తోఁచును. అట్టిపరిస్థితులలో మూఁడుగ్రహములస్థితినిబట్టి యన్నయార్యుని జననకాలమును నిశ్చయముగాఁ గనుగొనఁజాలము. అయినను నెట్లువచ్చునో చూతమని గణితముచేసి చూచితిని, క్రోధి సంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమనాఁడు రవిశుక్రశను లుచ్చస్థానములయందుండినట్లును విరోధిసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమనాఁడు గురుకుజ, రవులుచ్చస్థానగతులై యుండిరనియుఁ గనుపట్టుచున్నది. అన్నయార్యుని జననసంవత్సరము విరోధియో క్రోధియో సునిశ్చితముగ నిర్ణయించుట కీగణనము తోడుపడలేదు.

ఈచర్చనింతటితో వదలి బలమైన వేఱువిధ మగుసాక్ష్యములభించువఱకు విరోధిసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమయే యన్నమాచార్యునిజననకాలమని నిర్ణయింతము. శ్రీవెంకటేశ్వర వచనముల పీఠికలో శ్రీప్రభాకరశాస్త్రులుగారే అన్నమాచార్యులజననము క్రీ.శ. ౧౪౦౯

అనివ్రాసియున్నారు. తమయభిప్రాయమును మార్చుకొనినప్పుడును, తిరుపతి దేవస్థాన ప్రకటనములతో భిన్నాభిప్రాయులైనపుడును శ్రీ ప్రభాకరశాస్త్రులువారు అందులకుఁ దమకుఁ గ్రొత్తగా లభించిన యాధారములను దెలిపియుండినచో నిప్పుడింతచర్చ కవసరము లేకపోయెడిది. అట్టియాధారముల నెచ్చటనైన శ్రీశాస్త్రులువారు తెలిపియుండిరేమో నాకుఁ దెలియలేదు. అవి లభించినచో వానిని బరిశీలించి సత్యమని తోఁచినచోఁ బ్రభాకరశాస్త్రులుగారి యభిప్రాయముతో నేకీభవింపవచ్చును.

క్రీ. శ. ౧౪౫౦ మొదలు ౧౪౯౧ వఱకు కర్ణాటరాజ్యమున దండనాయకుఁడుగను మంత్రిగను బరిపాలనాధికారిగను దుదకుఁ గర్ణాటకసింహాసనాధినేతగను నుండిన సాళువ నరసింగరాయ లీయన్న మార్యుని బహువిధముల గౌరవించి పూజింపుచుండెడివాఁడు. నరసింహరాయల యౌన్నత్యమంతయు నన్నమాచార్యుని యనుగ్రహము వలననే లభ్యమైనది. రాయలు వేంకటేశ్వరభక్తుఁడు. అన్నమాచార్యుల యుపదేశానుసారముగ శ్రీ వేంకటేశ్వరుని సేవించి నరసింహరాయలు కర్ణాటరాజ్యశ్రీ నొందఁగలిగెను.

తుళువ వీరనరసింహరాయలు సింహాసన మధిష్ఠించుటకుఁ బూర్వమే యన్నమాచార్యులు పరమపదము నందెను. శ్రీ వెంకటేశ్వరస్వామి వారియనుగ్రహముచే సంగమ, సాళువ, తుళువ వంశజులు కర్ణాటకరాజ్యమున నభివృద్ధిగనుటయు, వారికాలముననే శ్రీ వెంకటేశ్వరప్రతిష్ఠ హెచ్చుటయు జరిగినది. మానవుల కైహికాముష్మికఫల సిద్ధియగుటకును దేవస్థానములకుఁ గీర్తిప్రతిష్ఠలు లభించుటకును భగవంతునియందు మానవులకుండు భక్తివిశ్వాసములే కారణములు.

సామాన్యమానవాతీతములగు మహిమలుగొన్ని యన్నయాచార్యుల యొద్దఁగన్పట్టెనని చిన్నన్న వ్రాసిన చారిత్రమువలన దెలియుచున్నది.[౧]

---

౧ అన్నమాచార్య చరిత్ర పీఠిక.

సాళువ నరసింహరాయలు, వెంకటేశ్వరస్వామిపై నన్నయాచార్యులు రచించిన శృంగారకీర్తనలనువిని యానందపరవశుఁడై తనపై నట్టిశృంగారకీర్తనలను రచియింపుమని యన్నమాచార్యులనడిగెనఁట! నరకృతివిముఖుఁ డగునాతఁ డందుల కీయకొనలేదఁట! అందుపై రాయలతనిపై గినుకఁ జెంది యాతనికి సంకెలలను వేయించెనఁట. అప్పుఁడాచార్యులు శ్రీవెంకటేశ్వరు నుద్దేశించి సంకెలలఁ దొలగించుమని యొకకీర్తనను జెప్ప నవి విడిపోయెనఁట! రాయ లది సేవకులకృత్యమని భావించి మరల సంకెలఁదగిలించి నీకు మహిమయున్నచో నాయెదుట సంకెలనుండి విముక్తుఁడ వగుమని యనెనఁట! భక్తాగ్రగణ్యుఁడైన యన్నయ్య మఱియొకకీర్తనపాడఁగా నాసంకెల ముక్కలైపోయెనఁట! నరసింహరాయ లాశ్చర్యమునొంది పశ్చాత్తప్తుఁడై యాతని శరణుజొచ్చి కటాక్షింపుమని వేడుకొనియెనఁట! అన్నయాచార్యులు పగనహింపక యాతని ననుగ్రహించెనట.

(౨) అన్నమాచార్యులవారి యగ్రహారములో నొకమామిడిచెట్టు గలదఁట. దానిఫలములు మిగులపులుపును జీడివాసనయుఁ గలవఁట! వానిని స్వామికి నివేదనచేసి తానుతినఁగాఁ బండ్లుపులిసిపోయెనఁట! స్వామిదంతములుకూడఁ బులిసిపోయియుండునని తలంచి విచారమునొంది యాచెట్టుపండ్లను మధురముగా నుండునట్లు చేయుమని శ్రీవేంకటేశ్వరుని ప్రార్థించుచు నొకకీర్తనను రచింపఁగా నంతట నుండియు నాచెట్టుఫలము లతిమాధుర్యముగా నుండెడివఁట!

ఇట్టి మహిమ లెన్నియోగలవు. వాని నెఱుంగఁగోరువారు చిన్నన్న రచించిన చారిత్రమును శ్రీ శాస్త్రులుగారి పీఠికతోఁగూడ పఠించి యానందించెదరుగాక!

అన్నమాచార్యుల రచనలనుగూర్చి చినన్న వ్రాసిన ద్విపదల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

"యోగమార్గంబున నొకకొన్ని బుధులు
వైరాగ్యవచనతో వాసింపఁగొన్ని
సతవత్త్వమునఁ దాళప్రముఖముల్ గాఁగ
ప్రవిమలద్విపద ప్రబంధరూపమున
నావెంకటాద్రిమాహాత్మ్య మంతయును
శతకముల్ పదిరెండు వకలభాషలను
రాగిల్ల శృంగారరసరీతిఁగొన్ని
సారసనేత్రుపై సంకీర్తనములు
పరమతంత్రములుముప్పదిరెండు వేలు
సవముగా రామాయణము దివ్యభాష
గావించి రుచుల శృంగారమంజరియు
ప్రతిలేనినానాప్రబంధముల్ చేసి."

భక్తాగ్రేసరుఁ డైనపురందర దాసీయన్నమాచార్యుల కాలమువాఁడఁట !

అన్నమాచార్యులయర్థాంగియైన తిరుమలాంబ రచించిన సుభద్రాపరిణయము చక్కనిశైలిలో మనోహరముగా నున్నది. సుభద్రపాత్రను చేమకూర వెంకటకవికంటెఁ దిరుమలాంబ, స్త్రీగావునఁ జక్కగాఁ బోషించినది. ఈమెగ్రంథములోని పదములనే కొన్నిటిని వెంకటకవి తన విజయవిలాసమునఁ జేర్చినాఁడు.

"ఎగుబుజంబులవాఁడు– మృగరాజనడుము
నడచివచ్చుకొను నె– న్నడుముగలవాఁడు
గరగరనివాడు చ– క్కనివాఁడు వతఁడు
గొప్పకన్నులవాఁడు– కోదండగుణకి
ణాంకంబులౌబాహు– లమరినవాఁడు
వెన్నున మచ్చగల– విభవంబువాఁడు
బవిరిగడ్డమువాఁడు– పన్నిదంబిడిన
వెన్నుపగడసాల– వెసనాడవచ్చు. —తిమ్మక్క.

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబుఁ
బుడికిపుచ్చుకొను సన్నడుమువాఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాంకము
లైనముంజేతు లమరువాఁడు

బవిరిగడ్డమువాఁడు పన్నిదం బిడి డాగవచ్చు
నందవు వెన్నుమచ్చవాఁడు
గరగరనివాఁడు నవ్వు మొగంబువాఁడు

—వేంకటకవి.

ఈతిరుమలాంబ తనయౌవనదశలోనే యీగ్రంథమును క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున రచియించియుండెనని తలంపవలసియున్నది.



# 117. తాళ్లపాక పెదతిరుమలాచార్యులు



ఈకవికిఁ బెదతిరుమలయ్య, పెదతిరుమలయ్యంగారు, అన్నయ తిరుమలార్యుఁడు, అన్నయతిమ్మనార్యుఁడు, పెరియతిరుమలయ్యంగారు తిమ్మయ, తిరుమలతిరుమలాచార్యుఁడు, తిమ్మయార్యుఁడు, తిరుమల గురుఁడు, తిరుమలరాయదేశికుఁడు, తలవాకతిరుమలయ్య, అనువాడుక పేరు లున్నవి.

ఇతఁడు నందవరీకబ్రాహ్మణుఁడు; ఋగ్వేది; ఆశ్వలాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; శృంగారసంకీర్తనలు మొదలగు ననేక గ్రంథములను రచించినఅన్నమయ్య యీకవికిఁ దండ్రి; ఈకవితల్లి పేరు అక్కాంబ. ఈతనినివాసము తిరుపతి. ఈతనితండ్రియైన అన్నమార్యుని చరిత్రము నిందు వ్రాసియున్నాఁడను. (ఆంధ్రకవితరంగిణి ఆఱవ సంపుటము.) ఇతనిసవతితల్లి తిమ్మక్క కవయిత్రి. ఆమె చారిత్రము నింతకుముందు వ్రాసియున్నాఁడను.

ఈపెదతిరుమలార్యున కైదుగురు పుత్త్రులు. వీరిలోఁ గొందఱు కవులు, వారిచారిత్రముల నిందుఁ గ్రమముగ వ్రాయుదును.

ఈతనితండ్రి యైనయన్నమయ్య క్రీ. శ. ౧౪౦౮ వ సంవత్సరమునజన్మించి ౧౫౦౩ వ సంవత్సరమునఁ గాలధర్మము నొందెనని యాతనిచరిత్రమున వ్రాసియుంటిని. ఈ పెదతిరుమలాచార్యులు ౧౪౬౦ ప్రాంతమున జన్మించి తండ్రివలెనే తొంబదిసంవత్సరములు జీవించి ౧౫౪౭ ప్రాంతమున నిహలోకమును వీడియుండెను. క్రీ శ. ౧౫౪౬ వఱకు నీతనిశాసనములు కన్పించుచున్నవి.

ఇతఁడు శృంగారకీర్తనలు, శృంగారదండకము, శృంగారవృత్తశతకము, వైరాగ్యవచనగీతములు, చక్రవాళమంజరి, వెంకటేశోదాహరణము, వెంకటేశనీతిశతకము, సుదర్శనరగడ, రేఫఱకారనిర్ణయము, ఆంధ్రభగవద్గీత, ఆంధ్రహరివంశము, మేలుకొలుపుద్విపద, ఆంధ్రవేదాంతము, అనుగ్రంథములను రచియించెను.

ఇతఁడు శ్రీవేంకటేశ్వరభక్తుఁడై, సర్వదా యాతనిసన్నిధానమునఁ గీర్తనలను గానముచేయుచుఁ దనధనమును స్వామి కర్పించుచు స్వామిభాండాగారమునుండి బహుమతులను బడయుచు నన్నవస్త్రములకు లోటు లేకుండ పుత్రపౌత్రాదిసంపత్తిగలిగి జీవితమును సుఖముగాఁ గడపినమహాపురుషుఁడు. ఇతని యిష్టదైవము శ్రీవెంకటేశ్వరుఁడు అలవేలుమంగ "తాళ్ళపాకవారి యాఁడుపడుచు"అని నమ్మకము శ్రీవేంకటేశ్వరుని కళ్యాణకాలమున వీరే పీటలపైఁ గూర్చుండి కన్యాదానము చేయుదురు.

ఈతిరుమలాచార్యుని కవిత్వముననచ్చటచ్చట వ్యర్థపదప్రయోగములు గన్పట్టినను మనోహరమై ధారాశుద్ధికలిగి ద్రాక్షాపాకమున నీతనికవిత విరాజిల్లుచున్నది. ఈతని రచనములనుండి శైలిఁజూపుటకై

యుదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాఁడను. గేయములు వ్యాకరణమునకు లొంగవు.

(౧) శృంగారకీర్తనము:—

ఆహిరి:- ఏమని చెప్పుదునే యిటువంటి వేడుకలు
కామించి యాతండు నాకు కడుంజపి చూపెను॥

చరణము

తెరదీసి యానలతో దృష్టించిచూచిన చూపు
వరుసనవ్వులి మోము మిన్నులై ననవ్వు
పరువము దప్పకుండా పాచికూడినకూటమి
సరుగ నిండుసిగ్గులు జారినప్పటిరీతి॥
కొంచక వొట్లు పెట్టుకోగా వేడుకొనుటలు
మించి యలుక దేరినమీఁదిమాటలు
అంచవసంతము లెట్లాడి కౌగిలి
యెంచి నాల్లునాళ్ళుచేసి యెనయునాటితమి॥
జడియక సురతము సలిపిన మీఁదినిద్ర
యెడమాటల దించె వొడంబాట్లు
అడరి శ్రీవేంకటేశుం డన్నిట నన్ను నేలి
యెడయనివలపుల యింపులుపుట్టించెను॥

(౨) అధ్యాత్మ సంకీర్తనము:—

పల్లవి:— రామ రామ రామ కృష్ణ రాజీవలోచన నీకు
దీమువంటి బంటననే తేజము నాది॥

చరణము:— వారిధి దాటి మెప్పించ వాయుజుఁడ నేగాను
సారెఁ జవుల మెప్పించ శబరిఁ గాను
బిరాన సీతనిచ్చి మెప్పించ జనకుండఁ గాను
యేరీతి మెప్పింతు నన్ను యెట్లుగాచేవో॥

ఘనమైన మోఁచి మెప్పించ గరుడుండ నేఁగాను
కొనఁ గామసుఖ మియ్య గోపికంగాను
వినుతించి మెప్పించ వేయినోళ్ళభోగిఁ గాను
నిను నెట్లు మెప్పింతు ననుఁ గాచేదెట్లో॥
నవ్వుచుఁ బాడి మెప్పించ నారదుఁడ నేఁగాను
అవ్వలఁ బ్రాణమియ్య జటాయువుం గాను
యివ్వల శ్రీవేంకటేశ నీకే యిటు శరణంటి
అవ్వల నా తెరువేదో రక్షించే దెట్లో॥

(3) చక్రవాళమంజరి:—

శ్రీలలనాధారు చిన్మయాకారుఁ గారుణ్యవర్తి, వెంకటగిరిమూర్తి
మూర్తిత్రయశరీరు మునిజనోద్ధారు ధారుణీసంగు సత్తమశోభితాంగు
సంగుప్తభవసింధు యదులోకబంధు బంధురబలతూరు ఖకవిచారు.
జారుచక్రాబ్జాంకు సమరనిశ్శంకు శంకుకర్ణాద్యంకు జలజపత్రాక్షు

* * *

సలరేయివిరహాగ్ని సలసినయఖిల ఖగంబులై సట్టిపడతులా వెతఁ
దలపోసి సకియచిత్తములోనమన్న యున్నత శ్రీవెంకటోర్వీధరేశు
నీలకవాణితో వెనయింపతున్న సున్నమాటలఁ బోవ దోడతుఁ డికను

* * *

పాకశాసనుఁడు వైభవముల నొనరు నరులలోఁ బూజ్యుఁ డప్పయవర్య తనయ
నయశాలి తిమ్మయ్య నవచతురతల దలఁచి మంజరిచెప్పెఁ దజ్ఞు లింపార.

(౪) నీతిశతకము:—

అడుసు చేతులఁ దివియంగ వచ్చు నొకవేళ
బలిసి యొండిన గడ్డపారవలయు
నాఁకటివేళనే యన్నంబు రుచియగు
దనిసెనే నోకిలింతలు గదరిగుఁ
దటితోడ విత్తినఁ దలచుగాఁబండు జే
నేపుడైన విత్తిన నీచపోవు

బంటు నాయా వేళ పనిఁగొనవలెఁ గాని
యలవాటు దప్పిన నడిచిపడును

వేళవేళలఁ గార్యముల్ వెలయఁజేయ
వలయు నొకయింత దప్పిన వళముగాదు
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ
విమలరవికోటిసంకాశ వేంకటేశ.

గీ. యన్నమాచార్యసుత తిమ్మయార్యుఁడుఁ
బ్రకృతి చేసితిఁ జేకొమ్ము పద్యశతము ॥కలిత॥

(౫) సుదర్శనరగడ:— శ్రీమహావిష్ణుని చక్రాయుధమునకు సుదర్శనమని పేరు. దానిపైనిఁ జెప్పిన రగడ యిది.

మంత్రాధిరాజమానితచక్రము యంత్రపీఠమధ్యాపితచక్రము
కుంజరపాలవగుణయుతచక్రము రంజితపుష్పపరాగము చక్రము
వంధ్యేతరగర్వస్ఫుటచక్రము సంధ్యారుణపటసంవృతచక్రము
మిథ్యావాదతిమిరహరచక్రము తథ్యామృతసంతర్పితచక్రము,
నరసింహమంత్రనామపుంజచక్రము ధృతనక్షరములధామైనచక్రము
మహాసుదర్శనమంత్రముచక్రము విహరితవజ్రవిధములచక్రము
అంబరవతసింహాక్షరచక్రము సాంబుజాక్షపాశాంకుశచక్రము
మానితదిక్పతిమంత్రముచక్రము నానావిధహరినామపుంజచక్రము.

(౬.) శ్రీవేంకటేశోదాహరణము:—

ఉ. శ్రీరి పదాబ్జసేవలయిన కొమ్మల నెమ్మదిఁ బెండ్లియాడియున్
ధారుణి బ్రహ్మచారినని తప్పక పల్కి పరీక్షితున్ మహో
దారతఁ బ్రాణమెత్తుచుఁ బ్రతాపము మీఱఁగఁ బ్రోచు మోహనా
కారునియందు వేంకటశిఖామణియందు మనంబు నిల్పెదన్. ౧

కలిక

మఱియు శోభిగుణాభిమానియందుఁ
దఱి నాభిజనుతాభిధానియందు

శతపత్రసమనేత్ర శౌరియందుఁ
దతచిరగోత్రధారియందు
శతకోటి శతకోటి సారియందుఁ
గ్రితువాటి రిపుదాటికారియందు
భుజగేంద్ర ఘనసాంద్రభుజునియందు
రజనీంద్ర రుంద్రగోత్రజునియందు. ౨౦

ఉత్కళిక

భువియుఁ భవనంబు దివియు భువనంబు
రుచులు నచరంబు ఖచరనిచయంబు
నలరుబలుసొంపు గలుగుచెలువంపు
ధరణీధరునందుఁ బరమగురునందు. ౨౧

(౭) రేఫ ఱకారములు, రేఫ ఱకారనిర్ణయ మనిదీనికిఁ బేరు. రేఫలను ౫౭౭ గీతములలోను ఱకారములను ౫౭౩ గీతములలోను వివరించియున్నాఁడు. ఇందలిశబ్దము లక్షరక్రమమున నున్నవి.

“కోరప్పన మనఁగా జే
కూరుట యనఁ దక్కరనగ– గోరికలనఁగా
గూరిమి యనఁగా నతనికిఁ
గూడుతు నన రేఫలయ్యె గుణనిధికృష్ణా. ౧౬
జటిగొని యొకచో జాజఱ
జఱజఱ నొకజెట్టిపోతు జాఱె ననంగా
జఱుపుచ్చ జఱభి జోఱజోఱ
జిఱజిఱ యనఁ బెద్దజాలు చెలువుగఁ గృష్ణా. ౨౧

(౮) శృంగారదండకము

“వాఁడి పూజోంపముల్ వేఁడిక్రొవ్వెన్నెలల్; క్రూరముల్ కీరముల్ ఘోరముల్ భృంగఝుంకారముల్; దీపితారోపముల్ కోకిలాలాప

ముల్; విస్ఫురత్కోరకపముల్ చిత్రపాంచాలికా రూపముల్; జాలముల్ మందవాతూలముల్; సంతతాభీలముల్ సారికాజాలముల్ వీని నేనెట్లు సైరింతుఁ జేతోభవాస్త్రంబు లేరీతి వారింతునో యంచుఁ జింతన్ గపోలోపరిన్యస్తహస్తాబ్జయై దుస్తరస్వేదయై యావమన్మస్తయై మోము వాడంగఁ జెన్గొప్ప పీడంగ జన్గవ్వు జాఱంగ నిట్టూర్పు మీఱంగ బెట్టాసలూరంగ మైఁ బారవశ్యంబు దేరంగ

"ఉ. నన్నుతిఁ దాళ్ళపాకపురశాసనుఁ డన్నయతిమ్మనార్యుఁడ
త్యున్నతిఁ జెప్పె దండకము దుగ్ధపయోనిధికన్యకారతి
స్విన్నమృగీమదాంకునకు వేంకటభర్తకు నిత్యభోగసం
పన్నన కా రవీందుకులపర్వతతారకమై చెలంగఁగాన్.

(౯) వైరాగ్య వచన మాలికాగీతములు :-

సాళంగనాట (పల్లవి).

"నిగమగోచరా నామనంబు యోగంబు సేయంగడంగిన
చండాల గర్దభ శునక కాంతాదులు తలంపునం బారెడిని
యంతట నదివిడిచి పురాణంబు చదువంజూచిన
శూర్పణఖా విరాధ కబంధ రావణకుంభకర్ణాదుల
నామంబులునోరం దొరలెడిని
అదిమాని జపంబు సేయంబూనిన నావలింతయు
నిద్రాయు నలసత్వంబాదివెడిని
యదిచాలించి తీర్థయాత్రకుతూహలుండనైన
తెరువుకా చోర వ్యాఘ్రమకరాదిభయంబులు వడంకం
జేయఁదొడంగెడిని
యీరీతుల నాప్రయత్నంబు లెక్కడి కెక్కు,
నేనొక్కటిదలంచిన వేఱొకచందంబున నీమాయ భ్రమయింపుచున్నది
యేయుపాయంబున నిన్ను నావశము సేసుకొనియెద

నాచందము నాకు బోధింపవే నీవు జగద్గురుండవు నారహ
స్యము నీచేతనున్నది. శ్రీవేంకటేశ్వరా. ॥౨౭॥

(౧౦) శృంగారవృత్తశతకము.

"ఉ. శ్రీగలవాఁడ వేయనినఁ జెల్లును నేనిఁక నడ్డమాడినిన్
బాగులుగావు హావమునఁ బంతము దక్కును మీఱిపల్కినం
దీగెలు సాగి యీరొకటి దీయఁగఁ బేనటువచ్చునందుగ్రి నీ
భోగము నాకు నిచ్చితివి పొందుగఁ దొల్తనె వేంకటేశ్వరా! ౫౧

చ. అలుగుచుఁ గాంత మాఱు మొగమై యటుచూచిన దర్పణంబునన్
బెళకక నీమొగంబు ప్రతిబింబము గానఁగవచ్చె నంతలోఁ
గలకల నీవునవ్వితివి కాంతయు నవ్వెను మీకు నడ్డమే
యలుకలు దీర్చెఁ దోడిచెలు లచ్చెరువందఁగ వేంకటేశ్వరా! ౬౪

చ. పులకలు మేన నించె నొకబోటిని బేర్కొనినంత నీకు నేఁ
బిలువఁగఁ బోదునో మగనిఁ బెంకిలిసేసినఁ బుణ్యహాని నా
వలపటు వెట్టు నీమననువచ్చినఁ జాలును నవ్వుగాదు పా
తలపుఁ బాయ లెప్పుడును దప్పదు శ్రీతిరువేంకటేశ్వరా! ౧౦

ఈ పెదతిరుమలాచార్యుల శాసనములు క్రీ.శ.౧౫౧౭ – మొదలు ౧౫౭౭వఱకుఁ గన్పించుచున్నవి. ఇతఁడు శ్రీకృష్ణదేవరాయలు, అచ్యుతరామరాయలు, సదాశివరాయలు, అళియరామరాయలకాలములలో నున్నవాఁడు ఇతఁడెప్పుడిచ్చిననేమి శ్రీవేంకటేశ్వరునకు ౧౦-౧౫ గ్రామముల నిచ్చెను. స్వామిపుష్కరిణిలో నీరాజనమంటపమును, నాతటాకమునకు నాల్గుప్రక్కలను ప్రదక్షిణమంటపములను, వరాహస్వామియాలయమునకు ప్రాకారములను శ్రీవేంకటేశ్వరాలయమునకుఁ దూర్పుగోపురమును స్వామిపుష్కరిణికి నల్లఱాతితో సోపానములను నింక నెన్నింటినో నిర్మించెను.౧ ఈ పెదతిరుమలాచార్యులనామ ముదాహృతము లైనశాసనములు పెక్కులున్నవి.౨

తిమ్మరుసుమంత్రిచేఁ బ్రసాదస్వామ్యమును ౧౫౩౨ వ సంవత్సరమున విలిచికొనెనని శ్రీకృష్ణరాయల చరిత్రమున వ్రాసియున్నాఁడను.

ఇతఁడు తాళ్ళపాకపురశాసకుఁడ నని చెప్పఁబొనియున్నాఁడు. ఆగ్రామకరణికము వీరిదేయై యుండును. ఈ తాళ్ళపాకవారు సర్వదా శ్రీవేంకటేశ్వర సేవచేయుచు కావ్యకర్తలై స్వామిసన్నిధిని గేయములను పాడుచుండుటచే స్వామిదర్శనార్థమే తెంచు యాత్రికులిచ్చు ద్రవ్యముచే ధనవంతులై సుఖముగాఁ గాలక్షేపముఁ జేయుచు తమద్రవ్యమును స్వామి కర్పించుచు నిహపరసాధకులై ధన్యజీవులైరి.

ఈ పెదతిరుమలాచార్యులు కృష్ణదేవరాయల రాజ్యప్రారంభకాలమున కేఁబదేండ్లవాఁడు. రాయలకాలములో నీతనికుమారుఁడైన చినతిరుమలరాయలుకూడ నున్నాఁడు. రాయలు వైష్ణవభక్తాగ్రేసరుఁడైనను, తాళ్ళపాక వారికాలములో నేడుమారులు తిరుపతివిచ్చేసియుండియుఁ దాళ్ళపాకవారిని గౌరవించినట్లు గానరాదనియుఁ బైఁగా వారినివాసగ్రామమైన తాళ్ళపాకను వ్యాసరాయతీర్థుల కగ్రహారముగాఁ నిచ్చివేసెననియుఁ నిందుమూలమునఁ దాళ్ళపాకవారిపై రాయలకు గౌరవభావము లేకపోఁగా నించుక ద్వేషభావము గలదేమో యని యనుమానము కలుగుచున్నదనియు శ్రీప్రభాకరశాస్త్రులుగా రన్నమాచార్యచరిత్రపీఠికలో వ్రాసియున్నారు. ఇవియాధారరహితము లైన యూహాలనియు, నిందు సత్యముండదనియుఁ దలంచుచున్నాఁడను, రాయలు రాజ్యమునకు వచ్చునప్పటి కన్నమాచార్యు లిహలోకమును వీడియుండెను. వ్యాసరాయల కగ్రహార మొసంగునాటికిఁ దాళ్ళపాక

---

౧ తి.దే.శా సం3సంఖ్య౧౨౨ 30-11-1517; సం.౪.సంఖ్య౯. 31-10-1530; సం౪సంఖ్య ౧౪ 27-3-1532; సం.౪, సంఖ్య౨౦.౪౧.౧౦౦ 25-10-1537; సం ౪ సంఖ్య౧౨౨ 15-1-1937 సం.౪ సంఖ్య౧౨౯ 17-3-1939; సం.౪ సంఖ్య౧౫౫. 12-2-1541; సం౫సంఖ్య3౪ 19-3-1944 సం౫సంఖ్య౪౩ 3-7-1945; సం౫సంఖ్య౪౭ A 3-7-1545 సం ౫.సంఖ్య౫౫ 2-8-1945; సం౫సంఖ్య౬౮, 20-6-1946

౨ A.R.607 of 1907 శక౧౪౫౬ 8 of 1904.శక౧౪౫3; ఇంకనుజాలగలవు

వా రాగ్రామమును వీడి తిరుపతిలోనో, వారియగ్రహార గ్రామముల లోనో నివాస మేర్పరచుకొనియుండును. తాళ్ళపాకను దాళ్లపాకవారి వద్దనుండి లాగికొని వ్యాసరాయల కిచ్చెననుట కాధారములు లేవు.

కృష్ణరాయలు తిరుపతివచ్చినప్పుడు తాళ్ళపాకవారిని గౌరవింప లేదనుటకును నాధారములులేవు. తిరుపతిశాసనములలో శ్రీకృష్ణరాయలు, శ్రీవేంకటేశ్వరస్వామికి, రత్నములు, ద్రవ్యము, ఆభరణములు మొదలగునవి యిచ్చినట్లు గన్పట్టుచున్నది. అట్లే పెదతిరుమలాచార్యులు మొదలగువారికి విశేషద్రవ్యము నిచ్చియుండవచ్చును. ద్రవ్యరూపమగుటచే నది శాసనముల కెక్కియుండదు.

ఈపెదతిరుమలాచార్యులను మండెము కోటలో నెవరో కత్తితోఁ బొడిచిరఁట! అది యాతనికిఁ బునర్జన్మమయ్యెనఁట! ఈవిషయమును, బెదతిరుమలయ్యయుఁ జినతిరుమలయ్యయుఁ జిన్నన్నయుఁ గూడ గ్రంథస్థము చేసియుండుటచే నది సత్యమని యంగీకరింపకతప్పదు. కాని యాదురాత్ముఁ డెవ్వఁడో వారు చెప్పలేదు. శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు స్పష్టముగాఁ జెప్పలేదు, కాని మండెమురాయఁడనఁగా నరసింహదండనాథుఁడనియు, నాకాలమున తుళువ నరసనాయకుఁడు దండనాథుఁడుగా నున్నాఁడు. కావున నాతని కీకథతో సంబంధముండి యుండుననియు, శ్రీకృష్ణరాయలకును పెదతిరుమలయ్యకు వైరస్యమునకిదియొక కారణమై యుండుననియు నూహాలపై మాహాలను జేసియున్నారు. ఈయూహాలకు లేశమాత్రము నాధారము లేదు. కొంచెమేని యాధారముండినచోఁ గొంతియూహను దానికి జేర్చి చెప్పవచ్చును. రాయలమంత్రియైన తిమ్మరుసును నాతనిసోదరుఁడైన గోవిందరాజును బెదతిరుమలయ్య చేసిన ధర్మములను బాలించినట్లు అన్నయాచార్య చరిత్ర పీఠికయందు శ్రీశాస్త్రిలువారే వ్రాసియున్నారు. కావునఁ గృష్ణరాయలకును దాళ్లపాకవారికిని వైరస్యమున్నదని తలంపరాదు. తాళ్లపాకవారు స్వతఃనరకృతి విముఖులు. శ్రీవేంకటేశ్వర పాదపద్మారాధ

కులు. రాజసన్మానమున కపేక్షించెడువారు కారు. వారును శ్రీకృష్ణరాయలును బరస్పరముపేక్షాభావమును గలిగియుండిన నుండవచ్చును. కాని యంతమాత్రమున వారిరువురు నొకరియెడనొకరు విరోధభావముతో మెలంగిరని తలంపఁజనదు.

అనేకులు కవులు రాయలచే సన్మానితులైనవారుకలరు. కాని యాతనికిఁ దమకృతుల నర్పించినవారిరువురే. పెదతిరుమలయ్య యొనర్చిన ధర్మకార్యములు పెక్కులున్నవి. ఈక్రింద పద్యశాసనముకూడ నాతనిదే.

సీ. శ్రీశాలివాహనాంచిత శకాబ్దము లెన్న
నిల వేయునన్నూఁట యేఁబదియును
నాలవయేఁడగు నందన సంవత్సర
వైశాఖపూర్ణిమా వాసరమున
శ్రీవేంకటాధీశ శృంగార సంకీర్త
నాచార్య తాళ్లపాకాన్నమార్య
పుత్త్రి తిమ్మార్యుండు పూర్వపుఁగోనేఱు
కట్టించె నవశిలాకలితముగను

తత్తటాంకణగోపుర ద్వారములను
భువనసన్నుతుఁడైనట్టిభూవరాహ
ఘనుని తిరుచుట్టుమాలె ప్రాకారవరము
తాన కట్టించె నాచంద్రతారకముగ. ౧

ఈపెదతిరుమలయ్య రచించిన వేంకటేశ్వర వచనములలో మచ్చునకొకటి రెండువచనముల నిటనుదాహరించి యీతనిచారిత్రమును ముగించెదను. ౧౬౬ వచనములను తిరుపతి దేవస్థానమువారు ప్రకటించియున్నారు.

౧౭౯. సకలలోకారాధ్యా! అన్నిచోటులనుండుదువు. గావున నేనెచ్చటనుండి సంచరించి వచ్చినను నీయొద్దనున్నవారమే; నీవు సకలలోకనాథుండవు గావున నిన్నుంగొలిచినవారమే; కన్నులయెదుట నున్నరూపంబులెల్ల నీశరీరంబు గావున నిన్ను సదాసేవించినవారమే; మాలో నెప్పుడు బాయకుండుదువు గావున నిన్నుందలంచిన వారమే; నేంగొనియెడి యాహారంబులు నీవిచ్చినవి గావున నీప్రసాదోజ్జీవనమే; నేఁజేయుచున్నకృషి గోరక్షణవాణిజ్యాదులు నీలీలకుపయోగంబులు గావున నవి నీపూజలే నన్ను నీవు పుట్టించినవాఁడవు గావున నీకామము నీతల్లి నీఁడేరెడిది. ఈయర్థంబు మఱవకాదరింపుమయ్యా! నే నెప్పుడు నీసూత్రింబుననాడెడు బొమ్మను. నావిన్నపములు పదివేలు విన్నపములుగా నవధరించి నన్నుంగరుణింపవే శ్రీవేంకటేశ్వరా!

౧౮౦ రవిచంద్రలోచనా! మావేడుకకు నీప్రత్యక్షంబుఁ గోరెదముగాక నీవు ప్రత్యక్షంబైన నెట్లు కనుఁగొననోపుదుము నీవు కోటిసూర్యప్రకాశుండవఁట. ఒకసూర్యుండు దృష్టులకు మిఁగుమిట్లుగొల్పెడిని నీ వెట్లుగోచరించెదవో యద్భుతంబు శ్రీవెంకటాద్రిమీఁద నీరూపంబు దర్శించితిమి. మాకునిదియె బ్రహ్మసాక్షాత్కారంబు శ్రీవేంకటేశ్వరా!

ఈవచనములలోఁ గొన్ని గేయములవలెఁ బాడనగును.



---

౧. అన్నమాచార్య చరిత్రపీఠిక పుట ౯౮.

# 118. తాళ్లపాక చిన్నన్న (తిరువెంగళనాథుఁడు)

ఈకవికి "చినతిరువెంగళుఁడు; చినతిరువెంగళనాథుఁడు; తిరువేంగళరుఁడు; తిరువేనథయ్యారు, తిరువెంగళనాథుఁడు, తిరువెంగళనాథయ్యంగారు; తిరువెంకటనాధారు, వెంగళార్యుఁడు. అని నామాంతరములుకలవు. శృంగారమంజర్యాది కావ్యములను రచియించిన యన్నయాచార్యుఁడీతనికిఁ బితామహుఁడు రేఫఱకార నిర్ణయాది గ్రంథములను రచియించిన పెదతిరుమలాచార్యు లీతనికిఁ దండ్రి; ఈకవితల్లి తిరుమలమ్మ తాళ్ళపాక అన్నమాచార్యుల చారిత్రమునందీయఁబడిన వంశవృక్షమువలన నీతనిగోత్రాదులును వంశావళియుఁ దెలియఁగలవు.

ఈకవి అష్టమహిషీకల్యాణము; పరమయోగి విలాసము; ఉషా పరిణయము; అన్నయాచార్య చరిత్రమునను నాలుగు ద్విపదకావ్యములను రచియించెను.

గీ. చిన్నన్న ద్విపద కెరఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెరఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.

ఈపద్యము తెనాలిరామకృష్ణుఁడు చెప్పినట్లు అప్పకవి తనలక్షణగ్రంథము నందుదాహరించియున్నాఁడు. ఈపద్యమందలి చిన్నన్నయే యీకవి చిన్నన్న పెదతిరుమలయ్యయే యీచిన్నన్నతండ్రి నరసింగన్న యనఁగా సంకుసాల నృసింహకవియని కొందరభిప్రాయ పడుచున్నారు. ఆవిషయమునుగూర్చి నృసింహకవి చారిత్రమున వ్రాసెదను.

ఈకవి కవిత్వము నిర్దుష్టమై శ్లాఘాపాత్రమైనది. మధురములగు కేటపదములలో మనోహరముగ ద్విపదలను రచియించుటయందీతఁడు

కడు నేర్పరి. దినమునకు వేయిద్విపదలను రచియింపఁగలనని యీతఁడీ క్రింది ద్విపదలలోఁ దనప్రజ్ఞావిశేషమును జెప్పుకొనియున్నాఁడు.

గనియె-వారలలోన గావ్యంబుఁ జెప్పి,
యెనలేని శ్రీవెంకటేశు మెప్పించి
సకలంబు నెరుఁగ నసాధారణాంక
మకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ.
దినములోనన వేయిద్విపద లింపొంద
వినుతవర్ణనలతోడ విరచించువాఁడ
గవిశిరఃకంప యోగ్యప్రతిద్విపద
నివబిరుదాంకుండ నాళీకసదన
వాసి నీవేంకటేశ్వర పాదపద్మ
వాసనాలోలుప స్వాంతషట్పదుఁడ
వినుతశీలుఁడఁ దిరువెంగళనాథుఁ
డను పేరఁ బ్రఖ్యాతి నందినయేను

ఈకవి తనగ్రంథములయందు సంస్కృతకవి ప్రశంసయే గాని యాంధ్రకవులను నుతింపలేదు. ఇతడు తనకావ్యములను రచించుటలో నవలంబించిన ద్విపదలక్షణముల నీక్రిందిద్విపదలలో నుడివియున్నాఁడు:

వానవుల్మువ్వురు వనజాప్తుఁ డొకఁడు భాసిల్లు నది యొక్కపదము శ్రీకాంత
క్రమమున నీనాల్గుగణములు వడచుఁ గ్రమదూతముగఁ బ్రయోగము సేయరాదు.
ఆపాదమునకు మూఁడవగణం బాది దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింప నవి ప్రాసయుతములై రెండు ద్విపదవా విలసిల్లి వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁ జెప్పవలయు నెపుఁడు సంస్కృతమున నితరభాషలను
యతులలోపలఁ బ్రాసయతిదక్క సకల యతులు చెల్లును బ్రయోగాతిసారమున
ద్విపదతో ద్విపద వంథిల నేకశబ్ద మప్పుడు రెంటను గూర్ప నది యయుక్తంబు
మఱియు సంస్కృతసమానరూపమున నెఱయ నెన్నిఁటనైన విర్మింపఁదగును
తెనుఁగున గూర్చినద్విపద యంత్యమున నొనరఁ గ్రియాంతసముచ్చయాంతముఁ అ
దనరు నకార ముత్వముఁ గూడె నేవి వినుతింప మత్తతద్విపదాదియందుఁ
గొనకొన్న స్వరముతోఁగూడ గాదనుచు నొకరింప సుకవీంద్రు లుద్దండమండు
అతనున్న నొనఁగూర్ప ననువైన హల్లు గరిమ నీద్విపదాదిఁ గనుపట్టనేని

తొలివిభక్తికిఁ దక్కు దుపవిభక్తంత ముఖ సకారములును ముకురబింబాస్య
యానకారము చెల్లు నరమున్నలగుచు నానిలకచభృంగ యలమేలుమంగ
యనులక్షణంబుల నమరొంగ సుకవి జనునుప్రయోగైక శరణమై నిఖిల
జగదేకనుతవిరాట్పందోవతిష్ఠ యగుచు నేడ్విపద విఖ్యాతి చెలంగ
వితతతల్లక్షణ ద్విపదమార్గమున మతినెన్ని కృష్ణాష్టమహిషీవివాహ
కృతి యొనర్చెదఁ జమత్కృతి నెంపటింపఁ జతురశృంగారవాచాప్రౌఢి మెఱసి.

ఈతనిగ్రంథవిషయముల నొక్కింత యిట వ్రాసెదను.

(౧) అష్టమహిషీకల్యాణము :—

ఇది యైదాశ్వాసములుకలదై యలమేలుమంగాదేవి కంకిత మైనది. శ్రీకృష్ణునిభార్యలైన రుక్మిణి, సత్యభామ, జాంబవతి మొదలగు నెనమండ్రు పట్టమహిషుల కళ్యాణకథ లిందువర్ణితములు. మొదటి మూఁడాశ్వాసములలోఁ గృష్ణునిబాల్య క్రీడలును నాల్గవయాశ్వాసమున రుక్మిణీవివాహకథయుఁ దక్కినయాశ్వాసములోఁ దక్కిన పట్టమహిషుల పరిణయవృత్తాంతములును జెప్పఁబడినవి.

(౨) పరమయోగివిలాసము :—

ఎనిమిదాశ్వాసములుకలది. శ్రీవేంకటేశ్వరునకు నలమేలుమంగకునంకితము. ఇందువిష్ణుభక్తులగు పన్నిద్దఱాళ్వారులయొక్కయు, యామునాచార్య రామానుజాచార్యాది వైష్ణవమతప్రవక్తలయొక్కయుఁ జరిత్రములు వర్ణింపఁబడినవి. ఈయాళ్వారులయొక్కయు నాచార్యుల యొక్కయు కాలము నీగ్రంథప్రకాశకులు పీఠికలో నిచ్చియున్నారు.

(3) ఉషాపరిణయము :—

హరివంశముననుసరించి తానీకావ్యమును రచియించినట్లు కవి యీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

"హరివంశమార్గోక్త మగునుషాకన్య
కరమొప్పఁ బరిణయక్రమ మెట్టిదనిన

తిరుపతి దేవస్థానము వారీ 'యుషాకళ్యాణము'ను బ్రకటించుచు నాగ్రంథమున నీకథతో సంబంధించిన హరివంశశ్లోకములనుగూడఁ బ్రకటించియున్నారు. అది ౧౩౦ అధ్యాయములలో ౧౩౫౭ శ్లోకములను గలిగియున్నది చిన్నన్న యాకథను ౧౯౬౦ ద్విపదలలో ఘటియించియున్నాడు. సంస్కృతమున కిది యాంధ్రీకరణమని చెప్పరాదు. కాని స్వేచ్ఛానువాదమని చెప్పవచ్చును. ఆంధ్రభాగవతమునఁగూడ నీకథయున్నది. ఈకథను "ఎఱ్ఱాప్రెగడ" దాదాపు ౬౦౦ పద్యములలోను నాచన సోముఁడాఱువందల పద్యములలోను సంఘటించియున్నారు.

బాణాసురుని పుత్రికయగు నుషాకన్యను, శ్రీకృష్ణుని పౌత్రుఁడగు ననిరుద్ధుఁడు పరిణయమాడుటయు బాణాసురుని జయించుటయు మొదలుగాఁగల యిందలికథ సుప్రసిద్ధమైనది. కవులనేకులీకథను ప్రత్యేక ప్రబంధములుగను, నాటకములుగను సంఘటించియున్నారు.

ఈకవి గ్రంథములను తిరుపతిదేవస్థానమువారు ముద్రింపించి ప్రకటించినారు. ఈకవి క్రీ.శ. ౧౪౯౦-౧౫౬౧ సంవత్సరములనడుమనున్నవాఁడనియు, అష్టమహిషీకళ్యాణమును క్రీ.శ. ౧౫౪౫వ సంవత్సరమునను, పరమయోగివిలాసమును ౧౫౪౬వ సంవత్సరములోను ఉషాపరిణయమును ౧౫౪౭వ సంవత్సరమునను రచియించెననియు గ్రంథప్రకాశకులు వ్రాసియున్నారు. మూఁడు సంవత్సరములలో మూఁడు కావ్యములను రచియించి తక్కిన యీతని జీవితమంతయు నూరక కూర్చుండియుండెననితలంపరాదు ఇతఁడు దినమునకు వేయిద్విపదలను రచయింపఁగలనని చెప్పియున్నను, మూఁడుసంవత్సరములలో నీమూఁడుకావ్యములను సంఘటించెననియుఁ జెప్పఁజాలము. ఇతఁడింకేవేని కృతులను రచియించెనేమో చెప్పలేము. మొత్తముమీఁదనీతఁడు ౧౫౩౦-౧౫౫౦ నడుమ కావ్యరచనమును సాగించెనని చెప్పవచ్చును.

ఈతనికవిత్వశైలి తెలియుటకై యీతని గ్రంథములనుండి కొన్ని ద్విపదల నుదాహరించెదను. కృష్ణదేవరాయల రాజ్యాంతకాలమున

కితఁడు ముప్పదేండ్లవాఁడు. అందుచే నీతనిపాండిత్య మాతిసిచెవుల సోకియుండదు.

అష్ట మహిషీకల్యాణము:—

జల్ల చల్లా యని చల్లగాఁబఱుకు లెల్లవారలు విన నెలుగెత్తి చీరి
వెలగపండులతావి వెదచల్లుచల్ల కలికిగుచ్ఛిత అమ్మఁగాఁ బిల్చువారు
అరిది చేరున నొప్పు యమునతోయమువ కరిగెదువారునై యామంఢవారు
తలవరుల్ నెలవరుల్ తామె యై యచట చెలఁగుచుండిరి రాజశేఖర యంత. ఆగ

పరమయోగివిలాసము:—

కడఁకమై సేతువుఁ గట్టించు నప్ప డనిలజముఖు లైనయగచరనాథు
లనుపమశక్తి మహాపర్వతములఁ గట్టకట్టఁగ దాఁ గట్టనుంకించు
నొట్టిన లోనూర్మి యుదుతచండమున భువనంబులోన నభోమణి యొప్ప
దివిఁ గిడమరయును దెలివొందికరణి సామజబృందంబు చనుగెంచుత్రోవ
జీమలపంక్తి వచ్చినవిధంబునను

ఉషాకల్యాణము:—

"బలిపుత్రపుత్రి యాపాన్పుపైనున్న—వలరాజుపట్టిని వలకేలఁబట్టి
కలితవజ్రముల ముక్కలుసేయఁజారి—మలయగొళ్ళకు మారుమలయుచన్దేయి
గదియించి ప్రియునివక్షముఁ గౌగిలింప—నుదుటైవచనుమొన లొత్తిన నులికి
యులికి మేల్కాంచి ప్రద్యుమ్నునూనుండు—కలకలయన నేత్రకమలము ల్దెరచి

ఇతఁడు శ్రీవేంకటేశ్వరస్వామివారి వలన మకరకుండలములను బహుమానమందితినని పై ద్విపదలలోఁ జెప్పుకొనియున్నాఁడు. ఈభావము నే పరమయోగి విలాసాష్టమాశ్వాసాంతమున:—

"........ శ్రీవేంకటాద్రీశ దత్త
మకరకుండలయుగ్మ మండలకర్ణ"

అనుద్విపదలలోను నుల్లేఖించియుండెను. బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారిందలి "వేంకటాద్రీశుని" మానవునిగాఁదలంచి యావెంకటాద్రి వసుచరిత్ర కృతిపతియగు నారవీటి తిరుమలరాయుల సోదరుఁడో పుత్రుఁడో యైయుండునని యూహించి కవికాలమును వారిఁబట్టి నిర్ణయింపఁ

జూచిరి. కాని యదిపొరపాటు. ఇందలి వెంకటాద్రీశుఁడు మానవుఁడుకాఁడు తిరుపతియందలి శ్రీవేంకటేశ్వరస్వామియే ఈవిషయముగా నీతని మేనత్తకుమారుఁడైన రేవణచారి వెంకటార్యుఁడు కూడఁ జెప్పియున్నాఁడు.

శ్రీవీరేశలింగము పంతులుగారు కవులచారిత్రమున నష్టమహిషీకళ్యాణకర్త తాళ్ళపాక చిన్నన్న యనియుఁ బరమయోగి విలాసకర్త తిరువేంగళనాథుఁడనియు దలంచి వీరిచారిత్రములను వేరువేరుగా వ్రాసియున్నారు ౧ కాని వీరిరువురును భిన్నులుకారు.

ఈతిరువెంగళనాథుని శాసనములు క్రీ. శ. ౧౫౪౬ ౧౫౫౪ లోఁ గన్పట్టుచున్నవి. ౨ ఈకవి తనతాతయైన యన్నమాచార్యుని చరిత్రమును ద్విపదకావ్యముగా రచియించియుండెను.



## 119. తాళ్లపాక చినతిరుమలాచార్యులు

ఇతఁడు నందవరీకబ్రాహ్మణుఁడు. తాళ్ళపాకఅన్నమాచార్యుల పౌత్రుఁడు; పెదతిరుమలాచార్యులకుఁ బ్రథమపుత్రుఁడు. అన్నయాచార్యులవారి చారిత్రమున వీరి వంశవృక్షము నిచ్చియున్నాఁడను 3 అష్టమహిషికళ్యాణాది ద్విపదకావ్యములను రచియించిన చిన్నన్న యీకవికిఁ దమ్ముఁడు ఈకవికిఁ జిన్నతిమ్మన్న చిన్నతిరుమలయ్యంగారు సిరుతిరుమలయ్యంగారు తిరుమల అనిపేళ్ళు.

---

౧. ఆంధ్రకవులచరిత్రము మొదటిముద్రణము పుటలు ౨౧౨; 30౪

౨. తి దే. శా. సం ౫ పుటలు 401–19–2–1554; 184 17–7–1546 ఇంకను గొన్నియున్నవి.

3. వంశవృక్షమున పెదతిరుమలాచార్యులని ముద్రితమైనది. పొరపాటు. చినతిరుమలాచార్యులని చదువవలయును.

ఈకవి, అధ్యాత్మసంకీర్తనలు శృంగారసంకీర్తనలు, అష్టభాషాదండకము, సంకీర్తనలక్షణమను పద్యకావ్యమును రచించెను. తండ్రి తాతలవలెనే యితఁడును శ్రీ వెంకటేశ్వర భక్తుఁడై గ్రంథకర్తయై కీర్తిఁగాంచినవాఁడు. ఈయనకుమారుఁడైన తిరువెంగళప్ప గొప్పపండితుఁడై మమ్మటుని కావ్యప్రకాశికకు సుధానిధియను వ్యాఖ్యానమును, అమరమునకు బాలప్రబోధికయను తెలుఁగుటీకయును రచించి పేరుగాంచియుండెను. ఆంధ్రామరుకముకూడ నీతనిదే యనుచున్నారు. కాని యదిసంశయాస్పదము.

ఈ చినతిరుమలాచార్య గవి తన తాతయైన యన్నయాచార్యులు సంస్కృతమున రచించినసంకీర్తన లక్షణమును పద్యకావ్యముగా వ్రాసితినని యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

మ. ధరలోఁ దాళ్లపాక యన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మనుజేయఁబూని తగ నుత్పాదించెఁ దల్లక్షణం
బఁకఁ దైమించిన సంస్కృతంబునఁ గవీంద్రానంద సంధాయియై
పరిపూర్ణాఖిల శాస్త్రసమ్మతముగా భావజ్ఞులౌ నన్.

గీ. అలరు దాళ్లపాక యన్నయార్యసుతుఁడు
తిరుమలార్యుఁ డఖిలదేశికుండు
తత్పుత్రాగ్రజుండ ధరలోనఁ జినతిమ్మ
యార్యుఁడుండఁ దండ్రియను మతమున.

మ. పరమామ్నాయసమానమై వెలయుమత్పితామహాగ్రంథమున్
పరచాటూక్తి మదీయపుణ్యజనక వ్యాఖ్యాతమున్ వేడ్కఁదా
చరణాంభోరుహముల్ మదిందలఁచి సచ్ఛాస్త్రజ్ఞు లింపొందఁగా
వరుసంజెప్పెదఁ బద్యరూపమునఁ దద్వ్యాఖ్యానుసారంబుగన్.

ఈతఁడు సంస్కృతప్రాకృతాద్యష్టభాషలను వరుసగాఁజూపుచు నొక్కదండకమును రచించియుండెను. ఆఱుపుటలుగల యాదండకము

నుండి చవిచూచుటకై యెనిమిదిభాషలనుండి కొన్నిపంక్తుల నీకింద నుదాహరించుచున్నాఁడను. ఈ దండకము హేవిళంబి సంవత్సర మార్గశిర శుక్ల పంచమీ బుధవారము శా. శ. ౧౫౧౧ (7 నవంబరు 1589) నాఁడు రాగితేకులపై వ్రతివ్రాసినట్లు వ్రాయఁబడియున్నది.

ఈతని కనిష్ట సోదరుఁడైన చిన్నన్న క్రీ.శ. ౧౫౫౧ లో జన్మించి ౧౬౧౯ వఱకు నుండెనని యాతనిచారిత్రమున వ్రాసియుంటిని. ఇతఁడు ౧౫౪౦ ప్రాంతమున జననమందియుడును.

ఈకవి తన తాతయైన యన్నయాచార్యుల పదములను నుతించుచు దనసంకీర్తనలక్షణమునఁ బదిపద్యములు వ్రాసియుండెను. అందొకపద్యమునిట నుదాహరించెదను.

మ. శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడారహస్యంబులై
నుతులై తాళ్లపాక యన్నయచో సూత్నక్రియల్ జెన్నగున్.

సంకీర్తన లక్షణశైలి:— (ఇందు డెబ్బదిపద్యములుకలవు)

గీ. ఘనతమీఱంగ జయదేవకవివరేణ్యుఁ
డందమైనట్టి గీతగోవిందమందు
నంచితాష్టపదులు నల్కొనట్లు పదము
పరఁగు నెనిమిదిపదములు పల్లవియును...... ౫౯

క. పదములు శృంగారవధూ
మృదుమధురమనోజ్ఞ వాక్యమిశ్రము లైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంక మెఱుఁగి పలుకఁగఁ జెల్లున్. ౭౬

క. బూఱుగుకాయం గొట్టికిన
నీఱసతూలంబు దిశలనిండినగతి ని
స్సారపదబంధ కవితా
పారీణులపదము హాస్యపదమై యుండున్. ౨౦

అష్టభాషాదండకము:—

సంస్కృతము: సంపూర్ణ తేజోల్లసచ్చంద్రికాక్రాంత బర్హోర్ధ్వదీప్తిచ్ఛటా సంశయాపాదనాధిక్య నానామణిశ్రేణి కోణప్రభాజాల చంచత్కిరీటస్థితే గంధక స్త్వం కథం ఖండితారి పురా కూర్మరూపీ మహత్కర్మకారీ కథం ధీరభూమిస్తు భూదారపూర్వం......

ప్రాకృతము:- గోవద్ధణత్తాణ గోగ్గొత్థ అప్పోతు యేదత్త దప్పోవిసే సేణ భప్పేకిరయోకింయ సేయేయళావాస అప్పాయదా తుర్ఝు అప్పియ్యలీలాసుకమ్మోకరూ జమ్మజమ్మంతరే॥

సూరసేని:-సూరగ్గ తుం సూరసేణేన సేణేనపక్ఖీసనేనాదిడాసావళిసెవ్వమాణో మణూసోతు మంకి తి చింతేది తుర్ఝు వ్వణిగ్గార ణౌబంధుదాపుణ్ణభత్తిప్పహాజుణ్ణ దుద్దోన అంద్దార యుంద్ధా సళోయంక్క రేదిద్ధిరాహార దేయక్క దాసామి...

మాగధి:- నాలాయణే మాగాధాలాపశంశోశ ణగ్గీశమగ్గోలు కంశాశి శంశాల మేహాణి శేతుమ్మ హా శేశ శేశమ్మి కణ్ణాచయే ణంప యుణ్ణాహాళా శేశు కోలాహలాధాళ కోశచ్ఛవాశ్లేణ ఖగ్గోలుగోయణ్ణ గంధచ్ఛుఙ్ఞాత్తేచ వోశజ్జళంతోలు చక్కం గకాదంబ భింగాలిసక్లోయ......

పైశాచి:- అచ్ఛునిశేసో పిసాసేసనసంసెవ్వ గోలీసభూసాయమాణంగిఘి జాతాపగానీరసాళప్పహా యేవిసాళత్తణేణం యరచ్చాచ

యేసుంసరిచ్చప్ప వాహింయలీశాఘ రేహింవిరాయంతర
ణ్ణోహి వాతాయణాయాతవాతబ్బయానీత సౌరబ్భసంపత్తి

ప్రాచీ:-దేనావాసచ్చాళి కాకిన్నతానప్పవాహోలు మాతంకవాలో
ద్ధుతా ఉప్పలాసేనసీలాహ పిచ్ఛంకలింతాచ సవ్వంవహంతో
విరాయూహితస్సింతుహం నిచ్చనియ్యాత। తుచ్ఛాతివైలోక్క
నానామియా కేనసప్పణ్ణసాలా......

అవంతీ.-వెష్లూశిరిగంతు నానాఅబభ్భంసరాఫిత్త. వాణీససవ్వాణిసం
థూయమాణుప్పహాజుత్తుభూళోయవైగుంతు శ్రీవేంకటద్దిమ్మ
సాహిత్తు హేచారు నానావిధానేహి రాజంతరచ్ఛాసు అబ్బం
లిహేవుప్పకేగోరడాదంస......

సార్వదేశీ:-హేభట్టిరియోసవ్వదేసేసకం ప్లోకుడుంగేతు మంతత్తియేజు
త్తగోవీజణం ణిచ్చసావుళ్ళతణ్ణాయ చిత్తోరుమూహీయ చి
చ్ఛేయ దత్తేసకాళస్స గండిక్కనూరద్ధయోచారు ధేరో
సన ద్ధోళతల్లీల్ల సంపండరుంగేంద దేరాదిరించోళి...

"వాణీవీణానినాదప్రతిమచతురవాక్ తాళ్లపాకన్నయార్య
స్తత్పౌత్రిస్తిమ్మరోర్యేజిత ఫణిభణితి స్తత్సుతేనాష్టభాష
క్లుప్తోయం తిమ్మయేనారచితపదగంతిర్వేంకటాద్రీంద్రభర్తు
స్త్వస్స్యాద్యత్కీర్తి కేతుర్జగతివిజయతాం దండకః పండితేద్యః॥

ఈకవికాలము క్రీ.శ. ౧౫౦౫-౧౫౬౦ అని భావింపవచ్చును. ఈచినతిరుమలాచార్యుల శాసనములు, క్రీ.శ. ౧౫౪౦ మొదలు ౧౫౫౭ వఱకు గన్పట్టుచున్నవి.౧ ఈశాసనమునుబట్టి యితనికి శ్రీరామానుజ సిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కికకేసరి" యను బిరుదములున్నట్లు తెలియుచున్నది. ఈబిరుదములననుసరించి యితఁడు గొప్పపండితుఁడనుట స్పష్టము.

---

౧. తి.దే.శా.సం. ౪ సంఖ్య ౧౪౪. ౧౪౫ (క్రీ.శ. 22-3-1540)
" " ౫ " ౯౯; ( " 17-8-1547)

# 120. రేవణూరి వేంకటాచార్యుఁడు



ఇతఁడు నందవరీక వైదిక బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; తిరుమలకొండయార్యునకుఁ బుత్త్రుఁడు; తల్లి తిరుమలాంబ; తాళ్ళపాక యన్నయాచార్యున కితఁడు దౌహిత్రుఁడు.

ఇతఁడు శకుంతలాపరిణయమను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి శ్రీవేంకటేశ్వరున కంకితము చేసెను. ఈతని తండ్రియైన కొండయార్యుఁడు రామచంద్రోపాఖ్యానమను ప్రబంధమును రచియించినట్లు శకుంతలాపరిణములోని యీక్రింది గద్యవలనఁ దెలియవచ్చుచున్నది

"ఇది. శ్రీమత్తిరువెంగళనాథ శ్రీపాదరేణుప్రభావ కావ్యకల్పన, నందపురార్యవృత్తిప్రవీణ, రేవణూరివంశ పయఃపాథోధి సుధాధామ, రామచంద్రోపాఖ్యాన ప్రబంధసంధాన విద్వత్ప్రచండ తిరుమలకొండయాభిధ బుధాగ్రణీతనూభవ, భూభుజాస్థానని రాతంకచర్య వేంకటార్య ప్రణీతంబైన శకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబు"

బ్ర.శ్రీ వీరేశలింగముపంతులుగారు వెంకటార్యుఁడు రామచంద్రోపాఖ్యానమును రచించినట్లు చెప్పికొనెనని యాంధ్రకవులచారిత్రమున వ్రాసియున్నారు. కాని పైగద్యమునుబట్టి రామచంద్రోపాఖ్యానమును రచించిన దీతనితండ్రియగు తిరుమల కొండయార్యుఁడని నేననుకొనుచున్నాఁడను. రామచంద్రోపాఖ్యానమును దాను రచించినట్లు కవి శకుంతలాపరిణయ కృత్యాదియందుఁ జెప్పుకొనలేదు.

సంకీర్తనాచార్యుఁ డనిపేరుగాంచి యధ్యాత్మకీర్తనలాదిగా పెక్కుగేయములను రచించిన తాళ్ళపాకయన్నయాచార్యుఁ డీకవికి మాతామహుఁడు. అతనికుమారుఁడైన పెదతిరుమలాచార్యుఁ డీతనికి

మేనమామ. అష్టమహిషీకల్యాణాది గ్రంథములను రచించిన చిన్నన్న యీతనికి మేనమామ కుమారుఁడు.

ఈ వెంకటార్యకవిని శకుంతలాపరిణయమును రచియించి తన కంకితము చేయుమని యొకప్రభువు మొదటఁ గోరియుండినట్లును, కవి యందుల కంగీకరించి యీకృతిని రచియించినట్లును, కృతిపతి యీకృతిని గ్రహింపకుండ నొకకరణము విఘ్న మొనర్చినట్లును, నందుపైఁ దీనిని శ్రీవేంకటేశ్వరున కర్పించినట్లును గవి యీక్రింది గద్యపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

వ. అపూర్వాపూర్వకవి సుపర్వానుగ్రహంబునఁ బుణ్యగుణకథాశ్రవణకుతూహలిక బుధసదానుబంధం బగునొక్క ప్రబంధంబు సరససుమనోనుబంధంబుగా నిర్మింపం బూని యున్నసమయంబున నతిప్రభావసంపన్నుం డగుకశ్చిత్ప్రభుండు.

శా. శ్రీవత్సాన్వయు కేవఃఖూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సావర్ణ్యస్ఫుటకావ్యకల్పకకవిన్ సంకీర్తనాచార్యపు
త్రీవంశోత్తము నందవైదిక బుధాదిప్రోక్తనవృత్తిన్వయుం
భావున్ దిర్మలకొండయార్యసుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్.

క. పిలువంబంచి యెదుర్కొని
మిలమిల వలఘుప్రభావమిద్ధాస్థాన
స్థలిఁ జాగిలి మ్రొక్కి పటీ
కలితసుఖాసీనుఁ జేసి కలకల నగుచున్.

చ. కనుఁగొని చండికాభిసుముఖప్రద! నందనరాగ్రహార! పా
వనఘన పెద్దిభట్టకులవార్ధినిశాకర! నీవు శ్రీనివా
సుని యలమేలుమంగకృపఁ బొక్కినదిక్కవి వాంధ్రభూమిరా
ట్సనుతసభాస్థలీవన నవీనపికంబవు కాకలీకృతిన్.

శా. సల్లాలిత్యభివత్కవిత్వపటిమాసందర్భ వైదర్భికా
సల్లాపంబులు మామకీనసుకులస్వామీంద్రకీలాద్రిరా
ణ్మల్లేశుండును మెచ్చ నొక్కకృతి నిర్మాణంబు గావింపుమా
మల్లీఫుల్లసుమోల్లసన్మధు ఝరీమాధుర్యకౌదార్యతన్.

మ. అని హేమాంబరరత్నభూషణసుగంధాలంకృతుం జేసి స
ద్ఘటసారస్ఫుటవీటికాదు లొసఁగన్ గైకొంచు వాణీవధూ
వనజాతాంఘ్రిఘులద్ఘులన్న జనజిహ్వాస్థానవాగ్గోస్తనీ
జనితానంద మరందకందళ నదీజంఘాలవేలాస్యుఁడై.

వ. అమ్మహాకవివరుండును దదీయ వంశావతార నిర్ణయ వర్ణనాను పూర్వంబుగాఁ దత్ప్రబంధబంధురానల్పకల్పనం బొనరించి తత్సము చితకృతి కన్యాకరణంబునకు నవకరణంబుగా నుపకరణంబగునొక్క కరణంబు కృతఘ్నుండై విఘ్నంబు గావించిన దదీయవిఘ్నంబును దత్ప్రభుత్వచ్ఛత్రచామరాందోళికాది బహుప్రదాన క్రియానిఘ్నం బును మదీయజానుదఘ్నంబుగా విశంకించి నిశ్శంకబిరుదాంక సంక ల్పంబుతో నెంచి సంకీర్తనాచార్య దౌహిత్రసంప్రదాయంబు నగు మత్సంప్రదాయంబునకు సకలఖలనరాధిపాధమ గణగుణస్తోత్రం బపవిత్రం బగుట యదార్థం బనితలంచి....ఁడును నగు శ్రీ వేంకట రమణునకు.....సమర్పణంబుగా సమర్పించెద.

కృతిఁ గైకొన నిరాకరించిన ప్రభువును కశ్చిత్ప్రభుండని చెప్పెనే కాని పేరుచెప్పలేదు. తన కపకృతిచేసిన వారిపేరును వెల్లడించుటకు గూడ నుదారాశయు లిచ్ఛగింపరు. ఆప్రభువు ఇంద్రకీలాద్రియందు న్నమల్లేశ్వర భక్తుఁడని పై పద్యములో నున్నది. బెజవాడసమీప మున నున్న పర్వతమున కింద్రకీలాద్రియని పేరు. ఈప్రభుఁ వాసమీప మున నుండియుండును. ఆకాలమున నాప్రాంతము నేలుచున్న ప్రభు వె వ్వఁడో తెలిసికొనవలసియున్నది. అయిన నీవిచారణతో మనకుఁ బని

లేదు. కవియే యూహకొనినప్పుడు మన కగత్యమేమి? విచారణచేయఁ బూనితిమేని యొకరిమీఁద బడవలసిన యపకీర్తి వేఱొకనిపైఁ బడ వచ్చును.

ఈకవికాలము నూఱునూటయేబది సంవత్సరములకుఁ బూర్వమై యుండునని బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమున క్రీ.శ. ౧౯౧౧ లో వ్రాసియున్నారు. దానినిబట్టి యితనికాలము ౧౭౫౦ ప్రాంతమైనది. కాని యది సత్యము కాదు. ఈకవికి మాతామహుఁ డైన తాళ్లపాక యన్నయాచార్యులు క్రీ.శ. ౧౪౦౮-౧౫౦౩ నడుమ నున్నవాఁడని యాయన చారిత్రమున వ్రాసి యున్నాఁడను.

వెంకటార్యుఁడు శకుంతలాపరిణయమున కవిస్తుతి నీక్రిందిపద్యములోఁ గావించియుండెను.

మ. పరఁగన్ భారతకల్పసారతులు శబ్దస్ఫూర్తి సంధింప ని
ర్భరవృత్తిన్ బరమేశపోతఘను లాలంకారముల్ పూర్వఁ జూ
పరులై నట్టిపితామహాద్యులు నుతుల్ పాటింప నర్తించు నీ
సరసాంధ్రోక్తివధూటి కేను సుమనస్సంపూర్తి గావించెదన్.

ఇందలి పరమేశుఁడు ప్రబంధపరమేశ్వరుఁ డగు నెఱ్ఱాప్రెగడయనియు, పోతఘనుఁడు బమ్మెరపోతన యనియుఁ బితామహాద్యులు అల్లసాని పెద్దన ముక్కుతిమ్మనాదులనియుఁ దలంపవలసియున్నది. దీనినిబట్టి యీకవి పెద్దనాదులతో సమకాలికుఁడై క్రీ.శ. ౧౫౩౦ ప్రాంతమున నీకావ్యమును రచించెనని చెప్పవచ్చును. అన్నయార్యునకు దౌహిత్రుఁడును, క్రీ.శ. ౧౪౭౦-౧౫౫౦ నడుమనున్న పెదతిరుమలాచార్యులకు మేనల్లుఁడు నగు నీతనిగ్రంథరచనాకాలము ౧౫౩౦ దాఁటి యీవలకు రాదు.

కడపమండలములోని ప్రొద్దుటూరు తాలూకా రామేశ్వరము అను గ్రామమున రేవణూరు వెంకటశాస్త్రి యనునతఁ డొకనూయి త్రవ్వించిన ట్లొకశిలాశాసన మున్నది. ఆశాసనమున శకసంఖ్య నీయలేదు. క్రోధిసంవత్సర మనియున్నది.౧ ఆ వెంకటశాస్త్రి యీకవియేయైనచో నాక్రోధిసంవత్సరము శా.శ ౧౪౬౬ (క్రీ.శ.౧౫౪౪) అగును. వెంకటశాస్త్రి వెంకటకవు లొక్కరో భిన్నవ్యక్తులో పరిశోధింపవలసియున్నది.

ఈగ్రంథము ముద్రితము కాలేదు. తాళపత్రప్రతియొకటి శిథిలావస్థలో మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునం దున్నది. ఇతనికవిత్వము సంస్కృతపదబహుళమై పండితుల కాహ్లాద మొసంగుచున్నది. ఈతనికవిత్వరీతి తెలియుటకై మూఁడాశ్వాసములనుండియు మూఁడుపద్యముల నిందుదాహరించెదను.

ఈకవిగృహనామము కర్నూలుమండలమందలి కోయిలకుంట్ల తాలూకా రేవణూరు అనుగ్రామమునుబట్టి వచ్చియుండును. ఈతఁడాగ్రామనివాసియై యుండవచ్చును. కృత్యాదిపద్యములలో "పెద్దిభట్టకులవార్ధినిశాకర" అని చెప్పుకొనియున్నాఁడు. దీనినిబట్టి మొదట నీతనియింటిపేరు పెద్దిభట్ట వారై యుండునా యనిసంశయము కలుగుచున్నది. కాని నందవరీకులలో మొదట నాప్రాంతమునకువచ్చిన వారిపేరుల నుదాహరించి తామావంశములలోనివార మని చెప్పుకొను నాచారమున్నట్లు గన్పట్టెడిని. అదిసత్యమైనగావచ్చును. కాదేని మొదట పెద్దిభట్టవారై పిదప రేవణూరు నివాసముగా నేర్పరచుకొనుటచే రేవణూరివారైనఁ గావచ్చును. పైనివ్రాసిన శాసనకర్తయు నీతఁడు నభిన్నులైనచో నీతనినివాసము కడపమండలములోని రామేశ్వరమైనఁ గావచ్చును.

గద్యయందలి "తిరువెంగళనాథ శ్రీపాదరేణుప్రభావకావ్యకల్పన" యనువాక్యములకు రెండువిధము లగునర్థములు స్ఫురించుచు

౧. దత్తమండల శాసనములు సంఖ్య ౯౮. పుట ౩౪౭.

న్నవి. తిరువెంగళనాథుఁడు కవికిఁ గురువనియు, నాతని శ్రీపాదరేణు పరిభావముచేఁ గావ్యకల్పన చేసినవాఁడనియు నొకయర్థము. శ్రీవేంక టేశ్వరస్వామివారి "శ్రీపాదరేణుప్రభావ" మనుకావ్యమును రచించిన వాఁడని వేఱొకయర్థము. "శ్రీపాదరేణుమాహాత్మ్య" మనునొకకావ్య మును రచియించెననియు నది తిరుపతిదేవస్థానమునం దున్నదనియు, శ్రీప్రభాకరశాస్త్రిలుగారు అన్నయాచార్యచరిత్రపీఠికలో వ్రాసియు న్నారు. కావున గద్యయందలివాక్యము లాకావ్యమునకే యన్వయిం చును. కృత్యాదియందలి శార్దూలవృత్త మీయంశమును బలపఱచు చున్నది.

శకుంతలాపరిణయ కృత్యాదియందు వెంకటార్యకవి యన్నమా చార్యునిఁగూర్చి 'మఱియున్నమ్మహాదేవుండు మదీయమాతామహవంశ శిఖారత్నం బగునన్నమాచార్యునకు జామాతయుండని పించుకొని...' అనియు, "సంకీర్తనాచార్యదౌహిత్రి సంప్రదాయంబు నగుపుత్సంప్ర దాయంబునకు......" అనియు వ్రాసియున్నాఁడు. అన్నమాచార్యు నకుఁ దానుదౌహిత్రుఁడనని చెప్పుకొనక మాతామహవంశ శిఖార త్నమనియు దౌహిత్రసంప్రదాయమనియుఁ జెప్పుటచే నీతఁ డన్న మార్యులకు కేవలదౌహిత్రుఁడు కాఁడని శ్రీప్రభాకరశాస్త్రిలుగారు సం దేహించిరి. శ్రీశాస్త్రిలుగారే శ్రీపాదరేణుమాహాత్మ్యమున నన్నమా చార్యునకీతఁడు కేవలదౌహిత్రుఁడుగనే చెప్పుకొనెనని వ్రాసియుండిరి. "రేవణూరి వెంకటాచార్యుఁడు రచించిన శ్రీపాదరేణుమాహాత్మ్యమున స్వామిమేనెల్ల మేదించుటలో శ్రీపాదములందుఁ దొరికిన కర్పూర ధూళితోడి పునుఁగు తైలమును, దన్మిశ్రమమున పాదతీర్థమును శ్రీపాదరేణునామమునఁ బ్రస్తుతిగన్నది"౧

మాతామహవంశమనినప్పుడు, అన్నయాచార్యులైన మాతా మహుఁడు గావలయును. లేదా యాతనికుమారులలో మనుమలలో

౧. అన్నమాచార్యచరిత్ర పీఠిక పుట. ౩౪.

నెవ్వరైన వెంకటార్యునకు మాతామహుఁడు గావలయును. మాతా మహవంశమునకు శిఖామణి యనఁగా తాళ్ళపాక వంశరత్నమనియే కవియుద్దేశమని తలంపవలసియున్నది. సంకీర్తనాచార్య దౌహిత్రి సంప్రదాయమను వాక్య మీ యూహను బలపఱ్చుచున్నది. అన్న మాచార్య దౌహిత్రసాంప్రదాయమనియే చెప్పినాఁడు. కాని యాతని పుత్రపౌత్రుల దౌహిత్రుఁడనని చెప్ప లేదు. కావునను శ్రీపాదరేణు మాహాత్మ్యమునఁ దాను అన్నమాచార్య దౌహిత్రుఁడననిస్పష్టముగాఁ జెప్పికొని యుండుటనుబట్టియు నీ వెంకటార్యకవి యన్నమాచార్యుల కుమార్తె కుమారుఁడనియే నిశ్చయింపవలసియున్నది. తిరుపతి దేవ స్థానమువారు ప్రకటించిన గ్రంథములలోఁ దాళ్లపాకవారి వంశవృక్షము లన్నిటియందు నిట్లేయున్నది.

శకుంతలాపరిణయ కృత్యాదినుండి పైనినుదాహరించిన :—

"శ్రీనత్సాన్వయ రేవణూరికులజన్ శ్రీపాదరేణుప్రభా సౌవర్ణ్యస్ఫుట కావ్యకల్పకకవిన్ సంకీర్తనాచార్య పుత్రీవంశో త్తము......"

అను వాక్యములుకూడ నీకవి యన్నమాచార్యదౌహిత్రుఁ డని ధ్రువము సేయుచున్నవి.

ఉ. ఎమ్మెలు పుట్టఁబుట్టి నెఱవేఁటి భుజంగుల నుక్కడింపఁజా
లెన్నిమ్మవిలాసనల్ శ్రిమత నృత్యపు బెళ్కుఁడు సోగకన్నులన్
గ్రిమ్ముకొనంగఁ జల్లవిడి కమ్మనితావుల నట్టెదేహసా
ఖ్యమ్ములుగూర్పఁ గంధగిరి గంధవిహాఖ్య వి యెందుఁ దప్పురిన్. ౧౫

మ. అమరానంతలతాంతసాంతరమణీయాకల్పసియ్యామిత
క్రిమరియ్యాన్నృతకల్పలై బొదలు చంద్రశ్రీకళారేఖ నా
కొమరై యచ్చట నచ్చకోరదృశదాకుందారవిందాభినం
దమిళిందశ్రుతిగీతినుండి శుకసంతానోత్తమంబాత్మలోన్. ౨౫

ఉ. పరతము లేల! బాల! నవపల్లవగల్లవహల్లవంపుగో
రంతటఁ జేర శైవపు రయమ్మున ఆొమ్మునఁ గుమ్మ నీదుకొం
డంతటిగుబ్బదెబ్బలకు హాళిని బాళిని దాళ నాదుమ
చ్చాంతి కొకింత నీకుఁ గృపరాద పరా కపరాధమే మొకో! 3౦



## 121. శెలగపూఁడి వెంగయామాత్యుఁడు

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; లోహితసగోత్రుఁడు, పెద్దామాత్యపుత్త్రుఁడు.

బిల్వమంగళుఁడని నామాంతరము గలలీలాశుకుఁ డనుమహాకవి సంస్కృతభాషలో శ్రీకృష్ణకర్ణామృత మను పేర శ్రీకృష్ణుని శైశవక్రీడలను వర్ణించుచు మూఁడుశతకములను రచించియుండెను. ఈబిల్వమంగళుఁడు మొదట సంతతవేశ్యాప్రియుఁడై యుండియుఁ జింతామణి యను వేశ్యచే సోమగిరిగురునకు శిష్యునిగా నప్పగింపఁబడి, యాతనిచేఁ జింతామణీమంత్రమును వడసి తన్మాహాత్మ్యమున శ్రీకృష్ణునిదర్శన ప్రాప్తినొందినట్లును ఆవిషయమును గవి శ్రీకృష్ణకర్ణామృతముయొక్క ప్రథమశ్లోకమునం దీరీతిగా సూచించినాఁ డనియుఁ జెప్పుదురు.

శ్లో. చిన్తామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః
యత్పాదకల్పతరుపల్లవ శేఖరేషు
లీలా స్వయంవరరసం లభతే జయశ్రీః ॥

లీలాశుకుఁడు చిరకాలము శృంగారరసానుభవమునందుఁ గాలము గడపిన వాఁడగుటచే భగవంతునిఁగూడ శృంగారస్వరూపునిగనే

చూచుచు శ్రీకృష్ణకర్ణామృతమును శృంగారరసపూరితముగా రచించి భగవంతుని ప్రేమస్వరూపునిగా భజించి తన్మయుఁడై ధన్యుఁ డయినాఁడు. వెంగయామాత్యకవి శ్రీకృష్ణకర్ణామృతమునందలి శ్లోకములను లీలాశుకునిభావములు చెడకుండ నతిమాధుర్యముగా మూఁడాశ్వాసములలో నాంధ్రీకరించియున్నాఁడు. ఈతనిపద్యములను జదివి వెంగయార్యుఁడు లీలాశుకునంతవాఁడని లోకము నుతించుచుండును. ఈతఁడింకేమేని గ్రంథములను రచించెనేమో తెలియదు. ఈతని వంశీయుఁడై భానుమద్విజయమును రచించిన వెలగపూఁడి కృష్ణకవి, తన పూర్వులు గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్రము, మర్యాదరామసచివచరిత్రము మొదలగు గ్రంథములను రచియించినవా రని యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈతని కవిత్వశైలి తెలియుటకై లీలాశుకవిరచితములగు నైదు శ్లోకములను వానికాంధ్రపద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

శ్లో. యావన్న మేనిఖిలమర్మదృఢాంభిఘాత
నిస్సన్ధిబన్ధనముదేతిభవోపతాపః
తావద్విభో! భవతు తావకవక్త్రచన్ద్ర
చన్ద్రాతపద్విగుణితా మమచిత్తధారా.

మ. శతవర్షంబులమీఁద నొందుదురవస్థం జెంది లోఁ గుంది బా
ధితమై యింద్రియగోళముల్ మిగుల నంధీభూతముల్ గాక ముం
దతినుప్పొంగెడుగాతఁ దావకసుధాధారాళవేణుస్వనో
న్నతలావణ్యరమానివాసముఖచంద్రజ్యోత్స్ననామందటన్. ౧-౩౭.

శ్లో. కామంసన్తు సహస్రశః కతిపయేసారస్యధౌరేయకాః
కామంవా కమనీయతా పరిమళస్వారాజ్యబద్ధవ్రతాః
నైవైతైర్వివదామహేనచవయందేవప్రియంబ్రూమహే
యత్సత్యం రమణీయతా పరిణతి స్త్వయ్యేవపారంగతా.

ఉ. లోకములోపలన్ రసికలోక మనేకము గల్గుఁగాక య
స్తోకమనోహరావయవశోభితులుందురు గాక వారితో
నే కలహింపనేల మొగ మెచ్చక మేటికి సత్యమాడెదన్
నీకమనీయతామహిమ నీక తగున్ మఱికాన మెయ్యెడన్.

శ్లో. కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్స్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణం
సర్వాంగే హరిచన్దనంచ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః

మ. నుదుటం గస్తురిబొట్టు; నాసికతుద న్ముత్తెంబు; శ్రీగంధసం
పద నెమ్మేన; గరంబులం గటకముల్; వంశంబు హస్తాగ్రమం;
దెదపై నిస్తులకౌస్తుభంబు; నఱుతన్ శృంగారహారంబు; నిం
పొదవం గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.
౨-౧౧౦

శ్లో. రాధాకేళికటాక్షవీక్షితమహావక్షస్స్థలీమండనా
జీయాసుః పులకాంకురా స్త్రిభువనస్వాదీయస స్తేజసః
క్రీడాస్త ప్రతిసుప్తదుగ్ధతనయా ముగ్ధావబోధక్షణ
త్రాసారూఢ దృఢోపగూహన మహాస్సామ్రాజ్యసాంద్రశ్రియః

మ. రతికేళిం దమి దీఱఁగా నలసి నిద్రం జెంది స్వప్నంబుచే
నతిభీతిం రమ కౌఁగిలింప నిబిడంబై రాధికాపాంగలీ
క్షితవక్షస్స్థలనిస్తులాభరణమై చెన్నొందు రోమాంచసం
తతి సామ్రాజ్యరమానుభూతి పరమానందాకృతిన్ శౌరికిన్. ౩-౫౮

శ్లో. హస్తమాక్షిప్య యాతోఽసి
బలాత్కృష్ణ కిమద్భుతమ్
హృదయాద్యది నిర్యాసి
పౌరుషం గణయామి తే.

చ. వలచితిరా యటంచుఁ జెయివట్టినఁ గౌఁగిట గారవించి చె
క్కిలిఁ గొన గోట నొక్కి కరగింపక చిమ్ముకపోయె దీకిఁ బ్రియం
దలఁపున నిల్పఁ జిక్కక కదాచనఁ గల్గినఁ జౌరుమంబు నీ
కలవడె నంచుఁ బల్కు చెలి నక్కునఁ జేర్చినఁ శౌరిఁ గాంచెదన్.

3-82

వెంగయామాత్యకవి యీగ్రంథమునఁ 'కృత్యాదిగాని' గద్య గాని రచింపలేదు. ఆశ్వాసాంతపద్యమునఁ దన పేరుఁ దెలుపు నీక్రింది పద్యమునుమాత్రము రచించినాఁడు.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపావీక్షా త్తసారస్వతా
భ్యుదయ శ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధ క్షమాశాంతిస
త్యదయాభూషణ వెల్గపూఁడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాసము వొల్చుఁ బ్రాథమికమై కర్ణామృత శ్రీకృతిన్.

దీనినిబట్టి కవికృష్ణాశ్రయుఁ డనుయోగిపుంగవునిశిష్యుఁ డైనట్లు కనఁబట్టుచున్నది. ఈవెంగయామాత్యుని నివాసమెచ్చటనో తెలియఁ దగినయాధారములు దొరకలేదు. వెలగపూఁడియను గ్రామము, గుంటూరుమండలమందలి వంగవోలుతాలూకాలో నున్నది. వెలగపూఁడి గ్రామనివాసు లగుటచే వీరికి వెలగపూఁడివా రని పేరువచ్చినదని కృష్ణకవి భానుమద్విజయమునఁ జెప్పియుండుట నీకవి వెలగపూఁడి నివాసుఁ డని నిశ్చయింపవచ్చును.

శ్రీకృష్ణకర్ణామృతమందలి మూఁడాశ్వాసములతుదను నై పద్యమే యున్నది. మూఁడిటియందును "ప్రాథమికమై" అనియేయున్నది. కవి యిట్లు వ్రాసియుండఁడు. "రెండవదియై" "మూఁడవదియై" అని యర్థమిచ్చు మాటలను వేసియుండును. మూఁడాశ్వాసాంతములతుదలను వేయు వేయుగ భగవంతుని సంబోధించుచు మూఁడు మాలినీవృత్తములను రచియించియున్నాఁడు. ఇవిగాక ప్రథమాశ్వాసాంతముననున్న:

శ్లో. ఈశానదేవచరణాభరణేన నీవీ
దామోదరస్థిరయశః స్తబకోద్గమేన
లీలాశుకేన రచితం తవదేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాన్తరేపి.

యనుశ్లోకము నీక్రిందివిధముగా నాంధ్రీకరించి యందుఁ దననామమును దండిపేరుతోఁగూడ నిమిడ్చియున్నాఁడు.

మ. ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవయున్
గలలీలాశుకవాక్యముల్ దెనుఁగునం గర్ణామృతఖ్యాతిగా
నలరం జెప్పితి వెల్లపూడిమణి పెద్దామాత్యవెంగన్న నే
నలరుం దోయిటిమాడ్కిఁ గైకొనుము కృష్ణా! కల్పసంస్థాయిగాన్.

అమృతపుగుళికలవలెనుండు నీతనిపద్యము లనుదినపాఠయోగ్యములు. పద్యమును జదివినతోడనే యాపద్యమునందుఁ జిత్రింపఁబడిన శ్రీకృష్ణవిగ్రహము పాఠకుల యెట్టయెదుటఁ గాన్పించి తన్మయులం జేయుచుండును. ఈగ్రంథమునందలి మఱిమూఁడుపద్యముల నిటనుదాహరించెదను.

చ. వలపులు గుల్కుగోపిక లవారణ నొండొరుతోడ నాడుమా
టలఁ జెవి కింపుగా వినఁ దొడంగి తనర్చినమందహాసముం
బలుమఱు నాఁగి మేను గరు పాఱఁగ నూరక కన్నుమోడ్చున
జ్జలరుహపత్రనేత్రుని యసత్యపునిద్దుర కేను మ్రొక్కెదన్.

౧౪ ౨౧

మ. అరుణశ్రీ దళుకొత్తునంగుళుల నొయ్యం గప్పుచున్ విప్పుచున్
మురళీరంధ్రము లాస్యమారుతమునం బూరించు చొయ్యారమై
చరణద్వంద్వము మార్చడన్ నిలుచు కంజాయతాలోకభా
సురబృందావనమందిరాంతరచరిష్ణుం గృష్ణుఁ గీర్తించెదన్. ౨౪౫

మ. బెళుకుంగన్నులు మోముచుట్టు విరుగన్ బింబాధరోష్ఠంబుపై
దళుకు న్వెన్నెల లీనులేనగవు వింతల్ మాధురిం జెందఁ గం
దళితాలాపసుధారుచుల్ చెవికి నానందంబుగా నందు మం
దలనానందముఁ జిందుబాలుని యశోదానందనుంగాంచెదన్. ౩౮-౨౧

ఈకవికాలమును నిర్ణయించుటకు సాధనము లేవియు లభింప లేదు. గురుస్తుతి లేదు. దేవునకంకితము. తనవంశమును వర్ణింపలేదు. కాలమును జెప్పలేదు.

సంస్కృతకృష్ణకర్ణామృతకర్త యగులీలాశుకుఁడు క్రీ.శ. ౧౩౦౦ ప్రాంతమువాఁడు. ఆంధ్రకర్ణామృతతాళపత్రప్రతిలోదను ప్రతివిలేఖకునికాలము క్రీ.శ. ౧౭౧౪ అని యీక్రిందవ్రాసిన పద్యములవలనఁ దెలియుచున్నది.

"క. శ్రీమత్కర్ణామృతకృతి
ప్రేమంబున వెలఁగవూడి వెంగన తెనుఁగున్
గా మాల్యా గూర్చె దీనిన్
రామబ్రహ్మేంద్రదమాని రాట్టు లిఖించెన్.

గీ. శాలివాహనాఖ్య శకవర్షములు వె
యిన్ని ఆరుమూరు నిరువదేడు
పరఁగ చనినపిదపఁ బార్థివవత్సర
మార్గశీర్షమందు వ్రాసినాము."

భానుమద్విజయమును రచించినకృష్ణకవి ౧౭౦౦, ౧౭౪౦ ప్రాంతము వాఁడు. అతఁడు తనవంశమును దనకుఁ బూర్వము ౧౦ తరములవరకు వర్ణించినాఁడు. అందులో వెంగయామాత్యుఁడు లేఁడు. పెద్దయ యున్నాఁడు వెంగన యీపెద్దయకొడుకగునా? అయినచో నీకవి క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతముననుండును. కాని యింతటిమహాకవి పేరును గృష్ణకవి

యేలచెప్పకయుండును. కృష్ణకవి వెంగనకవి రచించిన కృష్ణకర్ణామృత ము నెరుంగును. అతఁడు భానుమద్విజయ కృత్యాదియందు రచించిన యీాక్రిందిపద్యములను జూడుఁడు.

క. భూనుత గాంగేయోపా
ఖ్యానసుమంతోద యాంధ్రకర్ణామృతముల్
మానిత వజ్రభుజోపా
ఖ్యానము శుభ హేతుసేతు మాహాత్మ్యంబున్.

క. దత్తాత్రేయచరిత్రన్
సత్తగు మర్యాదరామసచివు చరిత్రన్
చిత్తరవు కృతులుచేసిన
యుత్తమకవులెల్ల మీాకులోద్భవులగుటన్.

గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృత ము నను మూఁడు గ్రంథములు నీ వెంగయామాత్యుని వేమోయని తోచుచున్నది. కృష్ణకవి తనవంశవర్ణనములో వెంగనామాత్యునినామ మును జెప్పకపోవుటచేతను "మీాకులోద్భవు" లనిమాత్రమే చెప్పుట చేతను, ఆతఁడిచ్చిన వంశవృక్షమునందలి మరియొక శాఖవాఁడై యుం డుననియో లేక పదితరములకుఁబూర్వుఁడనియో తలంపవలసియున్నది. భానుమద్విజయమును బట్టి వెంగయామాత్యుని కాలము నిశ్చితము చేయవీలులేకపోయినది.

ఆంధ్రకృష్ణ కర్ణామృతమునందలి యొకపద్యమును లింగమగుంట తిమ్మకవి తనసులక్షణసారమున లక్ష్యముగా నుదాహరించెననియు నీ తిమ్మకవి తెనాలి రామకృష్ణుని కల్లుఁడుకావున నీవెంగయామా త్యుఁడు క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమువాఁడై యుండుననియు శతకకవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇప్పుడు మనకులభించుచున్న సులక్ష ణసార ముద్రితప్రతులలో వెంగయామాత్యుని పద్యముదాహృతము

కాలేదు. ఇప్పటిముద్రితప్రతి తిమ్మకవివిరచితమని చెప్పలేము. తిమ్మకవి యుదాహరించిన లక్ష్యములు కొన్నియిందు విడువఁబడినవి. తిమ్మకవి తరువాత నొకశతాబ్దికిఁ బిమ్మటనున్న కవులపద్యము లిందుఁ జేరినవి. శ్రీ సుబ్బారావుగారు పూర్వపుముద్రితప్రతినో తాళపత్రప్రతినోచూచి యావాక్యములను వ్రాసియుందురని తలంచి యీకవిని బదునాఱవశతాబ్దిప్రథమార్థమునఁ జేర్చితిని. ఇతనికాలమిదియేయని తలంచుచున్నాను. శ్రీవీరేశలింగము పంతులుగారుకూడ వెంగయామాత్యుని పద్యము సులక్షణసారమునం దుదాహృతమయ్యెనని యాంధ్రకవులచారిత్రమున వ్రాసిరి. కాని తిమ్మకవికాలము ౧౭౩౦ ప్రాంతమని యప్పటికి వారికిలభించిన సాధనములనుబట్టి నిర్ణయించియుండిరి. లింగమకుంట తిమ్మకవికాలము పదునాఱవశతాబ్ది మధ్యమని స్పష్టమైనది. కావున వెంగయామాత్యకవి యంతకుఁబూర్వుఁడగుట నిశ్చయము.



# 122. హరిభట్టు

ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు; యజుశ్శాఖీయుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; భారద్వాజసగోత్రుఁడు; రామపండితునకును తిమ్మమాంబకును కుమారుఁడు. ఇతనిగృహనామ మేదియో తెలిసినదికాదు.

ఈకవి వరాహపురాణము; మత్స్యపురాణము; భాగవతషష్ఠైకాదశద్వాదశస్కంధములు, నరసింహపురాణము అనుగ్రంథములను రచియించెను. ఇందు మత్స్యపురాణమును నరసింహపురాణమును మాత్రము ముద్రితములైనవి తక్కినపుస్తకముల యముద్రితప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందును ఆంధ్రపరిషత్పుస్తకభాండాగారమునను గలవు. ఈక్రిందిపద్యములవలనఁ గవికుల గోత్రాదుల నెరుంగనగును.

మ. అమృతప్రాయ విశేషకావ్యరచనాహంభావవుంభావ వా
గ్రమణీమూర్తివి; వేదశాస్త్ర వివిధగ్రంథార్థనిర్ణేతి వే
శముఖబ్రహ్మవు; యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండ వ
ర్యమతేజుండవు రాఘవార్యహరిభట్టా! సత్కవిగ్రామణీ

—వరాహపురాణము.

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామజ్ఞానురానేక జ
న్మారాధాధిక పుణ్యలబ్ధ హరినామాంకాప్తసత్పుత్రుఁడన్
శ్రీరామానుజ పాదపద్మయుగళీ చింతాసమాయుక్తుఁడన్.

వరాహపురాణమందలి యీక్రిందిగద్యపద్యములవలన నీతఁడష్టఘంటావధాన బిరుదముగలవాఁడనియు హనుమత్ప్రసాదలబ్ధవరప్రసాద సహజ సారస్వతుఁడనియుఁ దెలియుచున్నది. ఇతఁడు స్మార్తుఁడయ్యును నించుక వైష్ణవాభిమానము కలవాఁడని పైశార్దూలవృత్తమందలి చతుర్థపాదము చెప్పుచున్నది.

గీ. అష్టఘంటావధాన విశిష్టబిరుద !
నీవురచింపఁదలఁచిన నిరుపమార్థ
రమ్యమగు నీవరాహపురాణకావ్య
మంకితముచేయు నాపేర నభిమతముగ.

గద్య: ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజసారస్వతచంద్ర
నామాంక భారద్వాజస గోత్రపవిత్ర రామవిద్వన్మణికుమారా
ష్టఘంటావధాన పరమేశ్వరహరిభట్టారక ప్రణీతంబైన"

ఈకవి తండ్రిపేరు రాఘవార్యుఁడని పైపద్యమునందున్నది. ఇతని కుమారునిపేరు రాఘవమనీషియని నృసింహపురాణమునలనఁ దెలియుచున్నది. తండ్రిపేరు కుమారునకుబెట్టు నాచారముకలదు. కావున నీకవి పితృనామము రాఘవార్యుఁడనుట నిశ్చయము. కాని గద్యలో "రామవిద్వన్మణీ కుమార"యని యుదాహరించినారు. ఈగద్యపద్యములు రెండును వరాహపురాణములోనివే కావున తండ్రులుభిన్నులని గాని, కవులుభిన్నులనిగాని చెప్పరాదు. రాఘవయ్యకు రామయ్యయని నామాంతరముండవలయును. కాదేని యీరెండుశబ్దములు నొకవ్యక్తి కన్వయించు పర్యాయపదములు కావున బర్యాయపదములిచ్చటఁ గవి యుపయోగించెనని దలంపవలయును. ఇది సత్యమయ్యేనేని యాముక్త మాల్యదలో లక్ష్మీదేవియను పేరునకుఁ గమలయను పర్యాయపదముకు గృష్ణదేవరాయ లుపయోగించెననుట కిదియొక యుదాహరణమగును.

వరాహపురాణ మైదాశ్వాసములు కలది. దీనిని గవి నిజాము రాష్ట్రమందలి కంబముమెట్టు గ్రామమునకుఁ గరణమైన కొలిపాక యెఱ్ఱయామాత్యున కంకితముచేసియున్నాఁడు. కంబముమెట్టు పురమును గవి యిట్లు వర్ణించెను,

సీ. వరుణదిగ్వీథి వేపురమునఁ బ్రవహించెఁ
బావనసలిలసంపన్న మున్న

దీపించె నేపురి గోపికామానసా
స్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తి వి
భావిశిఖాండ నృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మ
హేళి వీరేశబాలేందుమౌళి
చతుర చతురంగ బలరత్న సౌధయూధ
సాలగోపురతోరణసకల వర్ణ
పౌరవారాంగనా జనప్రముఖవస్తు
మేదురం బట్టికంబము మెట్టపురము.

గీ. ఆంధ్రమండల గిరిదుర్గహారలతకు
విమలనాయకరత్న భావము భజించి
యున్నతోన్నత శైలసంపన్న మగుచు
సకలపుటభేదనముల నెన్నికకు నెక్కె.

కంభము మెట్టపురము నతిశయముగా వర్ణించుటవలనను, ఆగ్రామ కరణమునకు వరాహపురాణమును గృతి యొసంగుటవలనను గవి నివాసము కంబముమెట్టయనియే యూహింపదగియున్నది. కాదేని తత్పరిసరప్రాంత మయియుండును. ఆంధ్రకవుల చారిత్రములో నీతని నివాసము కంబముమెట్టయనియే వ్రాసియున్నారు.

వరాహపురాణకృతిపతియైన యెల్లయామాత్యుఁడు వేల నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; సర్వవిభునకును గంగాంబి కకును బుత్త్రుఁడు; ఎల్లమంత్రి మల్లమాంబలకుఁ బౌత్త్రుఁడు; ఇతనికిఁ జెన్న విభుఁడు, అనంతమంత్రి యనువారలు పెదతండ్రులు, రామశౌరి పినతండ్రి, కవి కిరువురుసోదరులుకలరు. కృతిపతియింటిపేరు గ్రామనా మమునుబట్టి వచ్చినది. కొలిపాకకు కొలనుపాకయని నామాంతరము.

ఇదియుఁ గంబముమెట్ట సమీపముననే యున్నది. కంబముమెట్టను సంస్కృతీకరించి స్తంభాచలమని కవి యిందువాడియున్నాఁడు.

కృతిపతిని బ్రిభువనియు, నమాత్యశేఖరుఁ డనియుఁ గవివర్ణించి యున్నను షష్ఠ్యంతములయందలి యీ క్రిందిపద్యమువలన నీతఁడు గ్రామకరణమైనట్లు స్పష్టమగుచున్నది.

క. శ్రీమహితస్తంభాచల
నామసముద్ధామపట్టణస్థలగణక
గ్రామణికి బంధుహిత ర
క్షామణికిఁ గవీంద్రపంకజనభోమణికిన్.

ఈయెఱ్ఱయామాత్యుఁడు తిరుమలనారాయణ గురువునకుఁ శిష్యుఁడైనట్లు షష్ఠ్యంతములలోని మఱియొకపద్యమువలనఁ దెలియనగును.

క. తిరుమలనారాయణగురు
చరణాబ్జధ్యానమధురసస్థిరమతిష
ట్చరణునకు ఫలితకృష్ణ
స్మరణునకు నరాతిమంత్రిమదహరణునకున్.

కృతిపతి పెదతండ్రియైన చెన్నవిభుఁడు సేనాధిపతియైన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. కాని యేప్రభువుకడ సైనికాధిపతిగ నుండెనో తెలియలేదు.

క. వారలలోపల నగ్రజుఁ
డై రాజిలు చెన్నసైనికాగ్రణి యక్కాం
బారమణీయుండుఁ గనియె మ
హారసికుల ఘనవిభు ననంతామాత్యున్.

ఈకవి వరాహపురాణమును బూర్తిగా నాంధ్రీకరింప లేదు. పూర్వభాగమునుమాత్రమే రచియించిన ట్లీక్రిందిపద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

మ. కపటస్వాంతులుగాక యెవ్వ రిలనాకాంక్షించి యోతద్వరా
హపురాణంబున నాదిఖండచరితం బాద్యంతమున్ విందు రా
నిపుణుల్ గాంతురు పుత్త్రపౌత్త్రధనవాణీసంపదాయుర్ము
ఖ్య పదార్థోదితసౌఖ్యవృత్తియుఁ దుదిన్ గైవల్యసంప్రాప్తియున్.

వరాహపురాణమును హరిభట్టునకుఁ బూర్వము నందిమల్లయ ఘంటసింగయకవు లాంధ్రీకరించి, తుళువనరసనాయకున కంకితము చేసియుండిరి.

వరాహపురాణమునకుఁ బిమ్మట నీతఁడు మత్స్యపురాణమును రచియించినట్లు కన్పట్టుచున్నది. ఇతఁడు మత్స్యపురాణమునుబూర్తిగ నాంధ్రీకరింపలేదు. అందలి విష్ణుధర్మోత్తరఖండము నైదాశ్వాసములలో నించుమించుగ నెనిమిదివందలపద్యములలో రచియించెను విష్ణుపూజాఫలము, దానఫలము, తులసీమాహాత్మ్యము మొదలగుభక్తివిషయకములగు కథ లిందుఁ దెలుపఁబడినది. ఈపురాణము నీతఁడు శ్రీరంగమునందలి శ్రీరంగేశునకుఁ గృతియిచ్చుచు, నరకృతివిముఖత్వములు సూచించు నీక్రిందిపద్యమును మత్స్యపురాణములో వ్రాసియున్నాఁడు.

సీ. ఆయురారోగ్యవిత్తైశ్వర్యములు గల్గి
విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనమునకై నరాధముల సన్నుతిసేయఁ
బొడమినపాపముల్ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు
నిశ్చలవృత్తితో నిలుచుకొఱకు

కౌరవంబులఁ బాసి రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ జనెదుకొఱకుఁ

బరమవైష్ణవజనులెల్లఁ బ్రస్తుతింప
మత్కృతంబయ్యు హరికథామాన్య మగుచు
నుత్తమంబగు విష్ణుధర్మోత్తరంబు
రంగనాథున కర్పింతు రాణ మెఱసి.

మనకుఁ దెలిసినంతవఱకు వరాహపురాణ మొక్కటియే యీ తఁడు నరాంకితము చేసియుండెను. తా ననుకొనినంత ప్రత్యుపకృతి వరాహపురాణకృతిపతివలన లభింపకపోవుట మూలముననో, మఱియొ కని నెవ్వనినైన స్తుతించి యితఁడు కృతులుచెప్పి లాభముఁ బడయఁజా లకయో, తుచ్ఛసుఖముల నపేక్షించి కృతులను నరాంకితముసేయుట పాపకార్యమని హృదయమున వాస్తవమగుపశ్చాత్తాపము జనించుట చేతనో, కవిమత్స్యపురాణమున బైపద్యమును వ్రాసియుండునని తలంప వలసియున్నది. మత్స్యపురాణమునందేకాక యిట్టియర్థము నొసంగు పద్య మొకటి షష్ఠస్కంధములోఁగూడ వ్రాసియున్నాఁడు.

చ. ఎడపక విష్ణునిం బొగడ నెన్నఁడు నొల్లక దుర్మదంబున
గడుపులకై నరాధములఁ గావ్యసుఖంబుల సన్నుతింపఁగాఁ
బొడమినపాపజాలములఁ బొట్టణఁగం బొలియించి ముక్తిఁ
బొందెదుకొఱకై రచింతుఁ గృతి నీలగిరీంద్రున కర్పితంబుగన్.

మత్స్యపురాణ రచనానంతరమున నీతఁడు భాగవతషష్ఠస్కంధ మును, ఏకాదశద్వాదశస్కంధములును వరుసగా రచియించినట్లు కన్ప ట్టుచున్నది. శ్రీమహాభాగవతమునఁ బంచమ, షష్ఠ, ఏకాదశ, ద్వాద శస్కంధములు పోతరాజకృతములుకావు. పరులు రచించిన యీభా గములు రసవంతములుగా లేనందున, రసవత్తరముగా నాభాగమును మఱల రచియింపవలయునని యీకవి ప్రయత్నించియుండిన ట్లీతఁడు

రచించిన భాగములలో పోతనయనుకరణములుండుటనుబట్టి యూహింపఁదగియున్నది. పంచమస్కంధము నీతఁడు రచియింపనే లేదో, రచియించినను, ఆంధ్రభాషయందలి పెక్కు గ్రంథములవలెఁ గాలగర్భమున బడిపోయెనో జెప్పజాలము.

షష్ఠస్కంధమును జగన్నాథమందలి జగన్నాథస్వామి కంకితము చేసిన ట్లీక్రిందిపద్యములవలన స్పష్టమగును.

మ. గురుకావ్యాదినిలింపసంఘములు వైకుంఠంబుతోఁ సాటిగాఁ
బురణింపం బురుషోత్తమాహ్వయమహాపుణ్యస్థలంబందు సా
గరతీరంబున నీలశైలశిఖరాగ్రంబందు వేంచేసియు
న్నరమాకాంతుని భక్తవత్సలు జగన్నాథుం బ్రశంసించెదన్.

శా. ప్రస్కంధామరరాజ్యరక్షకుని భూభారాపహర్తన్ మహో
శస్కందాభినుతప్రభావుఁ గమలాసంక్రాంతరాజన్మహో
రస్కున్ విష్ణుఁ దలంచి భాగవతపౌరాణీయ మైనట్టిష
ష్ఠస్కంధంబుఁ దెనుంగుఁ జేసెదను గృష్ణప్రీతిగా వేడ్కతోన్.

క. కృతినాథుఁడు నీలాచల
పతియఁట శుకయోగివదన భాషితమగుత
త్కృతి భాగవతంబఁట యిది
మతిఁ దలఁపఁగ నింతకన్న మాన్యము గలదే.

గీ. పరుసమునకు నినుము బంగారమును నొక్క
విధమ మైనయట్లు వీక్షసేయ
శ్వపచుఁడైన విప్రవరుఁడైన శ్రీవిష్ణు
భక్తి కొక్కసమము పరిచరింప.

ఏకాదశద్వాదశ స్కంధములు రెంటిని గవి తనయిష్టదైవమగు నాంజనేయస్వామికిఁగృతియొసంగి కృతార్థుఁడయ్యెను. పోతన ననుకరించినపద్యము లీస్కంధములలోఁ గూడ నున్నవి.

క. మారుతసుతుఁడఁట! కృతిపతి
పారీణత భాగవతము బలికెడిదఁట! యీ
పారస్య మెచటఁ గలిగిన
వేఱొక మార్గమునఁ బోవువెఱ్ఱియుఁ గలఁడే.

క. ధ్యానం బేక్రియ నిలుచును
భావజజనకాభిరాము పాదములందున్
ఏవిధమున వసుదేవుఁడు
శ్రీవల్లభు పాదపద్మయుగముఁ జెందె నరేంద్రా!

ఈకవి రచించిన యేకాదశ ద్వాదశ స్కంధములయందలి పద్యములు కొన్ని వెలిగందలనారయ రచియించినట్లు ముద్రితప్రతులలోఁ గన్పట్టుచున్నవి. ఇందునుగూర్చి నారయచారిత్రమున విపులముగాఁ జర్చించియున్నాఁడను.

ఈతని కడపటిరచనము నారసింహపురాణోత్తర భాగము. పూర్వభాగము నెఱ్ఱాప్రెగ్గడ యాంధ్రీకరించియుండెను. ఈనరసింహపురాణమును హరిభట్టు కాలధర్మము నొందినపిదప, నాతనితనయుఁడైన రాఘవమనీషిచేఁ బ్రోలుగంటిరంగనమంత్రి కృతినందిన ట్లీక్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. వనుఁ బిలువఁబనిచి యర్ఘా
సనమున నుపవిష్టుఁ జేసి సన్మానములం
దనియించి చిఱునగవు మొగ
మున నీరికె లొందవ వినయమున నిట్లనియెన్.

సీ. విను రాఘవమనీషి! హనుమత్కృపావర
లబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనర నేకాదశద్వాదశస్కంధముల్
దెనిఁగించె మీతండ్రి ధీయుతుండు

హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుఁడు
రాజమాన్యుఁడు కవిరాజనుతుఁడు
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ
జెదలువా డెఱ్ఱన మొదలుసేయఁ

ప్రతిభ దళుకొత్త నుత్తరభాగ మిప్డు
డంధ్రభాషను వచనకావ్యం బొనర్చి
నాప్రబంధంబు నా పేర నంకితముగ
నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య!

క. కృతముమనిన సత్పురుషులు
కృతులవలనఁ గాదె భువినిఁ గీర్తిఁ గని మహా
కృతకృత్యులైరి గావునఁ
గృతి దక్కఁగ నొందుకీర్తి హేతువు గలదే.

వ. అని సకర్పూరవీటికాశాటికాలంకారపేటికలిచ్చి నంబఁగ్రహించి

క. మిసిమిగలవసిఁడిపుయిదకు
వసుదేవజముద్ర దొరకుపడువున నన్ను
ద్రసవత్కవితాయువతికి
రసికుం డగుప్రోలుగంటిరంగన గలిగెన్.

వ. అని పరమహర్షోత్కర్షంబున నంగీకరించి యేతత్ప్రారంభంబు
నకు శోభనాచారంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద.

పై సీసపద్యములోని "వచనకావ్యము"నకు గద్యపద్యకావ్య మని యర్థము గ్రహింపవలయును. లేదా 'వచన' శబ్దమును 'పద్య' అని మార్చుకొనవలయును.

ఈగద్యపద్యములవలన నీగ్రంథము రాఘవమనీషియై రచించి యుండెననియు దీనిని హరిభట్టు రచియించెనని దలంచుటకువీలు లేదనియు

రాఘవకృతమని తలంచుట కాటంకములు గలుగజేయు సీసపద్యములోని "బానర్చ" "నావ్రిబంధంబు"యను శబ్దములను లేఖక ప్రమాదజనితములుగా నెంచి వానిని "బొనర్చి" "యావ్రిబంధంబు" అని మార్చుట న్యాయ్యమనియు మొట్టమొదట దోచవచ్చును. కాని విమర్శించిన మీదట యీ యూహ నిరాధారమనియు సత్యదూరమనియు దోపక మానదు. అందులకు బ్రిధాన కారణములు రెండు.

(౧) కృతిపతి కృతికర్తను నుతింపక యాతనితండ్రిని నుతించుట. ఇందువలన గృతికర్త హరిభట్టుగాని రాఘవమనీషికాడనుట నిశ్చయము, సీసపద్యమునందలి తక్కిన వాక్యములన్నియు హరిభట్టునకును నర్తించును.

(౨) ఆశ్వాసాంత గ్రింథాంత గద్యలన్నియు "హరిభట్టారక ప్రిణీతంబైన"యని యుండుట.

ఈ రెండు కారణములవలనను నారసింహపురాణము హరిభట్టు కృతమని నిశ్చయించుటకు సంశయ మక్కఱలేదు.

హరిభట్టు చనిపోయినపిమ్మట నాతనికుమారుడు కృత్యాదిపద్యములను ఆశ్వాసాద్యంతములను మార్చి ద్రివ్యలోభముచే రంగనమంత్రిపేర రచించియుండునా? లేక హరిభట్టు కృత్యాదిని, ఆశ్వాసాద్యంతపద్యములను రచింపక గ్రింథమునుమాత్రిము రచియించి కాలధర్మమునొంద రాఘునమనీషి వానిని పూర్తిచేసి రంగనమంత్రి కంకితము చేసియుండునా? ఈ రెండింటిలో బైనిచెప్పినపద్యములనుబట్టి రెండవ యూహయే బలవత్తర మయినట్లు కనబడును. కాని మొదటియూహయే బలవత్తమ మయినదనినాయభిప్రాయము. హరిభట్టు మొట్టమొదట దైవప్రార్థన మొనర్పనిదే గ్రింథమును బ్రారంభించియుండడు.

నరకృతి చేయఁదలచినవానికి కృతిపతిలభించువఱకును గ్రంథ్యాదిరచించుట కవకాశ ముండదు, కాని, నరకృతివిముఖుఁ డైనహారిభట్టుఒక్క పద్యమేని రచింపక గ్రంథము నేల ప్రారంభించును? ఇప్పుడున్న కృత్యాదిపద్యము రంగనమంత్రి నాశీర్వదించునదిగా నిట్లున్నది.

ఉ. శ్రీమహికాంతరంగ నరసింహనభోమణి యాదవాన్వయ
గ్రామణి సర్వదైవతశిఖామణి యాశ్రితభక్తలోకవాం
ఛామణి శాంబరీమృగదృశామణి వేంకటశైలరాజ ర
త్నామణి ప్రోలుగంటి నరసప్రభురంగనఁ బ్రోచుఁ గావుతన్.

ఈపద్యము హారిభట్టుకృతము కా దనుట నిశ్చయము. హారిభట్టు నరకృతిపరాఙ్ముఁడు కావున రంగనకుఁ గృతి నిచ్చియుండఁడు. మొదటిపద్యమునందైనను, రంగననామము లేకుండ నున్నచో, హారిభట్టు మొట్టమొదట నాయొక్కపద్యమును రచించి, పిమ్మట గ్రంథమును చేసియుండెనని దలంపవచ్చును. అట్లు లేదుకావునఁ గృత్యాది లేకుండ హారిభట్టు గ్రంథమును రచియించియుండెనను నూహ బలవత్తరము కాఁజాలదు. హారిభట్టురచించిన కృత్యాదిపద్యములను రాఘవమనీషి మార్చి వేసినాఁడనుటయే యుక్తము. గ్రంథాదిపద్యములో "ప్రోలుగంటి నరసప్రభురంగన" అను మాటలుతప్ప తక్కినపద్యమంతయు హారిభట్టుదే కావచ్చును. ఆమాటలకు బదులుగా "మాకుసర్వసుఖసంపదలిచ్చుచు"అను నర్థమిచ్చువాక్యములను వ్రాసియుండును. వానిని రాఘవపండితుఁడు పైవిధముగా మార్చియుండును. ఈక్రింది రెండుపద్యములలో మార్పుచేయనేలేదు. చూడుఁడు.

చ. కలకలఁ గేలి చిల్కపలుకం బలుకం ఒలుపొత్తు నెమ్మితోఁ
బులుకల మేను దేలగిలఁ బొంగుచు బంగరువీణె దానవుం
గులుకులు రాల్చి నల్వఁ జనుగుబ్బలతాఁకునఁ జొక్కఁజేయు నా
పలుకులకల్కి నిచ్చలును బాయక నామది నిల్చుఁ గావుతన్.

మ. హాసం దండంబున ముద్దుసేసి తనుబాలార్వంగఁ దన్మస్త్రకాం
తరవిన్యస్తమృగాంక రేఖ బిసనూత్రం బంచు లోఁ గొంక నొం
ది రతిం దుండము సాఁచి పట్టి శివియన్ దీకొన్న దానొల్లస
త్కరిరాజన్యుఁడు మత్ప్రబంధమునకుం గావించు నిర్విఘ్నముల్.

గ్రంథాదిపద్యమున శ్రీకృష్ణవర్ణ ముండుటచే హరిభట్టు గ్రంథమును శ్రీకృష్ణున కంకితము చేసినట్లు తోఁచుచున్నది.

కృతిపతియైన రంగనమంత్రి ఆర్వేలనియోగిబ్రాహ్మణుడు; ఆశ్వలాయనసూత్రుఁడు; వశిష్టగోత్రుఁడు. ప్రోలుగంటిపుర వాస్తవ్యుఁడు; నంద్యాల చినయోబళ ప్రభుపునొద్ద మంత్రిగా నుండి యాతనిచే గౌరవింపఁబడినవాఁడు. ఈవిషయ మీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

క. ఆర్వేలకులోజ్జ్వలునకు
గర్వితరిపుగహనదహనకనదనలునకున్
సర్వంసహామహాధిక
ధూర్వాహబలునకును విగతదుశ్శీలునకున్

క. పాత్రవశితాశ్వలాయన
సూత్రున కధికతరసుకృతశుభగుణచంచ
ద్గాత్రునకును బుధనుతచా
రిత్రున కశ్రాంతకృత హరిస్తోత్రునకున్.

సీ. అమరమర్త్యభుజంగమారాధ్య సౌరాష్ట్ర
సోమేశ్వరస్థానశోభితంబు
చెన్న కేశవదేవ శేఖర ప్రోత్తుంగ
భువనగోపుర సౌధభాసురంబు

పాతకజీమూత పటలఝంఝూనిల
తుంగభద్రాతీర సంగతంబు
విహృతిలాలన సౌరమహిళాంఘ్రిలాక్షాంక
విలసిత ప్రాకార వేష్టితంబు
జనసైంధవగంధేభ సంకులంబు
చతుర వారవిలాసినీ సమధికంబు
బహులవిస్తుల వస్తుసంపత్తివిజిత
గోపురంబొప్పు ప్రోలుగంటిపురంబు.

క. ఆపురి కేశవమూర్తికి
దీపిత మణిభూషలొసఁగి దృఢతర రాజ్య
శ్రీ పాలన ఖేలనధౌ
రాపాలుఁడు నరసవిభు వీరంగన వెలయున్

గీ. ఎలమి నందెల చినయాంధ శేంద్రదత్త
సలలితాందోళికాచ్ఛత్ర చామరాది
చిహ్నములు దాల్చి యెంతయుఁ జెన్నుమీఱి
మంత్రిరంగన వెలయుభూమండలమున.

రంగనయే కాకుండ నాతనిపూర్వులు కూడఁ బ్రోలుగంటియందే నివాస ముండియుందురని గృహనామమునుబట్టి తెలియుచున్నది ఈపట్టణము తుంగభద్రానదీతీరమున నున్నదని పై సీసపద్యములోనున్నది. ఈపట్టణ మిప్పుడెచ్చట నేపేరుతో నున్నదో తెలియ లేదు.

కృతిపతియైన రంగనమంత్రి కందాళశ్రీరంగగురుని శిష్యుఁడైన ట్లీక్రిందిపద్యములో నున్నది.

సీ. గురుతర వాధూలగోత్రాన్వయాంభోధి
పూర్ణిమాచంద్రుఁడై పొలుపుమీఱి

జైనచార్వాకాది సకలదుర్మతఘోర
గహనధూమాంకుఁడై కనకమించె
శిష్యకదంబ కచిరతరసంపత్తి
వితరణఖ్యాతిమై వృద్ధిఁబొందె
శ్రీ వేంకటాచల శిఖరమందిర దేవ
తాపరమూర్తియై యవతరించె

జగతిఁ గందాళభావనాచార్యవర్య
తనయుఁడయ్యె గురుస్వామి ఘనతకెక్క
నట్టిశ్రీరంగ గురునాథుఁ డాత్మగురుఁడు
గాఁగ నన్నుతివడసె రంగప్రభుండు.

ఇకహరిభట్టుకాలమును గూర్చి యోచింపవలసియున్నది, బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమ యాంధ్రకవులచరిత్రము వ్రాయునాఁటికి హరిభట్టుకృతమైన నరసింహపురాణము ముద్రితము కాలేదు వరాహమత్స్య పురాణములు దక్కఁ దక్కిన గ్రంథముల వ్రాఁతప్రతులైనను పంతులుగారికిలభింపలేదు, లభించినమత్స్య వరాహ పురాణములోఁ గవి కాలనిర్ణయము చేయుటకుఁ దగినయాధారములు గానరాకపోవుటచే నీతఁడెప్పటివాఁడో తెలిసికొనఁజాలమనియు, అప్పకవి హరిభట్టుగ్రంథములనుండి పద్యముల నుదాహరింపకపోవుటచే సరియైనయాధారములు లభించువఱకు హరిభట్టును క్రీ. శ. ౧౬౬౦ సంవత్సరప్రాంతమువాఁడని దలంపవచ్చుననియు శ్రీపంతులుగారుతమకవుల చరిత్రములో వ్రాసియున్నారు. అటుపిమ్మటఁ గొంతకాలమున కాంధ్రసాహిత్యపరిషత్తువారు మైసూరుపుస్తకభాండాగారమునుండి వ్రాఁతప్రతిని సంపాదించి, నరసింహపురాణమును ముద్రింపించిరి. ముద్రితప్రతికిఁ బిఠాపురసంస్థానకవియగు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు పీఠిక వ్రాయుచు నందు హరిభట్టుయొక్క కాలమునుగూర్చి విమర్శించి యాతఁడు క్రీ. శ. ౧౫ వ శతాబ్దియం దుత్తరభాగమున నున్న వాఁడను

టకు సందేహముండదని నిశ్చయించియు, ఈతఁడు రచించిన గ్రంథములన్నియుఁ బురాణాంధ్రీకరణము లేనై యుండుటంబట్టియు మత్స్యపురాణమున నీతఁడొనర్చిన యపూర్వ గ్రంథోపక్రమమునుబట్టియుఁ ప్రబంధకాలమునకుఁ బూర్వుఁడని యూహించుటయుక్తమేమో! అని సంశయమును జూపినారు.

హరిభట్టు రచించిన గ్రంథములన్నిటిలోను అతని కాలమును నిర్ణయించుట కెక్కువగాఁ దోడుపడునది నరసింహపురాణమే. వెంకటరామశాస్త్రిగా రవలంబించినమార్గము సరియైనదనియే నాయభిప్రాయము. అదిసరియైనదనిచూపుటకు మరికొన్ని యాధారము లానరసింహపురాణమునందే కనుపట్టుచున్నవి. వానిని దెలిసికొనుటకు ముందు కృతిపతివంశావళిని దెలిసికొనుటావశ్యకము. కావున నరసింహపురాణము ననుసరించి కృతిపతివంశవృక్షములో మనకథకవసరమయినంత వఱకుక్రిందనిచ్చుచున్నాఁడను.

తిప్పన = బైరమ

- కొండమంత్రి = మల్లమ
  - నరసరాజు = తిరుమలాంబ
    - రంగనమంత్రి
  - తిమ్మరాజు = అక్కమ
- నాగశౌరి = దేవమ
  - చెన్నశౌరి = కొండమ

ఈవంశవృక్షములోని రంగనమంత్రియే నరసింహపురాణకృతిపతి. ఇందు మొదటిపురుషుఁడగు తిప్పన ప్రౌఢరాయల దండాధీశుఁడైనట్లీక్రిందపద్యములోఁ దెలుపఁబడినది.

శా. ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయ నృపదండాధీశ సంపత్కళా
సామగ్రిన్ విలసిల్లి మల్లమను భార్యాకీర్తివిస్ఫూర్తి ను

ద్రాఘిమాసాధ్యమహోమహత్వమున సంధాయుక్తి దోశ్శక్తి వా
చామాధుర్యమునం బురావిభులతోఁ జర్చించు సర్వజ్ఞుఁడై.

ఈప్రౌఢరాయలు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకు విజయనగరరాజ్యమును బరిపాలించిన సంగమవంశములోని రెండవ దేవరాయలని, నరసింహపురాణముద్రిత ప్రతిపీఠికాకారులు గుర్తించి యున్నారు. శ్రీఆచార్య నేలటూరి వెంకటరమణయ్యగారివిషయమున సంశయముఁజూపి మల్లికార్జునరాయనామాంకితుఁడై ౧౪౪౭ మొదలు ౧౪౬౫ వఱకు రాజ్యమేలిన మూఁడవదేవరాయలై యుండునని యూహించినారు ౧ తిప్పనమునిమనుమఁడైన రంగనమంత్రి నరసింహపురాణమును క్రీ. శ. ౧౪౪౫ ప్రాంతమునఁ గృతినందియుండునని యీ దిగువఁజూపఁ బోవుకారణములచే నిశ్చితమగుచున్నది. శ్రీ వేంకటరమణయ్యగారును నట్లేయభిప్రాయపడిరి. అప్పటికి రంగనమంత్రికి దాదాపుగ నేఁబదేండ్లుండునని తలంపవచ్చును. అప్పటికీరంగనమంత్రియగ్రజులు ముప్పదేండ్లకు నయసునచ్చిన తనయులుండుటచే నైయూహయందు తప్పుండదు. ఆపక్షములో రంగనమంత్రి జననము క్రీ.శ ౧౩౯౦ వ సంవత్సరమున కించుకపూర్వమైయుండును. కావున నీతనిప్రపితామహుఁడైన తిప్పన క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున జన్మించియుండునని నిశ్చయింపవచ్చును. అప్పుడాతఁడు ౧౪౩౦–౧౪౪౬ నడుమనున్న ప్రౌఢదేవరాయలయొద్ద సేనాధిపతిగా నుండెననుటయొప్పునుగాని మల్లికార్జునునియొద్ద నేఁబదియేండ్లు దాఁటినపిదప సేనాధిపతిగానుండెననుట యొప్పదు. సామాన్యముగా నాకాలమునఁ గవులు రెండవదేవరాయలనే ప్రౌఢరాయలని వాడుచుండిరి. కావున రెండవదేవరాయలయొద్దనే తిప్పనయుండెనని యూహింతము అయినను హరిభట్టు, రంగనమంత్రులకాలము వేఱువిధమున నిర్ధారితమగుచున్నది. కావున తిప్పన, యేదేవరాయలకడ నున్నాఁడన్నను ప్రస్తుతాంశమున కంతగా బాధాకరము కాదు.

౧ భారతి. ౧౮ సం. భా ౧. పుటలు ౧౪౬–౩౪.

తిప్పమంత్రికిఁ బౌత్రుఁడైన చెన్నశౌరి కొన్నిగ్రంథములను రచియించినటు నరసింహపురాణకృత్యాది యందున్నది. ఈతనిచారిత్రము నిదివఱకు వ్రాసియున్నాఁడను౧. అతఁడు సాళువగుండ నరసింహరాయలయొద్ద నగ్రహారములను గైకొనియుండెననియందు వ్రాసియుంటిని అందుదాహరించిన పద్యములలో "ఖ్యాతి నరసింగరాయలుచేతఁ గొనియె"ననియున్నది. ఆకాలమున నీ పేరుగలవారని చెప్పఁబడువారు నల్గురున్నారు. అందు మొదటివాఁడైన సాళువగుండ నరసింగరాయలు క్రీ.శ. ౧౪౫౦-౧౪౯౦ నడుమ ప్రఖ్యాతిగనినవాఁడు. రెండవవాఁడీతని కుమారుఁడైన ఇమ్మడి నరసింగరాయలు పై పద్యమున 'నిమ్మడి' శబ్దము లేదు. కావున నీతఁడాతఁడుకాఁడు. మూఁడవ యాతఁడు కృష్ణదేవరాయలతండ్రియైన తుళువనరసనాయకుఁడు. ఈతనినామము పెక్కుతావుల నరసనాయకుఁడనియే యుదాహృతమైనది. ఎచ్చటనేని కొన్నిచోట్ల నరసింహనాయకుఁడనియున్నను, నరసింహ రాయలని యితఁడు పేర్కొనఁబడలేదు. కావున పై పద్యములోనియాతఁ డీతఁడుకాఁడు. ఈ తుళువనరసనాయకుని కుమారుఁడు వీరనరసింహ రాయలు. పై పద్యములో 'వీర' శబ్దములేదు. కావున నాతఁడీతఁడుకాఁడు. దీనినిబట్టి సాళువ నరసింహరాయలే చెన్నశౌరికగ్రహారము నిచ్చినయాతఁడని తేలుచున్నది. చెన్నశౌరి గ్రంథములు లభింపకపోవుటచే నీతఁ డేనరసింహరాయలచే నగ్రహారములను గొనియెనో తెలియుటలేదు. ఈనరసింహరాయనామధారులు నల్వురును క్రీ. శ. ౧౫౦౯ వ సంవత్సరమునకుఁ బూర్వమున్నవారు. దాత యేనరసింగరాయలైనను అగ్రహారమును గైకొనిననాఁటికిఁ జెన్నశౌరికి ౪౦ సంవత్సరము లున్ననుకొనినచో నాతని జననము ౧౪౬౦ ప్రాంతమగును. లేదా అంతకుఁబూర్వమగును. కాని తరువాత కానేరదు. రంగనమంత్రి కీతఁడు పినతాతకుమారుఁడగుట పై కాలము సరిపోవుచున్నది. చెన్నశౌరికిఁ దాతయైనతిప్పన ౧౪౦౦ ప్రాంతమున జన్మించి, రెండవదేవరాయలయొద్దనే పైన్యాధి

౧. ఆంధ్రకవితరంగిణి. సం. ౬ పుట 83.

పతిగా నుండెనని తలంచుట సత్యదూరముకాదని తలంపవచ్చును. ఈయంశములనుబట్టి రంగనమంత్రికాలము క్రీ. శ. ౧౫౦౦-౧౫౫౦ అని నిశ్చయమగుచున్నది.

ఈతిప్పమంత్రి దానశీలుఁడు, దైవభక్తుఁడు. ఈతఁడొనర్చిన ధర్మములను గవి యీక్రిందిపద్యములోఁ దెలిపియున్నాఁడు. ఈతఁడు వ్రాయించినశాసనము లుండియుండునుగాని యవి నాకు లభింపలేదు.

సీ. వదలనిభక్తితోఁ గట్టించెఁ బంపావి
రూపాక్షదేవుని గోపురంబు
విఠ్ఠలపతికిఁ గావించి యర్పణచేసె
మహనీయతరభోగమంటపంబు
మాల్యవంతము రఘువ్రాత్మవధూభర్తకు
ఘనకిరీటం బువాయన మొసంగె
దరిసెనఁబిచ్చె మతంగవీరన్నకు
గట్టాణిముత్యాల కంఠమాల
బ్రాహ్మణుల సెల్వ నగ్రహారములయందు
దిక్కులన్నింటఁ గీర్తులు పిక్కటిల్ల
వెలసె దుర్మంత్రిసంఘాతవిభవజాత
తిమిరకుముదారి యగునాతిప్పశౌరి

ఇతనితనయుఁడగు కొండమంత్రికూడా దండాధీశుఁడే, రంగనమంత్రి తండ్రియగు నరసింహమంత్రికూడ దండాధినాథుఁడై నట్లీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రీమదహోబలస్వామి పాదాబ్జము
ల్మరగించినాఁ డాత్మమధులిహమును
దానాంబుధారల ధారుణీసురదైన్య
కర్దమపుంజంబుఁ గడిగినాఁడు

సత్కీర్తిమల్లికా సౌరభ్యములను
వైరించాండ పేటి వాసించినాఁడు
చండప్రతాపమార్తాండ మండలిచేత
ధూర్తారి తుహినంబుఁ దోలినాఁడు

ప్రణుతి యొనరింపఁ దగడె నృపాలసభలఁ
బరమభాగవతోత్తము భవ్యచరితుఁ
జారుతర పుణ్యగణ్యు నీసకలదండ
నాథకులసింహుఁ గొండయ నారసింహు.

ఇంత వఱకు నరసింహపురాణకృతిపతినిబట్టి చూచితిమి. ఇఁకను కృతిపతియైన రంగనమంత్రికిఁ ప్రభువైన అవళిచినయోబళునిబట్టికూడ నీకాలము సత్యమగునో కాదో చూతము. రంగనమంత్రినందేల అవళిచినయోబళునకు మంత్రియైనట్లు నరసింహపురాణమునఁ బలుతావుల లోఁ జెప్పఁబడినది. అందు రెండుమూఁడు పద్యముల నీక్రింద నుదాహరించెదను.

క. హావళి చినయోభళనను
ధావల్లభమంత్రివర్య! ధైర్యాహార్యా!
ధీవిభవతోషితార్యా!
పావననేత్రాబ్జయుగ కృపారసధుర్యా!

ఉ. హావళి చిన్నయోభళధరాధిపశేఖర సైన్యపాల!

సీ. గీ యతఁడు హావళిచిన యోభళావనీశ
బహుళసామ్రాజ్యధౌరేయ మహిమనిపుణ
విపులబాహార్గళాటోప విజితభుజగ
సార్వభౌముండు రంగయసచివఘనుఁడు.

సీ. పా. నందేలచినఓబళనాథహృద్వీణకు
రంగుమీరిన తంత్రి రంగమంత్రి

ఈపద్యములవలన నందేలఅవుళిచిన ఓబళాధిపునియొద్ద నీరంగనమంత్రి మంత్రిగను దండనాథుఁడుగను నున్నట్లు స్పష్టమగుచున్నది. నంద్యాలవంశములో ఓబళనామకు లెందరోయుండుటచే నీఓబళుని తండ్రిపేరుకూడ తెలిసికొనవలసియున్నది. ఇతని తండ్రి నరసింగయ యైనట్లీక్రింది సీసపద్యమువలనఁ దెలియును.

సీ. తనమంత్రలాగ్రి ముద్దండారిమండల
భూధరంబులకు దంభోళిగాఁగఁ
దనకృపారసము బాంధవసేవకాళీతో
ద్యానసీమకు వసంతంబుగాఁగ
దనచక్కఁదనము కాంతామనశ్చంద్ర కాం
తములకుఁ జంద్రికోదయముగాఁగఁ
దననీతివర్తన ధారుణీజనచాత
కంబులకభ్రాగమంబుగాఁగ

వెలసె నేరాజు సముదగ్రబలసమగ్ర
కమఠకర్మఠభుజపీఠి చినఓబదానశాలి
యతఁడు నందేలనరసింగయాంతరంగ
తామరసహేళి చినఓబదానశాలి.

శా. ఆరాజన్యశిఖావతంస చతురాశాంతావనీచక్రభృ
ద్ధారంధర్యుఁడు శత్రునిర్మథన విద్యాశాలి లీలావతీ
మారాకారుఁడు ప్రోలుగంటి నరసామాత్యాత్మజుం డార్యత
త్త్వారంభుండగు రంగమంత్రి యొకనాఁ డాత్మీయగేహంబునన్.

ఈపద్యములవలన నంద్యాల నరసింగయకుమారుఁడైన యవుళిచినఓబళుఁడు రంగనమంత్రికిఁ బ్రభువని నిశ్చయమైనది. హావళిశబ్ద

విరహితముగా సీతనిని చినయోబళుఁడనికూడా వాడుచుందురని పైసీస పద్యాంతపాదమువలన దెలియుచున్నది. ఈయవళి చినయోబళునికాల ముగాని యాతనినిగూర్చిన మరియేయితర విషయముగాని నరసింహపు రాణమునుబట్టి తెలియదు. ఈనంద్యాలవంశమును బింగళి సూరనా ర్యుఁడు కళాపూర్ణోదయమున విపులముగా వర్ణించియున్నాఁడు.

నంద్యాలవంశము ఆర్వీటి బుక్కరాజు సంతానాంతర్భాగము. ఆర్వీటి బుక్కరాజునకు అబ్బలమ్మ, బల్లమ్మ అని యిరువురుభార్యలు. అబ్బలమ్మ కుమారుఁడు సింగరయ్య. ఈసింగరయ్యకు నరసింహరాజు నారపరాజు తిమ్మరాజు అనిముగ్గురు కుమారులు. అందులో మొదటివాఁడైన నర సింహరాజుతో నంద్యాలవంశము ప్రారంభమయినదని సూరనార్యుఁడీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. అందును సింగభూరమణుఁ డౌబళదేవిని బెండ్లియాడి నం
క్రందనతుల్య వైభవులఁ గాంచెఁ దనూజులముగ్గురన్ బుధా
నందవిధాయి నిర్మలగుణప్రకరున్ నరసింగరాజు శ్రీ
నందనతుల్యు నారవిభు నవ్యపురూరవుఁ దిమ్మపార్థివున్.

ఉ. ప్రాలినకీర్తిఁ బెంపెసఁగి వారలలో నరసింహరాజు నం
ద్యాలపురాధిపత్య విభవాతిశయంబువహించి మించెను
ద్వేలనిరూఢి నెల్లెడల విశ్రుతమై తనవంశమెల్ల నం
ద్యాల పదప్రసిద్ధిఁ దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్

ఈపద్యములవలన నంద్యాల (నందేల) వంశమునకు మూలపురుషుఁడు నరసింగరాజు అనియు నాతనివంశమువారు నంద్యాలవారైరనియుఁ దేలి నది. నంద్యాలరాజధానిగా రాజ్యమేలినవారు కావున వారునంద్యాల వారైరి. మనకథకుఁగావలసినంతవరకు నరసింగరాజు వంశవృత్తమును గళాపూర్ణోదయము ననుసరించి యీక్రిందనిచ్చుచున్నాఁడను.




రామరాజీయమున బుక్కరాజుకుమారుఁడైన సింగరయ్యయే నంద్యాలవంశమునకు మూలపురుషుఁడని చెప్పియున్నాఁడు.

సింగర, నరసింహశబ్దము లొక్కొక్కప్పుడే కార్థద్యోతకములుగా భావింపఁబడినను నిచ్చట భిన్నార్థములని తలంపవలయును. ఈవంశమువారు తమశాసనములలో నీభేదమునుజూపుచు వచ్చిరి.

పైవంశవృక్షములోఁ దుదిపురుషుఁడైన హోవళి చినయాబళ రాజే రంగనమంత్రికి ప్రభువు. ఈచినయాబళరాజును బింగళసూరనార్యుఁడు కళాపూర్ణోదయమున నిట్లు కీర్తించియున్నాఁడు.

క. ఆముప్పరిలో నగ్రిజుఁ
డై మించు నృసింహునకుఁ దదంగన యగు శ్రీ
రామాంబకు నుదయించి మ
హామతి నానళిచినౌబళాఖ్యుఁడు వెలయున్.

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁ డఖండ చండతే
జోవిభవంబునం దపనునూనుఁ డనూనవితీర్ణి పెంపునన్

దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంపఁగా
నావళిచిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే.

ఈచిన్నయోబనరపాలుని శాసనములు రెండుగన్పట్టుచున్నవి. అహోబలమున హావళి పెద్దయోబళరాజునకుఁ బుణ్యమునకుగాను శా. శ. ౧౪౭౦ కీలక సం॥ చైత్ర శు ౧౦ (శ్రీరామనవమి) నాఁడు వ్రాయించినది౧ దీనినిబట్టి యాతనికగ్రజుఁడు పెద్దయోబళరా జదివఱకు చనిపోయెననియు, నందువలన నీతఁడు చినయోబళరాజని పిలువఁబడియె ననియుఁ దలంపవలసియున్నది. రెండవది కర్నూలు మండలమునందలి సిరువోలుసీమలోని దేవరాజపురమను గ్రామమును నరసింగరాజ రఘుపతిరాజయోబళరాజునకుఁ బుణ్యమునకుగాను నగ్రహారముచేసి శా. శ. ౧౪౬౯ ప్లవంగ సం. శ్రావణ బ 30 సోమవారమునాఁడు వ్రాయించినది.౨ ఈరఘుపతిరాజు హావళిచినయోబళరాజునకుఁ బినతండ్రి. ఆతనికుమారుఁడైన యోబళరాజదివఱకే యిహలోకమును వీడియుండును అందుచేతనే కావలయు సూరనార్యుఁడు కళాపూర్ణోదయమున హావళి పెద్దయోబళరాజును గాని, రఘుపతిరాజుకుమారుఁడైన యోబళరాజును గాని చెప్పలేదు. ఈశాసనములు పైవంశవృక్షములోని నరసింహరాజుకుమారుఁడైన కుమారోబళునివేమో యనియనుమానము కలుగవచ్చునుగాని కాలమందుల కంగీకరింపదు.

ఈహావళిచినయోబళుఁడు క్రీ. శ. ౧౫౪౭-౧౫౪౮ సంవత్సరములలో నున్నాఁడనినచో నాతనిమంత్రియగు రంగనమంత్రి యా సంవత్సరములలో నావయసునవేయుండి యాప్రాంతముననే నారసింహపురాణమును రాఘవమనీషిచేఁ గృతినందియుండునని నిశ్చయించుట కాటంకముండదు. ఈహావళి చినయోబళుని పినతండ్రియగు యోబరాజు శా.శ. ౧౪౬౫ (క్రీ.శ. ౧౫౪3) శోభకృతు సం॥ మాఘ శు ౧౧

౧. A.R. 81 of 1915 క్రీ.శ. ౧౫౪౮
౨. A.R. 267 of 1936 క్రీ.శ. ౧౫౪౭

నాఁడు కొచ్చర్లకోటసీమకుఁ జేరిన తుమ్మపాడుగ్రామము నగ్రహారముఁ జేసి వ్రాయించిన శాసనములో నీరంగనమంత్రికొక వృత్తి కల్పించి నట్లున్నదని వ్రాయుచు శ్రీ ఆచార్య నేలటూరు వెంకటరమణయ్యగారు శాసనపాఠమును పూర్తిగా నిచ్చియున్నారు. ౧ ఈశాసనముకూడ రంగనమంత్రి కాలమును ధ్రువపఱచుచున్నది. రంగనమంత్రి కొంతకాల మీయోబళునియొద్ద నుద్యోగిగానుండెనేమోయని సంశయము కలుగుచున్నది. పైని వ్రాసిన "ఎలమి" అను గీతపద్యములోని "చినయోబళేంద్రుడు" వీఁడేమో!

హరిభట్టు చనిపోయిన యెంతకాలమునకు కాతెనికుమారుఁడు రంగనమంత్రికి గ్రంథమును దెచ్చి యిచ్చెనో చెప్పఁజాలము. క్రీ. శ. ౧౫౪౦-౧౫౫౦ నడుమ నీకృతిప్రదానము జరిగినదనుట నిశ్చయము. ఈకాలము ౧౫౪౩-౧౫౪౮ మధ్యనై యుండునని శ్రీ వేంకటరమణయ్యగారు నిశ్చయించియున్నారు. అదిసత్యమే యైయుండును. అంతకుఁ బూర్వము కొంతకాలము క్రిందటనే హరిభట్టు చనిపోయియుండును. దానినిబట్టి యీతఁడు పదునాఱవ శతాబ్దియందు ప్రథమార్ధముననున్న వాఁడనుట నిశ్చయము.

రంగనమంత్రి, కందాళభావనాచార్యతనయుఁడైన శ్రీరంగాచార్యులశిష్యుఁడు. ఈ శ్రీరంగాచార్యుల శాసనములు తిరుపతియందు క్రీ.శ ౧౫౪౫ ప్రాంతమునఁ గన్పట్టుచున్నవి. దీనినిబట్టియును బైని వ్రాసిన రంగనమంత్రికాలము సత్యమని ధ్రువపడుచున్నది.

ఎన్నివిధములఁ జూచినను హరిభట్టుకాలము ౧౫౩౫ దాఁటి యివ్వలకు రానేరదు. కావున నితఁడు బదునైదవ శతాబ్దియందంత్య పాదమునను, పదునాఱవశతాబ్దియందుఁ బూర్వార్థమునను నున్నాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. హరిభట్టుకాలము క్రీ. శ ౧౪౭౫—

౧. భారతి సం. ౧౪ భాం పుట ౨౪.

౧౫౩౫ అనియు, ౧౫౦౦-౧౫౩౫ నడుమ గ్రంథరచనమును గావించి యుండుననియు నిశ్చయింతము.

రంగనమంత్రికిఁ బినతాతయైన చెన్నశౌరి ద్విపద నారసింహ పురాణము రచియించియుండుటచేఁ గాఁబోలు రంగనమంత్రి పద్యనారసింహపురాణముఁ గృతినందియుండెను.

హరిభట్టు కవిత్వమీతఁడు చెప్పుకొనినట్లు, అమృతప్రాయము గనేయున్నది. గంగానదివంటివలె మహాధారగలిగి సమాససంస్కృతాంధ్రపదసంయుతమై హృదయంగమముగానున్నది.

నృసింహపురాణపీఠికలో బ్రహ్మశ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రి గారు, ఈకవి మత్స్యపురాణమున నపూర్వగ్రంథోపక్రమ మొనర్చెనవి వ్రాసియున్నారు. అయపూర్వోపక్రమమేదియో తెలియలేదు. కవులందఱిచేఁ జేయఁబడురీతిగా గ్రంథాదియం దిష్టదేవతాప్రార్థనము, పూర్వకవిస్తుతి, కుకవినింద, యివిలేవు. షష్ఠ్యంతములున్నవి. ఆశ్వాసాద్యంతపద్యము లున్నవి.

గ్రంథారంభమిట్లున్నది.

క. హరికి సమర్పిత మగుకృతి
సరళం బగు శుక్తిమధ్యకలబిందుక్రియన్
హరి కసమర్పిత మగుకృతి
విరసంబగుఁ దప్తలోహమృతజలము గతిన్.

వ. అని మనంబున వితర్కించి.

సీ. జలజసంభవునకు నిలువేలుపై మించెఁ
జర్చింప నేవేల్పు జగములోన
తారకబ్రహ్మమై తనదారు రామునిచేతఁ
బూజితుఁ డయ్యె నేపుణ్యమూర్తి

వీక్షింప నుభయకావేరీజలాంతరం
బున నిల్చె నేదేవుఁ డుస్కిగోరి
విభవంబుతోడ నేవిభుఁ డోసంగును భక్త
జనులకు వైకుంఠసదనముఖము

నట్టినిర్మలనిరవద్య యజ్ఞతత్త్వ
సచ్చిదానందరూపప్రశస్తుఁడైన
రంగపతిమీఁద బుద్ధిఁ జేరంగఁబూన్చి
యమ్మహాత్మునిఁ గాదుగా నాత్మఁదల్చి.

ఇష్టదేవతాప్రార్థనాదికమును విడచి యపూర్వోపక్రమము చేయవలయు నని కవి యుద్దేశించియుండఁ దనియు, ఇష్టదేవతాప్రార్థనాదికపద్యములున్న భాగము తమకు లభింపకపోవుటచే, ముద్రాపకులుఁన్నది యున్నట్లు ప్రకటించుటవలన నదియొక యపూర్వోపక్రమముగా వెంకటరామశాస్త్రిగారు భావించియుందురనియు నేనభిప్రాయపడుచున్నాఁడను.

నారసింహపురాణపూర్వఖండము నెఱ్ఱాప్రగ్గడ రచియించియుండుటచే హరిభట్టు ఉత్తరభాగము నాంధ్రీకరించెను. ఇందుఁ బ్రహ్లాదుడు దుర్మంత్రిబోధితుఁడై దేవతలతోఁ బగఁ గొనుటయు నింద్రునిజయించుటయు, వైకుంఠముమీఁదకు దాడివెడలుటయుఁ దుదకుబశ్చాత్తప్తుఁడై శరణుజొచ్చుటయు మొదలుగాఁగలకథలు వర్ణింపఁబడినవి.

హరిభట్టు కవిత్వశైలి తెలియుటకై యాతనిరచనములనుండి కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

మత్స్యపురాణము:—

మ. తరుణుల్ తత్పురపుష్పవాటికలలోఁ దానస్వరం బొప్ప సు
స్థిరలీలన్ హరిఁ బుండరీకనయనుఁ శ్రీమాన్ సీనాయకున్

బరమప్రీతినిఁ బాడుచున్నయెడఁ దత్పార్శ్వస్థితానోకహాం
తరభృంగావళి సేయు గానములు తత్తద్వాక్యసంపన్నమై...౧౮.

శా. ఆస్తిప్రతిపద్యమానవచనవ్యాపారముల్ సూచిత
న్నాస్తిత్వార్థసమేతయుక్తిసహితానల్పాపసిద్ధాంతవా
క్ప్రస్తావోన్నతులైనదుర్జనులవాక్యప్రౌఢిమం గుంది వి
స్రస్తం బైనమనంబు నిల్పు విధ మేచందంబు పాదోద్భవా...౩౮.

చ. ధనకులరూపశౌర్యగుణదానవయోబలరాజ్యభోగసం
జనితమదాంధులై నృపతిసంఘము లెల్ల నిజాత్మశత్రులన్
మునుకొని గెల్వనోపక సమున్నతసైన్యసమేతులై రయం
బున దనువుల్ త్యజింతురు ధనపూర్ణధరాతలలాభకాంక్షులై...౪౮

మ. ధనధాన్యంబులు గోలుపోయి నిజపుత్రభ్రాతృవర్గంబు చే
తను రోషంబున వెళ్ళఁగొట్టఁబడి యాత్మన్ దుఃఖయుక్తుండనై
చని నానావిధతీర్థతోయముల సుస్నాతుండనై యిచ్చటన్
గనుఁగొంటిం గమలాక్షు నిన్నుఁ గృతసత్కర్మంబునన్ బార్థివా.

న ర సిం హ పు రా ణ ము:—

ఉ. దానవనాయకుం డణఁగెఁ దత్సుతుఁ డిప్పుడు విష్ణుభక్తుఁడై
దీనునిమాడ్కిఁ బ్రత్యహము దేవగణంబుల కాపుఁడై తద్దీ
యానుమతింబులైనపను లర్థి నొనర్చుచున్నవాఁడు దు
ర్మానముతోడఁ దండ్రిపగ మానసవీథిఁ దలంపఁ డింతయున్.

ఉ. నర్తితతాళవృంతపవనంబులఁ గొంత; వధూకుచాంతర
స్ఫూర్తి మసింపుసమ్మిళితశోభనచందనచర్చఁ గొంత;గా
ఢార్తిహరంబులైనశిశిరానిలపోతవిభూతిఁ గొంత; సం
వర్తశిఖావదుగ్రకరవాసరతాపము నాఁపఁగాఁ దగున్.

ఉ. దానవనాథుపంపున సుదగ్రబలాఢ్యులు వెగ్గలంబుగా
మానిసిదిండిమూకలు సమస్తజగంబుల నాక్రమించి పై

మానికులెన్ బలారిభవమాధవధాతలు మున్నగాఁగ న
చ్చోనిలుపోవనీక నెనఁ జోఁచిరి తేనియయోఁగలుంబలెన్.

ఏ కా ద శ స్కం ధ ము :—

మ. శరకారుండు శరంబుమీఁద నిజదృక్స్వాంతంబు లేకంబుగా
నెఱి సంధించి తదేకనిష్ఠుఁ డగుచున్‌వీక్షించుచో మున్పటన్
దురగం బెక్కిన రాజుఁ గానకిక్రియన్ తోరంబుగా యోగిబా
హ్యాంతరచిజ్ఞానము మాని చేర్పవలయున్ యజ్ఞేశుపైఁ జిత్తమున్.

చ. అతిశయతుల్యనాశముల కాశ్రియ మైనజగంబు యోగిదా
సతతము నస్థిరం బని విచారము నేయుచు విష్ణుభక్తి సం
పదలను విఱ్ఱవీఁగుచుఁ బ్రసన్నతఁ బొందినయట్టిసద్గుణున్
బ్రతిదినసంబు తీవ్ర మగుభక్తిని సేవ యొనర్ప మేలగున్.

చ. ఎఱుఁగుదుఁ జిత్తమందు విబుధేశ్వర! మీరిట రాకమున్న నే
ధరణిభరంబు మాన్ప ఘనదానవుల న్వధియించినాఁడ దు
ష్కరమదగర్వసంపదలఁ గన్నులఁ గాననియాదవక్షమా
వరులను నేపణంచి యిదె వచ్చెద ముక్తికి సత్వరంబునన్.

ద్వా ద శ స్కం ధ ము :—

ఉ. చేసెదఁ జెప్పినట్లు మునిశేఖర యేమదిలోన భానుసం
కాశుని విష్ణునిం దలఁచి కామమదాదుల మోహసంపదన్
నాశము చేసి భాగవతనామక మైనసుధర్మపద్ధతిన్
వాసిగ వింటి మీవలన పర్ణితి మైనము రాచితోరమై.

చ. సరసిజసంభవాదిసురసంఘముచేత సుధర్మగుప్తికై
బరువడి యాచితుం డగుచు పన్నగశాయి కళావతీర్ణుఁడై
యరిమురితోఁ బరాశరున కాత్మజుఁడై జనియించి వేదముల్
వరుసతో నాల్గు చేసెమునివర్యులు మేలని సన్నుతింపఁగన్.

మ. హరినామస్మరణంబు సేయుము మదిన్ హర్షంబుతో దేవతాం
తర మంత్రాంతర సాధనాంతరములం దాసక్తి వర్జించి వే
మఱు పుత్రాప్తగృహాదులం దగిలి దుర్మార్గంబులం బోక త
త్పరుఁడై యున్న నరుండు చేరుఁ బరమస్థానంబు విప్రోత్తమా!

వరాహపురాణము:-

ఉ. మిక్కిలి శీతలాంబువులు మేనికిఁ గీడు మహోష్ణవారిచేఁ
బొక్కు శరీర మీయుభయముం దొరలించిన నింపొనర్చు ని
ట్లొక్కనయంబరయుండె భయమెుండె నొనర్పక తద్ద్వయంబు దా
నిక్క వెఱింగి చూపు మనుజేంద్రునకున్ వశులౌదు రందఱున్. ౧ఆ

చ. సరసుఁడు తారకాయుతుఁడు శాంతుఁడు రాజకళాకలాపవి
స్ఫురితుఁడు వచ్చెఁ గూర్మి ననుఁ బొందఁగ నంచు దలంచు యామినీ
తరుణి రతిక్రియాసముచితం బగు నంబరనూత్నశయ్యపై
నెరపిన మల్లెమొగ్గలన నిర్మలతం గనుపట్టెఁ దారకల్. ౨ఆ

చ. జలరుహబాంధవుం డమరశైలము చుట్టును నెక్కి యాడుచో
వలపలియాగె కాని గరువంబున డాపలివాగె దప్పినన్
మలఁగవు నీరశ్యామములు మాకిన గావని హేషితారవ
చ్ఛలమున నార్చె నవ్వసురశాత్రవసైనతురంగమావళుల్. ౩ఆ

షష్ఠస్కంధము :

గీ. సకలవేదశాస్త్రపారజ్ఞులైనట్టి
మునులకైన యోగిజనులకైన
పద్మభవునకైన పవనాత్మజునకైన
కామువారి మిగులఁ గడుపవశమె !

క. ఆయువు శేషించినచోఁ
బాయక జననంబు వసుధఁ బ్రాప్తం బగువ

యాయువు పూర్ణంబుగ ధృతి
నాయతపుణ్యమున జీవుఁ డగును మహాత్మా!

చ. అనియెడుమంత్రరాజమున నంబుజనాభునిఁగూర్చి దక్షసం
జనితకుమారకుల్ దపము సంతత మాచరణంబు సేయు స
ద్వనమున కేఁగి నారదుఁడు వారలఁ గాంచి ప్రియంబుతోడ ని
ట్లనియెను హేతుగర్భితపదాభినుతం బగువాక్యవైఖరిన్.

ఆంధ్రపరిషత్కార్యాలయమున హరిభట్టువర్థస్కంధ మని
యొక వ్రాఁతప్రతి కలదు. పై పద్యము లందులోనివే. ఈగ్రంథాంత
గద్యమున పోతన పేరే యున్నది. కృత్యాదివేఱుగా లేదు. ఇం దజా
మిళోపాఖ్యానము మొదలుగా నున్నది స్కంధాంతపద్యములు రామస్తు
త్యాత్మకములు.

ఇంతవఱకు వ్రాసినవిమ్మట బ్ర. శ్రీ నిడదవోలు వెంకటరావు
M A గారు హరిభట్టుకాలమును సరిగా తెలుపు శాసనము నుదాహరిం
చుచు నీక్రిందివాక్యములను వ్రాసియున్న వ్యాసము కనుపట్టినది. ౧
"హరిభట్టు శ్రీకృష్ణదేవరాయుని కాలమువాఁడని క్రీ. శ. ౧౫౧౩ లో
నున్నాఁడని యీక్రిందిశాసనమువలన తెలియనగును.

"శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షం
బులు ౧౪౩౫ అగు నేటి శ్రీముఖసంవత్సరం ఆశ్వీజ బ ౧౨ పుణ్యకాల
మందు శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ
కృష్ణరాయ మహారాయలుగారు సుఖానురాగం శ్రీరాజ్యం జేయుచుం
డుగాను శ్రీ మద్రఘుపతినాయకాచార్యులైన శ్రీ వీరరామనాయకుల

(A R. of Mysore Archeological Report 1927 Kolar inscriptions No. 69 page 77. A Copy of Ramasamudra grant of King Kristnaraya of Vizianagaram dated Saka 1435 in the Possession of Sawle Seshachar in Kolar town.)

---

౧. భారతి సం ౨౬ భా ౧. పుట ౨౧.

వారు శ్రీ భారద్వాజగోత్ర ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయు
లైన శ్రీ రామచంద్రభట్టోపాధ్యాయులు పుత్రులైన హరిభట్టోపా
ధ్యాయులకు ఇచ్చిన తామ్రశాసన మెట్లుండుననూ మా అధికారునికి
జేరిన చిన్నపల్లె అను గ్రామమునకు శ్రీరామసముద్రం అని ప్రతినామం
జేసి మా మాతాపితృవ్యులకు పుణ్యలోకప్రాప్తికై శ్రీరామసన్నిధిలో
సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను సమర్పించిరి. ఈ గ్రామానికి
జల్లెని ధ్యాదిసమస్త తేజస్స్వామ్యములున్ను మీరు పుత్రపౌత్రాదులుగా
అనుభవించుకొని మా వంశస్థులకు శ్రేయః ప్రార్థన జేసుకొని సుఖంగా
వుండేది అని వ్రాయించియిచ్చిన తామ్రశాసనం"

హరిభట్టు సంస్కృతభాషలో రతిరహస్యమును రచియించెనని
చెప్పుదురు. అందలి గద్య "ఇతి సర్వవిద్యాకవిద్య సహజసారస్వత
చంద్ర నామాంక రామవిద్వన్మణి కుమారు హరిహరనామకవివిరచితా
యాం శృంగారదీపికాయాం రతిరహస్యే" అని యున్నది హరిభట్టు
అని యుండక హరిహర అని యుండుటచే గొంత సంశయము కల్గు
చున్నది. ఇది విలేఖకప్రమాదమేమో!

సంస్కృత రతిరహస్యము స్తోమభూపాలుని యాంధ్రపద్యము
లతో గూడ ముద్రితమైనది. ఆ ప్రకాశకులు హరిభట్టే సంస్కృత రతి
రహస్యకృతికర్తయనియు జర్మనుపండితుండగు స్మిత్ అనునాతఁడు
సంస్కృత రతిరహస్యమును క్రీ. శ. ౧౮౭౪ లో జర్మనీదేశమునఁ
బ్రకటించె ననియు వ్రాసియున్నారు.



# 122. రాచమల్లుకవులు

కాకునూరి అప్పకవి, కూచిమంచి తిమ్మకవి మొదలగు లక్షణ వేత్తలు కవులషష్ఠములోనివనియు, శృంగారషష్ఠములోనివనియుఁ గొన్ని పద్యములను దమలక్షణ గ్రంథములయం దుదాహరించి యున్నారు. పేరులు వేఱుగానున్నను నీరెండు గ్రంథములును ఒక్కటియే. పోతనామాత్యుని షష్ఠస్కంధము శిథిలమైపోఁగా దానిని సింగనపూరించెను. అతనికవిత్వము సరసముగా లేదనికాఁబోలు, హరిభట్టీస్కంధమునుమరల రచించెను. దీనినేయీరాచమల్లుకవులుకూడ రచించియున్నారు. కవుల షష్ఠమని వాడుచుండుటచే నీకవులొక్కరని యనుకొనఁజొచ్చిరి. కాని యిద్దరుకవులు దీనినికలిసి రచించిరని తలంచుట సమంజసము గాఁగన్పడలేదు. అప్పకవి "తృతీయవర్గసరళమునకు, రాచమల్లు వారి షష్ఠస్కంధము"అని వ్రాసియున్నాఁడు. రాచమల్లు అనునది యింటిపేరై యుండును. ఆకవులిరువురుగాని యొక్కరుగాని యైయుందురని నాయభిప్రాయము. ఒక్కరు రచియించినను జనమంచివారి రామాయణమనినట్లే "రాచమల్లు" వారిషష్ఠస్కంధమని పిలువఁబడుచుఁ గ్రమక్రమముగ "రాచమల్లు" కవులషష్ఠమై తుదకుఁ గవులషష్ఠమై యుండును. షష్ఠస్కంధమందలి "అజామిళోపాఖ్యానము"ను జెప్పుసందర్భమున శృంగారవర్ణన మధికముగాఁ జేసియుండుటచే దీనికిశృంగారషష్ఠమనికూడ పేరువచ్చినది. ఈక్రిందనుదాహరించిన పద్యములవలన నీగ్రంథములు రెండును నొకటియే యని తెలియును.

అప్పకవి-యుదాహరించినవి.

శృంగారషష్ఠము:—

౧. తే. తల్లియును దండ్రిదైవంబు తలఁపగురుఁడ
కాఁడె యితఁడేమిచేసినఁ గళలఁదగునె

నాస్తి శాంభవ యోరి యన్యాయవృత్తి
నాస్తిక త్వం గురోశ్శపరమ్మనంగ వినవె?

౨ సీ. గీ. ఉత్తరమున నాపోశనమె త్తఁబోయి
భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు.

3. సీ. గీ. వలవదుభయంబువారెంత వారలైన
నట్టివారలు మన కగ్గమైనవారు
వారు నిరయంబునకుఁ గాఁపువచ్చువార
లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు.

౪. క. అనుటయుఁ గృష్టద్వైపా
యనతనయుం డిట్టులనియె నవహితమతియై
వినుమతిగుహ్యము నారా
యణకవచము భక్తవాంఛితార్థప్రదమున్.

పై పద్యములలోని ౧, ౨, 3 పద్యములను గూర్చి వాంచి తిమ్మకవి తనగ్రంథమున నుదాహరించుచు నవి కవులషష్ఠములోనివని చెప్పి యున్నాఁడు. 4వ పద్యము శృంగారషష్ఠములోనిదిగా నుదహరించెను. తిమ్మకవి, పైనజెప్పినవిగాక, కవులషష్ఠములోనివని కొన్నియు, శృంగారషష్ఠములోనివని కొన్నియుఁ బద్యముల నుదాహరించి యున్నాఁడు. వాని నీక్రిందవ్రాసెదను.

శృంగారషష్ఠము:—

ఉ. జాఱుటయుం దదూరుయుగసాంద్రరుచుల్కటిమీఁదనుండి దై
వాఱినఁగాంచి పంచశరపంచశరీపరికంపితాత్ముఁడై
పాఱుఁడు దాబహుశ్రుతము బల్మియుభావవిశుద్ధకల్మియు
న్మీఱిన నెమ్మనంబుఁ గడిమిన్ నిలు పోవఁగలేక లోలతన్.

సీ. రాయైన తబిసిపేరంటాలిఁ గ్రమ్మఱఁ
గలిగించునడుగుచే వెలసినాఁడు

కవులమష్టము:—

క. అరిగి సమ్మిత్ప్రసవ కుశాం
కురపక్వఫలోత్కరంబుఁ గొని గృహమునకున్
మరలి యట వచ్చునప్పుడు
ధరణీసుర నందనుండు దనకట్టెదుటన్.

చ. పెరిగిన యీసున న్నమలిపింఛములన్ బురివిప్పఁబోలు నీ
నరసిరుహాక్షి వేనలికి సాటికినిల్వఁగ నోడిచొచ్చెనిం
దిరకిరణంబు తేటిగమి నీలము లిందు(?)నిపేరుగాంచె పె
న్నిరులు గుహాశ్రమంబుఁ గనియెన్నటిగల్గినవారి కోర్తురే.

గీ. ఇవ్విధంబున మరియు ననేకగతుల
లలితశృంగారచేష్టల లాచి లాచి
చూచుచున్నట్టి ప్రమ్లోచిఁ జూచి మునికి
మనసు గురగురమనియె ఝుమ్మనియె నొడలు.

క. నిరసి నెరసుంజచక్రిక
సరసీరుహ విరహఖేదసం సూచకమై.

క. ఇంటికిఁ జనుటయు మానెన్
వంటొనరింపంగఁ జాగె నాగరికలతోఁ
గుంటెనకాడులఁ గూడెన్
గొంటయ్యె మతిఁ దసాధుగోష్ఠీపరతన్.

సీ. గీ. ఎసఁగఁ జాత్రిక నోగిరం బిడక మున్న
యతిరయంబునఁ బరిషేచ మాచరించుఁ
దత్తరమున నాపోశన మెత్తఁబోయిఁ
భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు.

ఉ. తొక్కులతో సరాగము నెఱుంబరికింపఁదు వేడ్కఁజెంది రా
యక్కనకాచలంబు విబుదాఢ్యమునం జనుదెంచుచున్న

మ. గురుబంధుల్ దనుఁజుట్టిరాఁ దిగిచియాక్రోశింప నిశ్చేష్టుఁడై
యొరులం దన్ను నెఱుంగలేక యసుహృద్వ్యాధార్తి మున్గొందియా
పరత న్రొర్రయుచుఁ జో వివర్ణతమెయిం వాటిల్ల.......

ఉ. హంససమానగామికిని నట్టివిమాతనగర్భశుద్ధికిం
బుంసవనాదికృత్యములు భూపశిఖామణి యార్యసంసదా
శంసితకర్మకర్మఠత సాంగముగా నొనరింప నవ్వయో
త్తంసుఁ గుమారునిం గనియె దర్పకునిందిర గన్నకైవడిన్.

మ. పదము ల్త్రొక్కిలఁ గానుదీవ వెలయింపం గేశముల్ దూలఁబ
ర్వ్యెడ వక్షోరుహపాళిచేరఁ గనుదోయి స్వాప్నముల్ గ్రమ్మ గ
ద్గదకంఠంబున వాక్యము ల్దడఁబడన్ దద్దేహముం జొచ్చి యా
సుదతీరత్నము గాంచెఁ బాలుని మనశ్శోకానలజ్వాలునిన్.

శా. శీఘ్రంబేటికి వచ్చిసంసృతి భవశ్రీ సౌఖ్యగంధంబె దా
నాఘ్రాణింపని మత్తమూఁజాల దురాత్మా! భిక్షులం జేసినన్
శుఘ్రాది వ్యవమగ్నుఁ జేసితి కృపాశూన్యుండవై గోముఖ
వ్యాఘ్రంబింతియుగాక నీవు ఋషివే యాహాపితర్క్రూరంపఁగన్.

క. మనుజులలోపలఁ గర్మం
బొనరుచు వారెల్ల దండ్యులో వారలలోఁ
గనుఁగొనఁ గొందఱె దండ్యులొ
యనవుఁడు హరిభటుల కనిరి యప్పార్శ్వచరుల్.

వ. అడలిచి నిల్వవారిఁగని యంతకు కింకరు లెవ్వరయ్య మీ
రిదె యమునాజ్ఞఁ ద్రోచితిరి యెచ్చటనుం డిటవచ్చినార ల
య్యది గత మడ్డువెట్టుటకు నెవ్వరివార తెఱుంగఁ జెప్పుఁడా
యదితి తనూజులో సురలొ యక్షులొ సిద్ధులొ కాకసాధ్యులో.

పై సందర్భములను బరికించినచో నీరెండుగ్రంథములు నొక్క
టియే యనిస్పష్టమగును.

పై పద్యములుగాక, తిమ్మకవి మఱిరెండు పద్యముల నుదాహరిం చియున్నాఁడు. వానినీక్రింద నిచ్చెదను.

మ. తలతోఁ బల్లిన వాణిపానములమీఁద న్వ్రాలలేనత్తనో
య్యన పాశ్చాత్య నిజాస్యతిమ్ముఖములం దన్యోన్య మొక్క ప్రచుం
బనమబ్బంగఁ జతుర్ముఖత్వము ఫలింపంజొక్కు పద్మాసనుం
డనవద్యాయురుదీర్ణుఁ జేయుఁ జికతిమ్మాధీశుతిమ్మాధిపున్.

శా. చండాంశుప్రభ! చిక్కతిమ్మయ తనూజా! తిమ్మ! విధ్వస్త పా
షండంబైన త్రిలింగభాగవతషష్ఠస్కంధ కావ్యంబు నీ
కుఁడక్కం జతురాననత్వగుణయుక్తుం డౌ వాణీమనో
ఖండారోద్ధత చూఱకాఱ బిరుదప్రఖ్యాతిసార్థంబుగన్.

ఈ పద్యములనుబట్టి యీ షష్ఠస్కంధము చికతిమ్మాధీశు కుమారుఁడైన తిమ్మప్రభువుని కంకితము చేసినట్లు తెలియుచున్నది. ఇతఁడేవంశమువాఁడో తెలియదు. గుంటూరుమండలమునందలి మంగళగిరినృసింహస్వామి యాలయమున క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరమునాఁటి దొక శాసనముకలదు. (స్యూయెల్ సం ౨ పుట ౬౬) అది చికతిమ్మయ దేవునికుమారుఁడైన తిమ్మరాజు వ్రాయించినది. ఇతఁడు కృష్ణదేవరాయలకు సామంతుఁడో మంత్రియో యైయుండును. (స్యూయెల్ ౧ సం. పుట౧౧౭) చినతిరుమలరాజులు. తిమ్మరాజులు మఱికొందఱు కలరు. కాని పద్యములోఁ జెప్పినట్లు" చిక్కతిమ్మాధీశులతిమ్మయ్యలు మఱెవరును గాన్పింపలేదు. కావున నీశాసనకర్తయే షష్ఠస్కంధ కృతిభర్తయని యంగీకరింపఁదగియున్నది. అప్పకవి యీగ్రంథమునుండి లక్ష్యములను గైకొనియుండుటయే నీగ్రంథప్రాశస్త్యమునకుఁ దార్కాణము.

ఈ తిమ్మయశాసనము లింకనుగలవు.

పోతనామాత్యుఁడు క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమున భాగవతమును రచియించియుండుననియు నాప్రాంతముననే యాతఁడు

దేహమును జాలించియుండు ననియు నాతని చరిత్రమున వ్రాసియుంటిని. ఆతఁడు చనిపోయిన పిదప షష్ఠస్కంధము శిథిలమైపోయిన దనివిని యీ షష్ఠస్కంధము నీ కవులు రచించియుందురు. హరిభట్టుకూడ క్రీ. శ. ౧౫౨౦ ప్రాంతముననే షష్ఠస్కంధమును రచియించియుండెను. కావున నీ రాచమల్లువారి షష్ఠస్కంధము క్రీ. శ. ౧౫౨౦-౧౫౩౦ ప్రాంతమున రచితమైనదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈకవి లేక కవుల నివాసము గుంటూరు లేక బళ్ళారిమండలమని చెప్పఁదగియున్నది. ఉదాహృతపద్యములనుబట్టి యీకవిత్వము సలక్షణమై రసవంతమై మనోహరముగానున్నదని చెప్పవచ్చును.



## 124. మలయమారుతము సర్వన్న

మలయమారుతము సర్వన్న షష్ఠస్కంధములోనిదని యీ క్రింది సీసపద్యమును రామా ప్పిగ్గడజగ్గన తన ప్రబంధరత్నాకరమునఁ దుదాహరించియుండుటచే నీతని పేరు తెలియవచ్చినది. ఈ గ్రంథమిప్పు డెచ్చటను లభ్యముగుటలేదు. ఇతఁడు పదునాఱవ శతాబ్దివాఁడని నిశ్చయింపవచ్చును. పోతరాజకృత భాగవతషష్ఠస్కంధము శిథిలముగుటచే రాచమల్లుకవులవలెనే యీతఁడును షష్ఠస్కంధమును రచియించి యుండవచ్చును.

సీ. పోఁడియావగనున్న పుదులు టక్కలివంక
సక్కట నగసి గాశావదను న్న,
సరిగాఁమి నెంతయుఁ జటులలోఁ బడనున్న
గిరులెల్ల నీఁశఁ జెచ్చు పెఱుగను న్న,

పగిలి లోఁగరఁగెడు బంగారుకుండలు
తలకెక్కి యటమీఁదఁ జెలగఁకున్న,
కలఁగిన మాలూరిఫలము లింకిటమీఁద
గిట్టితి దీవులఁ బెట్టకున్న,

గీ. నడు...గమైననున్నతిఁ బాయవలసె
నక్కటా! మాకునని యవి యాత్మఁగుంద
మునుపు చింతాంధకారంబు మొనసె ననఁగ
నలినలోచన చనుమొనల్ నల్లనయ్యె (?)
(ప్రబంధరత్నావళినుండి గ్రహింపఁబడినది.)



## 125. ఎఱ్ఱన

ఈతఁడారువేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; కూచనమంత్రికిని ముత్తమాంబికకును బుత్రుఁడు; అష్టభాషాకవితాప్రవీణుఁడు, నవఘంటసురత్రాణ బిరుదాంచితుఁడు.

ఈకవి రతిరహస్యమను నామాంతరముగల కొక్కోకమును, రచించి కుంటముక్కల మల్లమంత్రి కంకితముచేసెను. ఈమల్లమంత్రి సోదరునికుమారుఁడైన చినభైరవామాత్యుని ప్రేరణముచే దిరుపతివెంక టేశ్వరునకు సకలనీతికథానిధానమను గ్రంథమును గృతియిచ్చెను. మల్లమంత్రి తండ్రి భైరవామాత్యుఁడగుటచే నీతనిని జినభైరవుఁ డందురు. ఎఱ్ఱనకవి పురాణసారమను మఱియొకగ్రంథమునుగూడ రచియించెను. కాని యది యిప్పుడెచ్చటను గన్పించుటలేదు. ఈ పురాణసారమునకుఁ జినభైరవామాత్యుఁడే కృతిభర్త.
కొక్కోకమునందుఁ గవి తనను గూర్చి యిట్లువ్రాసికొనియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్ర ప్రసిద్ధన భూరి నా
పస్తంబసూత్ర ప్రశస్తఘనుఁడ
గురుదయానిధి యైనకూచనమంత్రికి
సంగనామణి యుత్తమాంబికకును
దనయుండ సత్కవీంద్రసుమాన్యచరితుండ
శివకృపాసుజ్ఞానశేఖరుండ
నారూఢవిద్యాచలానంద యోగీంద్ర
శిష్టపరిచార విశిష్టఘనుఁడ

వెల్లనామాత్యుఁడను సత్కవీంద్రహితుఁడఁ
గలితవాక్ప్రౌఢిఁ గోకశకవివరుండఁ
జతురమతితోడ రతికళాశాస్త్రవిధియుఁ
దెనుఁగుఁగావింతు రసికులు వినుతిసేయ.

పినభైరవామాత్యుఁడు తననుగూర్చి పలికినట్లు చెప్పఁబోనిన సకలనీతి కథానిధానములోని యీక్రిందిపద్యములవలనఁ గవివృత్తాంతము కొంత తెలియఁగలదు.

సీ. శ్రీవత్సగోత్రవారిధి పూర్ణశీతాంశుఁ
డగు కూచమంత్రికి నాత్మజుఁడవు
వివిధాష్టభాషాకవిత్వ వాచాప్రౌఢిఁ
బూర్వకవీంద్రులఁ బోలినాఁడ
వఖిలపురాణేతిహాస కావ్యస్మృతి
చయము రచించినచారుమతివి
మావినతండ్రియా వెల్లమంత్రికిని
గోకశంబు చెప్పినగోవిదుఁడవు

రసికులభినుతి చేయఁ బురాణసార
మనువమంబుగ నాకిచ్చినట్టి ప్రౌఢ

వట్లుగావున నొకటినిన్నడుగఁ దలఁచి
యిచ్చుటికిఁ బిల్వఁబంచితి నెఱ్ఱనార్య.

క. భానమునఁ దోఁచెఁగలియుగ
పావనభూపాలకథలు బంధురకావ్య
శ్రీవెలయ నాంధ్రభాషను
గావింపఁగవలయు సుపవిత్రకాకతనాథున్.

కొన్కోఁక కృతిపతియైన మల్లమంత్రి గజపతిచేఁ బాత్రబిరుదమును గైకొనినట్లును నాజమానుఖానునిచేత వినుకొండ దుర్గమునకధిపతిగాఁ జేయఁబడినట్లును నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. హరిపదధ్యాన తత్పరుఁడు చండల మహా
లక్ష్మీప్రసాదైక లబ్ధవరుఁడు
రహిఁ గజపతిమహారాయ లిచ్చినసమం
చితమహాపాత్ర ప్రసిద్ధయశుఁడు
నాజమాఖానరాయనిచేత నొడయఁడై
వినుకొండ దుర్గ మేలినఘనుండు
కృతివననిక్షేప వృథుతటాకాలయ
తనయాది సప్తసంతానఘనుఁడు

మునిపరాశరగోత్ర సంజనితుఁడార్య
సేవ్యతిరువెంగళాచార్య శిష్యుఁడనఁను
మంత్రి పెనుమల్లికొమ్మయ, మనుమ, డెల్లి
మంత్రి తెల్లగయు, భైరవమల్లమంత్రి

సకలనీతికథానిధానకృతి ప్రేరకుఁడగు పినభైరవామాత్యుఁడు కొండపల్లి దుర్గాధిపతియై నట్లీక్రిందిపద్యములవలన దెలియుచున్నది.

సీ. పరిభవించె నేపిట్టఁ బర్వతాగ్రంబున
నరిగిరీశ్వరుఁడు శ్రీనాయకుండు

వసియించె నేవీట వర్ణితశాలాంత
    రమున మరాళస్థాన రాజహాళి
యుదయించె నేవీట నుత్తరాశాతట
    భూషణీకృతనింబ పుట్టలాంబ
వరియించె నేవీట నలదిశాకోణంబు
    నందు గుబ్బటలమైలారమూర్తి

వినుతి గాంచె నేవీటను విప్రరాజ
వైశ్యశూద్రాది బహువిధవర్ణసమితి
యట్టిపురరత్న మొప్పుభవ్యాంబుజాతి
మండితామరతరువల్లి కొండపల్లి.

క. ఇటువంటి కొండపల్లి
పుటభేదన మంత్రిమకుటభూషణ మహిరా
ట్కటకవిభేదన ఘటనో
ద్భటుండు కుంటముక్కుల పినభైరవుఁడొప్పున్

మల్లమంత్రి వంశవృక్షమీ క్రింది పద్యములవలనఁ దెలియును.

సీ. మునిపరాశరగోత్రముఖ్యుఁడగు గుంటు
    పలివెరుమళిరాజు భాగ్యమూర్తి
యారాజవర్యున కాత్మజుండై యొప్పు
    గురుధైర్యనగరరాజు కొమ్మరాజు
కొమ్మయమంత్రికిఁ గూర్మినందనుఁడయ్యె
    మనుమయామాత్యుఁ డమాత్యహాళి
యామనుమయ్యకు నవతరించిరి మొందు
    కొండూరుచిట్టిన కోవిదుండు

గీ. పొసఁగ నోబళమంత్రి తత్పుత్రుఁడయ్యె
దెలగయామాత్యుఁ డష్టదిగ్దీపకీర్తి

ఇట్టి తెలగయ్యకును బుట్టె నసమయశుఁడు
భైరవామాత్యుఁ డరిమంత్రిభంజనుండు.

గీ. ఘనులు నాచనసోమన కాళహస్తి
మంత్రిగోపన సింగనామాత్యవరులు
తమ్ములుగ రూపకీర్తి ప్రతాపములను
బ్రబలె నిల కుంటముక్కుల భైరవుండు

ఆ. అట్టిభైరమంత్రి కనుకూలభాగ్య సౌ
భాగ్యగరిమ వెలయఁబత్ని యయ్యె
నక్కమాంబ తనయులనఘుల నలువురఁ
గనియె గుణసముద్రులనుచు బొగడ

క. వారెవ్వరనిన గంగన
ధీరుఁడు పెదమల్లనయును దీప్తయశశ్శ్రీ
ధారుఁడు మల్లామాత్యుఁడు
భైరవుఁడుననంగ నఖిలభాగ్యోన్నతులై.

పై సీసపద్యములో వర్ణింపఁబడిన వంశవృక్షమంతయు "హరిపదధ్యాన" యనుసీసపద్య గీతమందలి తుది రెండుచరణములలో "మంత్రి పెరుమాళ్ళకొమ్మయు మనుమరోబమంత్రి తెలగయభైరవ మల్లమంత్రి" యనుకూర్చియున్నాఁడు.

పై సీసపద్యములో "గుంటుపలి" వారనియున్నది. ఇదిపొరపాటో విలేఖకునికృత్యమో చెప్పఁజాలను. గుంటముక్కులయని సవరించుటకు యతియంగీకరింపదు. గుంటుపలివారు కుంటముక్కులవారైనారని యన రాదు. వారు నందవరీకులు వీరాఱువేలవారు.

ఈపద్యము ప్రక్షిప్తమన రాదు. ఇందలిపేరులు మరియొకపద్య మందలినామములతో సరిపోవుచున్నవి. "కుంట-ముక్కులపెరుమాళ్ళు పుణ్యమూర్తి" అని సవరింపవలసి యుండునని తోఁచుచున్నది.

కొక్కోక ముద్రితప్రతిలోఁ గవితండ్రిపేరు మాచనయని యున్నది. అదిపొరపాటు. కూచనమంత్రి యుండవలయును.

కొక్కోక కృతిపతియైన మల్లమంత్రికిఁ దిరుమల తిరువెంగళాచార్యుఁడు గురువైనట్లు క్రిందిపద్యభాగమువలనఁ దెలియుచున్నది.

క. తిరుమల తిరువెంగళ
పరమకృపాబ్ధివిభవ భాగ్యాత్మునకున్.

నాచన, సోమనలనువారు మల్లమంత్రికిఁ బినతండ్రులు. నాచన సోముఁడను మహాకవికిని వీరికిని సంబంధము లేదు.

సకలనీతికథానకృతి ప్రేరకుఁడైన పినభైరవుఁడు మల్లమంత్రికిఁ బెద్దయన్నగారగు గంగన్నకు దనయుఁడైనట్లు క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

“శ్రీమహితరూప్య పదసేవితసురేంద్రా !
క్షేమకరతల్పగత శేషగతశోభా !
భామహితగంగవిభు భైరవ! సుధీవ్రా
ద్ధామ్మ తిరువేంకట నిధానజగదీశా !

ఈపినభైరవునకుఁ గూడ పాత్రబిరుదమున్నట్లు గ్రంథాదినున్న యీక్రింది పద్యము చెప్పుచున్నది. పాత్రమహాపాత్ర బిరుదములు ఒరిస్సాప్రభువులగు గజపతులవలననే బ్రసాదింపఁబడుచుండినట్లు శాసనసాక్ష్యమున్నది.

ఉ. శ్రీలలనాధినాథుఁ డతసీకుసుమాంచితమూర్తి యష్టది
క్పాలకిరీటరత్నరుచి భాసిపదాబ్జుఁడు మిత్రసర్వభూ
పాలుని గుంటముక్క పినభైరవపాత్రుని నేలుసత్కృపా
లోలుఁడు వేంకటేశ్వరుఁడు లోకములెప్పుడుఁ బ్రోచుఁగావుతన్.

మల్లమంత్రికి గురువగు తిరువెంగళాచార్యుఁడే యీపినభైరవునకుఁ గూడ గురువైనట్లీక్రిందిపద్యమువలన నూహింపవచ్చును.

క. గురుశేఖర ప్రఖ్యాతుఁడు
తిరుమలయాచార్యుఁ డాత్మదేశికుఁడన సు
స్థిరకీర్తి సప్తసంతతి
వరుఁడగు చినభైరవుండు ప్రతిదివసమునన్.

ఈ చినభైరవునకు సకలనీతికథానిధాన రచనమునాఁటికి మల్ల మంత్రి యనుకుమారుఁడుండిన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. వనితాజనకందర్పుఁడు
ఘనదాన ఘనాఘనంబు కమనీయవిభా
దినకరుఁడు కుంటముక్కల
చినభైరవమల్లమంత్రి పృథుతరకీర్తిన్.

ఈకవి కాలమును నిర్ణయించుటకు రెండాధారములు కన్పట్టుచున్నవి. కొక్కోకములో "రావిపాటి తిప్పరాజును సకలనీతికథానిధానములో శ్రీనాథునిఁ బూర్వకవులుగా నుతించియుండుటచే నితఁడు క్రీ. శ. ౧౪౫౦ కిఁ దరువాతివాఁడనుట స్పష్టము. ఈరెండుగ్రంథములకుఁ గృతిపతులైన వారిరువురును గజపతులచేఁ బాత్రిబిరుదముల నందినవారగుటచేఁ గృష్ణా, గుంటూరుమండలములలో గజపతులు పాలకులుగానున్న కాలములో నీతఁడున్నాఁడనుట నిశ్చితమైనవిషయము. గజపతులు క్రీ. శ. ౧౪౭౦ మొదలు శ్రీకృష్ణదేవరాయలు కొండపల్లి దుర్గములను జయించి (౧౫౧౫) వఱకు వినుకొండ ప్రాంతముల యందున్నవారు. కావునఁ గవియాకాలమునందుండి యీకావ్యములను రచియించెనని స్పష్టముగాఁ జెప్పవచ్చును. చినభైరవునకంటె మల్లమంత్రి యిరువదేండ్లు వయసునఁ బెద్దవాఁడై యుండును. క్రీ. శ. ౧౪౮౦ ప్రాంతమునఁ గొక్కోకమును ౧౫౦౦ ప్రాంతమునఁ బురాణసారమును సకలనీతికథానమును రచియించియుండునని తలంపవలసి యున్నది. ఈమంత్రులిరువురును బురుషోత్తమగజపతికాలములోనుండి

యుందురు. ప్రతాపరుద్రగజపతి కాలములోఁ గూడఁ గొంతకాల మువఱకు నుండియుండవచ్చును.

పినభైరవుఁడు తిరుపతియందలి పాపవినాశతీర్థమున నొకగండ శైలమును స్థాపించిన ట్లీక్రిందిపద్యమువలనఁ గన్పట్టుచున్నది.

క. పాపవినాశనతీర్థ
వ్యాపారనిదర్శితాఘు వారణలీలా
టోప ఘనగండశైల
స్థాపిత వేంకటగిరీంద్రసదనస్థితికిన్.

కుంటముక్కలవారి శాసనములు నాకుఁగన్పట్టలేదు.

వినుకొండ, కొండపల్లి రాజ్యములను బరిపాలించిన యిరువురు నియోగిబ్రాహ్మణప్రభువు లీతనిగ్రంథములకుఁ గృతిపతులగుటచే నీకవి గుంటూరుమండలములోని కొండవీటిసీమవాఁడయిన ట్లూహింపఁ దగియున్నది.

ఈతఁడు రచించిన రతికళాశాస్త్రము సంస్కృతమున వైన్య దత్తునిచే రచియింపఁబడిన కొక్కోకమున కాంధ్రీకరణ మైనట్లీ క్రింది పద్యమునఁ దెలియనగును.

క. శ్రీవైన్యదత్తకౌతుక
భావిత కొక్కోక సత్ప్రబంధనిగుంభ
ప్రావీణ్యాధిప కల్పక
లావాక్యము తెలుఁగు తెరఁగులరయఁగవలయున్.

వైన్యదత్తపండితునకీగ్రంథరచనమువలనఁ గొక్కోకకవియని పేరువచ్చి నది. దీనినాంధ్రీకరించుటచే దానును గొక్కోకకవియైనట్లు "గొక్కోక కవినరుండ" నని యితఁడు వ్రాసికొనియున్నాఁడు.

రతికళాశాస్త్రవిషయము లిందు విపులముగా వర్ణింపఁబడినవి. కవిచరిత్రకారులగు శ్రీవీరేశలింగముపంతులుగారు "దీనికవిత్వము ప్రౌ

ద్యముగా నే యున్నను, నీతిమంతులు చదువఁదగినగ్రంథము కాదు" అనివ్రాసియున్నారు. "నీతిమంతులు" అనువాక్యమునకు బదులుగా "దుర్బలహృదయు లగుయువకులు" అనియుంచిన సముచితముగా నుండును. లేకున్న కృత్తికర్తయుఁ గృతిభర్తయుఁ దుదకు వైన్యదత్తపండితుఁడును గూడ నీతిమంతులు గారని చెప్పవలసివచ్చును. శాస్త్రమే నాశనమయి పోవును.

ఇతనికవిత్వము ప్రౌఢమై సరసజనహృదయంగమమై యున్నది. శైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను. ఈగ్రంథము ముద్రితమై రహస్యప్రచారమునం దున్నది. కొక్కోకము

చ. యతివరవాక్యధేనువుల నప్పటి కప్పటి కర్థదుగ్ధముల్
బితికి మథించి పద్యరుచి భీమమనోహరభోగభాగ్యముల్
శతముఖుఁ డాదిగా సురలు సన్నుతిఁ జేయఁగ నొప్పసారము
న్నతముగఁ జేసినాఁడ గవినాథులు చేకొనుఁ డాత్మవీథులన్. ౧౮

సీ. పరిజన వాహన పశుపికశారికా
సారసంరక్షణ సలుపవలయు
గురుజనములయెడఁ బరమభక్తివహించి
చెప్పనూడిగమును జేయవలయు
సవతిపట్టున మహాసౌజన్యయై కూర్మి
సోదరిమాఱుగాఁ జూడవలయు,
సవతిబిడ్డలఁ గాంచి సంతసిల్లుచుఁ
దనదుబిడ్డలవలెఁ దలఁపవలయు

మగఁడు పరదేశమరిగిన మంగళంపు
సూత్రమేగాని శృంగారమాత్రముడిగి
యుత్తమామల చేరువయుండఁ బాన్పు
నందు శయనింపవలయుఁ గులాంగనకును.

ఆ. ద్రాక్షపంచు మునుఁగుదామర దండోత్ప
లంబు విష్ణుక్రాంతలఁ జగఁ గూర్చి
నాలుగవదివసంబు పాలతో సేవింప
గర్భహాని కెట్టికాంతకైన.

సకలనీతికథావిధానము:—

ఉ. ఆవసుధాధినాథుఁడు ప్రియంబున ముందట భూమిఁ గాంచె గో
దావరివారిమగ్నజనితాఘవకల్మషతాపి విస్ఫుర
ద్దానకృశానుతీవ్రపరిదాహముఖాగణదవ్యామానకా
ప్లావనదృష్టి మేఘపటలస్ఫుటభాద్రపదాది శర్వరిన్.

ఉ. ఊరక యేలయుండ మన మోహనకరత్నము! యస్మదీయసం
చారవినోదముల్ కలసి సల్పెద మన్నఁ దొలంగు చేంకో
కీరమ పూరుషుల్ బహులకిల్బిషచారు లసత్యభాషణుల్
క్రూరులు వారితోడ నొడగూడి మనంగలశే నధూమణుల్.

ఉ. పెట్టియనట్టికో ననుచు భిక్షకుఁ డేటికిఁ వచ్చి యుండుఁజూ
పట్టెడు పెట్టెవట్టుకొని ప్రాప్తమఠంబున కేగుదెంచి యా
పెట్టియ కట్టువిప్ప బటుభీకరబుభుక్షము బిక్షుకాధమున్
బట్టి భుజించె సత్త్వములు భాగ్యవిహీనుల కేలఁ గల్గెడున్.

చ. పనసరసాలపాట లులపాటిగ నుత్తమమధ్యమాధముల్
వినఁబడు బుద్ధులేకయు ఫలించియుఁ బూచి ఫలంబు నొందియున్
వనిచి ఫలంబు లూరక వినాశముఁ బొందినయట్టిపాటికన్
మును ఫలమిచ్చి పూచిఫలముల్ ఘటియించియుఁబూచిపండియున్

ఈగ్రంథాముద్రితప్రతులు మదరాసుప్రాచ్యలిఖిత పుస్తకభాం
డాగారమునందున్నవి. పురాణసారమునుగూర్చి యొకానొకపండితుడు
వ్రాసినవ్యాసమును జదివియున్నట్లు జ్ఞాపకముగ నున్నది. కాని
యిప్పుడు స్ఫురణకు వచ్చుటలేదు.

ఈకవి యనేకసంస్కృతనీతిశ్లోకముల నాంధ్రీకరించి, యీగ్రంథమునఁ జేర్చియున్నాఁడు. మచ్చున కైదాఱుపద్యముల నీక్రింద నిచ్చెదను.

గీ. కన్నె రూపుఁ గోరు కనకంబుఁ గోరును
తల్లి చదువుఁగోరు తండ్రి బంధు
జనము కులముఁ గోరు సౌఖ్యభోజన మిల
జగతిగోరు నిదియ జగతి నురువు.

క. తనయింట మూర్ఖుపూజ్యుఁడు
తనయూరం బ్రభువుపూజ్యతముఁడగు రాజున్
తనభూమి పూజితుం డగు
వినుపూజ్యులు సకలమునకు విద్యావంతుల్.

క. తేలునకుఁ దోక విష మగు
వ్యాళమునకుఁ బండ్లవిషము వనమక్షికకున్
బోలంగ శిరము విషమగు
కాలినఖలునకునువిషము కాయం బెల్లన్.

క. సుతుకడకు గురువుకడకున్
సతికడకున్ వేల్పుకడకు జనపతికడకున్
పతికడకుఁ బ్రియముగోరెడు
నతఁ డూరక రిత్తచేత నరుగుట దగునా?

మల్లమంత్రికి చండలాంబ యిలువేల్పు అయిన ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది. ఈదేవి యేయూర నున్నదియో తెలిసెనేని, కుంటముక్కలవారి నివాసము దెలియును. గాని యాయమ్మవారి నివాసస్థానము తెలియలేదు. కుంటముక్కల యొకగ్రామమని తోఁచుచున్నది. కాని యది యెచ్చటనున్నదియుఁ దెలియరాలేదు.

గీ. సన్నుతావాస జగదాంబ చండలాంబ
తనకు నిలువేల్పుగా భూమిఁ దనరినాఁడు

గజపతియు నశ్వపతియును గారవింప
మహిని విలసిల్లె భైరవమల్లమంత్రి.

అజమూఖాను, గజపతులయొద్ద యుద్దండఖాను మొదలగువారి వలెనే సేనానాయకుఁడుగానో పరిపాలనాధికారిగనో నుండియుండును. ఆతనిగూర్చిన వివరముల నెఱుంగవలసియున్నది.



## 126. వెన్నెలకంటి సూరనార్యుఁడు



ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు ఆపస్తంబసూత్రుఁడు; హారితసగోత్రుఁడు. అమరయామాత్య పుత్రుఁడు సూరనార్య పౌత్రుఁడు ఈతఁడు విష్ణుపురాణమును దెనిగించి పంటరెడ్డికులజుఁడగు రాఘవరెడ్డి కంకితము చేసెను. కృతిపతి పలికినట్లుగా గవితనుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

ఉ. ఈనిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికిఁ నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయయన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివారిలోన్.

సీ. భవ్యచరిత్రు నాపస్తంబ మునిసూత్రు
శుద్ధసారస్వత స్తోత్రపాత్రు
హారితసగోత్ర పవిత్రు నాంధ్రభాషాకావ్య
రచనాభినయ విశారదుఁ బ్రబంధ
కర్తను వెన్నెలకంటి సూర్యుని మనుమనిఁ
జెరుకూరి యమరయమంత్రి

సత్పుత్రునాకు విస్తార విచిత్రమా
ధుర్యకవిత్వచాతుర్యశీలు

తే. నిజకులాచార మార్గైకనిపుణుఁబరమ
సాత్వికోదయ హృదయు వైష్ణవపురాణ
వేది సారస్వవిద్యాప్రవీణు సుకవి
మాననీయుని సూరనామాత్యకవిని

క. నన్నుఁ బిలిపించి పెద్దయు
మన్నించి గురూపచారమార్గంబులు సం
పన్నములు చేసి వినయము
దన్నంతయుఁ బ్రోదిసేయఁ దగ నిట్లనియెన్.

క. నీవిప్పుడాంధ్రిభావం
గావించుమ నున్న చంపుకావ్యమ్మగు నీ
శ్రీవిష్ణుపురాణము నా
కీనలయు మదీయకీర్తి యిలలో నెగడన్

క. శ్రీ తిలోనఁ బసిఁడి పరిమళ
యుతమై రత్నమును గూడియున్నట్లు సుమీ
కృతిశ్రీవిష్ణు పురాణము
కృతికర్తవు నీవు నేను గృతిపతినగుటన్.

పై సీసపద్యములోఁగవి తండ్రి పేరు 'చెరుకూరి' యమరయామా త్యుఁడని యున్నది. ఆయమరయ్య కొన్నినాళ్ళు చిరుకూరునందుండు టచేఁ గాఁబోలు చెరుకూరి యమరయయని యాతనికిఁ బేరువచ్చియుం డును. వెన్నెలకంటివారిలో నింకొకయమరయ్య యుండుటచే నాతనికి నీతనికి భేదము తెలియుటకై యీతనిని చెరుకూరి యమరయ యని పిలుచుచుండెడివారని యూహింపఁదగి యున్నది. అంతియేకాని చెర కూరి యనునది గృహనామముగా తలంపరాదు. గద్యలోఁ జెరకూరి

శబ్దమును విడిచివేసి "ఇది శ్రీమదమరనామాత్య పుత్రహారితసగోత్ర పవిత్రసుకవిజనవిధేయ వెన్నెలకంటి సూరయనామధేయ" అనియున్నది.

విక్రమార్కచరిత్రమును రచించిన జక్కయకవి చారిత్రమున నొకవెన్నెలకంటి సూర్యునిఁగూర్చి చర్చించియున్నాఁడను. ఆసూర్యుఁడు విష్ణుపురాణకృతి కర్తయగు సూరనార్యుని పితామహుఁడని గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు కవిజీవితములలోఁ వ్రాసియున్నారు. ఆసూర్యునకు, ఈసూరనార్యుఁడు మనుమని మనుమఁడని బ్ర.శ్రీ వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రములో నుడివియున్నారు. ఈవిషయమును విమర్శించుటకు బునశ్శక్తుఁడైనను బాఠకులసౌకర్యముకొఱకు విక్రమార్కచరిత్రమున వెన్నలకంటిసూర్యునిఁగూర్చి చెప్పఁబడినపద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. వెన్నెలకంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్ర సం
పన్నుఁడు రెడ్డివేమ నరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
నన్నుతిగన్న సిద్ధనకు సంతతదాన కళావినోదికిన్.

ఈపద్యములోఁ జెప్పఁబడిన వేమనరపాలకుఁడనఁగా క్రీ. శ. 1320 మొదలు 1350 వరకును గొండవీటిరాజ్యమును పరిపాలించిన ప్రోలయ వేమారెడ్డియని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

విష్ణుపురాణకర్త. పైనివ్రాసిన ఈనిఖిలంబుమెచ్చ అనుపద్యములో ననపోతారెడ్డికి వెన్నెలకంటివారిలో నెవరో యొకకవి ప్రబంధములను గృతియిచ్చినట్లు చెప్పియున్నాఁడేకాని ఆకవిపేరెవరో చెప్పలేదు. ఈపేరుచెప్పబడనికవియును జక్కయకవి చరిత్రములోఁ "వెన్నెలకంటిసూర్యుఁడు" అనుపద్యములోఁ నుదాహృతుఁడైన సూర్యుఁడును ఒకవ్యక్తియే యని బ్రః శ్రీః వీరేశలింగము పంతులుగారు తమకవులచారిత్రములోఁ నీక్రిందిమాటలలో వ్రాసియున్నారు.

ఈ రెండుపద్యములలోను వర్ణింపఁబడిన వెన్నెలగంటియతఁ డొక్కఁడే యనుటకు సందేహము లేదు. మొదటిపద్యములో 'వేమ నరపాలకుచేత మహాగ్రహారముల్ గొన్నకవీంద్రకుంజరుఁ'డనియు, రెండవపద్యములో "వేమయ యన్నపోతభూజానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటివా"రనియుఁ జెప్పఁబడియున్నను, వేమారెడ్డియు నాతనిపుత్రుఁడైన యనపోతరెడ్డియు నేకకాలమునందే యుండినందున వెన్నెలకంటి సూరయ్య తండ్రికొడుకులకిద్దఱికిని బ్రబంధము లంకితము చేసి బహుమానము నొందియుండవచ్చును. అంతేగాక యనపోతరెడ్డి దండనాథుఁడుగా నుండి తండ్రిజీవితకాలములోనే ప్రసిద్ధిచెందియుండె నని యెఱ్ఱాప్రెగడ హరివంశమునందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. వేమారెడ్డి హూణశకము 1320 వ సంవత్సరము మొదలుకొని 1349 వ సంవత్సరము వఱకును, ఆతనిపుత్త్రుఁడైన వేమయ యనపోతా రెడ్డి 1350 వ సంవత్సరము మొదలుకొని 1361 వ సంవత్సరము వఱకును రాజ్యముచేసినందున వారియాస్థానమునం దుండినకవి వెన్నెలగంటి సూరన్న యాకాలమునందే నిస్సంశయముగా నుండిన వాఁడు. ఈకవి రచియించి యనపోతరెడ్డి కంకితముచేసిన ప్రబంధము లేవో తెలిసినవి కావు.

మనలో సాధారణముగా తాతపేరు మనుమనికి పెట్టుచుండుట యాచార మయినందునఁ విష్ణుపురాణమును రచించిన యీసూరన్న పయిసూరన్నకు మనుమఁడో మనుమనిమనుమఁడో యయియుండ వలెను. ఈకవి తానుఅనపోతరెడ్డికి ప్రబంధము లొసంగిన వెన్నెలగంటి వారి వంశజుఁడననియు వెన్నెలకంటిసూర్యుని మనుమఁడ ననియు వేఱు వేఱుగాఁ జెప్పుకొనుటచేత నీతఁడు వేమారెడ్డికాలములోనున్న సూర న్నకు మనుమనిమనుమఁడగుట స్పష్టము. కవి మొదటిసూరన్నకయిదవ తరమువాఁ డగుటచే నిరువురకును నూఱుసంవత్సరములకంటె నెక్కువ వ్యత్యాస ముండియుండవలెను. కాఁబట్టి యీకవి 1460 వ సంవత్సర మునకును 1480వ సంవత్సరమునకు నడిమికాలములో నుండినట్లు నిశ్చ

యింపవలసియున్నది." పంతులుగారు వ్రాసిన యీయంశములన్నియు నూహాజనితములే కాని, యొకయాధారము ననుసరించి వ్రాసినవి కావు. పంతులుగారియూహ సత్యమైనను కావచ్చును. అట్లుగాక వారిరువురును వేఱువేఱువ్యక్తులైనను కావచ్చును. విష్ణుపురాణకర్త, అనపోతారెడ్డికి ప్రబంధము లొసంగిన వెన్నెలకంటివా రని మాత్రమే చెప్పెను. కాని వేమారెడ్డియొద్ద నగ్రహారములను గైకొనినసంగతిని గూర్చి యేమియుఁ జెప్పలేదు వారొక్కరేయైనను నిర్వురైనను విష్ణుపురాణకర్త యైనసూరనార్యునికి తాతగాని, యాతనితాతగాని పై పద్యములోని సూర్యులలో నెవఁడును గాఁడు. వీరు వారికంటె భిన్నులు. వేమారెడ్డివలన నగ్రహారములను బడసినసూర్యుఁడుగాని, అనపోతారెడ్డికిఁ బ్రబంధములొసంగిన యాతఁడుగాని విష్ణుపురాణకర్త యొక్క పితామహుఁడో పితామహుని పితామహుఁడో యై యున్న యెడల నావిషయమును పైపద్యములో నాతఁడు స్పష్టముగాఁ జెప్పియుండును. అట్లు చెప్పక అనపోతారెడ్డికి ప్రబంధము లొసంగిన వెన్నెలకంటివారిలో నని యనిర్దిష్టముగా చెప్పనేల? అట్టి వెన్నెలకంటివారివాఁడ నని చెప్పుకొనుటకై మాత్రమే కవి యీపద్యమును వ్రాసియుండె ననుట స్పష్టము. అందుచే నాప్రబంధకర్తకును విష్ణుపురాణకర్తకును నడుమఁ గొన్నితరములు గడచియుండు నని భావింపవలసియున్నది. ఎన్నితరము లనువిషయమును వేఱుమార్గమునఁ దెలిసికొనవలయును. ఒకప్పుడీసూరన యాతనివంశపరంపరలోనివాఁడు కాక, వెన్నెలకంటివా రనిగృహనామముగల మరియొకవంశీయుఁడైనఁగావచ్చును. మనసూరనార్యుఁడు విష్ణుపురాణమును పంటరెడ్డివంశసంజాతుఁడును యానపాలగోత్రుఁడు నైన రాఘవరెడ్డి కంకితముచేసె నని పైని చెప్పియుంటిని. ఈరాఘవరెడ్డి అనవేమారెడ్డివంశీయుఁడని విష్ణుపురాణమునం దీక్రిందిపద్యములలో నున్నది.

ఆ. అట్టిపంటకులంబునందు నేడవచక్ర
వర్తి యన్న వేమవసుమతీశుఁ

డుద్భవించి కీర్తియును సత్ప్రతాపంబు
నెసఁగ భూమినెల్ల నేలుచుండె.

క. తనబ్రతుకు భూమిసురులకుఁ
దనబిరుదులు పంటవంశధరణీశులకున్
దననయము భూమిప్రజలకు
ననవేమన యిచ్చెఁ గీర్తి నధికం బగుచున్.

ఈపద్యములనుబట్టి రాఘవరెడ్డి అనవేమారెడ్డి వంశములోని వాఁడని కవి చెప్పనుద్దేశించినట్లు తెలియుచున్నది. విష్ణుపురాణ చతుర్థాశ్వాసాంతపద్యమునఁ గృతిపతిని "అనవేమక్షితిపాన్వయోత్తమ" అని సంబోధించియుండుటచే రాఘవరెడ్డి యనవేమునివంశీయుఁ డనిచెప్పుటయే కవియుద్దేశమైనట్లు స్పష్టపడుచున్నది. కాని యనవేమారెడ్డికిని యీరాఘవరెడ్డికినిగల సంబంధమునుగూర్చి కవి యేమియుఁ జెప్పక, యీక్రిందిపద్యములలో రాఘవరెడ్డి పూర్వులను జెప్పుచు "ఆపంటవంశమున"అని ప్రారంభించియున్నాఁడు. చూడుఁడు.

క. ఆపంటవంశమునఁ గుల
దీపకుఁ డగులింగశౌరి తేజోధికుఁడై
యేపారెఁ గీర్తిలక్ష్మీకిఁ
బ్రాపై తొల్లింటిరెడ్డిరాజులకరణిన్.

క. ఘనుఁ డాలింగారెడ్డికిఁ
దనయుడు కీర్తిప్రతాపధాముఁడు తేజో
ధనుఁడై పేరమరెడ్డి సు
జనవినుతుఁడు పుట్టె భాగ్యసంపద వెలయన్.

క. పేరుగల లింగయప్రభు
పేరన కుదయించె సుతుఁడు పెంపున్ సొంపున్
బౌరుషము యశముగల త
మ్మారెడ్డి సమస్తజనులు ప్రస్తుతిసేయన్.

క. ఆతిమ్మక్షితిపాలుఁడు
పాతివ్రత్యమున సకలభాగ్యశ్రీలన్
సీతకుఁ బ్రతివచ్చిన వి
ఖ్యాతగుణాలంబ మాచమాంబ వరించెన్.

తే. ఆవధూటికి నుదయించి రమితగుణస
మగ్రవైభవు లత్యంతమహితయశులు
బసవశౌరియు నన్నయప్రభువరుండు
లింగవిభుఁడు ననంగ నుత్తుంగయశులు.

ఈపద్యములనుబట్టి విష్ణుపురాణకృతిభర్తయగు రాఘవరెడ్డి వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




పంటరెడ్లలో ననవేమారెడ్డి ప్రఖ్యాతిపురుషుఁ డగుటచే నాతనివంశమువాఁ డని చెప్పుటయే కవి యుద్దేశ మైనట్లు "ఆపంటవంశమున" అనుపద్యమువలన మనము గ్రహింపఁదగియున్నది. అనవేమారెడ్డికిఁ బ్రబంధము లొసంగిన వెన్నెలకంటివారి వంశీయుఁడనని తనను జెప్పుకొనినట్లే కవి కృతిపతినిగూడ "అనవేమక్షితిపాన్వయోత్తముఁ"డైనట్లు వర్ణించియున్నాఁడేకాని నిజముగా నీరాఘవరెడ్డి యన

వేమారెడ్డి ప్రత్యక్షవంశము లోనివాఁడు కాఁడు. అనవేమారెడ్డి కీరాఘవరెడ్డి దౌహిత్రవంశములోనివాఁ డేమోయని కొందఱు సందేహించిరి. కాని యందును సత్యములేదు బ్ర.శ్రీ వీరేశలింగముపంతులుగారు శ్రీనాథచారిత్రములో "అనవేమమహీపాలునికిఁ బుత్రసంతతి లేదు. ఒక్కకుమారితమాత్ర ముండెను. ఆమె భక్తేశ్వరచోళనృపాలపుత్రుఁడైన భీమనృపాలునకు భార్యయయ్యెను" అని వ్రాసియుండిరి. ఈవాక్యములవలన, నన వేమారెడ్డికిని, రాఘవరెడ్డి వంశమునకును బ్రత్యక్షసంబంధము లేదని ధ్రువపడినది కాదా!

ప్రోలయవేమారెడ్డియొక్కయు నాతనిసోదరులైన మాచారెడ్డి అన్నారెడ్డి, మలారెడ్డి యనువారల యొక్కయు వంశవృక్షములను, ఎఱ్ఱాప్రెగ్గడ శ్రీనాథాదికవుల చారిత్రములలో నిచ్చియున్నాఁడను. వానిలో నెక్కడను లింగారెడ్డిపేరు లేకపోవుటవలన నీవంశమునకును, వేమారెడ్డి వంశమునకును సంబంధమే లేదని తోఁచుచున్నది. విష్ణుపురాణకృత్యాదియందు "రావూరి రాఘవరెడ్డి, రావూరి పేరయతమ్మవిభుఁడు'' అనివర్ణించియుండుటచేఁ గృతిపతిగృహనామము రావూరివారని స్పష్టమగుచున్నది. వేమారెడ్డి గృహనామము దేసటివారు కావున వారికిని వీరికిని సజాతీయ సంబంధముతప్ప దాయాదిసంబంధము లేదని చెప్పనచ్చును. కావున వేమారెడ్డినిబట్టి కృతిపతికాలనిర్ణయము చేయ యత్నించుట వ్యర్థప్రయాసము.

వేమారెడ్డి, అనపోతారెడ్డి ప్రభువులకాలములోనున్న వెన్నెలకంటి సూర్యునిబట్టి కాలనిర్ణయముచేయుచు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు కవికాలము క్రీ.శ.1378-1428 అనియును వీరేశలింగము పంతులుగారు 1460-1480 అనియును నిర్ణయించి యున్నారు. కాని అన్నిర్ణయము సరియైనదికాదు. ఆవెన్నెలకంటి సూర్యునకును విష్ణుపురాణకర్తకును తాత-మనుమలసంబంధముపై ధ్రువపడనపుడు, ఆసంబంధముపై నాధారపడిన కాలమును సరిగానుండదుకదా!

వెన్నెలకంటి వెంకటాచలకవి తన శ్రీకృష్ణ విజయప్రబంధమున నీసూరనార్యు నీవిధముగ నుతించియున్నాఁడు.

సీ. సూరపకాంతిచే సూర్యప్రకాశుండు
 వేదాదివిద్యల వెలసినాఁడు
విష్ణుపురాణంబు వేడుకఁదెనిఁగించి
 విమలయశంబున వెలసినాఁడు
రావూరి బసవన్న రమణతో నిచ్చిన
 యలమొగుళ్ళూరగ్రహారమందె
వెలుగోటి తిమ్మభూవిభునిచేఁ గొనియెఁ
 దానాందోళికాచ్ఛత్రమగు పదవిని

తే. కవితపుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు
 ననెడు పౌరుషనామధేయంబు నిలిపె
సరసగుణములు గలిగినసాధుసుకవి
మాననయుండు సూరనామాత్యవరుఁడు.

ఈపద్యమునుదాహరించుచు శ్రీరామమూర్తిపంతులుగారు కవికాలము క్రీ. శ. 1378-1428 అని నిర్ణయించినారు. ఈపద్యమునే యాధారముగాఁ గైకొని విష్ణుపురాణ ముద్రితప్రతికిఁ బీఠిక వ్రాసిన శేషాద్రిరమణ కవులు పైపద్యములోఁ జెప్పబడిన వెలుగోటి తిమ్మభూపాలుఁ డనఁగా క్రీ. శ. 1533 వ సంవత్సరములో నెలకొల్పఁబడిన పొదిల దుర్గాలయమునందలి శాసనములో వ్రాయఁబడియున్న "రేచర్లగోత్రోద్భవులైన వెలుగోటి పెదతిమ్మానాయనింగారి పౌత్రులైన కొమారతిమ్మానాయనింగారి పుత్రులైన కుమారకుమార చినతిమ్మానాయనింగారను మువ్వురిలోను రెండవ తిమ్మానాయకుఁడనియు నాకాలమందున్న కవి క్రీ.శ. 1530-1555 లోఁగా నుండియుండెననుట సత్యమనియు వ్రాసియున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధరత్నావళి పీఠికలో విష్ణుపురాణ కృతిపతియగు బసవయరాఘువుని శాసనమొకటి నెల్లూరిశాసన సం

పుటములలో నున్నదనియు దానినిబట్టి కృతిపతి 1526–29 ప్రాంతమున నున్నాఁడనియు వ్రాసిరసి చెప్పచు నాశాసనమును జూచి విమర్శింప వలసిన యవసరమున్నదనియు నీయంశము పీఠికయంతయుఁ ముగిసిన పిదపఁ జూచుటచేఁ జర్చింపఁజాలకపోతిమనియు శేషాద్రిరమణ కవులు పీఠికలో వ్రాసి యున్నారు.

ఆశాసనమును జూచినచోఁ కవికాలము నిర్ధిష్టమగునని తలంచి యాసంపుటమును జదువఁగా భవనయ్యరాఘవరెడ్డి వ్రాయించిన రెండు శాసనములందుఁ గన్పించినవి.

మొదటిది నెల్లూరిమండలములోని కనిగిరి తాలూకా యందలి దాసాలపల్లి గ్రామమున అంకాలమ్మగుడికి దక్షిణమున నున్నది. రెండవది ఆ తాలూకాలోని పెద్దఅలవలపాడు గ్రామమునద్ద నదిలోని శిలపై నున్నది. ఈరెండు శాసనములును తెలుఁగులో నున్నందున వాని నీ క్రిందనిచ్చుచున్నాఁడను. మొదటిది:—

"శ్రీమతే రామానుజాయనమః స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౦ అగు నెట్టి సర్వధారిసంవత్సర ఆషాఢ శు॥ ౧౧ ఆ॥ చతుర్భవనాధీశ్వర అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన వెలిగొండ శ్రీతిరువెంగళనాథన్కి విూదాసులు రాఘవారిరాగా వరెడ్డింగారను వెలిగోటి రంగానాయిని కొమారుండు తిమ్మానాయనింగారున్ను అనంతమైన దండములు సమర్పించియిచ్చిన ధర్మశాసనం॥ వుద్దగిరికింజెల్లిమానాయకాళ్రిలోని కనకగిరి మునుమూరి పోలచర్లకుంజెల్లి దాసకిపల్లెగ్రామము కొండమరుదయ్య వారికిన్ని రావూరిబసువారెడింగారికిన్ని వెలుగోటి రంగానాయునింగారికిన్ని పుణ్యముగాను అంగరంగవైభవాలకున్ను అమృతపళ్ళకున్ను ఆచంద్రార్కస్థాయిగాను యీగ్రామం నుంకంచూ పుటో యనిమోదలుగాను దేవునికి దారావోసి సమర్పించియిస్తిమి యీపుణ్యానకు యెవ్వరు తప్పినడచినాను తమ మాతృపితృలాముసంవారిని గోవును బ్రాంహ్మని వారణాసిలో

స్వహస్తంబుదశేసినదోషానపోదురు. మరిసితప్పినవడచిర్లాముఖ శేసినమున్ను గాడిదెసిళినమును కుడిచినవారు "శ్రీ ౹ దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం. దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం ఫలం స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం. పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్" (శ్రీ),

రెండవ శాసనము:—

"శుభమస్తు స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౪౪౦ అగు నేంటి పుష్య శుద్ధ ౧౫ గురువారమున్ను సోమగ్రహణమున్ను అయిన పుణ్యకాలం అందును జగన్నాభ్బిగండ స్తంగ్రామధనుంజయ. హేమాద్రిదాన చింతామణిపట్టులలాట రాయబనువశంకర బిరుదాంకుండు అయిన రావ్రాని రాఘవరెడ్డింగారు తమతండ్రి బన్వారెడ్డింగారికిన్ని తమతల్లి అమలాంబికకున్ను పుణ్యమఘునట్టుగ్గాను లింగాలకొండ సోమేశ్వరునికిన్ని బగాది గంగ్గకున్ను సాష్టాంగమున్ను దణ్నముపెట్టి సమర్పించిన ధర్మశాసనము కొండమరుసయ్యంగారు మానాయకంరాన్కు ఇచ్చిన కనగిరి పోలచెర్ల మునుండూరిసీమలో గంగపట్నం సోమేశ్వరునికిన్ని బగాది గంగకున్ను షోడసోపచారాలకున్ను సమర్పిత్తిమిగాన ఇధర్మనుఎవ్వరుతప్పినాను. గంగకర్త గోవును బ్రాహ్మణిచంపిన పాపానపోవువారు.

మొదటిశాసనము క్రీ. శ. ౧౫౧౮ వ సంవత్సరము నాంటిది. రెండవశాసనము క్రీ. శ. ౧౫౨౬ వ సంవత్సరమునాంటిది. దానమిచ్చిన గ్రామములు ఉదయగిరి రాజ్యముక్రింద నున్నవి. ఉదయగిరి దుర్గమాకాలమున శ్రీకృష్ణదేవరాయలపాలనములో నుండెను. శాసనములలో చెప్పంబడిన కొండమరుసయ్యంగారనగా శ్రీకృష్ణదేవరాయలకడ మంత్రిపదవిలో నున్నరాయసం కొండమరుసయ్య యను బ్రాహ్మణుడు. సాళువతిమ్మరుసయ్యయు, కొండమరుసయ్యయు కృష్ణరాయలవద్ద మంత్రులుగానుండిరి. కొండమరుసయ్య ఉదయగిరిదుర్గమునకు పరిపాలకుడుగానున్నప్పు డుదయగిర రాజ్యములోచేరిన కొంతప్రదేశమును గ్రహ్నా

ట్ప్రభుత్వమునకుఁ బన్నుకట్టుపద్ధతిమీఁద రాఘవరెడ్డియు వెలుగోటి తిమ్మానాయుఁడును గుత్తకుఁ దీసికొని యుండినట్లు శాసనములయందలి "మానాయంకరానికి యిచ్చిన" అనుమాటలవలనఁ దెలియుచున్నది.

ఆకాలములో నట్లునాయంకరమునకుఁ దీసికొనినవారు, దేవ బ్రాహ్మణులకు దానిమిచ్చునాచార మున్నట్లు చాలశాసనములవలనఁ గనఁబట్టుచున్నది. ఇంగ్లీషుదొరతనము మనదేశమునఁ బ్రారంభమగు టకుఁ బూర్వమిట్టియధికారము గ్రామమందలి పెద్దకాపులకును గ్రామ ములను గుత్త చేసెడివారికిని గూడ నుండినట్లు శాసనములవలనను దాన పత్రములవలనను గ్రామలెక్కలవల్లనను గనుపడుచున్నది. ఈదాన కర్తలిద్దరును నుదయగిరిరాజ్యమునకు లోఁబడినయొక చిన్నసంస్థానము నకు పాలకులని యూహింపఁదగియున్నది. శాసనకర్తలకాలము స్పష్టమయినది. కావున దీనిఁబట్టిమనసూరనార్యుఁడు, పదునాఱవ శతాబ్దిని బూర్వార్ధమునందున్నవాఁడనుట స్పష్టము. శాసకర్తయైన రాఘవరెడ్డి తలిదండ్రులనామములును విష్ణుపురాణమునఁ జెప్పఁబడిన కృతిపతితలిదండ్రుల నామములనొకటియే యగుటవలన నీశాసనకర్త యే విష్ణుపురాణకృతిపతి యనుటకు సందేహము లేదు.

నెల్లూరుకంటి వేంకటాచలకవి చెప్పిన వెలిగోటి తిమ్మభూవిభుఁడు మొదటిశాసనమందలి వెలిగోటిరంగానాయునికుమారుఁడైనతిమ్మానా యుఁ డనియనుటకును సందేహింపఁబనిలేదు. కాని శేషాద్రిరమణ కవు లనుకొనినతిమ్మానాయఁడీతిమ్మానాయుఁడు కాఁడు. ఆతిమ్మానా యుఁడు కుమారతిమ్మానాయుఁడు. ఈతిమ్మానాయనికిఁ గుమారశబ్దము లేదు. శాసనకర్తయైనతిమ్మానాయనితండ్రి రంగానాయుఁడు శేషా ద్రిరమణకవు లిచ్చినవంశావళిలో రంగనాయుఁడు లేఁడు.

వెంకటాచలకవి వ్రాసిన సీసపద్యములో సూరనార్యుఁడు 'మొగుళ్ళూరును' రావూరి బసవన్న చేనగ్రహారముగాఁ గైకొనినట్లు

వ్రాసియున్నాఁడు కాని యదిసత్యముగాదు. కృతిపతియే కవి కగ్రహార మొసంగిన ట్లీక్రిందివచనములోఁ గవిచెప్పియున్నాఁడు.

"వ అని బహుమానపూర్వకంబుగా గంధాక్షతంబు లొసంగి కనకమణి భూషణాంబరంబులు గట్టనిచ్చి కర్పూరసహితంబుగా దాంబూలంబుసమర్పించి, తమతండ్రిపేర బసవాపురం బనునగ్రహారంబేక భోగంబుగానొసంగి గారవించిన నేనును బరమసంతోష పరిపూర్ణహృదయుండనై మదీయప్రణీతకావ్యకన్యా మనోహరుండగు రావూరి బసవభూపాలు రాఘవు వంశంబభివర్ణించెద".

ఈ మొగుళ్ళూరునకే బసవాపురమని పేరిడియుండును. ఈయగ్రహారము నిచ్చినప్పుడు బహుశః యేతామ్రశాసనమో వ్రాయించియుండును కాని యదిబయల్పడలేదు. ఆయగ్రహారమిప్పు డెవ్వరిక్రింద నుండెనో తెలియదు. ఆవంశీయుఁడగు వేంకటాచలకవి యాయగ్రహార విషయమునుగూర్చి యేమియు వ్రాసినట్లు కనుపడదు మొగుళ్లూరు నెల్లూరుమండలమునఁ గందుకూరు తాలూకాలో నున్నది.

ఈసూరనార్యుఁడు పదునారవ శతాబ్దియం దున్నవాఁడని స్పష్టమగుటచే వేమారెడ్డికాలములోనున్న సూరనార్యున కీతఁడు మనుమ డని వ్రాసిన శ్రీరామమూర్తిపంతులుగారియూహలును, మనుమని మనుమఁడని వ్రాసిన వీరేశలింగముపంతులుగారి యూహలును సత్యములు కావని స్పష్టమగుచున్నది.

కృతిపతికిఁ దండ్రియైన బసవభూపాలునకు పంగులూరి యన్నయార్యుఁడు గురువై నట్లీ క్రిందిరెండు పద్యములవలన దెలియుచున్నది.

సీ. వినుతనానావేద వేదాంగశాస్త్రపు
 రాణేతిహాస నిర్వాహకుండు
 శైవవైష్ణవ సౌరశాక్తగాణాపత్య
 మంత్రతంత్రాగమ మర్మవిదుఁడు

పరమపావన పరాపశ్యంతి మధ్యమా
వైఖరీమార్గప్రవర్తకుండు
ఆధారమణి పూరకాది పంకజప్రతి
నిత్య ప్రపంచ దశాత్మకుండు.

తే. కావ్యనాటకాలంకార భవ్యమూర్తి
పరమగురుసంప్రదాయప్రభావనిరతుఁ
డగుచు ఘోడియరాయవిఖ్యాతి నొందెఁ
బెంగులూరన్నయార్యుండు బ్రహ్మవిదుఁడు.

ఆ. అట్టిపెంగులూరియన్నయాచార్యుని
కరుణవడసి సిరులఁ గాంచి మించె
రసికశేఖరుండు రాపూరితిమ్మయ
బసవభూవిభుండు వసుధయందు.

కృతిపతియైన రాఘవరెడ్డికిఁ దిరుమలతాతాచార్యుని మనుమఁడైనసింగరాచార్యుఁడు గురువైన ట్లీక్రిందిపద్యములవలన నెఱుంగ నగును.

క. అతనియాచార్యుఁడు వి
ఖ్యాతయశోధనుఁడు సింగనార్యుఁడు వెలసెన్
భూతలమునందుఁ దిరుమల
తాతయవంశమున సకలధర్మజ్ఞుండై

సీ. వేదాంతవిద్యావివేకి వద్దర్శన
పారంగతుఁడు పరావర రహస్య,
వేది బ్రహ్మాండాదివివిధపురాణజ్ఞుఁ
డసమానధర్మశాస్త్రాభినేయ
కుశలుఁడు పరమార్థకోవిదుం డఖిలాధ్వ
రక్రియానిపుణుఁ డవక్రకావ్య

నాటకాలంకారనానాకళాభిజ్ఞ
డుభయభాషాకవితోజ్జ్వలుండు

తే. పరమవైష్ణవమార్గతత్పరుఁడు కీర్తి
ధనుఁడు తిరుమలతాతయ్య మనుమఁడైన
సింగరాచార్యుగురువుగా సేవసేసి
రమణఁ జెలువొందె బసవరాఘవుండు.

పై కందమున సింగరాచార్యుని తిరుమలతాతయవంశమున జన్మించినట్లు చెప్పి, సీసపద్యమున నాతనికి మనుమఁడనియే చెప్పినాఁడు.

కృతిపతికిఁ దల్లి యైనయమ్మలాంబపితృవంశమునుగూడ కవి యైదారుపద్యములలో వర్ణించియున్నాఁడు. అందు రెండుపద్యములను వ్రాయుచున్నాఁడను.

ఆ. ఘనతరాశ్వదాన, గజదాన, దీక్షాగు
రుండు నాఁగ నవనిరూఢికెక్కి
పట్టిమేటితాత యల్లూరియనమార
విభుఁడు పాకనాటవిస్తరిల్లె.

క. ఆయనమారనపుత్త్రుఁడు
పాయనిపౌరుషము యశము భాగ్యము విభవ
శ్రీయును గలవెమ్మమహీ
నాయకరత్నంబు పాకనాటను వెలసెన్.

ఈతని తనయయే యమ్మలాంబ.

కృతిపతివంశమును జాలపద్యములలోఁ గవివర్ణించియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నుదాహరింపక కృతిపతిని నాతనితండ్రిని వర్ణించిన రెండుపద్యములనుమాత్రము నుదాహరించి యీకవిచారిత్రము ముగించెదను.

సీ. కటకాధిపతు లైన గజపతిరాజుచేఁ
ప్రతిలేనిపల్లకీపదవి నొందె
మహిమచేఁ గర్ణాటమండలాధిపుచేతఁ
గడలేనిరాజ్యభాగములు గాంచె
జాగ్రదపౌరుషమున రాజిల్లి మెఱయఁగా
మలకవజీర్ల నుమ్మలికఁ జేసె
తెలగాణభూములఁ గలమన్నవారిచే
బలవంతమునను గప్పములు గొనియెఁ
తే. జాటుధ్వాటీనిరాఘాటఘోటకావ
ళీఖురోద్ధూతనిబిడధూళీవిలిప్త
మండితాశాంగనాకుచమండలుండు

సీ. చూడనేర్చిననాఁడె చూడంగ నేర్చెను
గవిగాయకులయెడ్లఁ గలిమి గలుగ
నవ్వనేర్చిననాఁడె నవ్వంగ నేర్చెను
ధనలోభులైనదుర్మనుజపతులఁ
బలుకనేర్చిననాఁడె బలుకంగ నేర్చెను
సుజనసమ్మతముగా సూనృతంబు
నడవనేర్చిననాఁడె నడవంగ నేర్చెను
మహనీయ మనుధర్మమార్గమునను
తే. జదువనేర్చిననాఁడె తాఁ జదువనేర్చెఁ
వ్యాససిద్ధాంతవేద్యంబులైన కథలు
రాయవేశ్యాభుజంగుండు రమ్యకీర్తి
రతుఁడు రావూరిబసవయరాఘవుండు.

విష్ణుపురాణము సంస్కృతమున రెండుభాగములుగా నున్నది. మొదటిభాగమున విష్ణుదేవునిమాహాత్మ్యమును దెలుపుకథలు, శ్రీకృష్ణచరిత్రమును గలవు. ఆభాగమునే సూర్యనార్యుఁ డాంధ్రీకరించెను.

రెండవభాగమున ధర్మవిషయములు, వ్రతమాహాత్మ్యములు, అర్థశాస్త్రము, వేదాంతము మొదలగువిషయము లున్నవి ఆభాగము నీతఁ డాంధ్రీకరింపలేదు. నన్నయభట్టు శ్రీమహాభారతమును వర్ణించిన పద్యమున ననుకరించి యీసూరనకవి విష్ణుపురాణము నీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. వేదంబులకు నెల్ల వేదంబు ధర్మశా
స్త్రంబులలోపల ధర్మశాస్త్ర
మాగమార్థములలో నాగమార్థం బగు
జ్యోతిషంబులలోన జ్యోతిషంబు
బహుపురాణములలోపలఁ బురాణం బతి
హాసంబులం దితిహాస మఖిల
నీతిశాస్త్రములలో నీతిశాస్త్రము మహా
యోగవిద్యలలోన యోగవిద్య
తే. కావ్యములలోనఁ గావ్యంబు భవ్యతరము
సకలలోకైకవేద్యంబు సకలజన
చిత్తరంజనకారణం బుత్తమంబు
క్షోణి నొప్పారు విష్ణుపురాణ మనఘ.

కృతిపతినివాసము నెల్లూరుమండలమందలిగుడ్లూ రయిన ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. గౌరీసమేతుఁడై గరిమతో నేవీట
నేపారునీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట
గిరిభేదినుతుఁ డైన కేశవుండు
యోగినీసహితయై యొప్పారు నేవీటఁ
బస్నీడిపోతేరమ్మ భవువిమిత్త్ర

పావవినాశమై ప్రివహించు నేవీట
మన్నేఱు మిన్నేటిమార టగుచుఁ
ఆ గుంజరములు వేయి గొలువంగ నేవీటఁ
గొడగుచక్రివర్తి పుడమి యేలె
నట్టిరాజధానియై యొప్పుగుడ్లూరి
నొనర నేలుచుండి యొక్కనాఁడు.

నీలకంఠేశ్వరస్థాన మైనయాగుడ్లూరునందే కవిత్రియములోని యెఱ్ఱాప్రెగ్గడ కొంతకాలము నివసించియున్నట్లు భారతారణ్యపర్వమునం దున్నది.

ఉ. ఎవ్వని మూర్తినార్తి యొకయించుక లేదు సభాంతరంబులం
దెవ్వఁడు పూజ్యుఁడై మెఱయు నీజనులెల్ల సదావిధేయులై
యెవ్వని నాశ్రియింపుదు రహీనవచో విభవాభిరాముఁడై
యెవ్వఁడు తేజరిల్లునతఁడెప్పుడు నీకృపవాఁడు భార్గవీ.

ఉ. మొల్ల సుగంధి నామనసు మోహము నాఱడిపెట్టి నీవు న
న్నొల్లక పీడనాడెద నయోరతగవా మగవారిచిత్తముల్
పుల్లసిల్లంగఁ జేయఁ బొరపొచ్చెము లాడఁగ నాఁడువారికే
చెల్లును జెల్లఁబోవ్రితము చెడ్డసుఖంబును దక్కదయ్యెగా.

---

## 127. పెదపాటి సోమయ్య

ఈకవి 'అరుణాచలపురాణము, కేదారఖండము, త్రిపురవిజయము, శి. జ్ఞానదీపిక యను నాలుగుగ్రంథములను రచియించెను. ఈగ్రంథములిపుడెక్కడను గానరావు. ఈతని గ్రంథములలోని పద్యములు కొన్ని ఆంధ్రసాహిత్యపరిషత్తు నందున్నయుదాహరణ గ్రంథములో నున్నవనియుఁ గొన్ని జగ్గన ప్రబంధరత్నాకరములోనున్నవనియుఁ దెలుపుచుఁ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధ రత్నావళియందు వానిని బ్రకటించియున్నారు.

ఈతనికవనము సరసమై ప్రౌఢమయినదిగా నున్నది. శైలి తెలి యుటకై కొన్ని పద్యములనిట నుదాహరించెదను.

అరుణాచలపురాణము:—

సీ. ప్రతిభావిలంఘితభారతబహుళకథా
ఘట్టు నన్నయభట్టుఁ గడుభజించి
యుభయభాషాప్రౌఢిమోద్యన్మహా రాజ్య
భాజిఁ దిక్కనసోమయాజిఁ బొగడి
వాక్ప్రతోషిత దక్షవాటీమహాస్థాన
భీము వేములవాడభీముఁ గొలిచి
భావబంధనిబంధ పరమేశబిరుదప్ర
శర్ము నెఱ్ఱయశర్ము సన్నుతించి

గీ. భారతీహారు భవదూరుఁ బ్రణుతి సేసి
సుకవికులసోము నాచనసోము నెన్ని
నవ్యకవితానాథుఁ శ్రీనాథుఁ దలఁచి
సరసనకాలాంధ్రకవుల కంజలియొనర్చి

కేదారఖండము:—

మ. పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకారవిశేషముం గలిగి విశ్వప్రాణసౌభాగ్య సం
పదమై తేజియఁబోలి క్రాలవలదా! పద్యంబు హృద్యస్థితిన్.

సీ. లలిఁ గావ్యనాటకాలంకారములు చూచి
శబ్దప్రపంచంబు జాడఁ దెలిసి
వర్ణోద్భవవ్యక్తి వర్గగ్రహారిమై
ప్రస్నిగ్ధరూపఁజింతనము మెఱిఁగి
గణరూపదేవతాగ్రహమైత్రి సత్కృత
మాతృకాపూజాదిమార్గ మెఱిఁగి

జల్లి వికృతియు కాకుపోల్లువ్యర్థము ద్రాఘ
విరసంబు గ్రామ్యోక్తి పరిహరించి
గీ. కవిత సెప్పినఁ దగుఁ గాక కవిసి నోరి
కొలఁదు లివ్వల నవ్వలఁ గూర్చి తెచ్చి
దిట్టకూళతనంబున పట్టి బిగిని
గావ్య మనిచెప్ప మెత్తురే కవిజనములు.

త్రి పు ర వి జ య ము :—

సీ. భూమివిశ్వంభరాభూతంబు రథము త
ద్రథమధ్యమునఁ బొల్చు దాయి విల్లు
విల్లువెంబడి దిగ్గువెలుఁగులు చక్రముల్
చక్రాద్రి కులపతి చారునారి
నారిఁ బట్టఁగఁబాఱు నాగరకపుగతి
గతిమీఁద విహరించు ఘనశరంబు
శరము నాభిని గన్న శతవృద్ధు సారథి
సారథిమాటలు సైంధవములు
గీ. గాఁగ నేఁగి వేగఁ గడకతోఁ బురములు
గెల్చి వచ్చి గెలుపు గిరిజతోడఁ
జెలఁగి చెలఁగి చెప్పి చెలువొందు శంభుండు
గాచుఁ గాత మనలఁ గరుణతోడ.

శి వ జ్ఞా న దీ పి క :—

క. సుకవులు పలుకఁగఁ గెళవులు
కుకవు దా రటతు రార! కొలకులభ్రమర
ప్రకరము ఝుంకరింపఁగ
'బెక బెక' మన కేలమాను భేకము లవలన్,
సీ. బవరాన సూతుఁడై పార్థున కాతండు
వచ్చినాఁడీతఁడు మెచ్చినాఁడు

చంచెత్కృపాస్ఫూర్తిఁ బంచాస్త్రి నాతండు
పెంచినాఁ డీతండు నొంచినాఁడు
శేషపన్నగన్న రాజు సెజ్జగా నాతండు
వ్రాల్చినాఁ డీతండు డాల్చినాఁడు
హాలాహలముఁ జూచి యల్లంత నాతండు
చెంగినాఁ డీతండు మిం)గినాఁడు

గీ. చక్రి యాతండు వసుమతీచక్రి యితఁడు
నవనవరుఁ డాతఁ డీతఁడు హరణపరుఁడు
విశ్వమయుఁ డాతఁ డీతండు విశ్వనాథుఁ
డనుచు హరిహరనాథుల నభినుతింతు.

అరుణాచలపురాణమునందలి ౧౦ పద్యములును, కేదారఖండ మునందలి ౯ పద్యములును, శివజ్ఞానదీపికయందలి 3 పద్యములును, త్రిపురవిజయమునందలి నొకపద్యమును బ్రబంధరత్నావళియం దుదాహృదములైనవి. గ్రంథవిస్తరభీతిచే పద్యములను మాత్రమే పైని వ్రాసితిని.

కూచిమంచి తిమ్మకవి పై సీసపద్యమునందలి "శేషపన్నగరాజు" అనుపాదమును 'సెజ్జ' యనుప్రయోగమునకు లక్ష్యముగా నిచ్చుచు, "కవిలోకబ్రహ్మ శివజ్ఞానదీపిక" లోనిదని వ్రాసియుండుటచే నీకవికి "కవిలోకబ్రహ్మ" యని బిరుదమున్నట్లు కాన్పించుచున్నది. మరియు నీ తిమ్మకవి అరుణాచలపురాణములోని యీక్రిందిపద్యమును నఖండ యతికిలక్ష్యముగా నిచ్చియున్నాఁడు.

ఉ. తారక జిచ్చిఖండి శివతాండవమాడ తనందుమర్దలో
దారరవంబు మేఘనినదంబనిచేరినఁ జూచినాశికా
ద్వారబిలంబు జన్నిదఁపువ్యాళముఁ జొచ్చినఁ దొండమెత్తి ఘీం
కారముఁ జేసినవ్వు వెనకయ్య కృతీశ్వరుమంచుఁ గావుతన్.

ఇతఁడు శ్రీనాథునిఁ బూర్వకవినిగా నుతించుటచేతను, ఇతడు రచించినపద్యముల నుదాహరణగ్రంథమున నుదాహృతములగుట వలనను నీకవి క్రీ. శ ౧౫౦౦ ప్రాంతమున నున్నాఁడని నిశ్చయింపవచ్చును.

గోదావరిమండలమున నేలూరుతాలూకా యందొక పెదపాడును కర్నూలుమండలమునఁ గర్నూలుతాలూకాయందుఁ బెద్దపాడును గలవు. మరియెచ్చటనైనఁ బెదపాడుగలదేమో తెలియదు. గోదావరి మండలమునందలి పెదపాడులో బ్రాహ్మణులలోఁ బెదపాటివారు లేరు. కాని యామండలమునఁ బెదపాటివారు నియోగిబ్రాహ్మణులు శ్రీవత్స గోత్రులచ్చటచ్చట నున్నారు. అందీకవినిగూర్చి చెప్పఁదగినవారుకన్పింపలేదు.

అరుణాచల పురాణములోనిదని పైనివ్రాసిన యుత్పలమాలలో ''పంటలుమీరుదు రప్పురంబునన్''అనియున్నది. ఇందలిపంటశబ్దమును ''పంట రెడ్లు''ను సూచించుటకై కవి యుపయోగించినట్లు కన్పట్టుచున్నది. అదిసత్యమయ్యేనేని పంటరెడ్లు విస్తారముగానున్న కర్నూలు, నెల్లూరు, మండలములలో నేదియో యొకగ్రామము కవినివాసమై యుండునని యెంచఁదగియున్నది. గోదావరిమండలమునఁ బంటరెడ్లు లేరు. ఆప్రాంతములలోఁ బెదపాటివారున్నారేమో తెలిసికొనవలసియున్నది.

ఉదాహృత పద్యములనుబట్టి యీతనికవిత్వము సరసమై మనోహరముగా నుండునని తోచుచున్నది. ఇంతకంటె నీకవినిగూర్చి నిప్పటికేమియుఁ దెలియరాలేదు.



# 128. ఆంధ్రకవి రామయ్య

ఆంధ్రసాహిత్యపరిషత్తులోనున్న యుదాహరణగ్రంథమునం దీకవి రచియించిన విష్ణుకాంచీమాహాత్మ్యములోనివని పండ్రెండుపద్యములుదాహరింపఁబడియున్నవి. వానిని శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు ప్రబంధరత్నావళిలోఁ బ్రకటించినారు. 'ఆంధ్రకవి' బిరుదనామమో గృహనామమో తెలియదు. ఈకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఆంధ్రకవి యను గృహనామము కలవా రున్నట్లువినియుండలేదు, 'చిట్టకవి' 'నిమిషకవి' యిట్టిబిరుదులు కలవు. కాని, ఆంధ్రకవి యనిబిరుదములలోగన్పట్టదు

ఈతనిపద్యములలో నాలుగింటి నిం దుదాహరించుచున్నాఁడను

శా. ద్రాక్షాపాకనవీనవైఖరిఁ బ్రబంధస్తోమముల్ సెప్పి యు
ద్యత్కీర్తిం దయ్యె మహాకవీంద్రులకు నాహా! యెట్టిపుణ్యాత్ముఁడో
సాక్షాద్భారతిగాక యీతఁడు మనుష్యవ్యక్తియే యంచు సం
లక్షింపందగు కాళిదాసుఁ గృతిలీలావ్యాసుఁ గీర్తించెదన్

సీ. శబ్దశాసనకావ్యసంఘట్టనక్రమా
నందితబుధవర్యు నన్నపార్యు
నుభయభాషారచనోన్నిద్రభద్రవ
చోరాజిఁ దిక్కనసోమయాజి
లక్ష్యలక్షణకళాలంకారసౌభాగ్య
సత్కావ్యవిన్యాసు శంభుదాసు
ఛందోనిబంధనచాతురీధౌరేయు
వాగ్ధానము వేములవాడభీము

మ. అరుణస్ఫూర్తి సురేంద్రదిక్తట మహావ్యాప్తిన్ విజృంభింపఁగా
శిరసుల్వ్రంచెఁ జకోరవర్గములు హెచ్చెం జక్రవాకంబు లా

తురతంగ్రైరవపంక్తి దూలెఁగడు సంతోషించెఁబద్మంబు లో
క్కరిచే టొక్కరిమేలు పొమ్మనుట నిక్కంబైన చందంబునన్.

చ. రసికత సోలిసోలి యనురాగరసంబునఁ దేలితేలి యా
కసములు మెట్టిమెట్టి తమకంబునఁ గాంతలఁబట్టిపట్టి యా
దొసఁకులఁ జిక్కిచిక్కి కడుదూరముగాఁ జని తక్కితక్కి పై
కొసరెసగం జకోరికలు కోరిక లీరికలొత్త మత్తిలున్.

క్రీ. శ. పదునాల్గవశతాబ్దినడుమనున్న నాచనసోము నీతఁడు నుతించియుండుటను, బదునాలవశతాబ్దిమధ్యముననున్న యుదాహరణగ్రంథసంధాత యీతని పద్యములను గైకొనియుండుటచేతను నీకవి నప్పుఁడు పదునైదవశతాబ్దియందున్న వాఁడని నిశ్చయింపవచ్చును. ఇతఁడు రాయలసీమవాఁడని యూహ వొడముచున్నది. ఉదాహృత పద్యములనుబట్టి యితనికవిత్వము సరసమై మనోహరముగా నున్నదని చెప్పవచ్చును.



## 129. వాసిరాజు రామయ్య



ఇతఁడు బృహన్నారదీయము నాంధ్రీకరించినట్లు రామాప్రెగ్గడ జగ్గనకవి తనప్రబంధరత్నాకరమున మూఁడుపద్యముల నుదాహరించి యుండుటచే నెఱుంగఁగల్గితిమి. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁ డని తోఁచుచున్నది. విష్ణుకాంచీమహాత్మ్యమును రచించిన "ఆంధ్రకవి రామయ్యయు నీతఁడును ఒక్కఁడేమో యని శ్రీవీరేశలింగముపంతులు గారును శ్రీప్రభాకరశాస్త్రిలుగారును సంశయించియున్నారు. ఇతఁడే ప్రాంతమువాఁడో యెప్పటివాఁడో తెలియదు. క్రీ. శ. ౧౫౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వుఁడగుట నిశ్చయము.

బృహన్నారదీయము పదునెనిమిదియుపపురాణములలో నొకటి. దీనిని "శాత్తులంక మృత్యుంజయకవి" యాంధ్రీకరించియున్నాఁడు.

ప్రబంధ రత్నావళినుండి కైకొని యామూఁడుపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

రామయకవి బృహన్నారదీయమెచ్చటనో కలదని నామిత్రు లొకరు చెప్పియున్నారు, అది లభించెనేని యందలివిశేషముల ననుబంధముగాఁ బ్రకటించెదను.

ఇందలి మొదటిపద్యములో భరద్వాజమహర్షి వర్ణితుఁ డైనాఁడు. కవి యీపద్యమును కథాభాగమున వ్రాసెనో లేక కృతిపతియొక్కగాని, కృతికర్తయొక్కగాని గోత్రకర్తయని తెలుపుటకై వ్రాసెనో తెలియదు.

శా. అంభోజాసనమానసాంబుజభవుం డధ్యాత్మవిద్యోన్నతా
రంభుం డిద్ధతపోవిశేషకమిత్రస్ఫీతఘోరాఘసం
రంభుం డంచితశాంతిసంయుతుఁడు భారద్వాజమౌనీంద్రుఁ డు
జ్జృంభించెన్ వరసప్తసంయమిజనశ్రేణీసముద్భాసియై

సీ. మల్లికానవనముత్ఫుల్లపాటలపుష్ప
వల్లరీసౌరభ్యవాసితంబు
కాసారనీరజవ్యాసక్తమధుకరీ
ఝంకారముఖరితాశాముఖంబు
పద్మాప్తకిరణప్రభావలీసంతప్య
మాన సర్వంసహామండలంబు
దహనహేతిచ్ఛటావదహ్యమాన దు
ర్గమఘోరకాంతారసముదయంబు

గీ. చటులతరనిర్భరోష్ణసంసక్తవాత
శోషితాశేషనిమ్నగాస్తోమజంతు
సంచయంబును నగుఘర్మసమయ మేచి
పర్వె నతిసాంద్రమగుచు దిగ్భాగములకు.

---

# 130. సంకుసాల నృసింహకవి



ఈకవిచంద్రుఁడు కవికర్ణ రసాయనమను నా ఱాశ్వాసముల యుత్తమశృంగారప్రబంధమును రచియించి, శ్రీరంగమందలి శ్రీరంగేశ్వరున కంకితము చేసెను. మాంధాతృచక్రవర్తి చారిత్రమును నాతఁడు విమలాంగిని బరిణయమాడినకథయు నిందు వర్ణితములైనవి. ఈపుస్తకమున శృంగారవైరాగ్యములు రెండును సమముగాఁ జెప్పినట్లు కవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

తే. యతి విటుఁడు గాకపోవు టెట్లస్మదీయ
కావ్యశృంగారవర్ణనాకర్ణనమున
విటుఁడు యతి గాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున

తనకావ్యమునందలి శృంగారవర్ణనల నాకర్ణించినంతమాత్రమున యతి విటుఁడు గాకపోఁడనియు, వైరాగ్యవర్ణనము వినినంతనే విటుఁడు యతిగాకుండ నుండఁడనియుఁ బైపద్యములో నీతఁడు ప్రతిజ్ఞ చేసియున్నాఁడు. ఇందుఁ గొంత యతిశయోక్తియున్నను, నిజముగాఁ దనప్రతిజ్ఞకుఁ దగిన ట్లీతఁడీగ్రంథమును రచియింపయత్నించినవాఁడని చెప్పవచ్చును.

ఈగ్రంథమును రచియించిన కవి, కృష్ణదేవరాయలకుఁ గృతినొసంగవలయునని విజయనగరమునకు వచ్చి చాలాకాలము ప్రయత్నించినను, అసూయాగ్రస్తుఁడైన యల్లసాని పెద్దనమూలమున నాతనికి రాజదర్శనము కాలేదనియుఁ దనతోఁ దెచ్చికొనినధనము వ్యయమైపోయి దినభత్యమునకుఁగూడ కొదువరాఁగా దుద కాతఁడు తనగ్రంథమందలిపద్యముల నమ్ముకొనవలసివచ్చెననియు, నందొకపద్యమును గృష్ణదేవరాయల తనయ మోహనాంగి నాల్గువేలవరాలిచ్చి, కొనెననియు

విదప నొకప్పు డామెయును రాయలును జతురంగమాడుచున్నప్పు డామె బంటు, రాయలమంత్రియొక్కయు నేనుగుయొక్కయు నడుమకు రాఁగా రాయలకుమార్తె "ఉద్ధతులమధ్యమునఁ బేదల కుండఁ దరమె" యని యామె విలిచినపద్యభాగమును జదువుచుఁ దన బంటును దప్పించె ననియు, రాయ లది విని యాపద్యమును బూర్తిగాఁ జదువుమని యామెను గోరఁగా నామెసిగ్గుపడుచు,

గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణితనుమధ్య మెచటికో దలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె! యహహ!
యుద్ధతులమధ్యమునఁ బేదల కుండఁదరమె?

చదివెననియు, నాపద్య మెవరురచించిరని యడిగి జరిగినవృత్తాంత మెఱింగి రాయలు తనయాస్థానమున నాకవికిఁ జరిగినయుపేక్షకుఁ జాలఁగాఁ జింతించెననియు నొకకథ యానుపూర్వికముగ వచ్చుచున్నది. రాయలవారిచే నధికసన్మానమును, ధనమును, నగ్రహారములను బడసి, కవికర్ణరసాయనమున కవ్విధముననుదీసిపోని మనుచరిత్రను రచించి, సర్వవిధముల మాన్యుఁడై యున్న పెద్దన యీకవియెడ ననూయ వహించినాఁడనుటకుఁ గారణము గన్పట్టదు. ఈకథయందలి సత్యాసత్యములను మనము నిర్ధారణ చేయఁజాలము కాని, రాజులను దూషించుచు, నరకృతిని నిరసించుచు నీకవి రచించిన యీక్రిందిపద్యములనుబట్టి యీకథయందుఁ గొంతవఱకైన సత్యమున్నదేమో యని యనుకొనవలసివచ్చుచున్నది. రాయలవారికి మోహనాంగి యను కొమారిత లేదు. అందుచే నీకథకు రాయలతో సంబంధమున్నట్లు తొన్పింపదు. అస్థలమనోరథములు సఫలములు గాకపోవుటకుఁ గారణములు వేఱయినను, నిర్నిమిత్తగ నానింద భూపాలుర సన్నిధానవర్తులపైఁ బడుచుండును. ఇందుఁ బెద్దన యెట్టివాఁడయ్యెనేమో! కవియందనాదరణముజూపినవాఁడు కృష్ణరాయలుగాక మఱియెవఁడైన గావచ్చును.

సీ. అందోళికలయందు నంతరచరులైన
సవికృతాకృతుల పిశాచజనులు;
పరకరాళంబులై ప్రార్థింపఁ గనుఁగోక
వాయెత్తకుండు జీవచ్ఛవములు;
వాలవీజనములఁ గ్రాలుచు నీఁగకు
నంటీని ఖరవర్తులాండసములు;
వేత్రపరంపరావిలకంటకాకృతిఁ
జేరఁ బోరాని బర్బూరతరులు;

శంఖనాగస్వరస్వరశ్రవణసమద
విస్ఫుటచ్ఛత్రవిస్ఫారితస్ఫటాక
దిష్టనివవైద్యనకవర్తిముష్టఫణులఁ
బ్రభుదురాత్ముల నెవ్వాఁడు బ్రస్తుతించుః

వ. అదియునుంగాక

తే. నరగుణాంకిత మయ్యెనేని సరసకృతియు
దూష్యమగు శునకాద్యృతదుగ్ధ మట్ల
హరిగుణాంకితమయ్యెనే నసదుకృతియు
హారసూత్రంబుగతి హృదయంగమంబు.

సీ. జగదేకపతియయ్యు సకలాభిగమ్యుండు
సర్వశాసకుఁడయ్యు సదయహృదయుఁ
డభిమతప్రదుఁడయ్యు నంజలిసాధ్యుండు
పరిపూర్ణుఁడయ్యును బ్రణుతికాముఁ
డతిగతేంద్రియుఁడయ్యు ననిమిషదృగ్దృశ్యుఁ
డనియోజ్యుఁడయ్యు భక్తానుయాయి
సాక్షియయ్యు సుతాపచారానభిజ్ఞుండు
సముఁడయ్యు నార్తరక్షాపరుండు

భద్రగుణసిద్ధి దుర్గుణప్రతిభటుండు
సముఁడు నధికుఁడు లేనియుత్తమపురుషుఁడు
వెదకిచూచిన శ్రీరంభవిభునివంటి
ప్రభువు నత్యంతసులభుఁడు బయఁడు గలఁడె ?

ఈకవిరచించినగ్రంథమునం దెచ్చటను దనతండ్రి మొదలుగాఁ బూర్వులనామములనుగాని తనకులగోత్రాదులనుగాని చెప్పుకొనలేదు. గద్యలో "ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహాసేవకోపసేవకనరసింహానామధేయప్రణీతంబైనకవికర్ణరసాయనం" బనిమాత్రమే చెప్పుకొనియున్నాఁడు. గ్రంథాంతమునఁ దననామమును గ్రంథనామమును మాత్రమే యీక్రిందిపద్యములోఁ జెప్పియుండెను.

క. కవితావిచక్షణతగల
కవికంఠవిభూషణముగఁ గైకొనవలయుం
గవివరనృసింహవిరచిత
కవికర్ణరసాయన మనుకావ్యము దీనిన్.

ఈతనినివాసమేదియో తెలియదు. కవి కడపమండలవాసియైన శ్రీవైష్ణవుఁడో వైష్ణవమతాభిమానియైన బ్రాహ్మణుఁడో యైయుండునని తోఁచుచున్నది, వీరేశలింగముపంతులుగారు నియోగి యనివ్రాసి యున్నారు.

కవికాలమును నిర్ణయించుటకుఁ బైనివ్రాసినకథతప్ప గ్రంథమునం దెట్టియాధారములును లేవు. ఆకథయందు లేశమాత్రమేని సత్యమున్నచో నీతఁడు కృష్ణదేవరాయలకాలమువాఁ డనిచెప్పవచ్చును. ఇతఁడు పూర్వకవుల నెవ్వరిని పేరుపెట్టి స్తుతిచేయకుండ సత్కవులను మాత్రమ యీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు.

చ. మనమునఁ గొన్ని నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం
బనఘ కథాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ

గనుఁగొనుకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణబంధులు గారె సత్కవుల్.

అప్పకవి యీగ్రంథమునుండి లక్ష్యములను గైకొనియుండుటచే నీతఁడు లాక్షణికకవియనియు, నప్పకవికిఁబూర్వుఁడనియు గ్రహింపఁ దగును.

ఈతనికి భట్టపరాశరుఁడు గురువైనట్లుగద్యలోఁ జెప్పియున్నాఁడు కదా! అతనినిబట్టి యీకవికాలనిర్ణయముఁ జేయుటకు కొంతియాధారముగనప్పుచున్నది.

"శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరఅచ్యుతరాయ మహారాయులు రాజ్యము చేయుచుండగా శకసంవత్సరములు 1457 అగు మన్మథసంవత్సర మీనమాసపూర్ణిమనాఁడు, ఉత్తరానక్షత్రయుక్త సోమవారమున హారితసగోత్రుఁడైన భట్టపరాశరుని శిష్యుఁడగు మల్లమల్లయకుమారుఁడు రామయ్యయను నాతఁడు శ్రీవెంకటేశ్వరస్వామివారికి 400 పణములు సమర్పించి, నట్లొకశిలాశాసనము (అరవములోనున్నది) తిరుపతిదేవాలయమందలి రెండవ ప్రాకారముయొక్క పడమటిగోడపైనున్నది. ఈశాసనకాలము క్రీ.శ. 1536 సం॥ మార్చి నెల 6వ తేదీ ఈశాసనమునం దుదాహృతుఁడైన భట్టపరాశరగురుఁడే మననృసింహాకవికి గురువని యనుకొనవచ్చును. ఇది సత్యమయ్యెనేని, కృష్ణదేవరాయలు క్రీ.శ. 1509 మొదలు 1530 సంవత్సరమువఱకును రాజ్యము చేసియుండుటచే భట్టపరాశరుఁడును నాతని శిష్యుఁడైన నృసింహాకవియుఁ గృష్ణదేవరాయల కాలములో నున్నారనుటకు సంశయింపనక్కఱలేదు. కాని యంతమాత్రమున నాకథ సత్యమని నమ్మరాదు.

ఈకవి కవిత్వశైలి తెలియుటకై కొన్ని పద్యముల నిటవ్రాయుచున్నాఁడను.

ఉ. నారకయాతనాంబుధికి నావ! నిబద్ధకవాటగోపుర
ద్వారమునందుఁ గుంచిక; భవక్షితిజంబునకున్ ఫలంబు; వి
స్ఫారనిజార్థగుప్తికనపాయనిధిస్థలి; వంశవర్ధనాం
కూరము పుత్త్రినిం బడయఁగోరుట యొప్పదె యెట్టివారికిన్. ౧౮

క. కాకేమి తన్నుఁ దిట్టెనె
కోకిల తనకేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగయగుఁ బరుసని
వాకునఁ జుట్టమగు మధురవాక్యము వలనన్. ౨౦.

శా. దర్పం బేర్పడ ముగ్ధలం బతులు నూత్నక్రీడకుం దార్చి కం
దర్పుం డార్వఁగ నీవిబంధనములం దప్పింప నవ్వీటిలో
నర్పించుం బనరంతుకస్థితిఁ బ్రదాపైహాస్యం బభావంబుగాఁ
గర్పూరాగరుధూపధూమపటలీగాఢాకృతిప్రక్రియల్. ౮౧

నృసింహకవి తనకావ్యమున కుకవినిరాకరణము నెక్కువగాఁ జేసి యాత్మస్తుతి చేసికొని యున్నందున నితఁడు స్వాతిశయస్వభావముగల వాఁడుగాఁ గన్పట్టుచున్నాఁడని వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రములో వ్రాసియున్నారు. కుకవినిరాకృతి నేఁడనిమిదిపద్యములలోఁ జెప్పినమాటసత్యము. "యతివిటుఁడు" అనుపద్యముదక్క యాత్మస్తుతి చేసికొనిన పద్యములు లేవు. దీనినిబట్టి కవిస్వాతిశయ స్వభావముగల వాఁడని తలంపరాదు. రసజ్ఞులను, తనకావ్యమునందలి దోషములను సవరింపుఁడని యీక్రిందిపద్యములోఁ గోరియున్నాఁడు.

ఆ. తప్పుగల్గెనేని తీరతీర్చి రసజ్ఞు
లస్మదీయకవితననుమతింతు
రించుకలుకగలిగనేఁదీర్చి పేర్చియుసి
నుల్లమున వర్తింపకోర్తురెట్లు?

పురాతన కవీశ్వరులకంటె తానధికుఁడను గానని యీక్రింది పద్యములోఁ సూచించియున్నాఁడు.

చ. హృదయగతిం బురాతనకవీశ్వరు లేఁగినవీథి లేదు నే
దదనుమతిన్ రచించుకృతి తాత్త్వికులం గరగింపకుండునే
మదగజరాజము ల్చనినమార్గములం గడునింపునింప వే?
మదగజరాజయాన మదమంథరబంధుర యానమానసముల్.

ఈతని యవతరణికను జదివినప్పుడీతఁడు స్వాతిశయ స్వభావముగలవాఁడు కాఁడనియు, నాత్మగౌరవమును నిలుపుకొనఁ బ్రియత్నించు స్వభావము గలవాఁడనియు నాకుఁదోఁచినది.

ఇంతవఱకు వ్రాసినపిదప నీకవికాలమునుగూర్చి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో వ్రాసిన వ్యాసమును జూచుట తటస్థించినది.౧ ఈకవిగురువైన పరాశరభట్టారకుఁడు రామానుజశిష్య పరంపరలోనివాఁడనియు, వేదాంతదేశికాచార్యుల వారి శిష్యుఁడనియు, నీవేదాంతదేశికాచార్యులు క్రీ.శ. ౧౨౬౮ సంవత్సరము మొదలు ౧౩౬౯ వ సంవత్సరమువఱకు నూటరెండుసంవత్సరములు జీవించె ననియు, నీతని శిష్యుఁడగు పరాశరభట్టారకుఁడుకూడ నాకాలమునందే యుండు ననియు, నాతనిశిష్యుఁడైన సంకుసాలనృసింహకవి క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమున నుండుననియు ననంతకృష్ణశర్మగారందు వ్రాసియున్నారు. ఆవ్యాసములో "ఈ యిరువురుతప్ప నే నెఱిఁగినంతవఱకు వేఱొక్క భట్టపరాశరుఁడు లేఁడు." అని శర్మగారు వ్రాసిరి. నేను పైన వ్రాసిన భట్టపరాశరుని వారెఱిఁగియున్నచో, వారేమని యెడి వారో తెలియదు.

శర్మగారివ్యాసమున బ్రధానవిషయములు రెండు. మొదటిది రెండవభట్టపరాశరుఁడు శ్రీవేదాంతదేశికాచార్యులవారి శిష్యుఁడనుట. రెండవది సంకుసాల నృసింహకవి రెండవభట్టపరాశరునకు శిష్యుఁడనుట. మొదటియంశము నిజ మనుటకు శర్మగారీక్రిందివాక్యములను వ్రాసియున్నారు.

---

౧. ఆ.సా.ప. పత్రిక. పింగళ. పుట ౨౮౦—౨౮౪.

"రెండవభట్టపరాశరుఁడు శ్రీవైష్ణవాచార్యులలోఁ బ్రఖ్యాతత ముఖ్యలై కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్రాదిబిరుదాంకితు లగు శ్రీవేదాంతదేశికులశిష్యుఁడు. మొదటిపరాశరభట్టు తమ్ముని మనుమఁ డగుశ్రీభట్టసుదర్శనాచార్యుని కుమారుఁడు. ఈసుదర్శనాచార్యులే భగవద్రామానుజ విరచితమగు శ్రీశారీరక బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రుతప్రకాశిక యనువ్యాఖ్యానము రచించెను. వీరందఱును శ్రీరంగక్షేత్రవాసులు. పదునాల్గవశతకపుటాదిభాగమున అల్లాయుద్దీనుచేఁ బంపఁబడిన మల్లిక్ కాఫరుసేనలు దక్షిణమధురనాక్రమించుట సుప్రసిద్ధ విషయము. ఆసేనలు వచ్చునపుడును పోవునపుడును దోవలోని ముఖ్యపట్టణముల నెల్ల వీరైనంతవఱకుఁ బాడుచేసెను. శ్రీరంగక్షేత్రముకూడ నామహమ్మదీయ సేనలదాడికి లోపడిన దయ్యెను. అనేక శ్రోత్రియబ్రాహ్మణులవృ ద్ధాయబ్రహ్మణ్యములకుఁ బాత్రులైరి. అట్టివారిలోఁ బైనివిన్నవించిన శ్రుతప్రకాశికాకర్తలగు సుదర్శనాచార్యులొక్కఁడు. తురకలదెబ్బలచేఁ బ్రాణములు విడుచుచు నాతఁడు సమీపమందున్న వేదాంతదేశికులను బిలిచి తనురచించిన శ్రుతప్రకాశికాగ్రంథమును, కుమారులనిద్దఱను వారిచేత నర్పించి "ఈకుమారులను రక్షించి యీగ్రంథమును బ్రచురపఱుపుమని వేఁడుకొనెను. వేదాంతదేశికులును నందు కంగీకరించి యాకుమారులతోడను బుస్తకముతోడను బీనుఁగుపెంటలమఱుఁగున దాఁగియుండి తురకలదండు వెడలిపోయినవెంటనే యీదేశమున నిఁక నుండరాదని పయనమై మైసూరు సమీపముననున్న సత్యమంగళక్షేత్రమునకువచ్చి యందు నివాసమేర్పఱచుకొనిరి. ఆయిరువురు కుమారులకు నుపనయనాదు లింద్దే జరిగించిరి. తరువాతఁ బదునాల్గవ శతకపుమధ్యభాగమున శ్రీవిద్యారణ్యులచే స్థాపింపఁబడిన విజయనగరసామ్రాజ్య సూర్యుని యుదయముచేదక్షిణమందు నెలకొనియుండిన మహమ్మదీయుల చంద్రధ్వజము లస్తమించినవి. అప్పుడు వీరు మరల స్వదేశముఁ జేరిరి.

* * *

౧౩౧౦ వ సంవత్సరమున మహమ్మదీయులు మధురానగరము నాక్రమించిరి. అప్పటికుపనయనము కూడఁగానివయసున నఁగా నెంతయెక్కువైనను బదేండ్లునిండకయున్నవారు భట్టపరాశరులు. శిష్యుఁడును గురువువలె నూఱేండ్లుజీవించియుండె ననుకొన్నను బదునాల్గవ శతముముగియులోపల నతఁడు బరమపదముఁ జేరియుండవలయును."

ఈపైవాక్యములనుబట్టి రెండవభట్టపరాశరుఁడు వేదాంతదేశికులవారి శిష్యుఁడనుటకు పైనిఁజెప్పిన తురకలకథదక్క వేఱుగ నాధారమేదియుఁ గన్పట్టలేదు. వారిరువురును గురుశిష్యులైనట్లుగ్రంథస్థాధారములను శర్మగా రిచ్చియుండలేదు. ఈగురుశిష్యసంబంధమున కాధారము కేవల మాకథయే యైనచో, నది నృసింహకవిని గూర్చిన కథవంటిదేమో యని యనుమానము కల్గుచున్నది. అట్టిసంశయము కలుగుట కింకొకకారణముకూడ కలదు. అది సులభముగా బోధపడుటకై భట్టపరాశరుని వంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను.



ఈవంశవృక్షము శర్మగారిచ్చిన వంశవృక్షముతో సరిపోవుచున్నది. ఈవంశవృక్షమును ఇందీయఁబడినకాలమును తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన శాసనసంపుటమునుండి గైకొంటిని. శ్రీరామానుజులవారుపదకొండవశతాబ్దియందుండుటసుప్రసిద్ధము. ఆయనశిష్యుఁడగుశ్రీవత్సచిహ్నచార్యులుఁకూడ నాకాలమునందుండుట నిశ్చయము. కావున నిందీయఁబడినకాలము సరియైనదనియే చెప్పవచ్చును. తరమునకు ముప్పదిసంవత్సరములవంతున లెక్కించినచో, క్రీ. శ. ౧౦౬౩ లో జన్మించిన శ్రీరామపిళ్లకు మనిమనుమఁడైన రెండవపరాశరభట్టరు క్రీ.శ. ౧౧౫౩లో జన్మించియుండును. క్రీ. శ. ౧౨౬౮ లో జన్మించిన వేదాంతదేశికాచార్యులవారి కీతఁడు శిష్యుఁడగుట యసంభవము. తరమునకేఁబదిసంవత్సరముల వంతున లెక్కించినను నీపరాశరభట్టుజననము ౧౨౧౦ ప్రాంతమగును. అప్పుడును వేదాంతదేశికునకు శిష్యుఁడు కాఁజాలఁడు. వేదాంత దేశికునకు శిష్యునిగాఁ జేయవలయునన్నచోఁ దరమున కెనుబదిసంవత్సరములవంతున లెక్కింపవలసియుండును. ఇదియనుభవవిరుద్ధము. కావున నీరెండవభట్టపరాశరుఁడు వేదాంతదేశికులవారిశిష్యుఁడు కాఁడు. కావునఁ బైనిచెప్పినకథయు విశ్వాసార్హమైనది కాదు. ఒకవేళ నాకథయే సత్యమయ్యెనేని, యాకుమారులను సంరక్షించినవాఁడు వేదాంతదేశికుఁడుగాక మఱియొకరెవరైన నైయుండును. శర్మగారు చెప్పినవిషయములకు నమ్మఁదగిన గ్రంథస్థ నిదర్శనములు లభించినయెడల స్వభావవిరుద్ధమైనను తరమునకెనుబదియేండ్లుఁ గణించియో మఱియొకవిధముననో సరిపుచ్చుకొనవలసియుండును.

ఇఁకను రెండవభట్టపరాశరునకు సంకుసాలనృసింహకవిశిష్యుఁడా? యనువిషయ మాలోచింపవలసియున్నది శర్మగారివ్యాసములోనిందులకాధారములను జూపియుండలేదు. వేదాంతదేశికాచార్యులవారు మాధవారణ్యులవారితో సమకాలికులనియు, నాచార్యులవారు దారి

ద్రవ్యస్థితిలో నుండుటఁ జూచి, తమప్రభువు సంస్థానమునకు వచ్చినచోఁ దగిన జీవనోపాధి గల్పింతుమని మాధవారణ్యులు వర్తమానముసేయ నాచార్యులవా రందు కంగీకరింపక నైదుశ్లోకములను వ్రాసిపంపి రనియు నందలియొకశ్లోకములోని పదములను బ్రయోగించి నృసింహాకవి, కవికర్ణరసాయనమున నొకపద్యమును రచియించియుండెననియు నందుచే నృసింహాకవి దేశికాచార్యులవారి శిష్యునిశిష్యునిగా భావింప వలయుననియు శర్మగారియభిప్రాయము. వారుదాహరించిన శ్లోకమును బద్యమును నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

శ్లో. క్షోణీకోణశతాంశపాలనకలా దుర్వారగర్వానల
క్షుభ్యత్క్షుద్రనరేంద్ర చాటురచనా ధన్యాన్ న మన్యామహే
దేవం సేవితుమేవ నిశ్చినుమహే, యోఽసౌ దయాళుః పురా
ధానాముష్టిముచే కుచేలమునయే ధత్తేస్మ విత్తేశతామ్.

పద్యము. జ్ఞానప్రౌఢమహాకవీశ్వరవచస్సంస్తూయమానుండు ల
క్ష్మీనాథుండు మదల్పవాక్యరచనాస్వీస్తు గాకుండునే
నానాభూపతులెల్లఁ గానుకలు రత్నశ్రేణు లర్పింపఁగా
ధానాముష్టిముచుం గుచేలు కరుణన్ ధన్యాత్ముఁగాఁజూఁడడే.

ఈరెండిటిభావము లొక్కటియే. శ్లోకముయొక్కనాల్గవపాదము నందలిపదములను పద్యముయొక్క నాల్గనపాదమునందలి పదములు నొక్కరీతిగనే యున్నవి.

వేదాంత దేశికాచార్యులవారు, శంకరమతానుయాయులను "ప్రచ్ఛన్నబౌద్ధులని" నిందించెడివారఁట ! నృసింహాకవికూడ నట్లే యితరమతనిందచేయుచు నట్టిమాటలనే ప్రయోగించినాఁడట! ఇవి యన్నియు సత్యములే. ఇందునలన వారిలో, వారిపౌర్వాపర్యములు నిర్ణయ మగునే కాని, వారిరువురునుసమకాలికులనిగాని; గురుశిష్య ప్రశిష్యునిగాని నిర్ణయింపసాధ్యముకాదు. వేదాంతదేశికుల వారికిని

నృసింహాకవికిని నడుమ భట్టపరాశరుఁడుంచి సంబంధమును కలిపి నప్పుడుమాత్రమే యీయనుకరణసూత్రము కొంతవఱ కుపయోగించును. అదిలేనప్పు డీచర్చతోఁ బనియుండదు. దేశికులవారిశ్లోకమును, అందలిశబ్దముల నుంచియే యిప్పుడెవ్వరైననాంధ్రీకరింపవచ్చునుకదా?

ఈకారణములనుబట్టి యనంతకృష్ణశర్మగారి యభిప్రాయముతో నేనేకీభవింపఁ జాలకున్నాఁడను.

నేను పైని నుదాహరించినపరాశరభట్టు వేదాంతదేశికులశ్లోకములను ప్రసంగవశమున నుడువఁగా నాతనిశిష్యుఁడైన నృసింహాకవి దాని నాంధ్రీకరించి తనగ్రంథమున వేసికొనెనని తలంపవచ్చును. ఆయభిప్రాయమునే మనసున నిడికొని ప్రభుఁడింపఁ జేసియు నరకృతివిముఖుఁడయ్యెఁ గవి పైపద్యములను వ్రాసియుండవచ్చును.

కడపమండలమునఁ బులివెందలతాలూకాలో సుంకేసులయను గ్రామ మున్నది. అందు నరసింహస్వామి యాలయమున్నది. ఆగ్రామమునుబట్టి యీకవిగృహనామమును నాదేవునిఁబట్టి కవినామమును వచ్చియుండునని యూహించుచున్నారు ౧ ఇదిసత్యమయ్యెనేని యీకవి యింటిపేరు "సుంకేసుల" యని నిర్ణయింపవచ్చును.

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులుగారు, అన్నయాచార్యచరిత్రపీఠికలో నీనృసింహాకవి తాళ్లపాక యన్నయాచార్యుని ప్రథమపుత్త్రుఁడగు నరసింగన్నయై యుండునని యూహించి వ్రాసినారు. కృష్ణరాయలకాలములో నల్లసాని పెద్దనమాలమున రాజదర్శనము కాశపద్యము నమ్మికొనినట్లు ప్రచారములోనున్న కథకు నాయకుఁడీ నరసింగన్నయే యైయుండుననియు రామకృష్ణకవి రచించెననెడి "ఉన్నన్న ద్విపదకెరగను" అనుపద్యములోని "మిన్నందిమొరసె నరసింగన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిక" అను చరణ మీనరసింగన్ననుగూర్చి చెప్పినదేయైయుండుననియు, శ్రీశాస్త్రులవారీసందర్భమున వ్రాసియున్నారు.

---

౧. శ్రీరంగాచార్యులవారి మద్రాసు రాష్ట్రీయ శాసనము.

అన్నయాచార్యులుగారి నరసింగన్న జననము క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతము. కృష్ణరాయలకాలమునాఁటికాతని వయసు ౬౦-౭౦ సంవత్సరము లై యుండును. ఆకాలమున నట్టిశృంగారప్రబంధము నాతఁడు రచియించినట్లు దలంప నవకాశము లేదు. తనతండ్రియైన యన్నమాచార్యులు సాళువ నరసింహరాయులచే నగ్రహారముల నందినవాఁడు. ఏకారణముచేతనో యొకనృపాలుఁడు తనయందు పేక్షాభావము వహించినంతమాత్రమున రాజులనందఱను నరసింగన్న నిందించియుండఁడు. తాళ్ళపాకవారికుటుంబమంతయుఁ దిరుపతిలోనుండఁగా నరసింగన్న వారినివిడిచి సుంకేసులకుఁబోయియుండుటకుఁ గారణమగుపడదు. శ్రీకృష్ణరాయలు, తాళ్ళపాకగ్రామమును వ్యాసతీర్థుల కగ్రహారముగా నిచ్చియుండుటచే నరసింగన్న సుంకేసులకుఁబోయియుండునని తలంపరాదు. అన్నయాచార్యులును పెదతిరుమలయ్యయుఁగూడఁ దమతమ గ్రంథములలోఁ దాళ్లపాక పురశాసనులమని చెప్పుకొనియున్నారు. వ్యాసరాయలకుఁ గృష్ణరాయలు దానమిచ్చినది క్రీ.శ. ౧౫౩౦ ప్రాంతము. నరసింగన్న అంతవఱకు జీవించియుండఁడు. కవికర్ణరసాయన కర్త నరసింగన్న యే యైనచోఁ దనగ్రంథమును దనవంశమున కిష్టదైవమగు శ్రీవెంకటేశ్వరునకుఁ గృతినిచ్చియుండును గాని శ్రీరంగేశున కంకిత మొసంగియుండఁడు. ఈకారణములచేఁ దాళ్ళపాక నరసింగన్నకు 'సుంకేసుల' యనుగృహనామము వచ్చునని తలంచుట కవకాశము లేదు. నిజముగా నరసింగన్న యేనృసింహకవియైనచోఁ దాళ్ళపాకనృసింహకవియనియే పేరువచ్చియుండును. దాళ్ళపాక నరసింగన్నయు సంకుసాల నృసింహకవియు భిన్నవ్యక్తులు, ఏకవ్యక్తియనుట కాధారములు లేవు.

అన్నయాచార్యులు తిరుపతి నివాసస్థానముగాఁ జేసికొనకపూర్వ మీకుమారునకు నరసింగన్న యను పేరును బెట్టియుండును. అన్నయాచార్యులు సుంకేసులలోఁ గొంతకాలమైననుండియున్నట్లాధారములు లేవు.

నిజముగాఁ దాళ్ళపాక నరసింగన్నయే కవికర్ణరసాయనకర్తయైన చో నాతనిసోదరులగు పెదతిరుమలయ్యగాని, చిన్నన్నగాని, యా విషయమును సూచనగానైన నెచ్చటనేని జెప్పియుందురు. అట్లు చెప్ప లేదు. కావున కవికర్ణరసాయనకర్త సుంకేసుల నరసింహకవియే కాని తాళ్ళపాక నరసింగన్న కాఁడని నిర్ణయింతము.

## 131 భానుకవి

ఇతఁడు పంచతంత్రము నాంధ్రీకరించి, కృష్ణదేవరాయల కాలములోనున్న లక్ష్మీనారాయణ కంకితమొనర్చెను. గ్రంథాంత గద్య మిట్లున్నది.

"ఇది శ్రీభారతీకరప్రసాదలబ్ధవిద్యావిచిత్ర తిప్పనమంత్రిపుత్ర సుజనవిధేయ భానయనామధేయ ప్రణీతంబైన పంచతంత్రం బనుమహా ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

గ్రంథాంతగద్యకుఁ బూర్వమిఁక్రింది సీసపద్య మొకటియున్నది.

సీ. పంపావిరూపాక్ష భైరవవిట్ఠలే
శ్వర ముఖ్యదేవతావ్రజము చేత
పరిపంథిగర్వ విభాళన శ్రీకృష్ణ
రాయ భూధవభుజారక్ష చేత
భటనట జ్యోతిషపౌరాణిక భిషగ్వి
చక్షణ సత్కవీశ్వరుల చేత
సంతతమదవారి చారుశుండాల ఘ
టాజవ ప్రకటఘోటముల చేత
రమ్యమైయున్న విద్యాపురంబునందు
నిమ్మహాకృతి భానుకవీశ్వరుండు

తెనుఁగుబాస నొనర్చెను వినుతికెక్క
నవని నాచంద్రతారార్కమగుచుఁ దనర.

కృతిపతిసభలో మహాపండితుల సమక్షమున చిట్టనయనునతఁడు భానుకవిచే నొకప్రబంధమును గృతినందుమని కృతిపతితోఁజెప్పినట్లు కవి యాక్రిందిపద్యములను రచియించియున్నవాఁడు.

సీ. మందాకినీచంద్రమందార చందన
సితకీర్తిఁ దగునరసింహాభట్టు
పతికార్యహితనయోపాయ గంభీర
......... యున నరసమంత్రి
నృపసభాంతర వర్ణనీయధీమార్గవ
ద్దిష్ఠుఁడౌ నవధానకృష్ణమనుఁడు
నానాకలాప్రవీణత దిక్కులం దెల్ల
వెలసిన భరతము విష్ణుభట్లు
మొదలుగానున్న వారలు మోదమునను
వరుస నందఱు విన్నవించిరి ప్రధాన
వర్య మీతలఁ బొప్పు భూవలయమునను
నలహరిశ్చంద్ర రామచంద్రులకు నైనఁ
గీర్తి యున్నతికెక్కుట కృతులఁగాదె.

గీ. ఆశ్రితుఁడు మీకు నంధ్రభాషావిశా
రదుఁడు భానుకవి కరంబు వేడ్క
వతనిచేత సిద్ధియైనఁ బ్రబంధంబు
సేయఁబనుపు మధిప ! ధీయుతముగ.

మ. వరవాగ్వైఖరి లక్ష్యలక్షణజ్ఞను శ్రీవత్సాన్వయఖ్యాతిభూ
వరమాన్యప్రకృతిన్ బురాతనసుకావ్యప్రౌఢిమన్ భారతీ
వరమంత్రి ప్రతిభన్ మహేశపదసేవానిష్ఠఁ దక్కు...ను
ర్వరలోఁ దిప్పయభాస్కరేంద్రకవివాక్యంబుల్ భవద్భాగ్యముల్

అనికృతిపతితోఁడఁ జిట్టనామాత్యుండుపలుక నాతండును సంతోషాతిశయంబున వర్ణియని కర్పూరసమేతంబుగాఁ దాంబూలంబును జాంబూనదాంబరాభరణంబులును జామరాందోళికావిభవంబులును నేకభోగగ్రామంబులునొసంగి బహుమానపూర్వకంబుగా నంపెను" ఈచిట్టనామాత్యుఁడెవ్వరో తెలియదు. కృష్ణరాయలకాలమున రెంటూరి చిట్టనామాత్యుఁ డొకఁడు గన్పడుచున్నాఁడు(S.I.I. Vol.4 No.702) పైగద్యపద్యములనుబట్టి భానుకవి నియోగిబ్రాహ్మణుఁడనియు, శ్రీవత్సగోత్రుఁడనియుఁ దిప్పమంత్రికిఁ బుత్త్రుఁడనియు, విజయనగర నివాసి యనియు స్పష్టమగుచున్నది. కవియుఁ గృతిపతియుఁ గృష్ణదేవరాయల కాలములోనున్నవారు కావున, క్రీ. శ. ౧౫౧౦-౧౫౩౦ నడుమ నీ కావ్యము పుట్టినదనుట నిశ్చయము.

కృతిపతి, భారద్వాజసగోత్రుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు. ఇతనివంశవృక్ష మిది:—




కృతిపతితండ్రియైన విట్టలామాత్యుఁడు తనవిద్యాప్రౌఢిమఁ జూపి గజపతిచేత కనకఘంటలు గైకొనిన ట్లీక్రిందిపద్యములోఁ గవివర్ణించి యున్నాఁడు.

సీ. గజపతి మెప్పించి కనకఘంటలుగొని
విద్యాప్రవీణత వినుతికెక్కి

సతతాన్నదానంబు సాఁగిం ... ... ...
......గోత్రముల నెయ్యమునఁ బ్రోచె
పరహితకృతకృపా భాసకీర్తిస్ఫూర్తి
పొలుపొంద భూషణంబుగఁ, దనర్చె
ధర్మంబు గుణము సత్యంబును దన
......లగి వర్ణింప నమరె

నవని నానార్థిజనదరిద్రాంధకార
పటల మణగించె నరవిందబంధుఁబోలి
సఖులపాలిటికల్పవృక్షంబు దలఁప
మంత్రిమాత్రుండె విట్ఠయామాత్యవరుఁడు.

ఇతనికి బంగారుగంటలొసంగిన గజపతి, బహుశః కపిలేశ్వర గజపతియై యుండును. కవి, కృతిపతిని వర్ణించినపద్యములు పెక్కు లున్నవి: అందు రెండుపద్యముల నుదాహరించెను.

సీ. ప్రత్యర్థివర్ధిన పట్టణద్వారక
వాటపాటన బలోజ్జ్వలభుజుండు
సప్తసముద్రాంత శైలోపరిస్థలీ
సంకీర్ణ గుణలతాసంచయుండు
.........నిర్గతసురధునీభంగని
ర్హ్రాదజృంభిత వాగ్విరాజితుండు
ఛద్మమంత్రి లలాటచారుభాగ్యాక్షర
లంపూర్తి దృప్తవిలక్షణుండు

సజ్జనవ్రాత దైన్యతుషారహరణ
కరణమిత్రుండు కవిరాజకల్పశాఖ
పంచబాణనిభుం డుదయించెబంధు
రక్షణముసేయ లక్ష్మీనారాయణుండు

సీ. ఏమంత్రి సితకీర్తి హీరకర్పూర నీ
  హారహారంబుల నపహసించు
ఏమంత్రి శేముషి శ్రీమద్విక్రమ
  ............రంభఁ గూడు
ఏమంత్రిదానంబు జీమూతవాహన
  శిబిబలికర్ణుల సిగ్గుపరచు
ఏమంత్రి సౌందర్యమింద్రాత్మజ మనోజ
  ధనదసూనుల విన్నఁదనముసేయు
అఖిలభోగ వినిర్జితహరిహయుండు
  ............వర్ధితరమావి
రాజితరణము లక్ష్మీనారాయణుండు

పంచమాశ్వాసాంతమందలి యీక్రిందిపద్యమువలనఁ గృతిపతి శ్రీకృష్ణదేవరాయల కాలములో నున్నవాఁడని స్పష్టమగుచున్నది.

మ. సతతప్రాభవకృష్ణరాయధరణీచక్రేశకారుణ్య వ
ర్ధితలక్ష్మీవిలసన్నిశాంత సకలార్థివ్రాతసస్యావతీ
హితహస్తాంబుద! మేరుధీరకుహనా.........
హితపద్మాప్తసమగ్రధర్మగుణ విఖ్యాతాఖిలాశాంతరా!

పంచతంత్రమును భానుకవికిఁ బూర్వము దూబగుంటనారాయణకవి యాంధ్రీకరించియుండెను. ఇతనికిఁ దరువాత బైచరాజు వేంకటనాథుఁడు గూడ నీపంచతంత్రమును రచియించియున్నాఁడు. మిత్రభేదసుహృల్లాభాది తంత్రములైదును భానుకవి యీగ్రంథమున మనోహరమగుశైలిలోఁ జెప్పియున్నాఁడు.

నీతినిబోధించుపద్యములు కొన్ని గ్రంథమధ్యమునఁ బాత్రలచే బలికించినట్లును, కొన్ని కథతో సంబంధములేకుండను లిఖింపఁబడియున్నవి. ఇది వ్రాయసకులకార్యమేమో తెలియదు. ఈపద్యములయందుఁ గృతిపతిసంబోధనమున్నది. మచ్చునకుఁగొన్నిపద్యముల నీక్రింద నుదాహరించెదను

ఉ. భానుఁడు శీతభానుడనఁ బట్టపగల్ కడురేయటన్న సు
జ్ఞానులఁ జంచలాత్ములన సత్యము కల్లయటన్న నట్లయై
కానఁబడున్ మనోజశరకార్ముక పీడులకున్ దలంప భా
మానికరమ్ముచేత గుణమండన విట్టియలక్ష్మధీమణీ

చ. మలయజ శీతలంబులగు మాటలఁదేల్చుట వచ్చినంత బెం
పలవడ లేవఁజూచుట ప్రియంబు లొనర్చుట లేతనవ్వు వె
న్నెలలు ముఖేందునం దమరనిష్ఠురదంభము మానసంబునం
దలముగఁ బొల్చుదుర్జనుఁడు ధాత్రితలంబున లక్ష్మధీమణీ!

ఈగ్రంథా ముద్రిత ప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముననున్నది. భానయకవిత్వము మృదుపదసంశోభితమై మనోహరముగానున్నది శైలి తెలియుటకై యముద్రితమైన యుత్తమగ్రంథము గావున యారు పద్యముల నీక్రింద నుదాహరించెదను.

సీ. ప్రాచీదిశావధూఫాలదేశంబునఁ
బొలుపొందు చంద్రదంపుఁ బొట్టవంగ
జంభాసురారాతిసౌధోపరిస్థలి
కొమరారు కాంచనకుంభ మనఁగఁ
బ్రథమాచలేంద్రంబుపైఁ గనుపట్టి శో
భిల్లిన జేవురు గల్లనంగఁ
గోకవియోగాగ్నిఁ బోకార్చుటకు నెత్తు
సమయాభయ శయాంబుజం బనంగఁ
జంద్రుఁడపరాద్రిఁ జేర భూజనులు నిద్ర
దేరఁగలువలు ముకుళింప వారిజాత
వితతివికసింపఁ జీకటివిరియఁ గెంపు
మెరయ మార్తాండబింబంబు మింటఁబొడమె

మ. అపరాధంబొకయింత లేనినను నన్యాయంబునన్ రాజు క
ష్టపువృత్తిం జెరపంగఁ జూపెకడునాశ్చర్యంబు సర్వంసహా

ధిపులం డెక్కడి నీతి చూడఁగ మదాంధీభూత చేతస్కులై
యుపకారం బొనరించువానిఁ బరుగా నూహింతు రుర్వీస్థలిన్

ఉ. పాయఁగ లేను నిన్ను ననుభద్రసరోవర మందుఁ గూర్పవో
వాయస! యన్నఁ జంచువుల వానిఁ గ్రహించి చలంబు మీర వై
హాయసవీథి వేఁగి కనులాకరమున్ బొడఁగాంచి వేడుకన్
వాయుచలత్తరంగచయ వారికణంబుల సేదఁ దేరఁగన్.

శా. ఆనాగేంద్రుఁడు సంతసంబొదవ నుద్యత్కాలమేఘాకృతిన్
దానాంభఃకణసంచయంబు నడయన్ దంతావళశ్రేణితో
నానాభూజము లెల్ల వ్రాల శశసంతానంబు వైవస్వత
స్థానం బుద్ధతిఁ బారఁగా నడచెఁ జంచద్వేగ సంరంభయై.

క. కల్లనైనఁ గౌఁగిలింపని
కలకంఠిని గూర్చితివి సుఖంబొప్పఁగ నను
దలఁప నినుఁ బోలు చుట్టము
గలఁడే విత్తంబు నీవు గైకొను మనినన్.

చ. కరముల దండము ల్మెరయఁ గాయరుచుల్ వెలిఁబుబ్బ బాలభా
స్కరకిరణంబులం దెగడఁగా నరుదెంచిరి మందహాస భా
సురవదనారవిందులయి చూచుచు మువ్వురు బిక్షులంబరాం
తరమున నుండి నిర్జరులు ధాత్రిఁ జరింపఁగ వచ్చిరో యనన్

ఈకవి యింటిపేరు "భండారు" అని యనుచున్నారు. పైపద్యములలో "కరణము" "కరణిక" యని యున్నది భాండాగారాధ్యక్షుఁడుగా నుం డుటచే 'భండారు' వారైరో కరణికము చేయుచుండుటచే 'గరణిక' వారైరో తెలియలేదు. కరణికము చేయుచుండుటచే "గరణీకలక్ష్మ" అని సంబోధించియుందురు.



శ్రీ ఆనంద తీర్థ ప్రెస్ : రామచంద్రపురం.